## 318

## ఓపెన్ స్కూల్ సీనియర్ సెకండరీ లెవల్ (ఇంటర్మీడియట్) కోర్సు

# అర్థశాస్త్రం

## స్టడీ మెటీరియల్



ఎ.పి. స్టేట్ ఓపెన్ స్కూల్ (APSOS) హైదరాబాద్

# సీనియర్ సెకండరీ స్థాయి కోర్సు
# (ఇంటర్మీడియట్ (APOSS) కోర్సు)

# అర్థశాస్త్రం
## (స్టడీ మెటీరియల్)

ఎ.పి. స్టేట్ ఓపెన్ స్కూల్ (APSOS), హైదరాబాద్

ఏ.పి.ఓపెన్ స్కూల్ సొసైటి, ఎస్.సి.ఇ.ఆర్.టి. క్యాంపస్, ఎల్.బి.స్టేడియం ఎదుట, బషీర్‌బాగ్, హైదరాబాద్-500 001.
ఫోన్ నెం.040-23299568, www.apopenschool.org; E-mail: diraposshyd@yahoo.in

# అర్థశాస్త్రం స్టడీ మెటీరియల్ రూపకర్తలు

## ముఖ్య సంపాదకులు


**శ్రీ సత్యనారాయణరెడ్డి,** యమ్.ఎ., యమ్.ఇడి.

డైరెక్టర్

ఓపెన్ స్కూల్ సొసైటీ, హైదరాబాద్.


## సంపాదకులు


**డా॥ ఎల్.ఎస్.ఎన్. ప్రసాద్,** ఎం.ఎ., ఎం.ఫిల్.,

పి.హెచ్.డి., పి.జి., సి.ఎస్., సిసిపి (ఐఎస్ఐ)

రీడర్ ఇన్ ఎకనామిక్స్

హిందూకాలేజి, గుంటూరు.


## రచయితలు


**డా॥ ఎల్.ఎస్.ఎన్. ప్రసాద్,** ఎం.ఎ., ఎం.ఫిల్.,

పి.హెచ్.డి., పి.జి., సి.ఎస్., సిసిపి (ఐఎస్ఐ)

రీడర్ ఇన్ ఎకనామిక్స్

హిందూకాలేజి, గుంటూరు.

**డా॥ పి. వేణుగోపాల్,**

ఎం.బి.ఎ., ఎం.ఎ., ఎం.ఫిల్., పి.హెచ్.డి.

లెక్చరర్, హిందూకాలేజి,

గుంటూరు


## సమన్వయకర్తలు


**శ్రీ ఆర్.వెంకటేశ్వరరావు**

యం.ఎ.(లిట్)., యం.ఎ.(హిస్టరీ), యం.ఇడి., యం.ఫిల్

ఎ.పి.ఓపెన్ స్కూల్ సొసైటి, హైదరాబాద్.

**శ్రీమతి యం.వీణ**

కో–ఆర్డినేటర్

ఎ.పి.ఓపెన్ స్కూల్ సొసైటి, హైదరాబాద్.

# విషయసూచిక


హమారా గరీబ్
గ్రూప్
రంజిత్ కేయ్ సాడి సింగ్ ఓల్చ

# 1

# అర్థశాస్త్ర నిర్వచనాలు
# (Definitions of Economics)

## 1.1 పరిచయం

అర్థశాస్త్రం ఒక సామాజిక శాస్త్రం. ఈ శాస్త్రం ప్రజల ఆర్థికపరమైన ప్రవర్తనను, దాని ఫలితాలను, విశ్లేషణ చేయును. ఇది వస్తు సేవల ఉత్పత్తి, పంపిణీ, వినియోగం వంటి కార్యకలాపాలలో నిమగ్నమైన వ్యక్తులు, వ్యవస్థలను గురించి అధ్యయనం చేయును.

## 1.2 లక్ష్యాలు

ఈ పాఠ్యభాగం చదివిన తరువాత మీరు ఈ క్రింది అంశాలను తెలుసుకోగలరు.

1. అర్థశాస్త్రానికి మూలం – దాని అర్థం.
2. అర్థశాస్త్ర విషయం
3. అర్థశాస్త్ర నిర్వచనాలు – విమర్శలు

## 1.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. అర్థశాస్త్ర మూలం – దాని అర్థం రాయండి.***

జ: అర్థశాస్త్రం అనే పదం గ్రీకు భాషలోని పదాలైన 'OKIOS' ( ఒక ఇల్లు) 'NEMEIN' ( నిర్వహణ) అనే రెండు పదాల నుండి ఆవిర్భవించినది. దీనిని గ్రీకు భాషలో గృహ యాజమాన్యంగా వ్యవహరిస్తారు.

### రెండు మార్కుల ప్రశ్నలు

***1. సంపద నిర్వచనం రాయండి.***

జ: అర్థశాస్త్రానికి ఒక విశిష్టమైన నిర్వచనాన్ని ఇచ్చి దానికి శాస్త్ర రూపాన్ని ఇచ్చిన మొదటి వ్యక్తి ఆడమ్ స్మిత్. అందుకే ఆయనను అర్థశాస్త్ర పితామహుడుగా వ్యవహరిస్తారు. అర్థశాస్త్రం "సంపదను గురించి చర్చించే శాస్త్రం" గా ఆడమ్‌స్మిత్ నిర్వచించాడు. అంతేకాకుండా సంపదను ఆర్జించడమే ధ్యేయంగా ఉండే వ్యక్తుల ప్రవర్తనను పరిశీలించే శాస్త్రంగా పేర్కొన్నాడు. J.B. Say ప్రకారం "సంపదను గురించిన సూత్రాల అధ్యయనమే అర్థశాస్త్రం"గా పేర్కొనవచ్చు.

*2.* ***శ్రేయస్సు నిర్వచనం రాయండి.***

జ: Alfred Marshall 1890 లో ప్రచురించబడిన తన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ ఎకనామిక్స్" అనే గ్రంథంలో అర్థశాస్త్రాన్ని "మానవుడు, అతని శ్రేయస్సు గురించి చర్చించే శాస్త్రం" గా నిర్వచించాడు. మార్షల్ సంపదకు బదులు శ్రేయస్సుకు అధిక ప్రాధాన్యత ఇచ్చాడు. మార్షల్ తో పాటు బెవరిడ్జ్, కానన్ మరియు పిగోలు కూడా అర్థశాస్త్ర నిర్వచనంలో "శ్రేయస్సు" అనే భావానికి ప్రాధాన్యత ఇచ్చారు.

*3.* ***కొరత నిర్వచనం రాయండి.***

జ: లియోనల్ రాబిన్స్ 1932 లో ప్రచురించిన తన గ్రంథం "Nature and significance of economic science" లో అర్థశాస్త్రానికి కొరత నిర్వచనాన్ని ఇచ్చాడు. రాబిన్స్ ప్రకారం "మానవుని అపరిమితమైన కోరికలకు ప్రత్యామ్నాయ ప్రయోజనాలున్న పరిమిత సాధనాలకు ఉండే సంబంధం పట్ల మానవ ప్రవర్తన అధ్యయనమే అర్థశాస్త్రం."

ఈ నిర్వచనం మూడు అంశాలపై ఆధారపడి ఉంది. అవి

1. అపరిమితమైన కోరికలు
2. పరిమితమైన వనరులు
3. ప్రత్నామ్నాయ ప్రయోజనాలున్న వనరులు

*4.* ***అర్థశాస్త్రానికి గల వృద్ధి నిర్వచనాన్ని వివరించుము.***

జ: Prof. P.A.Samuelson అర్థశాస్త్ర అధ్యయనానికి చలనత్వాన్ని ఆపాదిస్తూ 'వృద్ధి' భావనకు తన నిర్వచనంలో ప్రాధాన్యత ఇచ్చాడు. ఈయన "విలువ గల వస్తువులను ఉత్పత్తి చేయటానికి సమాజాలు కొరతగా ఉన్న వనరులను ఎలా ఉపయోగిస్తాయి. ఆ వస్తువులను వైవిధ్యమున్న ప్రజల మధ్య ఎలా పంపిణీ చేస్తాయనేది అర్థశాస్త్రం అధ్యయనం చేస్తుంది" అని పేర్కొన్నాడు.

*5.* ***అర్థశాస్త్రానికి జాకబ్ వైనర్ ఇచ్చిన నిర్వచనాన్ని క్లుప్తంగా వివరింపుము.***

జ: జాకబ్ వైనర్ ప్రకారం – "ఆర్థిక వేత్తలు ప్రతిపాదించేదే అర్థశాస్త్రం". ఈ నిర్వచనాన్ని బట్టి తెలిసేదేమంటే, ఆర్థిక వ్యవస్థ ముఖ్య సమస్యలను, వివిధ సమయాలలో ఆర్థిక వేత్తలు సూచించిన పరిష్కార మార్గాలను అధ్యయనం చేయటం ద్వారా అర్థశాస్త్ర పరిధిని గురించి, చర్చనీయాంశాలను గురించి సమగ్రంగా తెలుసుకోవచ్చు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

*1.* ***సంపద నిర్వచనాన్ని వివరించి దాని లోపాలు వ్రాయుము.***

జ: అర్థశాస్త్రానికి ఒక విశిష్టమైన నిర్వచనాన్ని ఇచ్చి దానికి శాస్త్ర రూపాన్ని ఇచ్చిన మొదటి వ్యక్తి ఆడమ్ స్మిత్. అందుకే ఆయనను అర్థశాస్త్ర పితామహుడుగా వ్యవహరిస్తారు. అర్థశాస్త్రం "సంపదను గురించి చర్చించే శాస్త్రం" గా

ఆడమ్‌స్మిత్ నిర్వచించాడు. J.B. Say ప్రకారం "సంపదను గురించిన సూత్రాల అధ్యయనమే అర్థశాస్త్రం" గా పేర్కొనవచ్చు. వాకర్ నిర్వచనం ప్రకారం "సంపదకు సంబంధించిన విషయాలతో సంబంధం కలిగినదే అర్థశాస్త్రం".

పై నిర్వచనాల ప్రకారం, అర్థశాస్త్రం సంపదను మరింతగా పెంచుకోవటానికి ప్రజలు చేసే కార్యకలాపాలను గురించి అధ్యయనం చేస్తుంది.

**విమర్శ :–** అర్థశాస్త్రం యొక్క సంపద నిర్వచనం Carlyle, Ruskin లచే తీవ్రంగా విమర్శించబడినది. వారి ఉద్దేశ్యంలో అర్థశాస్త్రం

1. సంపదకు అధిక ప్రాముఖ్యత ఇవ్వబడింది.
2. మానవులలో స్వార్థబుద్ధిని పెంచుతుంది.
3. స్మిత్ నిర్వచనంలో సంపద అంటే కేవలం భౌతిక వస్తువులు గానే పరిగణించటం జరిగింది. ఇందులో సేవలను గురించిన ప్రస్తావించలేదు. కనుక ఇది అర్థశాస్త్ర పరిధిని తగ్గించేదిగా ఉందని వీరిద్దరి అభిప్రాయం.

***2. అర్థశాస్త్రానికి గల శ్రేయస్సు నిర్వచనాన్ని వివరింపుము. దీని లోపాలేవి?***

జ: Alfred Marshall 1890 లో ప్రచురించబడిన తన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ ఎకనామిక్స్" అనే గ్రంథంలో అర్థశాస్త్రాన్ని "మానవుడు, అతని శ్రేయస్సు గురించి చర్చించే శాస్త్రం" గా నిర్వచించాడు. మార్షల్ సంపదకు బదులు శ్రేయస్సుకు అధిక ప్రాధాన్యత ఇచ్చాడు. మార్షల్ తో పాటు బెవరిడ్జ్, కానన్ మరియు పిగోలు కూడా అర్థశాస్త్ర నిర్వచనంలో "శ్రేయస్సు" అనే భావానికి ప్రాధాన్యత ఇచ్చారు.

**శ్రేయస్సు నిర్వచనంలోని ముఖ్యాంశాలు :–**

1. సంపదకన్నా మానవ శ్రేయస్సుకు ఈ నిర్వచనం అధిక ప్రాధాన్యత ఇచ్చింది.
2. భౌతిక వస్తువులు మాత్రమే శ్రేయస్సును పెంచుతాయి.
3. మార్షల్, పిగోల ప్రకారం, భౌతిక శ్రేయస్సును పెంపొందించే కార్యక్రమాలే ఆర్థిక కార్యక్రమాలు.

**విమర్శ :** శ్రేయస్సు నిర్వచనం కొంత కాలం పాటు మెరుగైనదిగా భావించబడినప్పటికీ, ఆధునిక ఆర్థిక వేత్తలు దీనిని విమర్శించారు. అవిః

1. మార్షల్ నిర్వచనంలో ముఖ్యంగా భౌతిక వస్తురాశి నుండి పొందే శ్రేయస్సుకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వటాన్ని రాబిన్స్ ఖండించాడు.
2. మార్షల్, సంఘటిత సమాజంలోని మానవులను మాత్రమే లెక్కలోనికి తీసుకుని, ఇతరులను పట్టించుకోలేదు.
3. మౌలిక సమస్య అయిన 'వనరుల కొరత' ను ఈ నిర్వచనం పరిగణలోకి తీసుకోలేదనేది మరొక విమర్శ.
4. శ్రేయస్సు అనే దానిని పరిమాణాత్మకంగా కొలవలేమనేది మరో విమర్శ.

***3. అర్ధశాస్త్రానికి గల కొరత నిర్వచనాన్ని వివరింపుము. దానికి గల లోపాలను వ్రాయుము.***

జ: లయోనల్ రాబిన్స్ 1932 లో ప్రచురించిన తన గ్రంథం "Nature and significance of economic science" లో అర్థశాస్త్రానికి కొరత నిర్వచనాన్ని ఇచ్చాడు. రాబిన్స్ ప్రకారం "మానవుని అపరిమితమైన కోరికలకు ప్రత్యామ్నాయ ప్రయోజనాలున్న పరిమిత సాధనాలకు ఉండే సంబంధం పట్ల మానవ ప్రవర్తన అధ్యయనమే అర్థశాస్త్రం."

ఈ నిర్వచనం మూడు అంశాలపై ఆధారపడి ఉంది. అవి

1. అపరిమితమైన కోరికలు
2. పరిమితమైన వనరులు
3. ప్రత్నామ్నాయ ప్రయోజనాలున్న వనరులు

రాబిన్స్ నిర్వచనం ప్రకారం " కొరత ఉన్న పరిస్థితులలో మానవ ప్రవర్తనను పరిశీలించేదే అర్థశాస్త్రం"గా పేర్కొన్నాడు.

**విమర్శ :-**

1. రాబిన్స్ నిర్వచనం మారుతున్న సమాజానికి వర్తించదు. కాలం మారేకొద్దీ, సంభవించే మార్పుల వల్ల వనరుల కొరత అనే సమస్యను అధిగమించే వీలు ఉంటుంది.
2. ఆధునిక అర్థశాస్త్రానికి సంబంధించిన ఆర్థిక వృద్ధి, ఆర్థికాభివృద్ధి అనే ముఖ్యాంశాలను కొరత నిర్వచనంలో చర్చించలేదు.
3. రాబిన్స్ అర్థశాస్త్రాన్ని ఒక విజ్ఞాన శాస్త్రంగా పరిగణించటాన్ని విమర్శకులు అంగీకరించలేదు.
4. అర్థశాస్త్రం మానవ సంక్షేమానికి తోడ్పడేదిగా ఉండాలని విమర్శకుల అభిప్రాయం.



# 2

# ఆర్థిక వ్యవస్థ - ఆర్థిక ప్రక్రియ

# (Economy and it's Processes)

## 2.1 పరిచయం

మనలో అందరూ ఏదో ఒక పనిలో నిరంతరం నిమగ్నమై ఉంటాము. అర్ధశాస్త్రంలో ఏ కార్యకలాపాలు ఆదాయ సంపాదనకు, వ్యయానికి, పొదుపునకు దారితీస్తాయో అవి అతి ముఖ్యమైన కార్యకలాపాలుగా పరిగణించవచ్చు. వీటినే ఆర్థిక కార్యకలాపాలు అంటారు. ఈ ఆర్థిక కార్యకలాపాలన్నీ ఒకదానితో ఒకటి ముడిపడి, పరస్పర ఆధారాలుగా ఉంటాయి. ఉత్పత్తి ప్రక్రియలో ఏర్పడే ఉత్పత్తి వలన ఆదాయాలు ఉద్భవిస్తాయి. ఆ ఆదాయాలు ఉత్పత్తి ప్రక్రియలో తయారు చేయబడిన నూతన వస్తుసేవల కొనుగోలుపై ఖర్చు చేయబడుతాయి. కోర్కెలు సంతృప్తి పరచటానికి చేసే ఖర్చు వినియోగపుచర్య, అధికోత్పత్తి కోసం చేసే ఖర్చు పెట్టుబడి చర్య అంటారు. ఈ విధంగా ఉత్పత్తి, వినియోగం మరియు పెట్టుబడి ఈమూడింటిని ప్రధాన ఆర్థిక చర్య లేదా ఆర్థిక ప్రక్రియ అంటారు. ఏ ప్రదేశంలో ఈ ఆర్థిక కార్యకలాపాలు చేపట్టబడతాయో దానినే ఆర్థికవ్యవస్థ అంటారు.

## 2.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ఆర్థిక వ్యవస్థ అర్థ వివరణ
- ఆర్థిక వ్యవస్థ సమకూర్చే వివిధ వస్తుసేవలు
- ఉత్పత్తి, వినియోగం మరియు పెట్టుబడుల ప్రాధాన్యత
- స్థూల పెట్టుబడి, నికర పెట్టుబడుల మధ్య తేడా
- పొదుపు ప్రాధాన్యత
- వివిధ ఆర్థిక ప్రక్రియల మధ్య గల అంతర్గత సంబంధాలు

## 2.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. ఆర్థిక వ్యవస్థ.***

**జ:** ప్రజలు జీవనోపాధిని సమకూర్చుకొను విధానమే ఆర్థిక వ్యవస్థ.

**2. వినియోగ వస్తువులు.**

జ: ఏ వస్తు సేవలు వినియోగదారుల కోర్కెలు ప్రత్యక్షంగా తీరుస్తాయో అవి వినియోగ వస్తుసేవలు.

**3. ఉత్పాదక వస్తువులు**

జ: ఏ వస్తుసేవలు నూతన వస్తుసేవల ఉత్పత్తికి సహాయపడతాయో అవి ఉత్పాదక వస్తుసేవలు.

**4. నశ్వర వస్తువులు**

జ: ఒక్కసారి మాత్రమే ఉపయోగిత కల్గిన వస్తువులు నశ్వర వస్తువులు.

**5. అనశ్వర వస్తువులు**

జ: అనేక పర్యాయములు ఉపయోగిత కల్గిన వస్తువులు నశ్వర వస్తువులు.

**6. ఆర్థిక వ్యవస్థ ప్రక్రియలు**

జ: ఆర్థిక వ్యవస్థలోని ముఖ్య ప్రక్రియలు (i) ఉత్పతి (ii) వినియోగం మరియు (iii) పెట్టుబడి.

**7. ఉత్పత్తి**

జ: ఉత్పత్తి కార్యక్రమం అనగా వస్తుసేవల ఉత్పత్తి అని అర్థం.

**8. వినియోగం**

జ: కోర్కెలు తీర్చుకోవడానికి వస్తుసేవలు ఉపయోగించుకోవడమే వినియోగం అంటారు.

**9. పెట్టుబడి**

జ: మూల ధనరాశికి అదనంగా మూలధన వస్తువులను చేర్చడమే పెట్టుబడి.

**10. ఇన్వెంటరీలు**

జ: ముడిసరుకులు, సగం తయారైన వస్తువులు పూర్తిగా తయారైన వస్తునిల్వల్లో గోచరించిన మార్పులను ఇన్వెంటరీలు లేదా నిల్వలపై పెట్టుబడి అంటారు.

**11. స్థిర పెట్టుబడి**

జ: స్థిర మూలధన వస్తువులైన యంత్రాలు, కర్మాగారాలు భవనాలలో పెరుగుదలను స్థిర పెట్టుబడి అంటారు.

**12. స్థూల పెట్టుబడి**

జ: ఇన్వెంటరీల పై పెట్టుబడి మరియు స్థిర పెట్టుబడుల మొత్తాన్ని స్థూల పెట్టుబడి అంటారు.

**13. మూలధన తరుగుదల**

జ: మూలధన వస్తువులలోని అరుగుదల లేదా అకస్మాత్తుగా వచ్చే ప్రమాద నష్టాలు, ముందుగానే ఊహించినట్లు డిమాండ్ మార్పుల వల్ల గానీ, సాంకేతిక పరిజ్ఞానంలో మార్పుల వల్లగానీ, పాతబడిన యంత్ర సామాగ్రిని, మూలధన తరుగుదల లేదా స్థిర మూల ధన వినియోగ క్షీణత అంటారు.

**14. నికర పెట్టుబడి**

జ: నికర పెట్టుబడి = స్థూల పెట్టుబడి – తరుగుదల

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ఆర్థిక వ్యవస్థ అనగా నేమి ?***

జ. ఉత్పత్తి, వినియోగ కేంద్రాల సమగ్ర స్వరూపమే ఆర్థిక వ్యవస్థ. సాధారణముగా ఆర్థిక వ్యవస్థ అనే పదానికి, దేశానికి సన్నిహిత సంబంధము కలదు. ఇది నగర ఆర్థిక వ్యవస్థలకు, గ్రామీణ ఆర్థిక వ్యవస్థలకు సంబంధించినదిగా ఉంటుంది. ఇక ప్రపంచ ఆర్థిక వ్యవస్థ గురించి మాట్లాడితే, ప్రపంచంలోని అన్ని ఉత్పత్తి కేంద్రాలు ప్రస్తావనకు వస్తాయి. భారత ఆర్థిక వ్యవస్థ అనగా భారతదేశంలో ఉన్న ఉత్పత్తి వినియోగ కేంద్రాలు, క్షేత్రాలు, సంస్థలు ఆర్థిక వ్యవస్థ పరిధిలోనికి వస్తాయి.

***2. వినియోగ వస్తువులు అనగా నేమి?***

జ. ఏ వస్తువులు మానవుల కోర్కెలు ప్రత్యక్షంగా తీరుస్తాయో వాటిని వినియోగ వస్తువులు అంటారు. కోరికలు తృప్తిపరుచుకోవడానికి కొనుగోలు చేస్తున్న ఆహార పదార్థాలు, వస్త్రాలు, బూట్లు, పుస్తకాలు, గృహ సామాగ్రి, స్కూటర్లు, మొదలైన వస్తు సముదాయాలను వినియోగ వస్తువులుగా పరిగణిస్తారు. ఈ వస్తువులు కొనుగోలు దారుల కోరికతో పాటు, కుటుంబసభ్యుల కోరికలు కూడా ప్రత్యక్షంగా తీరుస్తాయి. వినియోగ వస్తువులను రెండు రకములుగా వర్గీకరించవచ్చును. ఎ) నశ్వర వినియోగ వస్తువులు మరియు బి) అనశ్వర వినియోగ వస్తువులు. వినియోగ ప్రక్రియలో ఏ వస్తువులు ఒక్కసారి మాత్రమే కోరికలు తీర్చడానికి ఉపయోగపడి తదుపరి ప్రయోజనాన్ని కోల్పోతాయో వాటిని నశ్వర వినియోగ వస్తువులు అంటారు. ఇవి పాలు, పంచదార, కూరగాయలు, పండ్లు, సబ్బులు, నూనె, సిరా, కాగితము మొదలైనవి. కోర్కెలు మరలా, మరలా తీరుస్తాయో వాటిని అనశ్వర వినియోగ వస్తువులు అంటాము. ఉదాహరణకు గృహోపకరణాలు, వస్త్రాలు, బూట్లు, రిఫ్రిజరేటర్లు, టి.వి., రేడియోలు మొదలైనవి.

***3. ఉత్పాదక వస్తువులు అనగా నేమి?***

జ. ఏ వస్తువులు నూతన వస్తుసేవల ఉత్పత్తికి సహాయ పడతాయో వాటిని ఉత్పాదక వస్తువులు అంటారు. యంత్రాలు, పరికరాలు, భవనాలు, ముడిసరుకులు మొదలైన వాటిని ఉత్పాదక వస్తువులు అంటారు. అధికోత్పత్తిని సాధించడానికి ఉత్పత్తిదారులు వీటిని కోరుకుంటారు. ఉత్పాదక వస్తువులు వస్తూత్పత్తికే కాకుండా సేవా పరంగా కూడా కోరబడతాయి. వైద్యాలయాలలో వాడే ఎక్స్-రే యంత్రాలు, డాక్టర్లు ఉపయోగించే స్టెతస్కోపులు, ఉత్పాదక వస్తువులుగా పరిగణించబడి వైద్యసేవలు అందిస్తున్నాయి. ఈ విధంగా నూతన వస్తుసేవల ఉత్పత్తికి సహాయపడే వస్తుసేవలే ఉత్పాదక వస్తువులు.

***4. ఉత్పత్తి అనగానేమి?***

జ. సాధారణంగా ఉత్పత్తి అనగా పరిశ్రమలలో తయారు చేయబడే యంత్రాలు, టి.వి.లు, వస్త్రాలు, మందులు లేదా వ్యవసాయ భూములలో పండే పంటలు అనే భావన కల్గుతుంది. కాని అర్థశాస్త్రంలో ఉత్పత్తి అనే పదానికి విస్తృత అర్థం కలదు. వివిధ రకాల వస్తువుల ఉత్పత్తితో పాటు, సేవల సప్లయ్‌ని కూడా ఉత్పత్తిగా భావిస్తాం.

**5. స్థిర పెట్టుబడి అనగానేమి?**

జ. ఉత్పత్తి కేంద్రాలు సమకూర్చుకునే అనశ్వర ఉత్పాదక వస్తువులను స్థిర పెట్టుబడి అంటారు. ఇది యంత్రాలు, యంత్ర పరికరాల పెరుగుదలకు దారితీస్తుంది. నిల్వలపై పెట్టుబడి, స్థిర పెట్టుబడి కలిపితే సంస్థ మొత్తం పెట్టుబడికి సమానమవుతుంది. ఈ విధమైన పెట్టుబడిని మూల ధన సంచయనం అంటారు.

**6. నికర పెట్టుబడి అనగానేమి?**

జ. నిరంతరం ఉత్పత్తిలో స్థిరమూలధనం ఉపయోగించడం వలన కొంత అరుగుదలకు దారితీస్తుంది. ప్రమాదవశాత్తు కొన్ని పరికరాలు దెబ్బతిని ఉండవచ్చు. ఇవన్నీ స్థిరమూలధన విలువను తగ్గిస్తాయి. పురాతనమైనవి కావడం వలన కొన్ని యంత్రాలు విలువ తగ్గవచ్చును. నూతన ఉత్పత్తి పద్ధతులు వెలుగులోకి వస్తే కొన్ని యంత్రాలు పురాతనమవుతాయి లేదా పాత యంత్రాలు తయారు చేసే వస్తువులు, మారిన అభిరుచులు అలవాట్లకు అనుగుణంగా ఉండక పాతబడి ఉండవచ్చు. స్థూల పెట్టుబడి నుండి తరుగుదలను మినహాయించగా వచ్చేదే నికర పెట్టుబడి.

నికర పెట్టుబడి = స్థూల పెట్టుబడి – తరుగుదల

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. వినియోగానికి ఉత్పత్తికి మధ్య గల సంబంధం పేర్కొనండి?***

**జ:** ఉత్పత్తి వినియోగము మరియు పెట్టుబడి వంటి ఉత్పత్తి ప్రక్రియల మధ్యగల అవినాభావ సంబంధం ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చును.

1. వినియోగానికి పెట్టుబడికి ప్రాతిపదిక ఉత్పత్తి. ఉత్పత్తి లేకపోతే వినియోగం పెట్టుబడి ఉండవు. స్థిరమైన ఉత్పత్తి వద్ద వినియోగం అధికంగా ఉంటే పెట్టుబడికి లభ్యత తక్కువగా ఉంటుంది.
2. ఉత్పత్తికి పెట్టుబడికి వినియోగమే ఉత్ప్రేరకము. వినియోగం లేకపోతే ఉత్పత్తి పెట్టుబడులకు ప్రాముఖ్యత ఉండదు.
3. ఉత్పత్తి స్థాయి, పెట్టుబడి స్థాయిపై ఆధారపడి ఉంటుంది. అధిక పెట్టుబడి అధికోత్పత్తికి దారితీస్తుంది.
4. ద్రవ్య పెట్టుబడికి పొదుపు ఆధారం. ఎక్కువ పొదుపు ఎక్కువ పెట్టుబడికి, ఎక్కువ పెట్టుబడి ఎక్కువ ఉత్పత్తికి, ఎక్కువ ఉత్పత్తి ఎక్కువ వినియోగానికి, పెట్టుబడికి దారితీస్తుంది.



# 3

# ఆర్థిక వ్యవస్థల - ప్రధాన సమస్యలు

# (Basic Problems of an Economy)

## 3.1 పరిచయం

ప్రధాన ఆర్థిక ప్రక్రియలలో ఒకటి ఉత్పత్తి. ఈ ఉత్పత్తి ప్రక్రియలో ఉత్పత్తిదారుడు రకరకాల సమస్యలు ఎదుర్కొనాలి. ఏది ఉత్పత్తి చెయ్యాలి? ఎంత ఉత్పత్తి చెయ్యాలి? ఏ విధంగా ఉత్పత్తి చెయ్యాలి? ఎవరి కోసం ఉత్పత్తి చెయ్యాలి? మొదలైనవి ప్రధాన సమస్యలు. అన్ని ఆర్థిక వ్యవస్థలలో అందరూ ఉత్పత్తిదారులు ఈ సమస్యలు ఎదుర్కొన వలసి వస్తుంది. ఈ అధ్యాయంలో మీరు ఈ సమస్యల గురించి, అవి ఏర్పడడానికి గల కారణాల గురించి, ఎందుచేత ఇవి ప్రధాన సమస్యలుగా పరిగణింప బడుతున్నాయో ప్రశ్నలు, సమాధానాల పద్ధతిలో తెలుసుకుంటారు.

## 3.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- వనరుల కొరత అనగా నేమి?
- వనరులకు గల ప్రత్యామ్నాయ ప్రయోజనాలు – అర్థం
- ఆర్థిక సమస్యలు ఎందుకు ఉత్పన్నం అవుతాయి.
- ఆర్థిక వ్యవస్థల ప్రధాన సమస్యలు వివరించడం.
- వనరుల అభివృద్ధి వినియోగితలో సమర్థత
- ఉత్పత్తి అవకాశరేఖ ఆధారంతో ప్రధాన ఆర్థిక సమస్యల పరిష్కారం.

## 3.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

**1. ఎంపిక సమస్య**

జ. ఎంపిక సమస్యకు మూలకారణాలు వనరుల కొరత, ప్రత్యామ్నాయ ప్రయోజనాలు.

**2. ఆర్థిక వ్యవస్థ ప్రధాన సమస్య**

జ. ఆర్థిక వ్యవస్థ ప్రధానసమస్య బహుళ ప్రయోజనాలు కల్గిన పరిమిత వనరులు.

**3. వనరుల కేటాయింపు సమస్య**

జ. ఏఏ వస్తువులు ఉత్పత్తి చెయ్యాలి? ఎంత పరిమాణంలో ఉత్పత్తి చెయ్యాలి? అనేవి వనరుల కేటాయింపునకు చెందిన సమస్య వివరిస్తుంది.

**4. ఉత్పత్తి అవకాశాల వక్రరేఖ**

జ. ఆర్థిక వ్యవస్థ ప్రధాన సమస్యలను ఉత్పత్తి అవకాశాల రేఖ సహాయంతో వివరిస్తాము. ఉత్పత్తి అవకాశాల రేఖపై ఉన్న బిందువులు వనరుల సంపూర్ణ మరియు సమర్థవంతమైన వినియోగితను సూచిస్తాయి. ఉత్పత్తి అవకాశాల రేఖ దిగువ భాగంలో ఉన్న బిందువు వనరుల అల్ప వినియోగాన్ని నిరుద్యోగితను సూచిస్తాయి.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ప్రత్యామ్నాయ ప్రయోజనాలు కల్గిన వనరులు అనగానేమి?***

జ. వివిధ రకాల వస్తుసేవలను ఉత్పత్తి చెయ్యడానికి ఉపయోగ పడే వనరులను ప్రత్యామ్నాయ ప్రయోజనాలు కల్గిన వనరులు అంటారు. మనవద్ద ఉన్న ఆదాయం వివిధ రకాల వస్తుసేవల కోసం ఉపయోగించినట్లు, ఒక ఆర్థిక వ్యవస్థలో వనరులను వివిధ వస్తుసేవల ఉత్పత్తికి వినియోగించ వచ్చును. ఏ వనరులు ఏ వస్తూత్పత్తికి సహాయ పడుతున్నాయో అవి ఆ మేరకు ఇతర వస్తుసేవల ఉత్పత్తికి లభ్యంకావు. ఆర్థిక వ్యవస్థలో వనరులు పరిమితమే కాక వాటికి బహుళ ప్రయోజనాలుంటాయి.

***2. ఎంపిక సమస్య లేదా ఆర్థిక సమస్యలు అనగానేమి?***

జ. ఏ ఆర్థిక వ్యవస్థ కావలసిన వస్తుసేవలన్నీ ఉత్పత్తి చేసుకో లేదు. ఒక రకమైన వస్తుసేవల సముదాయాన్ని ఉత్పత్తి చేస్తే వేరొక సముదాయాల ఉత్పత్తిని వదులుకో వలసివస్తుంది. ఇది వనరుల వినియోగంలో ఎంపిక సమస్యకు దారితీస్తుంది. దీనినే ఆర్థిక సమస్యగా కూడా గుర్తించవచ్చును. వాస్తవానికి ఎంపిక సమస్య ఉత్పత్తిదారులకు, వినియోగ దారులకు సంబంధించిన ఉమ్మడి సమస్యగా గుర్తించవచ్చును. వినియోగదారులు తమ పరిమిత ఆదాయాన్ని వివిధ వస్తుసేవలకు కేటాయించడంలో ఎంపిక సమస్య తల ఎత్తుతుంది. అదే విధంగా ఉత్పత్తి దారులు పరిమితంగా ఉన్న వనరులను వివిధ వస్తు సేవల ఉత్పత్తికి కేటాయించేటప్పుడు ఎంపిక సమస్య తలెత్తుతుంది.

***3. పరిమిత వనరులు అనగానేమి?***

జ. కోరికలు అపరిమితాలు. వాటిని తీర్చుకోవడానికి కావలసిన వస్తుసేవలను కొనుగోలు చేయడానికి అవసరమైన ఆదాయం మాత్రం పరిమితం. అందుచే ఒక వ్యక్తికి కావలసిన అన్ని వస్తుసేవలు కొనడం సాధ్యంకాదు. మరోవిధంగా చెప్పాలంటే ఆదాయం పరిమితంగా ఉండడంవలన అన్ని కోర్కెలు తీర్చుకోలేం. వ్యక్తులు కోర్కెలు తీర్చుకోవడానికి ఉపయోగపడే సాధనం ఆదాయం. ఏ వ్యక్తి వద్దనైనా అధిక ఆదాయం ఉండవచ్చు కానీ, అపరిమిత ఆదాయం మాత్రం ఉండదు. ఈ విధంగా వ్యక్తుల ఆదాయానికి ఒక పరిమితి ఉంటుంది.

**4. వనరుల కొరతను వివరించండి.**

జ. వనరులను భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపన అని వర్గీకరణ చేయవచ్చును. ఏ ఆర్థికవ్యవస్థలో అయినా ఈ వనరులు పరిమిత సంఖ్యలో మాత్రమే లభిస్తాయి. ఏ ఆర్థిక వ్యవస్థ లోనైనా అధికంగా ఉండవచ్చు కానీ అపరిమితంగా మాత్రం ఉండవు. కనుక పరిమితంగా ఉన్న వనరులు పరిమిత వస్తుసేవలను ఉత్పత్తి చేస్తాయి. అందువలన ఆర్థిక వ్యవస్థలో వస్తు సేవల సప్లయ్ వాటికున్న డిమాండు కన్నా తక్కువగా ఉంటుంది. దీనికి గల కారణం వనరుల కొరత. ఏ వనరుల సప్లయ్, వాటికున్న డిమాండు కన్నా తక్కువగా ఉంటుందో దానిని వనరుల కొరత అంటారు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఆర్థిక సమస్యలు ఏవిధంగా ఏర్పడతాయి? వనరులు పుష్కలంగా ఉంటే ఆర్థిక సమస్యలుంటాయా?***

**జ:** ప్రతి ఆర్థిక వ్యవస్థ పరిమిత వనరులు కల్గి ఉంటుంది. అభివృద్ధి చెందిన దేశాలలో సహితం అధిక వనరులుంటాయి కానీ, అపరిమిత వనరులుండవు. కాబట్టి ప్రతి ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొనే ఎంపిక సమస్య వనరుల కొరతకు సంబంధించినది. అందువలన వనరుల కొరత వలన ఏర్పడే సమస్యలు ప్రధాన సమస్యలుగా భావిస్తారు.

ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొనవలసిన ప్రధాన సమస్యలు మూడు రకాలు అవి

(i) ఏ ఏ వస్తుసేవలు ఎంతెంత పరిమాణంలో ఉత్పత్తి చెయ్యాలి.

(ii) ఏ విధంగా ఉత్పత్తి చెయ్యాలి.

(iii) ఎవరికోసం ఉత్పత్తి చెయ్యాలి.

**i) ఏ ఏ వస్తుసేవలు ఎంతెంత పరిమాణంలో ఉత్పత్తి చెయ్యాలి**

ప్రతి ఆర్థిక వ్యవస్థ ఆధీనంలో ఉన్న వనరులు పరిమితం కాని అది ఉత్పత్తి చెయ్యవలసిన వస్తుసేవలు మాత్రం అపరిమితాలు. ఏ ఆర్థిక వ్యవస్థ తనకున్న పరిమిత వనరులతో తన ప్రజలకు కావలసిన అన్ని వస్తుసేవలు ఉత్పత్తి చెయ్యలేదు. అందువలన ఏ ఏ వస్తుసేవలు ఎంతెంత పరిమాణంలో ఉత్పత్తి చెయ్యాలనే సమస్య ఎదురవుతుంది. అనగా వనరుల కేటాయింపు సమస్య ఎదురవుతుంది. అందుబాటులో ఉన్న వనరులను, ఏరకమైన వస్తు సేవల సముదాయాలు ఉత్పత్తి చెయ్యాలో నిర్ణయించడం కూడా ఎంపిక సమస్యే. ఈ విధంగా ఏవి ఉత్పత్తి చెయ్యాలి ఎంతెంత ఉత్పత్తి చెయ్యాలి అనే సమస్య వనరుల కేటాయింపు పైన, వాటికున్న ప్రత్యామ్నాయ ప్రయోజనాల పైన ఆధారపడి ఉంటుంది.

**ii) ఏ విధంగా ఉత్పత్తి చెయ్యాలి**

ఏవిధంగా ఉత్పత్తి చెయ్యాలి అనేది ఉత్పత్తి పద్ధతుల ఎంపికకు సంబంధించినది. ఉత్పత్తి పద్ధతులు అనగా ఏ ఏ ఉత్పత్తి కారకాలు ఎంతెంత నిష్పత్తిలో వస్తుసేవల ఉత్పత్తిలో పాలు పంచుకొంటున్నాయో తెలుసుకోవడం. సాధారణంగా వస్తుసేవలను అనేక రకాలుగా ఉత్పత్తి చేస్తారు. శ్రమ మూలధనాలను వివిధ అనుపాతాలలో మిళితం చేస్తూ వస్త్రం ఉత్పత్తి చెయ్యవచ్చును. పెద్ద పెద్ద యంత్రాలు ఉపయోగించి, తక్కువ శ్రామికులను వినియోగించి వస్త్రాలు ఉత్పత్తి చేస్తే దానిని మూలధన సాంద్రిత పద్ధతుల ద్వారా ఉత్పత్తి అంటారు. ఒక వేళ యంత్రాలను ఉపయోగించకుండా ఎక్కువ

మంది శ్రామికులను నియమించి చేతితో వస్త్రాలు తయారు చేసినట్లయితే దానిని శ్రమ సాంద్రిత ఉత్పత్తి అంటారు.

ప్రతి ఆర్థిక వ్యవస్థలోను ఉత్పత్తి పద్దతుల ఎంపిక సమస్య ఏర్పడడానికి ప్రధాన కారణం శ్రమ మూలధనాలు పరిమితంగా లభ్యం కావడమే. ఏ ఆర్థిక వ్యవస్థ అయినా పరిమిత వనరులు సద్వినియోగం చేసుకుంటూ వివిధ వస్తు సేవలు ఉత్పత్తి చెయ్యడానికి తగిన ఉత్పత్తి పద్ధతులను ఎంపిక చేసుకుంటుంది.

**iii) ఎవరికోసం ఉత్పత్తి చెయ్యాలి.**

ప్రతివ్యక్తి తనకు కావలసిన అన్ని వస్తువులను పొందలేడు. ఆర్థిక వ్యవస్థలో జరిగిన ఉత్పత్తి అందరి కోర్కెలు తీర్చలేదు. అందుచేత ఎవరు ఎంతెంత పంచుకోవాలి అనే ప్రశ్న ఏర్పడుతుంది. ఆర్థిక వ్యవస్థలో వివిధ వర్గాల మధ్య ఎంతెంత వస్తురాశి ఏ విధంగా సర్దుబాటు చెయ్యాలో తెలిపేదే పంపిణీ సమస్య.

## ఇతర సాధారణ సమస్యలు

పైన వివరించిన ప్రధాన సమస్యలతో పాటు ఆర్థిక వ్యవస్థలోని మరికొన్ని సాధారణ సమస్యలు కూడా ఎదుర్కొనవలసి వస్తుంది.

**(i) వనరుల సంపూర్ణ వినియోగిత**

వనరుల కొరత కారణంగా వాటిని సంపూర్ణంగానూ, సమర్ధవంతముగానూ ఉపయోగించవలసి ఉంటుంది.

**ఎ) వనరులన్నీ సంపూర్ణంగా వినియోగించుట**

ఏ వనరు నిరుపయోగంగా లేదా వాడకుండా ఉండటం కానీ ఉండరాదు. ఏ వనరైనా వాడకుండా ఉంటే అది వృధా అవుతుంది. కాబట్టి అన్ని వనరులు సంపూర్ణంగా ఉపయోగించుకొంటే వస్తుసేవల ఉత్పత్తి గణనీయంగా పెరుగుతుంది.

**బి) వనరులు సమర్ధవంతంగా వినియోగించుట**

కొరతగా ఉన్న వనరులను సాధ్యమైనంత సమర్ధవంతముగా వినియోగించుకోవాలి. వనరులు సమర్ధవంతంగా వినియోగించటం అనగా మరి ఏ ఇతర ప్రత్యామ్నాయ పద్దతుల ద్వారా కూడా సాధించ లేనంత గరిష్ఠ ఉత్పత్తిని ప్రస్తుత పద్దతిలో సాధించటం అని అర్థం. ప్రతి ఆర్థిక వ్యవస్థ కొరతగా ఉన్న వనరులను సమర్ధవంతంగా వినియోగించడానికి ప్రయత్నిస్తుంది.

**(ii) వనరుల అభివృద్ధి**

ఎక్కువ వస్తూత్పత్తికి ఎక్కువ వనరులు అవసరం. అందువలన అదనపు వస్తూత్పత్తికి అదనపు వనరులు అవసరమౌతాయి. ఆర్థిక వ్యవస్థలో ఎన్ని ఎక్కువ వనరులు లభ్యమయితే, అంత ఎక్కువ వస్తురాశి ఉత్పత్తి సాధ్యపడుతుంది. కనుక ప్రతి ఆర్థిక వ్యవస్థకు ప్రస్తుత సమస్య అదనపు వనరుల సమీకరణ. ఈ విధంగా ప్రతి ఆర్థిక వ్యవస్థ ఆర్థిక సమస్యల వేదికగా మారింది. ఈ ఆర్థిక సమస్యలకు మూలకారణం వనరుల కొరత.

***2. ఉత్పత్తి అవకాశాల రేఖ ద్వారా ఆర్థిక వ్యవస్థల సమస్యలు పేర్కొనండి?***

**జ: వనరుల కేటాయింపు సమస్య**

ప్రతి ఆర్థిక వ్యవస్థలోను వనరులు పరిమితంగా ఉంటాయి మరియు ఇవి వివిధ రకాల వస్తూత్పత్తికి ఉపయోగ పడతాయి. పరిమిత వనరులతో వివిధ సమూహాలకు చెందిన వస్తువులను ఉత్పత్తి చెయ్యవచ్చును. ఈ సందర్భంలో ఉత్పత్తి చెయ్యగల వివిధ వస్తువులను పరిశీలించ వలసి ఉంటుంది. ఉదాహరణకు ఒక ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తికి రెండు రకాల వస్తువులు అంటే వస్త్రాలు మరియు గోధుమలు అనుకొందాం. ఆర్థిక వ్యవస్థలో లభ్యమవుతున్న అన్నిరకాల వనరులను సంపూర్ణంగానూ, సమర్ధవంతంగానూ ఉపయోగించడం ద్వారా ఉత్పత్తి చేయగల వస్త్రాలు మరియు గోధుమల సముదాయాలను ఈ క్రింది పట్టిక తెలియజేయుచున్నది.

**ఉత్పత్తి అవకాశాల పట్టిక**

| ఉత్పత్తి అవకాశములు | వస్త్రాలు (మీటర్లలో కోట్లలో) | గోధుమలు (క్వింటాళ్ళు లక్షలలో) |
|---|---|---|
| A | 0 | 10 |
| B | 1 | 9 |
| C | 2 | 7 |
| D | 3 | 4 |
| E | 4 | 0 |

పై పట్టికలో ఒక ఆర్థిక వ్యవస్థ తనకున్న వనరులతో వస్త్రాలు మరియు గోధుమలకు సంబంధించి ఉత్పత్తి చెయ్యగల ఐదు సమూహాలను సూచించడం జరిగింది. A సమూహాన్ని పరిశీలిస్తే ఆర్థిక వ్యవస్థ తనకున్న వనరులతో 10 లక్షల క్వింటాళ్ళ గోధుమ ఉత్పత్తి చెయ్యగలదని గ్రహించవచ్చును. B సమూహాన్ని పరిశీలిస్తే వస్త్రం ఒక కోటి మీటర్లు గోధుమలు 9 లక్షల టన్నులు ఉత్పత్తి చెయ్యగలదని గ్రహించవచ్చును. ఈ విధముగా సమూహాలు C, D మరియు Eలు వస్త్రాలకు, గోధుమలకు సంబంధించి వివిధ ఉత్పత్తి అవకాశాలను తెలియజేస్తున్నాయి. పై అంశాలు ఈ క్రింది రేఖాపటంలో ఇవ్వబడినవి.




వస్త్రాలు (కోట్ల మీటర్లు)

పై పటంలో A బిందువు మొదటి సముదాయానికి చెందిన ఉత్పత్తి అవకాశాన్ని 10 లక్షల క్వింటాళ్ళ గోధుమలు,'O' వస్త్రోత్పత్తిని తెలియజేస్తున్నది. B బిందువు 9 లక్షల క్వింటాళ్ళ గోధుమలు ఒక కోటి మీటర్లు వస్త్రోత్పత్తిని తెలియజేస్తున్నది. ఈ విధంగా C, D, E సమూహాలు ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తి చేయగల గోధుమలు,వస్త్రాలఉత్పత్తి అవకాశాలను, వనరుల సంపూర్ణ వినియోగితను తెలియజేస్తున్నాయి.

రేఖాపటంలో A బిందువు నుండి E బిందువు వద్దకు కదులుతున్నప్పుడు, వనరుల వినియోగితను గోధుమ ఉత్పత్తి నుండి వస్త్రోత్పత్తికి తరలించ బడుతున్నాయని తెలుసుకోవాలి. అందుచే AE ని ఉత్పత్తి అవకాశాలను వనరుల వినియోగితను తెలియజేస్తున్నది. కాబట్టి ఈ వివిధ సమూహాలలో ఏదో ఒకటి ఆర్థిక వ్యవస్థ ఎంపిక చేసుకుంటుంది.

**వనరుల అల్ప వినియోగం లేక అసమర్థ వినియోగం**

పైన తెల్పిన AE ఉత్పత్తి అవకాశాల రేఖ పై ఉన్న వివిధ బిందువులు గోధుమ మరియు వస్త్రాలకు సంబంధించిన వివిధ సముదాయాలను తెలియజేస్తున్నాయి. ఆర్థికవ్యవస్థ ఈ సముదాయాలలో ఏది నిర్ణయించుకొన్నప్పటికీ అది తన వనరులను సంపూర్ణంగాను, సమర్థవంతంగాను వినియోగించు కొంటున్నదని గ్రహించవచ్చు. ఒకవేళ ఆర్థిక వ్యవస్థ వస్తూత్పత్తి AE ఉత్పత్తి అవకాశాల రేఖ దిగువ భాగంలో ఉంటే వనరులు అల్పంగాను, అసమర్థంగాను వినియోగింపబడు తున్నాయని గ్రహించవలెను. పటములో k బిందువు ఈ విషయాన్ని సూచిస్తున్నది. k బిందువు వద్ద గోధుమ ఉత్పత్తి 5 లక్షల క్వింటాళ్ళు. వస్త్రము ఉత్పత్తి 1 కోటి మీటర్లు. కానీ పటంలో C లేదా D బిందువులు ఇదే వనరులతో ఆర్థిక వ్యవస్థ సాధించ గల గరిష్ఠ వస్తుసముదాయాన్ని సూచిస్తున్నాయి. కాబట్టి ఏ ఆర్థిక వ్యవస్థ తన వనరులను సక్రమంగాను, సమర్థవంతంగాను ఉపయోగించుకుంటుందో అది వివిధ వస్తు సముదాయాలతో గరిష్ఠ ఉత్పత్తిని చేపట్టడమే కాకుండా మరింత ఉన్నత స్థాయి తెలిపే బిందువులను కూడా చేరుకోగలుగుతుంది.

**వనరుల అభివృద్ధి :**

ప్రతి ఆర్థిక వ్యవస్థ అదనపు వనరుల సంపాదనకు ప్రయత్నిస్తూ ఉంటుంది. వనరుల అభివృద్ధి వస్తుసేవల అభివృద్ధికి దారితీస్తుంది. ఈ క్రింది పట్టిక వనరుల పెరుగుదల ఫలితంగా వస్త్రాల ఉత్పత్తిలోను, గోధుమ ఉత్పత్తిలోను సాధించిన అధికోత్పత్తిని సూచిస్తుంది.

# 4

# ఆర్థికాభివృద్ధి - భారత ఆర్థిక వ్యవస్థ

# (Economic Development and Indian Economy)

## 4.1 పరిచయం

ప్రతి ఆర్థిక వ్యవస్థ ప్రజలకోసం అనేక రకాల వస్తు సేవలు ఉత్పత్తి చేస్తుందనే విషయాన్ని గత అధ్యాయం ద్వారా తెలుసుకున్నాము. ఈ అధ్యాయంలో ఆర్థికాభివృద్ధి అంటే ఏమిటి? ఆర్థిక వ్యవస్థల లక్షణాలు ఏమిటి? ముఖ్యంగా భారత ఆర్థిక వ్యవస్థ ప్రధాన లక్షణాలు ఏమిటి? మొదలైన విషయాలు తెలుసుకుందాం.

## 4.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ఆర్థికవృద్ధి నిర్వచనం
- ఆర్థికవృద్ధి, ఆర్థికాభివృద్ధి మధ్య తేడాలు.
- అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రధాన లక్షణాలు.
- భారత ఆర్థిక వ్యవస్థ ప్రధాన లక్షణాలు

## 4.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

**1. దేశాల వర్గీకరణ**

జ. ఏ దేశాల స్థూల జాతీయోత్పత్తి 2,895 అమెరికా డాలర్ల కన్నా అధికంగా ఉంటుందో అవి అభివృద్ధి చెందిన దేశాలుగాను, ఏ దేశ స్థూల జాతీయోత్పత్తి 2,896 అమెరికా డాలర్ల కన్నా తక్కువగా ఉంటుందో అవి అభివృద్ధి చెందుతూ ఉన్న దేశాలు గాను పరిగణించవచ్చును.

**2. అభివృద్ధి చెందుతున్న దేశాల లక్షణాలు**

జ. అభివృద్ధి చెందుతూ ఉన్న దేశాలలో ప్రధానంగా మనకు కనిపించే లక్షణాలు (i) అల్పస్థాయిలో ఆదాయం, వినియోగం (ii) తక్కువ జీవన విధానం (iii) నిరుద్యోగిత, పేదరికం (iv) వ్యవసాయ వృత్తుల ప్రాధాన్యత (v) ఉధృతంగా ఉన్న జనాభా పెరుగుదల రేటు

**3. మెరుగైన జీవన ప్రమాణ నిర్ణాయకాలు**

జ. మెరుగైన జీవన విధానాన్ని నిర్ణయించేవి ఆయుఃప్రమాణం, నిరక్షరాస్యత, శిశు మరణాల రేటు మొదలైనవి.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ఆర్థికాభివృద్ధి అర్థాన్ని వివరింపుము.***

ఆర్థికాభివృద్ధి అనే భావన చాలా విస్తృతమైనది. ఇది ఆర్థికవృద్ధితో పాటు మానవజీవిత గమనానికి సంబంధించిన అన్ని రకాల అనుకూల మార్పులను పరిగణనలోనికి తీసుకుంటుంది. అన్నిరంగాల అభివృద్ధిని సమీక్షిస్తుంది. ఈ విధంగా ఆర్థికాభివృద్ధి అనగా వస్తుసేవల పరిమాణంలో కనిపించే పెరుగుదలతో పాటు, జాతీయ ఆదాయ పంపిణీలోనూ, సాంకేతిక రంగాలలోనూ, సంస్థాపరమైన అంశాలలోనూ సాధించిన అభిలషణీయ మార్పు అని చెప్పవచ్చును. ముఖ్యంగా ప్రజల నిజ తలసరి ఆదాయం, పేదరికం, నిరుద్యోగం, ఆదాయ అసమానతలపై ఆర్థిక వృద్ధి చూపుతున్న ప్రభావాన్ని గమనించాలి. ఈ మొత్తం అంశాల సమగ్ర స్వరూపమే ఆర్థికాభివృద్ధి.

***2. ఆర్థిక వృద్ధి అనగానేమి?***

ఒక ఆర్థిక వ్యవస్థ సాధించిన వస్తు సేవల మొత్తం పెరుగుదలను ఆర్థిక వృద్ధి అంటారు. ఈ రకమైన వస్తుసేవల పెరుగుదల ఏదో ఒక సంవత్సరం కాకుండా నిరంతరం దీర్ఘకాలం పాటు కొనసాగవలెను. అందుచేత తాత్కాలికంగా, అకస్మాత్తుగా పొందిన వస్తుసేవల పెరుగుదల ఆర్థిక వృద్ధి అని పిలువబడదు. ఉదాహరణకు వ్యవసాయ ఉత్పత్తులు ఒక సంవత్సరం పెరిగి, తరువాత సంవత్సరాలలో పెరగకపోతే, దానిని ఆర్థిక వృద్ధి అనలేం. కాబట్టి ఒక దేశం దీర్ఘకాలం పాటు వస్తుసేవల ఉత్పత్తిలో నిరంతరం సాధించిన పెరుగుదలను ఆర్థిక వృద్ధి అని చెప్పవచ్చు.

***3. తలసరి ఆదాయం ఆధారంగా దేశాల వర్గీకరణను వివరింపుము.***

ప్రపంచ బ్యాంకు దేశాలను 4 తరగతులుగా వర్గీకరించింది. అవి 1. అతి తక్కువ ఆదాయం గల దేశాలు, 2. తక్కువ మధ్య ఆదాయం గల దేశాలు, 3. ఎక్కువ మధ్య ఆదాయం గల దేశాలు, 4. అతి ఎక్కువ ఆదాయం గల దేశాలు. మొదటి రెండు రకాలకు చెందిన దేశాలను అభివృద్ధి చెందుతూ ఉన్న దేశాలు అంటారు. మిగిలిన రెండు రకాల దేశాలను అభివృద్ధి చెందిన దేశాలు అంటారు.

| తరగతి | తలసరి స్థూల జాతీయోత్పత్తి (అమెరికా డాలర్లలో) |
|---|---|
| ఎ) అతి తక్కువ ఆదాయం గల దేశాలు | 725 లేక అంతకన్నా తక్కువ |
| బి) తక్కువ మధ్య ఆదాయం గల దేశాలు | 726 నుండి 2895 |
| సి) ఎక్కువ మధ్య ఆదాయం గల దేశాలు | 2896 నుండి 8955 |
| డి) అతి ఎక్కువ ఆదాయం గల దేశాలు | 8956 లేక అంతకన్నా ఎక్కువ. |

## నాలుగు మార్కుల ప్రశ్నలు

### *1. ఆర్థికవృద్ధి, ఆర్థికాభివృద్ధి మధ్య తేడాలు వివరించండి?*

**జ:** ఒక ఆర్థిక వ్యవస్థ సాధించిన వస్తు సేవల మొత్తం పెరుగుదలను ఆర్థిక వృద్ధి అంటారు. ఈ రకమైన వస్తుసేవల పెరుగుదల ఏదో ఒక సంవత్సరం కాకుండా నిరంతరం దీర్ఘకాలం పాటు కొనసాగవలెను. తాత్కాలికంగా, అకస్మాత్తుగా పొందిన వస్తుసేవల పెరుగుదల ఆర్థిక వృద్ధి అని పిలువబడదు. ఉదాహరణకు వ్యవసాయ ఉత్పత్తులు ఒక సంవత్సరం పెరిగి, తరువాత సంవత్సరాలలో పెరగకపోతే, దానిని ఆర్థిక వృద్ధి అనలేం. కాబట్టి ఒక దేశం దీర్ఘకాలం పాటు వస్తుసేవల ఉత్పత్తిలో నిరంతరం సాధించిన పెరుగుదలను ఆర్థిక వృద్ధి అని చెప్పవచ్చు.

అనగా వస్తుసేవల పరిమాణంలో పెరుగుదల లేనప్పటికీ, కేవలం ధరల పెరుగుదల విలువల పెరుగుదలకు దారితీస్తున్నది. దీనిని బట్టి ఆర్థికవృద్ధి అనగా వస్తురాశి విలువల పెరుగుదల కాదు. దీర్ఘకాలం పాటు వస్తూత్పత్తి రాశి పరిమాణంలో గోచరించే పెరుగుదల అని గ్రహించాలి.

### *2. ఆర్థికాభివృద్ధి అనే భావన వివరించండి?*

**జ:** ఆర్థికాభివృద్ధి అనే భావన చాలా విస్తృతమైనది. ఇది ఆర్థికవృద్ధితో పాటు మానవజీవిత గమనానికి సంబంధించిన అన్ని రకాల అనుకూల మార్పులను పరిగణనలోనికి తీసుకుంటుంది. అన్నిరంగాల అభివృద్ధిని సమీక్షిస్తుంది. ఈ విధంగా ఆర్థికాభివృద్ధి అనగా వస్తుసేవల పరిమాణంలో కనిపించే పెరుగుదలతో పాటు, జాతీయ ఆదాయ పంపిణీలోనూ, సాంకేతిక రంగాలలోనూ, సంస్థాపరమైన అంశాలలోనూ సాధించిన అభిలషణీయ మార్పు అని చెప్పవచ్చును. అందుచేత కేవలం వస్తుసేవలలో వృద్ధిని ఆర్థికాభివృద్ధి అనలేం.

ఆర్థికాభివృద్ధి ప్రతిఫలాలు అన్ని వర్గాల ప్రజలకు సమానంగా అందక పోవచ్చును. అప్పుడు ధనవంతులు మహా ధనవంతులుగానూ, పేదలు నిరుపేదలు గానూ మారతారు. దీనిని కూడా ఆర్థికాభివృద్ధి అనలేం. ఇక్కడ ప్రజల నిజ తలసరి ఆదాయాలు పెరిగినాయి కనుక ఆర్థిక వృద్ధిగా చెప్పవచ్చును. అదే సమయంలో ఆదాయం అసమానతలు కూడా పెరిగినాయి కాబట్టి ఇది ఆర్థికాభివృద్ధిగా పరిగణింపరాదు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

### *1. భారత ఆర్థిక వ్యవస్థ లక్షణాలు వివరించండి?*

**జ:** భారత ఆర్థిక వ్యవస్థ, అభివృద్ధి చెందుతూ ఉన్న ఆర్థిక వ్యవస్థ అన్ని లక్షణాలను కల్గి ఉంది. ఈ విషయాన్ని మరింత విపులంగా అర్థంచేసుకోవడానికి భారత ఆర్థిక వ్యవస్థ లక్షణాలను పరిశీలిద్దాం.

#### 1) తక్కువ ఆదాయస్థాయి

భారత జాతీయ తలసరి నికర ఆదాయం 1995-96 వ సంవత్సరంలో రూ.9,300/-లు. ఇది ప్రపంచములోని చాలా దేశాల కంటే అతి తక్కువ. ప్రపంచములోని 133 వెనుకబడిన దేశాలలో ఇండియా 110 వ స్థానంలో ఉన్నది

అనగా మన కన్నా 109 దేశాలు ఎక్కువ తలసరి ఆదాయాన్ని అనుభవిస్తున్నాయి. తక్కువ ఆదాయస్థాయి, తక్కువ జీవన ప్రమాణాన్ని, తక్కువ వినియోగాన్ని సూచిస్తుంది. దేశంలో మూడు వంతుల జనాభా పేదరికపు రేఖ దిగువ భాగమున జీవించుచున్నారు. వీరు కనీస పౌష్టిక ఆహారం పొందలేక పోతున్నారు. అందువలన శ్రామిక ఉత్పాదక సామర్థ్యం కూడా తక్కువగా ఉన్నది.

**2) వ్యవసాయ రంగ ప్రాధాన్యత**

భారతదేశంలో 2/3 వంతు మంది శ్రామికులు వ్యవసాయ రంగం పై ఆధారపడి పనిచేస్తున్నారు. మన దేశ జాతీయాదాయంలో వ్యవసాయ రంగం వాటా 30 శాతం ఉన్నది. కానీ అభివృద్ధి చెందిన దేశాలలో జాతీయాదాయంలో వ్యవసాయరంగం వాటా 2శాతం నుండి 4 శాతం మాత్రమే. ఇదే విధంగా అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయరంగంలో పనిచేస్తున్న శ్రామికులు 2 నుండి 9 శాతం మాత్రమే. మనదేశంలో వ్యవసాయరంగం చాలా భాగం వర్షాలపై ఆధారపడి ఉన్నది. వ్యవసాయ రంగంలో ఉపయోగించే ఉత్పత్తి పద్ధతులు చాలా పురాతనమైనవి. మనదేశంలో కొన్నిచోట్ల ఆధునిక పద్ధతులలో వ్యవసాయం జరుగుతున్నప్పటికీ ఎక్కువ శాతం పాత ఉత్పత్తి పద్ధతులపై ఆధారపడి ఉన్నది. నీటిపారుదల సౌకర్యములు లేని భూమి కూడా చాలా ఉన్నది.

**3) మూలధన కొరత**

మన ఆర్థిక వ్యవస్థలో ప్రజల ఆదాయాలు తక్కువ. అందుచే పొదుపు తక్కువ. పెట్టుబడి తక్కువ, ఫలితంగా మూలధన సంచయనం తక్కువ. మూలధనం కొరత వలన, ఇతర ఉత్పత్తి కారకాలైన శ్రామికులు, సహజవనరులు నిరుపయోగంగా ఉన్నాయి. మనదేశంలో పునరుత్పత్తి చెయ్యగల సహజ వనరులు, పునరుత్పత్తి చెయ్యలేని సహజవనరులు రెండూ పుష్కలంగానే ఉన్నప్పటికీ, మూలధనం కొరత వలన వనరుల అవినియోగిత ఎక్కువగా ఉన్నది.

**4) సాంకేతిక పరిజ్ఞానం కొరత**

మన ఆర్థిక వ్యవస్థ చాలా రంగాలలో వెనుకబడిన ఉత్పత్తి పద్ధతులు ఉపయోగిస్తున్నారు. పరిశోధనలపైన, అభివృద్ధి పథకాలపైన చేసే వ్యయం కూడా చాలా తక్కువగా ఉన్నది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అక్కడక్కడ కొన్ని కొన్ని పరిశ్రమలలో మాత్రమే కనపడుతున్నది.

**5) అవ స్థాపనా సౌకర్యముల కొరత**

విద్యుచ్ఛక్తి, రవాణా, సమాచారం మొదలైన వాటిని అవస్థాపనా సౌకర్యములు అంటారు. దేశ పారిశ్రామికాభివృద్ధికి ఈ అవస్థాపనలు అవసరం. దేశములోని వ్యవసాయ రంగం పైన, సేవారంగం పైన కూడా ఇవి ప్రభావాన్ని కల్గి ఉన్నాయి. మన దేశంలో ఈ సౌకర్యాలన్ని అసంపూర్ణంగా ఉన్నాయి.

**6) అధిక జనాభా పెరుగుదల రేటు**

1991 జననాభా లెక్కల ప్రకారం భారతదేశ జనాభా 84 కోట్లు ఉండగా, జనాభా పెరుగుదల రేటు 2.1శాతం ఉన్నది. 1951లో ప్రణాళికా బద్ధంగా అభివృద్ధి చేపట్టినప్పటి నుండి దేశంలో జననాల రేటు నెమ్మదిగా, మరణాల రేటు

మాత్రం వేగంగా తగ్గింది. దీని వలన జనాభా విస్ఫోటనమేర్పడి, వనరుల వినియోగితలో భారం పెరిగింది. ఫలితంగా జాతీయాదాయం పెరిగినంతగా, తలసరి ఆదాయం పెరగలేదు.

### 7) అధిక నిరక్షరాస్యత రేటు

మనదేశంలో చాలా మంది ప్రజలు నిరక్షరాస్యులు. 1951 నుండి అక్షరాస్యులు పెరుగుతున్నప్పటికీ, నిరక్షరాస్యులు కూడా ఎక్కువగా ఉన్నారు. నేటికీ దేశంలో సగానికి పైగా నిరక్షరాస్యులు ఉన్నారు. ముఖ్యంగా పురుషులలో కన్నా స్త్రీలలో నిరక్షరాస్యులు ఎక్కువ.

### 8) అధిక శిశు మరణాల రేటు

మనదేశంలో శిశు మరణాల రేటు అధికంగా ఉన్నది. 1995 లెక్కల ప్రకారం 1000 మందికి శిశుమరణాల రేటు 70 ఉన్నది. వైద్యసదుపాయాల కొరత, పోషక ఆహారపదార్థాల కొరత, మురుగునీటి పారుదల సౌకర్యాల కొరత, ఆరోగ్య సదుపాయాల కొరత వలన శిశు మరణాల రేటు అధికంగా ఉన్నది.

### 9) సంప్రదాయ - బద్ధమైన ఆలోచనలు, విధానాలు

భారతీయ సమాజం కుల ప్రాతిపదికపై అనేక వర్ణాలుగా, వర్గాలుగా విభజితమై ఉన్నది. మత విశ్వాసాలు, మూఢ నమ్మకాలు, ఆచార సంప్రదాయాలు, అభివృద్ధికి ఆటంకముగా నిలిచినాయి. ఉదాహరణకు పిల్లలను దేవుడిచ్చిన వరంగా భావిస్తూ కుటుంబ నియంత్రణ పద్ధతులను వ్యతిరేకిస్తారు. అదేవిధంగా వివాహానికి, పురుష సంతతికి అత్యధిక ప్రాధాన్యత ఇస్తారు.

### 10) ఉమ్మడి కుటుంబ వ్యవస్థ

మన దేశంలో గ్రామీణ ప్రాంతాలలో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉంది. ఇది శ్రామికుల గమన శీలతను అరికడుతుంది. కుటుంబసభ్యులు ఒక పక్క పేదరికాన్ని అనుభవిస్తూ మరో పక్క ఉమ్మడి కుటుంబ వ్యవస్థను పోషిస్తూ ఉంటారు.

పైన పేర్కొనబడిన వన్నీ భారతదేశ ఆర్థిక వ్యవస్థ ప్రధానలక్షణాలు. కాని గత 50 సంవత్సరాల నుండి మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి దిశగా పయనిస్తోంది. తలసరి ఆదాయం పెరిగింది. అవస్థాపనా సౌకర్యములు పెరిగాయి. దేశంలో అన్ని రంగాలలో అభివృద్ధి జరుగుతూ ఉంది. కాని జనాభా పెరుగుదల కారణంగా ఆర్థికాభివృద్ధి రేటు మందగించింది. అయినప్పటికీ బారతదేశం ఒక అభివృద్ధి చెందుతూ ఉన్న వర్ధమాన దేశంగా పేరు పొందింది. మనదేశంలో పంచవర్ష ప్రణాళికలు ప్రారంభించినప్పటి నుండి దేశం ఆర్థికంగా వేగాన్ని పుంజుకుంది.

# 5

# గణాంకశాస్త్రం : అర్థం మరియు దాని పరిధి

## (Statistics : Meaning and Scope)

## 5.1 పరిచయం

ప్రతిదినం మనం వార్తాపత్రికలలోను, రేడియో, టెలివిజన్ మరియు మ్యాగజైన్లలో అనేక విషయాలకు సంబంధించిన గణాంక వివరాలను చూడడం, చదవడం జరుగుతుంది. ఈ అంకెల అర్థం ఏమిటో మనం తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా కలదు. ఈ విధంగా అంకెలలో వ్యక్తపరచిన సమాచారాన్నే గణాంక దత్తాంశం లేదా గణాంకాలు అంటారు. ఈ పాఠ్యాంశంలో మీరు గణాంకశాస్త్రం అర్థాన్ని, దాని పరిధిని అధ్యయనం చేస్తారు.

## 5.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- అర్థశాస్త్రంలో గణాంకాల ఆవశ్యకత పరిధిని వివరించగలరు.
- గణాంకపద్ధతులు, గణాంక దత్తాంశం మధ్య గల తేడాను తెలియజేయగలరు.
- గణాంక దత్తాంశం యొక్క అర్థాన్ని దాని లక్షణాలను తెలియజేయగలరు.
- గణాంక విచారణలో గల వివిధ దశలను వివరించగలరు.

## 5.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

*1. ఏకవచన భావన*

జ: ఏకవచన భావనలో "గణాంకశాస్త్రం" అంటే గణాంక పద్ధతులు లేదా గణాంక దత్తాంశాన్ని రాబట్టడానికి ఉపయోగించే గణాంక పద్ధతులని అర్థం.

*2. బహువచన భావన*

జ: బహువచన భావనలో "గణాంకశాస్త్రం" అంటే సంఖ్యాదత్తాంశం అని అర్థం.

*3. గణాంకాలు*

జ: మొత్తాలకు సంబంధించిన యదార్థాలే గణాంకాలు. ఇవి అంకెలలో వ్యక్తం చేయబడతాయి.

***4. గణాంక విచారణలోని భాగాలు***

జ: దత్తాంశ సేకరణ, సమర్పణ, విశ్లేషణ, వివరణ వంటి పద్ధతులన్నీ గణాంక విచారణలోని భాగాలే.

***5. గణాంక విశ్లేషణ***

జ: గణాంక పనిముట్ల సహాయంతో దత్తాంశం నుండి కొన్ని అంతిమ నిర్ణయాలను రాబట్టడాన్నే గణాంక విశ్లేషణ అంటారు.

***6. దత్తాంశ వివరణ***

జ: దత్తాంశం ఆధారంగా రాబట్టిన అంతిమ నిర్ణయాల ఆధారంగా విధానాల రూపకల్పన చేయడాన్ని దత్తాంశ వివరణ అంటారు.

***7. విశ్లేషణ***

జ: అంకెల రూపంలో ఉన్న సమాచారం నుండి మరింత తెలుసుకోవడానికి ప్రయత్నించడం ద్వారా ప్రయోజనకరమైన అంతిమ నిర్ణయాలను రాబట్టడం.

***8. జనాభా గణాంకాలు***

జ: జనాభాకు సంబంధించి ప్రతి ఒక్కరిని లెక్కించడం.

***9. ప్రాథమిక దత్తాంశం***

జ: గణాంక శోధకునిచే మొట్టమొదటిసారిగా సేకరించిన పరిమాణాత్మక సమాచారం.

***10. ద్వితీయ దత్తాంశం***

జ: ఇది వరకే సేకరించబడిన దత్తాంశాన్ని, గణాంక శోధకుడు తన పరిశోధనలో ఉపయోగించుకుంటే, ద్వితీయ దత్తాంశం అవుతుంది. గణాంక శోధకునిచే సేకరించబడని ముద్రిత దత్తాంశాలన్నీ ద్వితీయ దత్తాంశమగును.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. గణాంక దత్తాంశం ఆవశ్యకతను వివరింపుము.***

జ: దత్తాంశాల ద్వారా సమస్యను అవగాహన చేసుకోవచ్చు. గణాంక పద్ధతులనుపయోగించి దత్తాంశములోని వాస్తవాలను తెలుసుకోవటమే కాకుండా భవిష్యత్తులో ఏర్పడే విధానాలను కూడా వివరించవచ్చు. పారిశ్రామికరంగం, వ్యవసాయ రంగం, అదేవిధంగా సేవారంగాల్లో గణాంక దత్తాంశాల అవసరం ఎంతో వున్నది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. అర్థశాస్త్రంలో గణాంకాల ఆవశ్యకతను తెల్పుము?***

జ: నిత్యజీవన వ్యవహారాలన్నింటిలోను గణాంకాల ఆవశ్యకత ఎంతైనా కలదు. ఏ ఇతర అధ్యయనాంశాలు కూడా గణాంకాల ఆధారం లేకుండా పూర్తి కానేరవు. అర్ధశాస్త్రం, వాణిజ్యశాస్త్రం, గణాంకశాస్త్రం, భూగోళశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనికశాస్త్రం, జంతుశాస్త్రం వంటి అధ్యయనాంశాలన్నింటిని మనం ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఇవన్నీ కూడా

గణాంకాలతో నిండి ఉంటాయి. అంతే కాకుండా ప్రభుత్వానికి చెందిన ప్రతి డిపార్టుమెంటు కూడా గణాంకాలను ఉపయోగించకుండా సక్రమంగా పనిచేయజాలదు. ముఖ్యంగా అర్థశాస్త్రం అధ్యయనంలో గణాంకాల ఆవశ్యకత ఎనలేనిది.

**i) అర్థశాస్త్ర సిద్ధాంతాలను అంగీకరించడం లేదా తిరస్కరించదానికి గణాంకాలు అవసరం**

మానవుని నిత్యజీవన వ్యవహారాలను పరిశీలించడం ద్వారానే అర్థశాస్త్ర సిద్ధాంతాలు మొట్టమొదటగా అభివృద్ధి చెందాయి. అయితే ఇట్లా పరిశీలన ద్వారా రూపొందించిన ఆర్థిక సిద్ధాంతాల వాస్తవికతను గణాంకాలతో పరిశీలించడం ద్వారా అట్టి సిద్ధాంతాలను అంగీకరించడం లేదా తిరస్కరించడం జరుగును.

**ii) ఆర్థిక వ్యవస్థ స్వరూపాన్ని తెలియజేయదానికి గణాంకాలు అవసరం**

ఆర్థికవ్యవస్థ స్వరూప స్వభావాన్ని గణాంక దశాంశం సహాయంతోనే అధ్యయనం చేయగలం. దీనిలో దేశజనాభా, సహజవనరులు, ఉద్యోగిత, జాతీయాదాయం, ఉత్పత్తులు, ఎగుమతులు, దిగుమతులు మొ॥ వాటికి సంబంధించిన విజ్ఞానం ఇమిడి ఉంటుంది. గణాంక విజ్ఞాన సహాయంతో ఆర్థిక వ్యవస్థలో ఉన్న లోపాలను కూడా తెలుసుకోవచ్చు. తద్వారా తగిన పరిష్కార మార్గాలను కనుగొనవచ్చు.

**iii) ప్రణాళికల రూపకల్పనకు గణాంకాలు అవససరం**

గణాంక దత్తాంశం సహాయం లేనిదే ఏ ప్రణాళికను రూపొందించడం సాధ్యం కాదు. దేశంలో లభించే వనరులు, దేశప్రజల అవసరాలు వంటి వాటికి సంబంధించిన గణాంక వివరాలు లేకుండా ఉత్పత్తి లక్ష్యాలు నిర్ణయించబడవు. ఈ విధంగా జనాభా తీవ్రతను గణాంకాల సహాయంతో తెలుసుకున్న తర్వాత మాత్రమే జనాభా నియంత్రణకు సమర్థవంతమైన విధానాల రూపకల్పన చేయడం సాధ్యపడుతుంది.

**iv) ప్రభుత్వ పథకాలు, విధానాల ప్రగతిని మరియు వాటి సఫలీకృత స్థాయిని అంచనా వేయుటకు గణాంకాలు అవసరం**

ప్రణాళికను రూపకల్పన చేయడానికే గాని, దానిని సక్రమంగా అమలు పరిచింది లేనిది తెలుసుకోవడానికి గణాంక దత్తాంశం అవసరం. అంతేకాకుండా ఆప్రణాళికలు ఎంతవరకు సఫలీకృతం అయినవి ప్రణాళికా కాలంలో ఉత్పత్తి, ఉద్యోగిత, వివిధ రంగాలలో ఏ మేరకు పెరిగాయనే విషయాలను గణాంకాల సహాయంతోనే అధ్యయనం చేయగలము.

***2. గణాంకశాస్త్ర పరిధిని తెలియజేయండి?***

**జ:** "గణాంకశాస్త్రం" అనే పదాన్ని రెండర్థాలలో ఉపయోగిస్తారు. అవి (అ) బహువచనభావన (ఆ) ఏకవచనభావన. బహువచన భావనలో "గణాంకశాస్త్రం" అంటే పరిమాణాత్మక సమాచారం లేదా గణాంక దత్తాంశం అనే అర్థం, ఏకవచన భావనలో గణాంక పద్ధతులు లేదా పరిణామాత్మక సమాచారన్ని అందించే గణాంక పద్ధతులనే అర్థంలో వాడుతారు. గణాంక సిద్ధాంతాలను అనేక రంగాలలో వాడుచున్నారు. ముఖ్యంగా నాణ్యత నిర్ణయించడంలోనూ, ఉత్పత్తి విధానంలోనూ వాటి అవసరం ఎంతో ఉంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

### *1. గణాంక దత్తాంశం అర్థాన్ని, దాని లక్షణాలను వివరించండి?*

"అంకెలతో కూడిన యదార్థ వాక్యాలే గణాంకాలు" అని చెప్పవచ్చు.

**దత్తాంశం లక్షణాలు (Characteristics)**

**i) గణాంకాలు మొత్తం యదార్థతకు సంబంధించినవి**

వ్యక్తిగత మరియు దేనికి సంబంధించని పరిమాణాత్మాక అంకెలు గణాంకాలు కావు. వ్యక్తిగతంగా తెలియజేయబడ్డ అంకెలను దేనితోను పోల్చలేము. అంకెల సమూహాన్ని సరిపోల్చడం, విశ్లేషించడం, ఈ అంకెల ఆధారంగా కొన్ని నిర్ణయాలను చేయడం ద్వారా గణాంకాలు యదార్థమును వివరించును.

**ii) గణాంకాలు విషయాన్ని అంకెలలో వ్యక్తం చేస్తాయి**

గణాంకాలు ఏ విషయాన్నైనా అంకెలలో తెలియజేస్తాయి. అయితే కొన్ని పరిమాణాత్మక వాక్యాలు "భారతదేశ తలసరి ఆదాయం తక్కువ" లేదా "భారతదేశ జనాభా గణనీయంగా పెరుగుతోంది". వంటివి గణాంకాలు కావు. ఇవి పరిమాణాత్మక సమాచారం ఆధారంగా చేయబడ్డ అంతిమ నిర్ణయాలు మాత్రమే. వీటిని విశ్లేషించడం, సమర్పించడం గాని చేయలేము. గణాంకాలనే విషయాన్ని పరిమాణాత్మకంగా అంకెలలో వ్యక్తం చేయాలి.

**iii) గణాంకాలు ఒక క్రమపద్ధతిలో సేకరించబడతాయి**

గణాంక దత్తాంశాన్ని ముందే నిర్ణయించుకున్న ధ్యేయం కోసం, దానికి తగినట్లుగా ప్రణాళికా బద్ధంగా, క్రమ పద్ధతిలో సేకరిస్తారు. దత్తాంశ సేకరణ ఉద్దేశ్యం సక్రమంగా నిర్ణయించుకోకపోయినా, గణికులు సరైన శిక్షణ పొందకపోయినా, ప్రశ్నావళి లోపభూయిష్టంగా ఉన్నా సేకరించబడ్డ దత్తాంశం కారణంగా తప్పుడు నిర్ణయాలకు రావలసి వస్తుంది.

**iv) గణాంకాలు సరైనా ప్రమాణంలో ఖచ్చితత్వాన్ని కల్గి ఉండాలి**

అధ్యయన క్షేత్ర పరిధి చిన్నదిగా ఉన్నప్పుడు సరైన ప్రమాణంతో తగినంత ఖచ్చితత్వాన్ని పాటిస్తూ గణాంకాలను సేకరించవచ్చు. ఉదా : ఒక చిన్న తరగతిలో విద్యార్థుల బరువులు, ఎత్తులకు సంబంధించిన దత్తాంశాన్ని అత్యంత ఖచ్చితత్వాన్ని పాటిస్తూ సేకరించవచ్చు. కాని విచారణా పరిధి లేదా అధ్యయన క్షేత్రం విస్తృతంగా ఉంటే దత్తాంశ సేకరణలో తప్పులు దొర్లే అవకాశం లేకపోలేదు.

**v) గణాంకాలు ముందే నిర్ణయించబడ్డ ఉద్దేశ్యం ప్రకారం ఉంటాయి**

దత్తాంశ సేకరణకు ముందే దాని ఉద్దేశ్యాన్ని, లక్ష్యాన్ని స్పష్టంగా నిర్ణయించుకోవాలి. ఉదా : ఆంధ్రప్రదేశ్ ఓపెన్ స్కూల్ సెకండరీ స్థాయి విద్యార్థుల ప్రతిభను ఒకటి లేదా అంతకంటె ఎక్కువ సబ్జెక్టులతో పోల్చాలని భావించా మనుకుందాం. అటువంటప్పుడు పోల్చవలసిన సబ్జెక్టులను, ఏ సంవత్సరంతో పోల్చదలచామో, ఆ సంవత్సరానికి నిర్ధిష్టంగా ముందుగానే నిర్ణయించుకోవాలి.

***2. గణాంక విచారణలో గల వివిధ దశలను క్లుప్తంగా తెలియజేయండి?*** *(8 మార్కుల ప్రశ్న)*

**జ:** ఏకవచన భావనలో "గణాంకశాస్త్రం" అంటే గణాంక పద్ధతులని అర్థం. గణాంకశాస్త్రం శాస్త్రీయ బద్ధంగా దత్తాంశాన్ని సేకరించడం, సమర్పించడం, విశ్లేషించడం దత్తాంశ వివరణ ఇవ్వడం చేస్తుంది. ప్రతి గణాంక విచారణ ఈ దశలలోనే కొనసాగుతుంది. మనం ఈ దశలన్నింటిని ఒక్కొక్కటిగా చర్చిద్దాం.

**గణాంకవిచారణ – దశలు**

**i) దత్తాంశ సేకరణ (Collection of Data)**

ఏదేని సమస్యను అధ్యయనం చేయాలంటే మొట్టమొదటగా దానికి సంబంధించిన దత్తాంశాన్ని సేకరించాలి. గణాంక శోధకుడే దత్తాంశాన్ని స్వయంగా సేకరిస్తాడు. అట్టి దత్తాంశాన్ని ప్రాథమిక దత్తాంశం (primary data) అంటారు. గణాంక శోధకుడు ఇతర మూలాల నుండి కూడా దత్తాంశాన్ని సేకరించవచ్చు. దీనిని ద్వితీయ దత్తాంశం (secondary data) అంటారు. ఈ దత్తాంశాన్ని ముద్రిత మూలాల నుండి గాని అముద్రిత మూలాల నుండి గాని పొందవచ్చు. ఉదాహరణకు రిజర్వ్ బ్యాంకు బులిటెన్.

**ii) దత్తాంశ సమర్పణ** (Presentation of Data)

దత్తాంశాన్ని సేకరించిన తర్వాత దానిని ఒక క్రమపద్ధతిలో అమర్చడంతో పాటు పౌనఃపున్య విభాజనం, పట్టీలు, గ్రాఫ్‌లు, చిత్రపటాలు, బొమ్మలు వంటి రూపాలలో దత్తాంశాన్ని సమర్పించాలి.

**iii) దత్తాంశ విశ్లేషణ** (Analysis of Data)

దత్తాంశ సమర్పణ తర్వాత మరో మెట్టు దత్తాంశ విశ్లేషణ. దీని ద్వారా అంతిమ నిర్ణయాలను రాబట్టవచ్చు. అయితే గణాంక పనిముట్లైన అంక మధ్యమం, మధ్యగతం, బాహుళకం వంటి వాటి సహాయం లేకుండా ఆర్థిక సమస్యలను విశ్లేషించడం సాధ్యం కాదు.

**iv) దత్తాంశ వివరణ** (Interpretation of Data)

గణాంక పరిశోధనలో చివరి దశ దత్తాంశాన్ని వివరించడం. గణాంక పనిముట్ల సహాయంతో దత్తాంశాన్ని విశ్లేషించిన పిమ్మట, దానికి సంబంధించిన వివరణ ఇవ్వడం జరుగుతోంది. దాని ఆధారంగా సరైన విధానాలను రూపొందించవచ్చు. కాని దత్తాంశాన్ని వివరించడానికి అత్యంత అనుభవం, నైపుణ్యం కావాలి. ఒకవేళ తప్పుగా వివరణ ఇచ్చినట్లయితే తప్పుడు నిర్ణయాలు తీసుకోవడమే గాక గణాంక శోధన ప్రధానోద్దేశ్యాన్ని భంగపరచినట్లవుతుంది.

# 6

# గణాంక దత్తాంశాన్ని అర్థవంతంగా తయారు చేయడం

# (Making Statistical Data Meaningful)

## 6.1 పరిచయం

ఈ పాఠ్యాంశంలో గణాంకశాస్త్ర పద్ధతులైన దత్తాంశ సేకరణ, వర్గీకరణ, నిర్వహణ మరియు దానిని ప్రాదీకరించడం వంటి వాటిపై ఏర్పరిచిన ప్రశ్నలు మరియు జవాబులను అధ్యయనం చేస్తారు.

## 6.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ప్రాథమిక దత్తాంశం మరియు ద్వితీయ దత్తాంశాల మధ్య గల తేడాలను గుర్తించగలరు.
- ప్రాథమిక దత్తాంశాన్ని సేకరించే వివిధ పద్ధతులను వివరించగలరు.
- ద్వితీయ దత్తాంశం లభించే మూలాలను ఉదాహరణలతో వివరించగలరు.
- పౌనఃపున్య విభాజనాన్ని తయారు చేసే వివిధ పద్ధతులను తెలియజేయగలరు.

## 6.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

**1. *ప్రాథమిక దత్తాంశ మార్గాలు***

జ: ప్రాథమిక దత్తాంశాన్ని అనేక పద్ధతులలో సేకరించవచ్చు. ప్రత్యక్ష వ్యక్తిగత శోధన పద్ధతిని గాని, ప్రశ్నావళి పద్ధతిని గాని ఉపయోగించవచ్చు.

**2. *ద్వితీయ దత్తాంశ మార్గాలు***

జ: ద్వితీయ దత్తాంశాన్ని ముద్రిత వనరుల నుండి, అముద్రిత వనరుల నుండి గాని సేకరించవచ్చు.

**3. *దత్తాంశ నిర్వహణ***

జ: ఏదో ఒక క్రమపద్ధతిలో సేకరించబడ్డ దత్తాంశాన్ని అమర్చడం, వివిధ సమూహాలుగా రూపొందించడం వంటి ప్రక్రియలను దత్తాంశ నిర్వహణ లేదా వ్యవస్థీకరణ అంటారు. ఇది దత్తాంశ విశ్లేషణకు మొదటిమెట్టు.

**4. *తరగతి అంతరం***

జ: ఒకే తరగతిలోని రెండు అవధుల మధ్య గల తేడాను తరగతి అంతరం అంటారు.

**5. *పౌనఃపున్య విభాజకం***

జ: పౌనఃపున్య విభాజనం అనేక రకాలుగా ఉంటుంది. (a)మినహాయింపు (b) విలీన (c) వివృతాంత అవధులు (d) అసమాన తరగతులు (e) సంచిత పౌనఃపున్యం.

**6. *సంచితం***

జ: ఒక విలువను దాని ముందు విలువతో కూడగా పరిమాణాత్మకంగా వచ్చే పెరుగుదల.

**7. *సమాచారకర్త***

జ: అడిగిన ప్రశ్నలకు ప్రతిస్పందనతో సమాధానం ఇచ్చువారు. గణాంక శోధకుడు ప్రశ్నావళిని తీసుకొని ఒక వ్యక్తి వద్దకు వెళ్ళినప్పుడు ఆ ప్రశ్నలకు సమాధానం ఇచ్చువాడు.

**8. *వరుసక్రమం***

జ: సాధారణ పరిభాషలో పరస్పర సంబంధం ఉన్న సంఘటనల వరుస కాని గణాంక శాస్త్రంలో కొన్ని సూత్రాల ప్రాతిపదికగా అమర్చబడిన శ్రేణి. ఉదా : ఒక శ్రేణి వరుసక్రమం 2 లో ప్రారంభమై 5 తేడాతో తయారుచేసినట్లయితే అది 2,7,12,17,22 అగును. ఈ సంఖ్యలు ఆరోహణ క్రమంలో అమర్చబడినవి. వీటిని తిరోగమనంగా అంటే పై నుండి క్రిందికి అమర్చినట్లయితే అవి 22,17,12,7,2 గా ఉండును. దీనినే ఆరోహణ క్రమం అంటారు

**9. *గణచిహ్నాల జాబితా***

జ: శ్రేణిలోని తరగతులలో చేర్చబడిన విలువలను సూచించే బార్లను తెలియజేసే జాబితా.

**10. *దత్తాంశం***

జ: ప్రభుత్వ రంగ సంస్థలు, వాణిజ్యసంస్థలు పారిశ్రామిక సంఘాలు, కార్మిక సంఘాలు మరియు పరిశోధనా సంస్థలు, జనాభా, ఉద్యోగిత, మార్కెట్లు మరియు విత్త సంబంధమైన అంశాలకు సంబంధించిన వివరాలను సేకరించి, విశ్లేషించి ప్రచురించిన గణాంక సమాచారం.

## రెండు మార్కుల ప్రశ్నలు

**1. *దత్తాంశ సేకరణ అనగానేమి?***

జ. ఏదేని సమస్యను అధ్యయనం చేయాలంటే మొట్టమొదటగా దానికి సంబంధించిన దత్తాంశాన్ని సేకరించాలి. గణాంక శోధకుడే దత్తాంశాన్ని స్వయంగా సేకరిస్తాడు. అట్టి దత్తాంశాన్ని ప్రాథమిక దత్తాంశం అంటారు. ఈ ప్రాథమిక దత్తాంశము 1) వ్యక్తిగత ఇంటర్వ్యూల ద్వారా, 2) ప్రశ్నావళిని పంపటం ద్వారా, 3) టెలిఫోన్ ద్వారా, 4) వేసుసడ్డా ద్వారా సేకరిస్తారు. సేకరించిన దత్తాంశం నుండి రిపోర్ట్ తయారుచేయుదురు.

*2. దత్తాంశ సమర్పణ అనగానేమి?*

జ. దత్తాంశాన్ని సేకరించిన తర్వాత దానిని ఒక క్రమపద్ధతిలో అమర్చడంతో పాటు పౌనఃపున్య విభాజనం, పట్టీలు, గ్రాఫ్‌లు, చిత్రపటాలు, బొమ్మలు వంటి రూపాలలో దత్తాంశాన్ని సమర్పించాలి. అయితే ఇవి అన్నీ వేర్వేరు సందర్భాలలో దత్తాంశమును బట్టి ఉపయోగించవలెను.

***3. పౌనఃపున్య విభాజనంను వివరింపుము.***

జ. దత్తాంశాన్ని సమూహాలుగా రూపొందించడానికి పౌనఃపున్య విభాజనం అవసరం. పౌనఃపున్య విభాజనం గణాంక దత్తాంశాన్ని సమూహాలుగా వర్గీకరిస్తుంది. ఉదా : ఎంతమంది విద్యార్థులు 40–50 మధ్య మార్కులు పొందినారనే సమాచారాన్ని తెలుపగలదు.

***4. సంచిత పౌనఃపున్యంను వివరింపుము.***

జ. ఒక తరగతి పౌనఃపున్యాన్ని దాని ముందు తరగతి పౌనఃపున్యాల మొత్తంతో కూడితే సంచిత పౌనఃపున్య విభాజనం వస్తుంది. దీనిని రెండు విధాలుగా తయారు చేయవచ్చు.

1) పై నుండి క్రిందకు అంటె 4 (1+3), 9 (4+5), 16 (9+7) మొదలగునవి. అట్టి విభాజనాన్ని "కంటె తక్కువ", "సంచిత పౌనఃపున్య విభాజనం" అంటారు. లేదా దీనినే "ఆరోహణ సంచిత పౌనఃపున్యం" అంటారు. శ్రేణిలో ఉన్న సాధారణ పౌనఃపున్యాన్ని పై నుండి క్రిందకు కూడితే "కంటె తక్కువ సంచిత పౌనఃపున్యం" ఏర్పడుతుంది. ఒక తరగతిలోని ఎగువ అవధి విలువ కంటె ఎన్ని పౌనఃపున్యాలు లేదా పరిశీలనాంశాలు దానికంటె తక్కువగా ఉన్నాయో తెలుసుకోవచ్చు.

2) సాధారణ పౌనఃపున్యాన్ని క్రింద నుండి పైకి కలుపుకుంటూ పోతే "కంటె ఎక్కువ" సంచిత పౌనఃపున్యం ఏర్పడుతుంది. ఉదా. 6 (2+4), 14 (6+8), 24 (14+10) మొ॥వి. దీనినే "అవరోహణ సంచిత పౌనఃపున్యం" అంటారు. శ్రేణిలో ఉన్న చలరాశి విలువ కంటె ఎన్ని పౌనఃపున్యాలు లేదా పరిశీలనాంశాలు ఎక్కువగా ఉన్నాయో తెలుసుకోవచ్చు.

ఇంకనూ సులభంగా తెలుసుకోవలెనంటే ఒక తరగతి దిగువ అవధికంటె ఎక్కువగా ఉండే అన్ని తరగతుల పౌనః పున్యాలను కూడితే ఆ తరగతికి సంబంధించి 'కంటె ఎక్కువ' సంచిత పౌనఃపున్యం వస్తుంది. బారు పటాలు అనేవి దత్తాంశ సమర్పణలో ఉపయోగించవచ్చు. వాటి వెడల్పు ఒకే విధంగా ఉండి, వాటి మధ్య దూరం కూడా ఒకే విధంగా ఉండును. అయితే వాటి ఎత్తులు దత్తాంశాన్ని ప్రతిబింబించును.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. దిగువ ఇవ్వబడ్డ గణాంక వివరాల ఆధారంగా ఒక ఫ్యాక్టరీలోని 20 మంది కార్మికుల వేతనాలకు సంబంధించిన పౌనఃపున్య శ్రేణిని నిర్మించండి. 450, 580, 600, 480, 540, 620, 400, 475, 500, 480, 620, 480, 570, 600, 650, 410, 550, 600, 650, 450.***

జ: i) దత్తాంశాన్ని ఆరోహణ క్రమంలో అమర్చండి

| | | | |
|---|---|---|---|
| 400 | 480 | 550 | 600 |
| 410 | 480 | 570 | 620 |
| 450 | 480 | 580 | 620 |
| 450 | 500 | 600 | 650 |
| 475 | 540 | 600 | 650 |

ii) పౌనఃపున్యాల జాబితాను తయారుచేయండి

| ఆదాయం | గణచిహ్నాలు | పౌనఃపున్యం (f) |
|---|---|---|
| 400 | 1 | 1 |
| 410 | 1 | 1 |
| 450 | 11 | 2 |
| 475 | 1 | 1 |
| 480 | 111 | 3 |
| 500 | 1 | 1 |
| 540 | 1 | 1 |
| 550 | 1 | 1 |
| 570 | 1 | 1 |
| 580 | 1 | 1 |
| 600 | 111 | 3 |
| 620 | 11 | 2 |
| 650 | 11 | 2 |

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ప్రాథమిక, మరియు ద్వితీయ దత్తాంశాల మధ్య గల భేదాన్ని తెల్పి, ప్రాథమిక, దత్తాంశాన్ని సేకరించే వివిధ పద్ధతులను వివరింపుము?***

**జ:** గణాంక దత్తాంశాన్ని రెండు విభిన్న పద్ధతులలో సేకరించవచ్చు. ఒక పద్ధతిలో దత్తాంశాన్ని నేరుగా సమాచార కర్త నుండి సేకరించడం. ఈ విధంగా సేకరించే గణాంక సమాచారాన్ని ప్రాథమిక దత్తాంశం (primary data) అంటారు. ఈ మూలంగా లభించే సమాచారాన్ని ప్రాథమికమూలం (primary source) అంటారు. గణాంక శోధకుడు స్వయంగా మొట్టమొదటి సారిగా దత్తాంశాన్ని సేకరించడం వల్ల ఇది వాస్తవాలకు సన్నిహితంగా ఉంటుంది.

### ప్రాథమిక దత్తాంశాన్ని సేకరించే పద్ధతులు

ప్రాథమిక దత్తాంశాన్ని సేకరించడానికి అనేక పద్ధతులు కలవు. వీటిలో కొన్ని ముఖ్యమైన పద్ధతులు.

**1. ప్రత్యక్ష వ్యక్తిగత శోధన**

ఈ పద్ధతిలో గణాంక శోధకుడు ఎవరి వద్ద సమాచారాన్ని రాబట్టాలని భావిస్తాడో వారిని ముఖాముఖి కలుస్తాడు. సమాచారం ఎవరి వద్ద నుండి సేకరిస్తారో వారిని సమాచారకర్త అంటారు.

**2. ప్రశ్నావళి పద్ధతి**

ఈ పద్ధతిలో ఏవేని సమస్యకు సంబంధించిన దత్తాంశాన్ని సేకరించడానికి అనేక ప్రశ్నలు గల జాబితాను తయారు చేస్తారు. దీనినే ప్రశ్నావళి అంటారు. దీనిని సమాచార కర్తలకు పోస్టు ద్వారా గాని, లేక వ్యక్తిగతంగా గాని అందజేస్తారు.

ప్రాథమిక దత్తాంశాన్ని ఉపయోగించుకోవడం వల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. గణాంక శోధకుడు తన అవసరానికి అనుగుణంగా సమాచారాన్ని సేకరించగలడు. అట్టి సమాచారం నమ్మదగినది గాను, గణాంక పరిశోధనకు సరిపోవునదిగా ఉంటుంది. కాని ఈ పద్ధతి అనుసరించడంలో కొన్ని ఇబ్బందులు లేకపోలేదు. ప్రాథమిక దత్తాంశాన్ని సేకరించడానికి ఎక్కువ సమయం పట్టడమే కాకుండా, ఎక్కువ ధనం, శ్రమ అవసరమగును. అందుచేత అనేక సందర్భాలలో కొన్ని చిన్న, చిన్న మార్పులతో ఇతర వ్యక్తులు లేదా సంస్థలు సేకరించిన సమాచారాన్ని ప్రస్తుత పరిశోధనకు ఉపయోగించు కోవడం జరుగుతోంది.

**ద్వితీయ దత్తాంశం:-**

ఇంకొక పద్ధతిలో ఇతరులు ఇంతకు ముందే సేకరించిన దత్తాంశాన్ని ఉపయోగించుకోవడం. గణాంక శోధకుడు కేవలం ఆ దత్తాంశాన్ని నేరుగా ఉపయోగించుకుంటాడు. ఈ విధంగా లభించే గణాంక సమాచారాన్ని ద్వితీయ దత్తాంశం (secondary data) అంటారు. ఇట్లా సమాచారం లభించే మూలాన్ని ద్వితీయమూలం (secondary source) అంటారు.

## ద్వితీయ దత్తాంశం లభించే మూలాలు

ఇంతకు ముందు వివరించినట్లు ద్వితీయ దత్తాంశాన్ని గణాంక శోధకుడు వ్యక్తిగతంగా సేకరించినది కాదు. దానిని ఇతర మూలాల నుండి మాత్రమే పొందడం జరిగింది. ఆ మూలాలను మౌలికంగా రెండు విధాలుగా వర్గీకరించ వచ్చు. (1) ముద్రితమైనవి. (2) అముద్రితమైనవి. కొన్ని మూలాలలో పరిశోధనావశ్యకతను బట్టి దత్తాంశాన్ని సేకరించి నప్పటికి అవి కొన్ని కారణాల వల్ల ప్రచురించబడవు. దీనిని ప్రచురించబడని మూలాలు అంటారు. ఉదాహరణకు విశ్వవిద్యాలయాలు, రిసెర్చి స్కాలర్లు, ప్రభుత్వం మరియు ప్రయివేటు సంస్థలు నిర్వహించే రికార్డులు సాధారణంగా ప్రచురించబడవు.

***2. "పౌనఃపున్య విభాజనం" అనే భావనను వివరింపుము. ఇది ఏవిధంగా పౌనఃపున్య శ్రేణి కంటె భిన్నమైనదో తెల్పుము?***

**జ:** పౌనఃపున్య శ్రేణులలో ఉన్న గణాంక దత్తాంశం అవర్గీకృతం (ungrouped) అట్టి దత్తాంశాన్ని సమూహాలుగా రూపొందించడానికి పౌనఃపున్య విభాజనం అవసరం. పౌనఃపున్య విభాజనం గణాంక దత్తాంశాన్ని సమూహాలుగా వర్గీకరిస్తుంది. ఉదా : ఎంతమంది విద్యార్థులు 40-50 మధ్య మార్కులు పొందినారనే సమాచారాన్ని తెలుపగలదు.

పౌనఃపున్య విభాజనాన్ని నిర్మించే ముందు దీనికి సంబంధించిన కొన్ని ముఖ్య భావనలను అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా కలదు.

**1. తరగతి (Class)**

రెండు అవధుల మధ్య తేడా ఉండునట్లు అమర్చబడ్డ సమూహాన్ని తరగతి అంటారు. ఉదా : 20–25, 25–30, మొ॥వి లేదా 20–24, 25–29 మొ॥వి. ప్రతి సమూహం ఒక తరగతికి ప్రాతినిధ్యం వహిస్తుంది.

**2. తరగతి అవధులు (Class Limits)**

ప్రతి తరగతికి రెండు హద్దులు లేదా అవధులు ఉంటాయి. వాటిని దిగువ అవధి (lower limit) మరియు ఎగువ అవధి (upper limit) అంటారు. అంటే తరగతికి నిర్దేశించబడ్డ ఎగువ, దిగువ హద్దులనే తరగతి అవధులు అంటారు. ఒక తరగతి 20–30గా ఉన్నప్పుడు దిగువ అవధి ($L_1$) = 20 మరియు ఎగువ అవధి ($L_2$) = 30 అగును.

**3. తరగతి అంతరం (Class interval) i =**

తరగతి యొక్క ఎగువ, దిగువ అవధుల మధ్య గల తేడానే తరగతి అంతరం అంటారు. ఇది ఎగువ అవధి నుండి దిగువ అవధి తీసి వేయగా వచ్చే విలువకు సమానంగా ఉండును. దీనినే తరగతి అవధి పరిమాణం అని కూడా అంటారు. ($L_2$-$L_1$) ఉదా : శ్రేణిలోని ఒక తరగతి 20–30గా ఉన్నప్పుడు తరగతి అవధి పరిమాణం $L_2–L_1$ = 30–20=10 అగును.

**4. తరగతి పౌనఃపున్యం (Class Frequency)**

ఒక తరగతిలో ఎన్ని అంశాలు ఉన్నాయో ఆ సంఖ్యను ఆ తరగతి పౌనఃపున్యం అంటారు. ఉదా : 40–50 తరగతి యొక్క పౌనఃపున్యం = 10. అదే విధంగా 50–55 తరగతి పౌనఃపున్యం = 5.

**5. మధ్య బిందువులు / మధ్య విలువలు (Mid Values)**

ఒక తరగతి యొక్క రెండు అవధుల సగటును మధ్య విలువ (M.V) అంటారు. ఈ విలువ తరగతి ఎగువ, దిగువ అవధులకు మధ్యస్థంగా ఉంటుంది.

***3. "మినహాయింపు పద్ధతి" మరియు "విలీన పద్ధతి" లో గల పౌనఃపున్య విభాజనాల మధ్యగల భేదాన్ని ఉదాహరణల సహాయంతో తెల్పుము?***

**జ:** పౌనఃపున్య శ్రేణిని తయారు చేసినట్లే పౌనఃపున్య విభాజనాన్ని కూడా తయారు చేయాలి. అయితే ఒక తేడా ఏమిటంటే పౌనఃపున్య విభాజనంలోని మొదటి నిలువ వరుసలో 20, 25 ...... 56, 58 వంటి నిరపేక్ష విలువలకు బదులు (20–25), (25–30) (30–35) ....... 55–60 వంటి వివిధ తరగతులలో సేకరించిన గణాంక వివరాలను పంపిణీ చేస్తారు.

పౌనఃపున్య విభాజనాన్ని అనేక విధాలుగా నిర్మించవచ్చు.

అ) మినహాయింపు పద్ధతి　　ఆ) విలీన పద్ధతి

ఇ) వివృత తరగతులు　　ఈ) అసమాన తరగతులు

ఉ) సంచిత తరగతులు

**అ) మినహాయింపు పద్ధతి (Exclusive Method)**

ఈ పద్ధతిలో ఏదైనా ఒక విలువ తరగతి ఎగువ అవధికి సమానంగా ఉంటే ఆ విలువను ఆ తరగతిలో మినహాయించి, ఆ తర్వాత తరగతిలో చేర్చే విధంగా గణ చిహ్నాలను (Tally Bars) గుర్తిస్తారు. ఉదా : 20–25 తరగతి నుండి మినహాయించి 25–30 తరగతిలో చేర్చడం జరుగుతోంది.

**ఆ) విలీన పద్ధతి (Inclusive Method)**

ఈ పద్ధతిలో ఒక తరగతి ఎగువ అవధికి సమానమైన విలువను ఆ తరగతిలోనే విలీనం చేస్తారు. అందువల్లనే దీనికి విలీనపద్ధతి అనే పేరు వచ్చింది. ఉదా : 20–24 తరగతిలో 20 మరియు 24 విలువలను విలీనం చేస్తారు. అదే విధంగా 40–44 తరగతిలో 40 మరియు 44 విలువలను విలీనం చేస్తారు. ఈ దిగువ పట్టికను విలీన తరగతుల ఆధారంగా రూపొందించడం జరిగింది.

**ఇ) వివృతాంత తరగతులు (Open end classes)**

వివృతాంత తరగతులు అంటే తరగతి అంతరాలు అసంపూర్ణంగా ఉండడం. వివృతాంత పౌనఃపున్య విభాజనంలో మొదటి తరగతి దిగువ అవధి గాని, శ్రేణిలోని చివర తరగతి ఎగువ అవధి గాని లేదా రెండూ గాని ఉండకపోవచ్చు. దిగువ ఇవ్వబడిన పట్టికను చూడండి.

**ఎఫ్.) అసమాన తరగతులు (Unequal Classes)**

అసమాన తరగతులు గల పౌనఃపున్య విభాజనంలో తరగతి అవధుల పరిమాణం ($L_2$-$L_1$) ఒకే విధంగా ఉండదు. అందువలన ఈ తరగతులను అసమాన తరగతులు అంటారు.

***4. సంచితపౌనఃపున్యం (Cumulative frequency) అనే భావనను వివరింపుము.***

**జ:** ఒక తరగతి పౌనఃపున్యాన్ని దాని ముందు తరగతి పౌనఃపున్యాల మొత్తంతో కూడితే సంచిత పౌనఃపున్య విభాజనం వస్తుంది. దీనిని రెండు విధాలుగా తయారు చేయవచ్చు.

i) పై నుండి క్రిందకు అంటె 4 (1+3), 9 (4+5), 16 (9+7) మొదలగునవి. అట్టి విభాజనాన్ని "కంటె తక్కువ "సంచిత పౌనఃపున్య విభాజనం" అంటారు. లేదా దీనినే "ఆరోహణ సంచిత పౌనఃపున్యం" అంటారు. శ్రేణిలో ఉన్న సాధారణ పౌనఃపున్యాన్ని పై నుండి క్రిందకు కూడితే కంటె తక్కువ సంచిత పౌనఃపున్యం (Less than cumulative frequency) ఏర్పడుతుంది. ఒక తరగతిలోని ఎగువ అవధి విలువ కంటె ఎన్ని పౌనఃపున్యాలు లేదా పరిశీలనాంశాలు దానికంటె తక్కువగా ఉన్నాయో తెలుసుకోవచ్చు.

ii) సాధారణ పౌనఃపున్యాన్ని క్రింద నుండి పైకి కలుపుకుంటూ పోతే కంటె ఎక్కువ సంచిత పౌనఃపున్యం ఏర్పడుతుంది. ఉదా. 6 (2+4), 14 (6+8), 24 (14+10) మొ॥వి. దీనినే "అవరోహణ సంచిత పౌనఃపున్య" అంటారు. శ్రేణిలో ఉన్న చలరాశి విలువ కంటె ఎన్ని పౌనఃపున్యాలు లేదా పరిశీలనాంశాలు ఎక్కువగా ఉన్నాయో తెలుసుకోవచ్చు. ఇంకనూ సులభంగా తెలుసుకోవలెనంటే ఒక తరగతి దిగువ అవధికంటె ఎక్కువగా ఉండే అన్ని తరగతుల పౌనః పున్యాలను కూడితే ఆ తరగతికి సంబంధించి కంటె ఎక్కువ సంచిత పౌనఃపున్యం వస్తుంది.

# 7

# గణాంక దత్తాంశ సమర్పణ

# (Presentation of Statistical Data)

## 7.1 పరిచయం

సాధారణంగా దత్తాంశాన్ని పట్టికలు, గ్రాఫ్‌లు మరియు పటాల ద్వారా సమర్పిస్తారు. నిలువగా, అడ్డంగా ఉన్న గళ్ళ వరసలో దత్తాంశాన్ని క్రమపద్ధతిలో పొందుపరచబడిన దానిని పట్టిక లేదా పట్టీ (Table) అంటారు. గ్రాఫ్‌లు అనేక రకాలుగా ఉంటాయి. మీరు ఈ పాఠ్యాంశంలో పట్టికలు, చార్టులు (Charts) 'పై' రేఖాచిత్రాలు (Pie diagrams) మరియు కాలశ్రేణుల రేఖాచిత్రాలు (Time Series line graphs) వంటి వాటిని ప్రశ్నలు, జవాబుల రూపంలో తెలుసుకుంటారు.

## 7.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ◆ పట్టిక అర్థాన్ని, దాని ఉద్దేశ్యాన్ని వివరించగలరు.
- ◆ నమూనా పట్టికను రూపొందించగలరు.
- ◆ బారు పటాల అర్థాన్ని, సాధారణ, బహుళ బారుపటాల నిర్మాణాన్ని వివరించగలరు.
- ◆ పై రేఖా చిత్రాల అర్థాన్ని, దాని నిర్మాణంలో తీసుకోవలసిన చర్యలను వివరించగలరు.
- ◆ కాలశ్రేణుల రేఖాచిత్రాల అర్థాన్ని దాని నిర్మాణంలో దశలను వివరించగలరు.

## 7.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. పట్టిక***

**జ:** నిలువు, అడ్డవరుసలలో గణాంక దత్తాంశాన్ని క్రమపద్ధతిలో సమర్పించేది పట్టిక.

***2. పట్టిక ముఖ్య భాగాలు***

**జ:** ప్రతి పట్టికలో ముఖ్య భాగాలైన పట్టిక సంఖ్య, పట్టిక పేరు, శీర్షిక, స్టబ్, ప్రధాన భాగం, పాదసూచిక మరియు దత్తాంశ మూలం వంటివి అవసరం.

***3. బారుపటం***

**జ:** బారు అంటే ఒక దట్టమైన గీత చదువరుల దృష్టిని ఆకర్షించడానికి గాను దానిని దట్టంగా గీస్తారు. బార్లను నిలువగా గాని, అడ్డంగా గాని గీయవచ్చు. బారు పొడవు చలరాశి విలువను తెలియజేస్తుంది. బారు వెడల్పులకు ప్రాధాన్యత ఉండదు. అందుచేతనే వీటిని ఏక పరిమాణ చిత్రాలు అంటారు.

***4. 'పై' రేఖా చిత్రం***

**జ:** 'పై' రేఖాచిత్రాలను వలయ చిత్రాలని, కోణరేఖా చిత్రాలని అంటారు. మొత్తం దత్తాంశంలోని విభాగాలను చూపడానికిగాను, వలయ చిత్రాన్ని వివిధ విభాగాల అనుపాతంలో ఖండాలుగా విభజిస్తారు. ప్రతి విభాగాన్ని డిగ్రీలలో వ్యక్తం చేయడానికి తగిన సూత్రాన్ని ఉపయోగిస్తారు.

***5. దత్తాంశాన్ని సమర్పించే పద్ధతులు***

**జ:** పట్టికలు, పౌనఃపున్య శ్రేణులు, పౌనఃపున్య విభాజనం, కాలశ్రేణుల రేఖాచిత్రం (గ్రాఫ్) వంటివి దత్తాంశాన్ని సమర్పించే ముఖ్య పద్ధతులు.

***6. కాలశ్రేణుల రేఖాచిత్రం***

**జ:** ఆర్థిక చలరాశిని కాలంతో సంబంధంగా అమరిస్తే దానిని కాలశ్రేణుల రేఖాచిత్రం అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. బారు పటాలు అనగానేమి?***

జ: బార్ అంటే ఒక దట్టమైన గీత. అధ్యయనం చేసే వారి దృష్టిని ఆకట్టుకోవడానికి దానిని దట్టంగా గీస్తారు. బారు పొడవు మనం పటంలో చూపించవలసిన చలరాశి పరిమాణాన్ని తెలియజేస్తుంది. బారు పటాలను ఏక పరిమాణ చిత్రాలని అంటారు. కారణం ఏమిటంటే బారు పొడవును మాత్రమే లెక్కలోకి తీసుకుంటారు. వెడల్పును పరిగణనలోకి తీసుకోరు. బారు అందంగా, ఆకర్షణీయంగా ఉండడానికి దానికి వివిధ రంగులు వేస్తారు. బారు పటాలు రెండు రకాలు. అవి 1. సాధారణ బారు పటాలు 2. ఉపవిభాజిత బారు పటాలు

***2. "పై" రేఖాచిత్రాలు అనగానేమి?***

జ: వలయ రేఖాచిత్రాలను "పై" రేఖా చిత్రాలని, కోణ రేఖా చిత్రాలని అంటారు. దత్తాంశాన్ని శాతములలో, డిగ్రీలలో విభజించి చెప్పడానికి "పై" రేఖాచిత్రాలను విరివిగా వాడుతారు. ఉదా: ఒక కళాశాల విద్యార్థులను సైన్సు విద్యార్థులని, కామర్సు విద్యార్థులని, ఆర్ట్సు విద్యార్థులని మూడు రకాలుగా విభజించవచ్చు. లేదా భారతదేశం ఎగుమతులను అమెరికా, యూరప్, అరబ్‌దేశాలు, ఆఫ్రికా దేశాలు మరియు ఇతర దేశాలుగా పేర్కొనవచ్చు. ఈ విధమైన విభజనలను చూపడానికి పై రేఖాచిత్రాలు సమర్థవంతంగా ఉపయోగపడతాయి. పై రేఖా చిత్రాలు వలయాకారంలో ఉండి మొత్తం దత్తాంశంలోని విభాగాలను తెలియజేసే విధంగా ఖండాలుగా విభజించబడుతుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

*1. "పై" రేఖాచిత్రం అర్థాన్ని, దాని ప్రయోజనాలను వివరింపుము.*

జ: వలయ రేఖాచిత్రాలను "పై" రేఖా చిత్రాలని, "కోణ" రేఖా చిత్రాలని (Angular diagram) అంటారు. దత్తాంశాన్ని శాతములలో, డిగ్రీలలో విభజించి చెప్పడానికి "పై" రేఖాచిత్రాలను విరివిగా వాడుతారు. ఉదా: ఒక కళాశాల విద్యార్థులను సైన్సు విద్యార్థులని, కామర్సు విద్యార్థులని, ఆర్ట్సు విద్యార్థులని మూడు రకాలుగా విభజించవచ్చు. లేదా భారతదేశం ఎగుమతులను అమెరికా, యూరప్, అరబ్‌దేశాలు, ఆఫ్రికా దేశాలు మరియు ఇతర దేశాలుగా పేర్కొనవచ్చు. ఈ విధమైన విభజనలను చూపడానికి "పై" రేఖాచిత్రాలు సమర్థవంతంగా ఉపయోగపడతాయి. "పై" రేఖా చిత్రాలు వలయాకారంలో ఉండి మొత్తం దత్తాంశంలోని విభాగాలను తెలియజేసే విధంగా ఖండాలుగా విభజించబడుతుంది. ఈ విధంగానే "పై" రేఖాచిత్రం ప్రతి విభాగాన్ని శాతములలో తెలియజేస్తుంది.

"పై" రేఖాచిత్రాల నిర్మాణంలో తీసుకోవలసిన చర్యలు

1వ చర్య : విభాగాల మొత్తం విలువలో ఒక్కొక్క విభాగం లేదా అంశం విలువ ఎంతో ముందుగా కనుగొనుము.

2వ చర్య : దిగువ సూత్రాన్ని ఉపయోగించి ప్రతి అంశం లేదా విభాగం డిగ్రీలలో ఎంతో కనుగొనుము.

3వ చర్య : ఏదో ఒక వ్యాసార్థంతో వలయాన్ని గీయండి.

4వ చర్య : కోణమాని నుపయోగించి చర్య – 2 లో పేర్కొన్నట్లు డిగ్రీలలో కనుగొన్న ప్రతివిలువలను పాతంలో వలయాన్ని ఖండాలుగా విభజించండి.

5వ చర్య : వివిధ ఖండాల మధ్య స్పష్టమైన తేడా గుర్తించే విధంగా ఖండాలకు వివిధ రంగులు వేయండి.

6వ చర్య : విభజించబడ్డ ఖండాలలో ఆయా అంశాల విలువలను డిగ్రీలలో చూపండి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

*1. పట్టికను తయారుచేయడంలో గల ఉద్దేశ్యం ఏమిటి? సాధారణ పట్టికలు, ప్రత్యేక భోగట్టా నిచ్చే పట్టికలను విచక్షణ చేయండి?*

**జ:** పరస్పర సంబంధం ఉన్న గణాంక దత్తాంశాన్ని సులభంగా ఈ పట్టికల ద్వారా సమర్పించవచ్చు. దానిని సరిపోల్చడం దీని వలన అధ్యయనం చేసేవారు వారికి అవసరమైన సమాచారాన్ని సులభంగా పట్టిక ద్వారా గ్రహించగలరు. ఉదాహరణకు దిగువ ఇవ్వబడ్డ పట్టిక ఉద్దేశం "A" అనే దేశం B.C.D.E అనే దేశాలతో జరిపిన ఎగుమతి, దిగుమతులకు సంబంధించిన వివరాలను తెలియజేయడం.

**పట్టికల రకాలు (Types of Tables)**

i) సాధారణ ఉపయోగ పట్టికలు (General purpose tables)

ii) ప్రత్యేక ప్రయోజన పట్టికలు (Special purpose tables)

**వీటిని ఒకదాని తర్వాత ఒకటి చర్చిద్దాం.**

### i) సాధారణ ఉపయోగ పట్టికలు (General purpose tables)

సాధారణ ప్రయోజన పట్టికలను **'నిక్షేపస్థాన'** (repository) పట్టికలని కూడా అంటారు. ఈ పట్టికలలో దత్తాంశం తాలూకు పూర్తి భోగట్టా ఉంటుంది. ఇందులోని భోగట్టాను సాధారణ వాడుకకు అవసరమైనప్పుడు త్రిప్పిచూడదానికి ఉపయోగిస్తారు. అందువలన ఈ పట్టికను సంప్రదింపుల పట్టిక (reference table) అంటారు. అంతే గాక ఈ పట్టికలు ఎక్కువ సమాచారాన్నిస్తున్నందున పరిశోధకులకివి చాల ఉపయోగపడతాయి. ఈ పట్టికల నుండి చిన్న పట్టికలను రాబట్టవచ్చు. సాధారణంగా భారత ప్రభుత్వం ఇతర గణాంక ఏజన్సీలు, వివిధ డిపార్టుమెంట్లు సమర్పించే గణాంక పట్టికలన్నీ ఈకోవకు చెందినవే.

### ii) ప్రత్యేక ప్రయోజన పట్టికలు (Special purpose tables)

ఈ పట్టికలు చిన్నవిగా ఉండి దీనిలోని విషయాలను సాధారణ ప్రయోజన పట్టిక నుండి రాబట్టటం జరుగుతుంది. అంటే సాధారణ ప్రయోజన పట్టిక నుండి ఉత్పన్నమైన సంఖ్యల ఫలితాల ఆధారంగా ప్రత్యేక ప్రయోజన పట్టిక రూపొందించబడుతోంది. అందుచేత ప్రత్యేక ప్రయోజన పట్టికను వ్యుత్పన్న పట్టిక (Derivative table) అని కూడా అంటారు. సాధారణ ప్రయోజన పట్టికలోని ఒకటి లేదా కొన్ని నిర్దిష్ట విషయాలను గురించి నొక్కి చెప్పడం కోసం ప్రత్యేక ప్రయోజన పట్టికలను తయారుచేస్తారు.

***2. పట్టికలోని భాగాలు* (Parts of a table) *ను వివరింపుము.***

**జ:** పట్టికలోఎన్ని భాగాలుండాలనేది నిర్దిష్టంగా పేర్కొనడం కుదరదు. దత్తాంశ స్వభావాన్ని బట్టి. విచారణా ఉద్దేశాన్ని బట్టి పట్టికలో భాగాలు మారుతూ ఉండును. అయినప్పటికి అన్ని పట్టికలకు వర్తించే కొన్ని భాగాలను క్రింద పట్టికలో వివరించబడింది.

**పట్టీ నంబరు**

( ............ పట్టీ పేరు ............... )

ముఖ్య గమనిక

<table>
<tr><td rowspan="2">స్టబ్ అర<br>(Stub Box)<br>స్టబ్ వివరాలు</td><td colspan="4">శీర్షికలు</td></tr>
<tr><td colspan="2">X శీర్షిక</td><td colspan="2">Y శీర్షిక</td></tr>
<tr><td></td><td>1 ఉప శీర్షిక</td><td>2 ఉప శీర్షిక</td><td>1 ఉప శీర్షిక</td><td>2 ఉప శీర్షిక</td></tr>
<tr><td>స్టబ్ A</td><td colspan="4" rowspan="4">పట్టిక ప్రధాన భాగం</td></tr>
<tr><td>స్టబ్ B</td></tr>
<tr><td>స్టబ్ C</td></tr>
<tr><td>మొత్తం</td></tr>
</table>

పాదసూచిక ఫుట్‌నోట్.

దత్తాంశ మూలం (.........)

## 1. పట్టిక సంఖ్య (Table Number)

ఒకటి కంటె ఎక్కువ పట్టికలను ఉపయోగించదలచినపుడు ప్రతి పట్టికకు ఒక సంఖ్యను వరస క్రమంలో కేటాయించడం ఎంతైనా అవసరం.

## 2. పట్టిక పేరు (Title)

ప్రతి పట్టికకు ఒక పేరు పెట్టాలి. ఆ పేరు క్లుప్తంగా, స్వయం ప్రబోధకంగా ఉండాలి. పట్టికలో ఏ దత్తాంశాన్ని చూపించేది తెలుపాలి. పట్టికలోని దత్తాంశం ఏ కాలానికి చెందింది, దానిని ఎవరు సేకరించింది తెలపాలి. పట్టికపేరు పట్టిక ఎగువ భాగంలో రాయాలి. పట్టిక పేరును పెద్ద అక్షరాలలో వ్రాయడం మంచిది.

## 3. శీర్షిక (Caption)

పట్టిక కుడి వైపున నిలువగీతలపై వ్రాసిన పదాలను (Headings) శీర్షికలంటారు. నిలువ గీత గడిలో ఏమున్నదో దాని శీర్షిక చెబుతుంది. ఒక పట్టీలో ఒకటిగాని అంత కంటె ఎక్కువగా గాని ఉపశీర్షిక లుండవచ్చు. శీర్షిక పదాన్ని స్పష్టంగా నిలువ గీత గడి మధ్యలో వ్రాసి చూపవలెను. నిలువగీతల గడిలో గణాంక ప్రమాణాలు వేర్వేరుగా ఉంటే వాటిని కూడా శీర్షికలో చూపాలి. పట్టీ పేరు కంటె శీర్షికలు చిన్నవిగా ఉండవలె.

## 4. స్టబ్ (Stub)

స్టబ్ శీర్షిక, స్టబ్ నమోదులను కలిసి స్టబ్‌గా వ్యవహరిస్తారు. ఒక పట్టికలో పూర్తిగా ఎడమ ప్రక్కన అడ్డు వరసల మీద ఉండే పదాలను “స్టబ్” అంటారు. ఇది ప్రతి అడ్డు వరుసల మీద అమర్చి ఉండే విషయాలను గూర్చి వివరిస్తాయి. స్టబ్‌లు సాధారణంగా శీర్షికల కంటె పెద్దవే గాని వాటిని వీలైనంత చిన్నవిగా చేసే ప్రయత్నం ఉండాలి. ఎందుకంటే పట్టికలోని ప్రధానభాగం శీర్షిక క్రిందకు వస్తుందే కాని స్టబ్‌ల క్రిందకు రాదు. ప్రతి స్టబ్ స్పష్టంగా ఉండాలి.

## 5. ప్రధాన భాగం (Main body)

ఇది పట్టికలో అత్యంత ప్రధానమైంది ప్రధాన శీర్షికలో సూచించిన ప్రకారం గణాంక వివరాలు పొందుపరచబడి ఉంటాయి. ఉదా : శీర్షికలో 1995-96 సంవత్సరాల మధ్యకాలంలో "A" దేశం యొక్క “దిగుమతులు, ఎగుమతులు” అని ఉన్నప్పుడు ప్రధాన భాగంలో A దేశం వివిధ దేశాలతో జరిపిన ఎగుమతి, దిగుమతుల విలువలకు సంబంధించిన సమాచారాన్ని గణాంకాలలో చూపాలి.

## 6. పాదసూచిక (Foot Note)

పట్టిక క్రింది భాగంలో ఒక పదంతో గాని, వాక్యరూపంలో గాని పట్టిక ప్రధానభాగంలో పొందుపరచిన గణాంక సమాచారం యొక్క పరిమితులను, దానిలో లేని అంశాలను చెప్పడానికి ఉద్దేశించినదే పాదసూచిక. ఉదా : ఒకానొక సంవత్సరం యొక్క దత్తాంశం లభించకపోతే దానిని పాదసూచికలో తెలపాలి. పాదసూచికను పట్టిక దిగువన చూపుతారు.

## 7. ముఖ్యసూచన (Head Note)

పట్టికలోని ముఖ్య సూచిక ఆ పట్టికలోని విషయాన్ని సంగ్రహంగా విశదీకరించడానికి ఉద్దేశించబడింది. దీనిని పట్టిక పై భాగంలో కుడివైపున మూలగా రాయవచ్చు. ఇది పట్టికలో పొందుపరచిన విషయాలను వాడిన వివిధ

కొలమానాలను అంటే "కోట్ల రూ॥లలో," లేదా "లక్షల టన్నులలో" లేదా ప్రత్తి వేల టన్నులలో మొదలగు వాటిని తెలియజేస్తుంది.

**8. దత్తాంశ మూలం (Source of Data)**

పట్టికలో సమర్పించిన దత్తాంశం ఏ మూలం నుండి తీసుకున్నది, పట్టిక క్రింది భాగం లోని పాదసూచిక క్రిందగా చూపాలి. దీని వలన అవసరమైతే అసలు దత్తాంశాన్ని కనుగొనడానికి, తద్వారా మరింత సమాచారం పొందడానికి అవకాశం ఉంటుంది. దత్తాంశ మూలాన్ని తెలిపేటప్పుడు గ్రంథకర్త పేరు, పుస్తకం ప్రచురణ కర్త పేరు, ప్రచురణ తేది, సంపుటల సంఖ్య, సూచిక సంఖ్య, పేజీ సంఖ్య మొదలగునవి చూపాలి.

***3. బారు పటం అనగా నేమి? వివిధ బారు పటాలను క్లుప్తంగా వివరించండి?***

జ: బార్ అంటే ఒక దట్టమైన గీత. అధ్యయనం చేసే వారి దృష్టిని ఆకట్టుకోవడానికి దానిని దట్టంగా గీస్తారు. బారు పొడవు మనం పటంలో చూపించవలసిన చలరాశి పరిమాణాన్ని తెలియజేస్తుంది. బారు పటాలను ఏక పరిమాణ చిత్రాలని అంటారు. కారణం ఏమిటంటే బారు పొడవును మాత్రమే లెక్కలోకి తీసుకుంటారు. వెడల్పును పరిగణనలోకి తీసుకోరు. బారు అందంగా, ఆకర్షణీయంగా ఉండడానికి దానికి వివిధ రంగులు వేస్తారు.

**బారుపటాలు – రకాలు**

బారు పటాలు రెండు రకాలు. అవి 1. సాధారణ బారు పటాలు 2. ఉపవిభాజిత బారు పటాలు

**అ) సాధారణ బారు పటాలు (Simple Bar diagrams)**

సాధారణ బారు పటాలను మరలా రెండువిధాలుగా పేర్కొనవచ్చు. అ) ఏక పరిమాణ బారుపటాలు ఆ) బహుళ బారుపటాలు

**i) ఏక పరిమాణ చిత్రాలు (Single Bar charts)**

బార్లను నిలువుగా గాని, అడ్డంగా గాని నిర్మించవచ్చు. సాధారణంగాని నిలువు బార్లనే ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. ప్రతి బారు పొడవు అంశాల పరిమాణాన్ని చూపుతుంది.

**ii) బహుళ బారు పటాలు (Multiple Bar Charts)**

కొన్ని సమయాలలో అంతర సంబంధం ఉన్న చలరాశికి సంబంధించిన దత్తాంశాన్ని బారు పటాలలో చూపించవలసిన అవసరం రావచ్చు. అటువంటి సందర్భంలో సాధారణ బారుపటాలు సరిపోవు. బహుళబారు పటాన్ని ఉపయోగించాలి. ప్రతి సంవత్సరానికి సంబంధించిన బార్లు వాటికి సంబంధించిన చలరాశులన్నింటికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ఉదా: దిగుమతి, ఎగుమతులను రెండు బార్లు ప్రాతినిధ్యం వహించగా, అమ్మకం ధర, ఉత్పత్తిధర, లాభాలను, మూడు బార్లు తెలియజేస్తాయి. సాధారణంగా పటంలో మూడు బార్లకంటె ఎక్కువ చూపించరు. బార్ల సంఖ్య అధికంగా ఉంటే దానిని అర్థం చేసుకోవడం క్లిష్టంగా ఉంటుంది. సాధారణ బారుపటాల నిర్మాణంలో వివరించినట్లుగానే బహుళ బారు పటాలను నిర్మిస్తారు. రెండు ఉదాహరణల సహాయంతో బహుళ బారు పటాలను దిగువ సమర్పించడాన్ని చూడవచ్చు.

**iii) ఉపవిభాజిత బారుపటాలు (Component Bar Charts)**

పైన వివరించినట్లు సాధారణ బారుపటాలు ఒక చలరాశిని మాత్రమే సమర్పించడానికి ఉపయోగడతాయి. కాని చలరాశి మొత్తాన్ని విభజించి చూపవలసి వచ్చినప్పుడు ఉప విభాజిత బారు పటాలను ఉపయోగించాలి.

# 8

# గణాంక పద్ధతులు

# (Statistical Methods)

## 8.1 పరిచయం

గణాంక దత్తాంశాన్ని సరిపోల్చడానికి మనకు వివిధ గణాంక సాధనాలు లేదా పద్ధతులు అవసరమవుతాయి. నిష్పత్తులు, రేట్లు, శాతాలు వంటివి, ఒక సమూహానికి చెందిన గణాంక సాధనాలుగా కనుగొన్నారు. సగటులు, పౌనః పున్య విభజనాలు మరొక సమూహానికి చెందిన గణాంకసాధనాలు కనుగొన్నారు. ఈ పాఠ్యాంశంలో మీరు ఈ గణాంక పద్ధతులపైనున్న సమాధానాలను తెలుసుకుంటారు.

## 8.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- నిష్పత్తి అర్థాన్ని ఉదాహరణతో వివరించగలరు.
- రేట్లు మరియు నిష్పత్తి మధ్యగల తేడాను వివరించగలరు.
- శాతాల భావనను వివరించగలరు.
- కేంద్ర స్థాన కొలతల అర్థాన్ని వివరించగలరు.
- అంక మధ్యమాన్ని గణన చేయగలరు.

## 8.3 ప్రశ్నలు - సమాధానాలు

**ఒక్క మార్కు ప్రశ్నలు**

***1. నిష్పత్తి***

**జ:** రెండు రాశుల మధ్యగల సంబంధాన్ని నిష్పత్తి తెలియజేస్తుంది. వీటిని పదాలని అంటారు.

***2. కేంద్రస్థాన కొలతలు***

**జ:** పరిమాణాత్మకంగా అమర్చబడిన దత్తాంశం యొక్క మధ్య స్థానంలో సగటు కేంద్రీకృతమైనందున సగటులను కేంద్రస్థాన కొలతలని అంటారు.

***3. అంకమధ్యమం సూత్రం***

**జ:** ఊహించిన సగటు పద్ధతినుపయోగించి అంక మధ్యమాన్ని కనుగొనడానికి $\overline{X} = A + \frac{\sum dx}{N}$ అనే సూత్రాన్ని ఉపయోగించాలి.

*4.* *ప్రత్యక్ష పద్ధతిలో అంకమధ్యమ సూత్రం*

**జ:** వర్గీకృత పౌనఃపున్య విభాజనంలో అంకమధ్యమమును ప్రత్యక్ష పద్ధతిలో కనుగొనడానికి ఉపయోగించే సూత్రం $\overline{X} = \frac{\sum fx}{\sum f}$ (ఇక్కడ $\overline{X}$ అంటే అంకమధ్యమం; $f$ అంటే పౌనఃపున్యం; X అంటే చలరాశులు.

*5.* *పరోక్ష పద్ధతిలో అంకమధ్యమ సూత్రం*

**జ:** వర్గీకృతం కాని శ్రేణిలో అంకమధ్యమాన్ని పరోక్ష పద్ధతి లేదా దగ్గర పద్ధతి (Short cut Method) లో కనుగొనడానికి ఉపయోగించే సూత్రం $\overline{X} = A + \frac{\sum fdx}{\sum f}$

*6.* *భారిత అంకమధ్యమం*

**జ:** శ్రేణిలోని అంశాలకు భిన్న ప్రాముఖ్యతలివ్వడం ద్వారా లెక్కించిన సగటును భారిత అంకమధ్యమం అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1.* *నిష్పత్తి - అర్థం*

జ: రెండు పరిమాణాల మధ్య సంబంధాన్ని నిష్పత్తి అంటారు. ఈ రెండు పరిమాణాలను రెండు రాశులని అంటారు. మొదటి రాశిని రెండవ రాశిచే భాగిస్తే నిష్పత్తిని కనుగొనవచ్చు. "ఏది సరిపోల్చుతామో" అది మొదటిరాశి. దేనితో సరిపోల్చుతామో అది రెండవ రాశి. ఈ విధంగా రెండు రాశులు నిర్ణయమైన తర్వాత మొదటిరాశిని రెండవ రాశిచే భాగిస్తే నిష్పత్తిని కనుగొనవచ్చు.

*2.* *రేట్లు అనగానేమి?*

జ: అర్థశాస్త్రంలో ఆర్థికాభివృద్ధి రేటు, జనాభా పెరుగుదల రేటు, జననాల రేటు, మరణాల రేటు, వ్యవసాయ దిగుబడి రేటు వంటి అనేక రేట్లను గూర్చి తరచూ, మాట్లాడుతూ ఉంటాం. ఈ రేట్లను లెక్కించే విధానం ఏవిధంగా ఉంటుందని చూడనప్పుడు, వీటన్నింటిని లెక్కించే ప్రక్రియ దాదాపు ఒకేవిధంగా ఉంటుంది. రేటు అనేది, నిర్ణీత కాలవ్యవధిలో రెండు పరిమాణాల మధ్య నిష్పత్తిని తెలియజేసేది వంటిది.

*3.* *భారిత అంకమధ్యమము అనగానేమి?*

జ: సామాన్య అంకమధ్యమాన్ని లెక్కించేటప్పుడు శ్రేణిలోని అన్ని అంశాలకు సమాన ప్రాముఖ్యత ఇవ్వడం జరుగుతోంది. అయితే శ్రేణిలో ఉన్న అంశాలకు వ్యక్తిగత ప్రాధాన్యత ఉన్నప్పుడు అన్ని అంశాలకు సమాన ప్రాముఖ్యత ఇవ్వడం ఒక రకంగా విషయాన్ని తప్పు త్రోవ పట్టించడమే అవుతుంది. పైగా శ్రేణిలోని అంశాల సాపేక్షిక ప్రాధాన్యతను అలక్ష్యం చేయడం వల్ల సగటులోని యదార్థత కనబడదు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. రేట్లను లెక్కించేటప్పుడు యూనిట్ ఆధారితం కంటె ఉన్నత ఆధారితాన్ని అన్వయించవలసిన ఆవశ్యకతను ఉదాహరణ సహాయంతో తెలియజేయండి.***

**జ:** అర్థశాస్త్రంలో మనం, ఆర్థికాభివృద్ధి రేటు, జనాభా పెరుగుదల రేటు, జననాల రేటు, మరణాల రేటు, వ్యవసాయ దిగుబడి రేటు వంటి అనేక రేట్లను గూర్చి తరచూ, మాట్లాడుతూ ఉంటాం. ఈ రేట్లను లెక్కించే ప్రక్రియ దాదాపు ఒకేవిధంగా ఉంటుంది. మనం ఇట్లా పేర్కొనడానికి వివరణ ఇవ్వడానికి కొన్ని ఉదాహరణలను తీసుకుందాం. ఉదా : ఒక హెక్టారులో పంట దిగుబడి రేటును తీసుకుందాం.

$$\text{ఒక హెక్టారులో పంట దిగుబడి రేటు} = \frac{\text{మొత్తం పంట ఉత్పత్తి (కేజీలలో)}}{\text{పంట క్రింద ఉన్న మొత్తం భూమి విస్తీర్ణం (హెక్టార్లలో)}}$$

పై ఉదాహరణలో రేట్లును లెక్కించే ప్రక్రియ నిష్పత్తులను లెక్కించే విధంగానే ఉంది. కాబట్టి ఈ ఉదాహరణలో రేట్లు, నిష్పత్తులు రెండూ సమానం. ఇక్కడ పంట దిగుబడి రేటు 'భూమి పరిమాణానికి ఉత్పత్తికి గల నిష్పత్తి' రెండూ ఒక్కటే. అందుచేత రేటు అనేది, నిర్ణీత కాలవ్యవధిలో రెండు పరిమాణాల మధ్య నిష్పత్తిని తెలియజేసేది వంటిది.

ఆధారంగా 'ఒక యూనిట్' ను తీసుకోవడానికి భిన్నంగా ఆమోదయోగ్యంగా ఒక ఆధారాన్ని తీసుకోవాల్సిన ఆవశ్యకత ఏమిటో వివరిద్దాం. ఒక యూనిట్ నిష్పత్తి విలువ కొన్ని సందర్భాలలో చాలా తక్కువగా ఉన్నప్పుడు నిష్పత్తి లేదా రేట్ల ప్రాధాన్యతను తెలియజేయడంలో విఫలమవుతుంది. అటువంటప్పుడు ఆధారంగా 100, లేదా 1000 లేదా 10,000 లను ఆధారంగా తీసుకోవాల్సిన అవసరం ఉత్పన్నమవుతుంది.

***2. భారిత అంకమధ్యమం ఆవశ్యకతను తెల్పుము.దానిని ఎట్లా లెక్కిస్తారు?***

**జ:** సామాన్య అంకమధ్యమాన్ని లెక్కించేటప్పుడు శ్రేణిలోని అన్ని అంశాలకు సమాన ప్రాముఖ్యత ఇవ్వడం జరుగుతోంది. అయితే శ్రేణిలో ఉన్న అంశాలకు వ్యక్తిగత ప్రాధాన్యత ఉన్నప్పుడు అన్ని అంశాలకు సమాన ప్రాముఖ్యత ఇవ్వడం ఒక రకంగా విషయాన్ని తప్పు త్రోవ పట్టించడమే అవుతుంది. పైగా శ్రేణిలోని అంశాల సాపేక్షిక ప్రాధాన్యతను అలక్ష్యం చేయడం వల్ల సగటులోని యదార్థత కనబడదు.

భారిత అంక మధ్యమము లెక్కించడానికి దిగువ చర్యలు తీసుకోవలసి ఉంటుంది.

1. శ్రేణిలో ఉన్న ప్రతి విలువకు వాటి సాపేక్ష ప్రాముఖ్యతను బట్టి భారాలివ్వాలి. $(\omega_1, \omega_2, \omega_3, ..., \omega_n)$
2. శ్రేణిలో ఉన్న ప్రతి విలువను ( $X$ ) వాటి సాపేక్షిక భారాలచే ( $\omega$ ) గుణించండి. ఇట్లా చేయడం వల్ల $\omega x$ వస్తుంది. $\omega_1 x_1, \omega_2 x_2, \omega_3 x_3, ..., \omega_n x_n$
3. $\omega x$ విలువలన్నింటిని కూడి మొత్తాన్ని కనుగొనండి. దానిని $\sum \omega x$ అని అంటారు.
   $\sum \omega x = \omega_1 x_1 + \omega_2 x_2 + ... + \omega_n x_n$
4. భారాల మొత్తాన్ని కూడండి. $\sum \omega$ వస్తుంది.
5. $\sum \omega x$ ను భారాల మొత్తం $\sum \omega$ చే భాగించినట్లయిన భారిత అంకమధ్యమం వస్తుంది.

భారిత అంక మధ్యమం $= \frac{X_1\omega_1 + X_2\omega_2 + X_3\omega_3 + ... + X_n\omega_n}{\omega_1 + \omega_2 + \omega_3 + ... + \omega_n}$

$= \frac{\sum \omega x}{\sum \omega}$

ఇక్కడ $\sum \omega x$ = విలువలను సంబంధిత భారాలచే గుణించగా లెక్కించిన మొత్తం

$\sum \omega$ = భారాల మొత్తం

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. అంకమధ్యమం అనగానేమి? వర్గీకృతం కాని పౌనఃపున్య విభాజనంలో ప్రత్యక్ష, పరోక్ష పద్ధతులనుపయోగించి అంకమధ్యమాన్ని ఎట్లా గణిస్తారో వివరింపుము.***

**జ:** సామాన్యంగా మనం 'సగటు' అని దేనిని పేర్కొంటామో దానిని గణాంక శాస్త్ర ఉపయోగంలో అంక మధ్యమం అంటారు. విస్తృతంగా ఉపయోగించే గణాంక కొలమానాలలో ఇది ఒకటి. శ్రేణిలో ఉన్న అన్ని అంశాల మొత్తాన్ని లెక్కించడం ద్వారా దీనిని కనుగొంటారు.

## అంకమధ్యమం - గణన

**ఎ) సాధారణ శ్రేణి - అంక మధ్యమం గణన** (Calculation of Arithmetic mean in simple array)

వ్యక్తిగత అంశాలున్న సాధారణ శ్రేణిని వ్యక్తిగత శ్రేణి (Individual series) అంటారు. ఈ శ్రేణిలో అంకమధ్యమాన్ని రెండు పద్ధతులలో గణించవచ్చు. (i) ప్రత్యక్ష పద్ధతి (Direct method), (ii) పరోక్ష పద్ధతి (Indirect method)

(i) **ప్రత్యక్ష పద్ధతి** (Direct method)

అంకమధ్యమం =

లేదా $(\bar{x}) = \frac{x_1 + x_2 + ........ + x_7}{N}$

(ii) **పరోక్ష పద్ధతి** (Indirect Method)

పరిశీలనాంశాలు తక్కువగా ఉంటే ప్రత్యక్ష పద్ధతిలో అంక మధ్యమాన్ని (Mean) కనుగొనడం ఎంతో సులభం. కాని పరిశీలనాంశాలు ఎక్కువగా నుంటే ప్రత్యక్ష పద్ధతి అసౌకర్యంగా ఉంటుంది. ఇటువంటి సందర్భాలలో పరోక్ష పద్ధతినుపయోగించడం మంచిది.

దత్తాంశంలో ఏ విలువ అంకమధ్యమానికి (Mean) దగ్గరగా ఉందని భావిస్తామో, దానిని ఎంపిక చేయండి. సామాన్యంగా శ్రేణిలో మధ్యగా ఉన్న విలువను ఎంపిక చేయడం సౌకర్యంగా ఉంటుంది. ఊహాత్మకంగా ఎంపిక చేసిన ఈ విలువను "ఊహించిన సగటు" (Assumed Mean) అంటారు. ఊహించిన సగటును "A" గుర్తుతో సూచిస్తారు. పరోక్ష పద్ధతిలో అంకమధ్యమాన్ని గణన చేయడానికి క్రింది చర్యలు అవసరం.

1. పరిశీలనాంశాలలో ఒక దానిని ఊహించిన సగటుగా తీసుకోండి.
2 ఊహించిన సగటు నుండి శ్రేణిలోని పరిశీలనాంశాల మధ్య విచలనాలను కనుగొనండి. విచలనాలను $dx$ గా తెలియజేయండి. అది $x - A$ కి సమానం.

3. విచలనాల మొత్తాన్ని కనుగొనండి. దీనిని $\varepsilon dx$ గుర్తుతో తెలియజేయండి.

4. దిగువ పద్ధతినుపయోగించి అంకమధ్యమాన్ని గణన చేయండి.

$$\overline{X} = A + \frac{\sum dx}{N}$$

## సి) పౌనఃపున్య శ్రేణిలో అంక మధ్యమం గణన

సాధారణ శ్రేణిలో వలనే పౌనఃపున్య శ్రేణిలో కూడా అంకమధ్యమాన్ని రెండు పద్ధతులలో గణించవచ్చు.

(i) **ప్రత్యక్ష పద్ధతి** (Direct Method)

ఈ పద్ధతిలో అంకమధ్యమాన్ని గణన చేయానికి దిగువ చర్యలను తెలుసుకోవాలి.

1. శ్రేణిలోని ప్రతి x విలువను దాని సంబంధిత పౌనఃపున్యంచే గుణించవలెను. ఆవిధంగా చేయడంవలన $fx = X \times f$ ను పొందవచ్చు.

2. $fx$ విలువల మొత్తాన్ని సంకలనం చేయాలి. తద్వారా మనం Σfx ను పొందగలం.

3. Σfx ను పరిశీలనాంశాల సంఖ్య Σf చే భాగించవలెను. ఇక్కడ పౌనఃపున్య విలువలన్నింటిని కూడితే Σf వస్తుంది. దిగువ పేర్కొనట్లు Σfx ను Σf తో భాగిస్తే అంకమధ్యమంను మనం సాధించగలం.

$$\overline{X} = \frac{f_1x_1 + f_2x_2 + \ldots + f_nx_n}{f_1 + f_2 + \ldots + f_n} = \frac{\sum fx}{\sum f}$$

(ii) **పరోక్ష పద్ధతి** (Indirect method) **లేదా దగ్గర పద్ధతి** (Short cut method)

పరోక్ష పద్ధతి రెండు విధాలుగా ఉంటుంది. మొదటి విధానంలో ఊహించిన సగటును (Assumed Mean =A) ని తీసుకోవడం. రెండవ విధానంలో సోపాన విచలనాలను (Step Deviations) తీసుకోవడం.

(i) ఊహించిన సగటును (Assumed Mean =A)

క్రింది సమీకరణంకు అన్వయిస్తే $\overline{X}$ విలువ వస్తుంది. $\overline{X} = A + \frac{\sum fdx}{\sum f}$

పరోక్ష పద్ధతిలో అంకెలనుపయోగించడం చాలా సులభం. అందుచేత అంకమధ్యమాన్ని లెక్కించడం కూడా చాల సులభమని మీరు గమనించి ఉంటారు.

(ii) **సోపాన విచలన పద్ధతి** (Step Deviation Method)

ఇది పరోక్ష పద్ధతిలో అంకమధ్యమాన్నికనుగొనే మరో విధానం. ఈ విధానంలో అదనంగా సోపాన విచలనాలను కనుగొనడం జరుగుతోంది. అందువల్లనే దీనిని సోపాన విచలన పద్ధతి అంటారు. చలరాశి విలువ (X) అధికంగా ఉంటే విచలనాల విలువ (dx = X−A) ఎక్కువగా ఉంటుంది. అందుచేత దీనిని సులభంగా లెక్కించడానికి వీలుగా ఒక సామాన్య సంఖ్యచే శ్రేణిలోని dx విలువలన్నింటిని భాగించవలెను. ఇట్లా చేయడం వల్ల విచలన dx విలువలు తగ్గించబడి, దానిని లెక్కించడం సులభమగును. ఇక్కడ సామాన్య సంఖ్యగా తీసుకున్న విలువను (i) గా పేర్కొంటాము.

***2. కేంద్రస్థాన కొలతలలో నున్న అంకమధ్యమం యొక్క గుణదోషాలను తెలియజేయండి.***

**జ: సుగుణాలు**

కేంద్రస్థాన కొలతలలో సామాన్యంగా ఉపయోగించబడేది అంకమధ్యమం. ఇతర కొలమానాలతో పోల్చితే అంకమధ్యమం కొన్ని సుగుణాలను కలిగిఉంది.

1. అంకమధ్యమాన్ని లెక్కించడం ఎంతో సులభం. శ్రమకల్గించే గణితీయ లెక్కలు చేయవలసిన పనిలేదు. పరిశీలనాంశాల మొత్తాన్ని, పరిశీలనాంశాల సంఖ్యచే భాగిస్తే అంకమధ్యమం తెలుస్తోంది.

$$\bar{x} = \frac{\sum x}{N} \text{ లేదా } = \frac{\sum x}{\sum f}$$

2. ఇది శ్రేణిలోని అన్ని విలువలపై ఆధారపడును. శ్రేణిలో ఏ భాగమైనా అసంపూర్ణంగా ఉంటే అంకమధ్యమాన్ని లెక్కించడం సాధ్యంకాదు.

3. ఇది బీజీయ ప్రస్తావనకు తగి ఉన్నది. అంటే వివిధ గణిత పద్ధతులను అంకమధ్యమంలో ఉపయోగించవచ్చు. ఉదాహరణకు : ఎ) రెండు శ్రేణుల అంకమధ్యమం వరుసగా $\overline{x_1}$ మరియు $\overline{x_2}$ అయినప్పుడు వాటి పరిశీలనాంశాలు $N_1$ మరియు $N_2$. ఈ రెండు శ్రేణుల ఉమ్మడి అంకమధ్యమాన్ని $\overline{x_{12}}$ క్రింది విధంగా కనుగొనవచ్చు.

$$\overline{X_{12}} = \frac{N_1 \overline{X_1} + N_2 \overline{X_2}}{N_1 + N_2}$$

4. ఇది స్పష్టంగాను, ఖచ్చితంగాను (Regidly) నిర్వహించబడిన సగటు. కారణమేమంటే పరిశోధకుడు పక్షపాత బుద్ధితో గణన చేసినా, నిష్పక్ష పాత బుద్ధితో గణన చేసినా వచ్చే అంకమధ్యమం ఒక్కటే.

**దోషాలు**

ఇతర కేంద్రస్థాన కొలతల కంటె అంకమధ్యమం కొన్ని కొన్ని ప్రయోజనాలను కల్గి ఉన్నప్పటికిని, ముఖ్యంగా మూడు అవలక్షణాలను కలిగి ఉంది.

1. శ్రేణిలోని అతిపెద్ద, అతి స్వల్ప (Extreme values) విలువల వల్ల అంకమధ్యమం అధికంగా ప్రభావితం అవుతుంది. అటువంటప్పుడు అంకమధ్యమం విలువ శ్రేణికి ప్రాతినిధ్యం వహించదు. అత్యధిక, అత్యల్ప విలువలు కృత్రిమంగా అంకమధ్యవిలువను ముందుకునెట్టడం గాని, క్రిందికి లాగడం గాని జరుగుతుంది.
2. అంకమధ్యమాన్ని కేవలం పరిశీలన (Mere observation) ద్వారా తెలుసుకోలేము.
3. అంకమధ్యమం అన్ని అంశాలపై ఆధారపడి ఉన్నదంటే అది ఆదర్శమైన సగటుగా చెప్పవచ్చు. అయితే ఒకప్పుడు కష్టంగా కూడా పరిణమిస్తుంది. ఉదా : మనకున్న 100 అంశాలలో 99 అంశాలు తెలిసి ఒక్క అంశం తెలియని కారణంగా అంకమధ్యమ గణన అసాధ్యమవుతుంది.

# 9

# సూచీ సంఖ్యలు : అర్ధం మరియు వాటి నిర్మాణం

# (Index Numbers : Meaning and their Construction)

## 9.1 పరిచయం

మన నిత్యజీవితంలో "ధరల పెరుగుదల" గూర్చి గమనిస్తూ ఉంటాము. దాని అర్ధం ఏమిటంటే నిత్యజీవితంలో మనం ఉపయోగించే అనేక వస్తువుల సగటు ధరలు పెరుగుతున్నాయని, అదే వస్తువులను, సేవలను కొనడానికి గతంలో కంటే ఇప్పుడు ఎక్కువ ధరను చెల్లించాలి. సూచీసంఖ్యలనుపయోగించి ధరలలో వచ్చే సగటు మార్పులను కనుగొనవచ్చు. వస్తువుల సగటు ధరలు పెరుగుతున్నాయని మనం చెప్పినప్పుడు అన్ని వస్తువుల ధరలు పెరుగుతున్నాయని అర్ధంకాదు. కొన్ని వస్తువులు ధరలు తగ్గవచ్చు. కాబట్టి సూచీ సంఖ్యలు ధరలలో వచ్చే సగటు మార్పులను మాత్రమే తెలియజేస్తాయి. (తగ్గుదల లేదా పెరుగుదల)

## 9.2 లక్ష్యాలు

- సూచీసంఖ్యలను నిర్వచించగలరు
- ధరల సాపేక్షాలను నిర్వచించగలరు.
- మీరు సూచీసంఖ్యల లక్షణాలను వరుసగా పేర్కొనగలరు.
- సూచీసంఖ్యల నిర్మాణంలో ఎదురయ్యే సమస్యలను వివరించగలరు.

## 9.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. సూచీ సంఖ్యలు***

**జ:** పరస్పర సంబంధం ఉన్న చలరాశుల సగటు మార్పును వ్యక్తంచేసే గణాంక కొలమానాలే సూచీ సంఖ్యలు.

***2. సూచీ సంఖ్యల రకాలు***

**జ:** సూచీసంఖ్యలు రెండు రకాలుగా ఉంటాయి. అవి (1) సామాన్య లేదా అభారిత సూచీసంఖ్యలు (2) భారిత సూచీసంఖ్యలు

***3. అభారిత సూచీ సంఖ్యలు***

**జ:** సామాన్య లేదా అభారిత సూచీసంఖ్యలు అన్ని వస్తువులకు సమాన ప్రాధాన్యతను ఇవ్వబడ్డసూచీసంఖ్యలు. అభారిత సూచీసంఖ్యలు అసమాన భారాలు ఇవ్వబడిన సూచీసంఖ్యలు

***4. సూచీ సంఖ్యను లెక్కించు పద్ధతులు***

**జ:** సామాన్య సూచీసంఖ్యలను రెండు పద్ధతులలో లెక్కించవచ్చు.

అవి : ఎ) సామాన్య సమిష్టి పద్ధతి $P_{o1} = \frac{\sum P1}{\sum Po} \times 100$

బి) ధరల సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతి $P_{o1} = \frac{\sum \left( \frac{P_1}{P_o} \times 100 \right)}{N} \times 100$

***5. లాస్పేయర్ సూచీసంఖ్య***

**జ:** భారిత సూచీసంఖ్యలలో లాస్పేయర్ పద్ధతి ఒకటి. ఆధార సంవత్సర పరిమాణాలను ($q_o$) భారాలుగా తీసుకుంటారు. దీని ప్రకారం సూచీసంఖ్య నిర్మించడానికి ఉపయోగించే సూత్రం : $P = \frac{\sum p_1 q_o}{\sum p_o q_o} \times 100$

***6. పాశ్చే పద్ధతి***

**జ:** పాశ్చే పద్ధతిలో వర్తమాన సంవత్సరం పరిమాణాలను ($q_1$) భారాలుగా తీసుకుంటారు. దీని ప్రకారం ఉపయోగించవలసిన సూత్రం $P = \frac{\sum p_1 q_1}{\sum p_o q_1} \times 100$

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. సూచీసంఖ్యలు అనగానేమి?***

**జ.** సూచీసంఖ్యలనేవి గణాంక కొలమానాలు. పరస్పర సంబంధం ఉన్న రెండు లేదా అంతకంటె ఎక్కువ చలరాశుల మధ్యగల సగటు మార్పులను తెలియజేస్తాయి. అంతేకాకుండా 2005 మరియు 2010 సంవత్సరాల మధ్యకాలంలో లేదా ఢిల్లీ మరియు ముంబాయి వంటి పట్టణాల మధ్య లేదా భారతదేశం మరియు జపాన్ దేశాల మధ్య వస్తువుల ధర లేదా వస్తు పరిణామంలో వచ్చిన సగటు మార్పులను ఈ సూచీసంఖ్యలు తెలియజేస్తాయి. వినియోగదారుల ధరల సూచి లేదా జీవన వ్యయ సూచీలు దీనికి సంబంధించిన సమాచారాన్ని అందించడంలో సహాయపడతాయి.

***2. ధర సాపేక్షాలుఅనే భావనను వివరింపుము.***

జ. సూచీసంఖ్యకు సులభమైన ఉదాహరణగా ధరల సాపేక్షాన్ని పేర్కొనవచ్చు. వర్తమాన సంవత్సర ధరను ($P_1$) ఆధార సంవత్సర ధర ($P_o$) లో భాగించి శాతములో వ్యక్తపరచబడిన విలువను ధర సాపేక్షంగా నిర్వచించవచ్చు.

***3. భారాలుఅనే భావనను వివరింపుము.***

జ. విస్తృత పరిధిలో చెప్పవలెనన్న మనకు రెండు రకాల సూచీసంఖ్యలున్నాయి. (1) సామాన్య లేదా అభారిత సూచీసంఖ్యలు (2) భారిత సూచీసంఖ్యలు. భారాలనేవి పరస్పర సంబంధం ఉన్న వివిధ వస్తువుల ప్రాధాన్యతను

తెలియజేస్తాయి. ఉదా: ఒక పేదవాని నెలసరి కుటుంబ బడ్జెట్‌లో అధికంగా ఆహారం మీద, తక్కువగా వస్త్రాలమీద, కొద్దిగా గాని లేదా అసలు లేకుండా కాని విద్య, ఆరోగ్య సౌకర్యాలు వంటి వాటికోసం వ్యయం చేయడం మనం గమనించవచ్చు. అందుచేత ఆహారం అనేది పేదవాని కుటుంబ బడ్జెట్‌లో అత్యధిక ప్రాధాన్యత లేదా భారంగల అంశం.

***4. సూచీసంఖ్యను నిర్మించడానికి సామాన్య సమిష్టి పద్ధతి అనే భావనను వివరింపుము.***

జ. సూచీసంఖ్యను నిర్మించడానికి ఇది చాలా సులువైన పద్ధతి. అన్ని వస్తువులకు లేదా అంశాలకు సమాన ప్రాధాన్యత ఇస్తారు. అందుచేత అన్ని అంశాలను సమానంగా భావిస్తారు. ఈ పద్ధతిలో సూచీసంఖ్య నిర్మాణానికి మూడు జాగ్రత్తలు అవసరం.

ఎ) వర్తమాన సంవత్సరంలోని అన్ని వస్తువుల ధరలను కూడి మొత్తం కనుగొనండి. ($\Sigma P_1$)

బి) ఆధార సంవత్సరంలో అదే వస్తువుల ధరలన్నింటిని కూడి మొత్తాన్ని కనుగొనుము ($\Sigma P_0$)

సి) క్రింది ఇవ్వబడిన సూత్రంలో విలువలను ప్రతిక్షేపించి ధరల సూచీని లెక్కించండి. ($\Sigma Po_1$)

$$\frac{P_1}{P_o} \times 100$$

$$P_{01} = \frac{\sum P_1}{\sum P_0} \times 100$$

***5. సూచీసంఖ్యను నిర్మించడానికి సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతి వివరింపుము.***

జ. అభారిత సూచీసంఖ్య నిర్మాణంలో ఇది మరో పద్ధతి. ఈ పద్ధతిలో వివిధ వస్తువుల ధరల సాపేక్షికాలను సగటు చేయడం ద్వారా సూచీసంఖ్యను కనుగొంటారు. సూచీసంఖ్యల నిర్మాణంలో ఏ సగటునైనా ఉపయోగించవచ్చు. ఉదా: అంకమధ్యమమును ఉపయోగించి సగటు చేయవలెనన్న సూచీసంఖ్య నిర్మాణానికి క్రింది సూత్రాన్ని ఉపయోగించవలె.

$$P_{o1} = \frac{\Sigma\left(\frac{P_1}{P_o} \times 100\right)}{N}$$

ఇక్కడ "N" అంటే సూచీసంఖ్యలో చేర్చబడ్డ వస్తువుల సంఖ్య.

సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతిలో సూచీసంఖ్యను తయారు చేసే పద్ధతులు

అ) ప్రతి వస్తువుకు ధరల సాపేక్షికాలను శాతములలో కనుగొనుము. $\frac{P_1}{P_o} \times 100$

ఆ) వివిధ వస్తువుల ధరల సాపేక్షికాలను అన్నింటిని కూడండి. $= \Sigma\left(\frac{P_1}{P_o} \times 100\right)$

ఇ) వస్తువుల సంఖ్య మొత్తాన్ని లెక్కించండి. $\Sigma N$

ఈ) ను సూచీసంఖ్యలో చేర్చబడిన వస్తువుల సంఖ్య "N" తో భాగించండి.

ఈ పద్ధతిని సరియైన ఉదాహరణతో నిరూపిద్దాం. పైన ఉదహరించినట్లు 1 మరియు 2లో ఇవ్వబడిన సమాచారాన్ని తీసుకొని సామాన్య సమిష్టి ఖర్చు పద్ధతిని వివరిద్దాం.

***6. లాస్పేయర్ పద్ధతి*** (Laspeyre's Method) ***ను వివరింపుము.***

ఈ పద్ధతిలో ఆధార సంవత్సర పరిమాణాన్ని (qo) భారాలుగా వాడుతారు. దీని ప్రకారం సూచీసంఖ్య నిర్మాణ సూత్రం $P = \frac{\sum P_1 q_o}{\sum P_0 q_o} \times 100$

***7. పాశ్చే పద్ధతి*** (Paasche's Method) ***ను వివరింపుము.***

ఈ పద్ధతిలో వర్తమాన సంవత్సర పరిమాణాలను ($q_1$) భారాలుగా తీసుకుంటారు. దీని ప్రకారం సూచీసంఖ్య నిర్మాణ సూత్రం $P = \frac{\sum p_1 q_1}{\sum p_o q_1} \times 100$

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. సామాన్య మరియు భారిత సూచీసంఖ్యలను విభేదించుము?***

**జ:** సామాన్య సూచీసంఖ్యలను రెండు పద్ధతులలో నిర్మించవచ్చు. అవి i) సామాన్య సమిష్టి పద్ధతి (simple aggregate method) ii) ధరల సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతి (simple average of price relatives method)

**ఎ) సామాన్య సమిష్టి పద్ధతి** (Simple aggregate method)

సూచీసంఖ్యను నిర్మించడానికి ఇది చాలా సులువైన పద్ధతి. అన్ని వస్తువులకు లేదా అంశాలకు సమాన ప్రాధాన్యత ఇస్తారు. అందుచేత అన్ని అంశాలను సమానంగా భావిస్తారు. ఈ పద్ధతిలో సూచీసంఖ్య నిర్మాణానికి మూడు జాగ్రత్తలు అవసరం.

ఎ) వర్తమాన సంవత్సరంలోని అన్ని వస్తువుల ధరలను కూడి మొత్తం కనుగొనండి. ($\Sigma P_1$)

బి) ఆధార సంవత్సరంలో అదే వస్తువుల ధరలన్నింటిని కూడి మొత్తాన్ని కనుగొనుము ($\Sigma P_0$)

**బి) సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతి**

అభారిత సూచీసంఖ్య నిర్మాణంలో ఇది మరో పద్ధతి. ఈ పద్ధతిలో వివిధ వస్తువుల ధరల సాపేక్షికాలను సగటు చేయడం ద్వారా సూచీసంఖ్యను కనుగొంటారు. సూచీసంఖ్యల నిర్మాణంలో ఏ సగటునైనా ఉపయోగించవచ్చు. ఉదా: అంకమధ్యమమును ఉపయోగించి సగటు చేయవలెనన్న సూచీసంఖ్య నిర్మాణానికి క్రింది సూత్రాన్ని ఉపయోగించవలె.

ఇక్కడ "N" అంటే సూచీసంఖ్యలో చేర్చబడ్డ వస్తువుల సంఖ్య.

సాపేక్షికాల సామాన్య సగటు పద్ధతిలో సూచీసంఖ్యను తయారు చేసే పద్ధతులు

అ) ప్రతి వస్తువుకు ధరల సాపేక్షికాలను శాతములలో కనుగొనుము. $\frac{P_1}{P_o} \times 100$

ఆ) వివిధ వస్తువుల ధరల సాపేక్షికాలను అన్నింటిని కూడండి. $=\Sigma\left(\frac{P_1}{P_o}\times 100\right)$

ఇ) వస్తువుల సంఖ్య మొత్తాన్ని లెక్కించండి. ΣN

ఈ) $\Sigma\left(\frac{P_1}{P_o}\times 100\right)$ ను సూచీసంఖ్యలో చేర్చబడిన వస్తువుల సంఖ్య "N" తో భాగించండి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. సూచీసంఖ్య అర్థాన్ని మరియు దాని ముఖ్య లక్షణాలను వివరింపుము?***

**జ:** సూచీసంఖ్యలనేవి గణాంక కొలమానాలు. పరస్పర సంబంధం ఉన్న రెండు లేదా అంతకంటె ఎక్కువ చలరాశుల మధ్యగల సగటు మార్పులను తెలియజేస్తాయి. అంతేకాకుండా 2001 మరియు 2006 సంవత్సరాల మధ్యకాలంలో లేదా ఢిల్లీ మరియు ముంబాయి వంటి పట్టణాల మధ్య వస్తువుల ధర లేదా వస్తు పరిణామంలో వచ్చిన సగటు మార్పులను ఈ సూచీసంఖ్యలు తెలియజేస్తాయి. ఉదా: మనం భారతదేశంలోని ప్రముఖ పట్టణాలైన ఢిల్లీ, ముంబాయి, మరియు కలకత్తాలలో ఏ పట్టణం ధరలదృష్ట్యా అత్యంత ఖరీదైనది లేదా అత్యంత చౌకైనదనే విషయం తెలుసుకోవాలనే సమాచారాన్ని అందించడంలో సహాయపడతాయి.

వివిధ రకాల వస్తువులను వివిధ యూనిట్లలో లెక్కిస్తారు. ఉదా: గోధుమ, వరి వంటి ఆహారధాన్యాలను కిలో గ్రాములలోను దుస్తులను మీటర్లలోను, పాలను లీటర్లలో కొలుస్తారు. ఈ విధంగా వివిధ యూనిట్లలో కొలిచిన వివిధ వస్తువుల సగటు మార్పులను తెలియజేయడానికి సూచీసంఖ్యలు సహాయ పడతాయి.

### సూచీసంఖ్యల ప్రధాన లక్షణాలు

సూచీసంఖ్యల లక్షణాలు క్రిందివిధంగా ఉంటాయి.

**1. సూచీసంఖ్యలు ప్రత్యేక సగటులు**

కేంద్ర స్థాన కొలతలైన అంకమధ్యమం వంటి వాటిని ఉపయోగించి రెండు లేదా అంతకంటే ఎక్కువ అంశాలను సరిపోల్చవచ్చు. అయితే ఇక్కడ అంశాలు వివిధ యూనిట్లలో ఉండడం వల్ల మనం సమస్యను ఎదుర్కొనవలసి ఉంటుంది.

**2. సూచీసంఖ్యలు పరస్పర సంబంధం ఉన్న చలరాశి సమూహం యొక్క నికర మార్పులను లెక్కిస్తాయి.**

సూచీసంఖ్యలు పరస్పర సంబంధం ఉన్న చలరాశి సమూహం యొక్క మార్పును (పెరగడం/తగ్గడం) ఒక్క సంఖ్యలో వర్ణిస్తాయి. ఉదా: 2001 మరియు 2006 రెండు సంవత్సరాల కాలవ్యవధిలో కొన్ని వర్గాల ప్రజలు వినియోగించేవస్తువుల ధరలలో వచ్చిన మార్పును పోల్చడానికి వినియోగదారుల ధరల సూచీసంఖ్యను లెక్కిస్తారు. 2001 సంవత్సరంతో పోల్చడానికి ఆ సంవత్సర సూచిని 100 గాను, 2006 సంవత్సర ధరల సూచీసంఖ్యను 120గా భావిద్దాం. అప్పుడు ధరలస్థాయి (120–100) 20% పెరిగిందని తెలుసుకోవచ్చు. ఈ విధంలో 2001 సంవత్సరం యొక్క సూచీసంఖ్యను 100 గాను, 2006 సం॥ యొక్క సూచీసంఖ్యను 120 గాను ఒకే సంఖ్యలో రెండు సంవత్సరాల కాలాల్లో గల ధరలస్థాయి సగటును సంక్షిప్తపరచినట్లు గ్రహించవచ్చును.

**3. నిర్ణీత కాలవ్యవధులలోను, ప్రాంతాల మధ్య వచ్చేమార్పుల ప్రభావాన్ని సూచీసంఖ్యలు కొలుస్తాయి.**

సూచీసంఖ్యలను ముఖ్యంగా నిర్ణీత కాలవ్యవధులలో వచ్చే మార్పులను కొలవడానికి ఉపయోగిస్తారు. అదే విధంగా వ్యవసాయ ఉత్పత్తులను పారిశ్రామిక ఉత్పత్తులను, ఎగుమతులు, దిగుమతులు వంటివాటిని వివిధ కాలవ్యవధులతో పోల్చవచ్చు. వివిధ పరిశ్రమలను వివిధ ప్రాంతాల (పట్టణాలు లేదా దేశాలు) ఆర్థిక స్థితిగతులను పోల్చడానికి సూచీసంఖ్యలను ఉపయోగించవచ్చు.

***2. భారిత సూచీసంఖ్యల నిర్మాణంలో లాస్పేయర్, పాశ్చే పద్ధతుల మధ్యగల వ్యత్యాసాలను గుర్తించండి. లాస్పేయర్ పద్ధతిని వివరింపుము?***

**జ:** భారిత సూచీసంఖ్యను నిర్మించేటప్పుడు జాబితాలో ఉన్న ప్రతిఅంశం యొక్క ప్రాధాన్యతను బట్టి భారాలనివ్వడం జరుగుతోంది. ఈ రకమైన సూచీసంఖ్యను లెక్కించడానికి రెండు పద్ధతులుగలవు. అవి (1) భారిత సమిష్టి పద్ధతి (Weighted aggregate method) (2) సాపేక్షితాల భారిత సగటు పద్ధతి (weighted average of price relative method) ఈ విభాగంలో రెండు రకాలైన భారిత సమిష్టి పద్ధతులను మనం అధ్యయనం చేస్తాం. అవి (1) లాస్పేయర్ పద్ధతి (Laspeyre's Method) (2) పాశ్చే పద్ధతి (Paasche's Method) ఈ రెండు పద్ధతులనుపయోగించి భారిత సూచీసంఖ్యలను నిర్మిస్తారు. అయితే ఈ రెండింటిలో ప్రధాన తేడా ఏమిటంటే లాస్పేయర్ ఆధార సంవత్సరం వస్తుపరిమాణాలను సాపేక్ష భారాలుగా ఉపయోగించగా పాశ్చే ఆధార సంవత్సర వస్తు పరిణామాలను సాపేక్ష భారాలుగా ఉపయోగించి ధరల సూచీని కనుగొంటారు.

**ఎ) లాస్పేయర్ పద్ధతి** (Laspeyre's Method)

ఈ పద్ధతిలో ఆధార సంవత్సర పరిమాణాన్ని (qo) భారాలుగా వాడుతారు. దీని ప్రకారం సూచీసంఖ్య నిర్మాణ

సూత్రం $P = \frac{\sum P_1 q_o}{\sum P_0 q_o} \times 100$

లాస్పేయర్ పద్ధతిలో సూచీసంఖ్యను లెక్కించడానికి అనుసరించవలసిన పద్ధతులు

ఎ) ప్రతివస్తువు లేదా సేవ యొక్క వర్తమాన సంవత్సర ధరలను ($P_1$) ఆధార సంవత్సర పరిమాణం ($q_o$) తో గుణించి $p_1, q_0$ కనుగొనండి

బి) ప్రతి వస్తువు లేదా సేవకు సంబంధించి ఆధార సంవత్సరం ధరలను ($p_o$) ఆధార సంవత్సరం పరిమాణంలో ($q_o$) తో గుణించి $p_o q_o$ కనుగొనుము.

సి) $p_1 q_o$ మరియు $p_o q_o$ లన్నింటిని కూడి $\Sigma p_1 q_o$ మరియు $\Sigma p_o q_o$ మొత్తాలను కనుక్కోండి.

డి) $\Sigma p_1 q_o$ మొత్తాన్ని $\Sigma p_o q_o$ తో భాగించి దానిని 100తో గుణించి లాస్పేయర్ సూచీసంఖ్యను కనుగొనండి.

# 10

# సూచీ సంఖ్యలు - సమస్యలు మరియు ప్రయోజనాలు

## (Index Numbers : Problems and Uses)

### 10.1 పరిచయం

సూచీ సంఖ్యల వలన ఎన్నో ప్రయోజనాలున్నాయి. ప్రభుత్వానికి సూచీ సంఖ్యల సమాచారం ఎంతైనా అవసరం. ఈ పాఠ్యాంశంలో సూచీ సంఖ్యల ప్రయోజనాలను ప్రశ్నలు-జవాబుల ద్వారా వివరించటమైనది.

### 10.2 లక్ష్యాలు

దీనిని అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- సూచీ సంఖ్యల నిర్మాణంలో ఉత్పన్నమయ్యే సమస్యలను వివరించగలరు.
- సూచీ సంఖ్యల ముఖ్యప్రయోజనాలను వివరించగలరు.
- సూచీ సంఖ్యలను గూర్చి కొన్ని పుస్తకాలలోను, దినపత్రికలలోను చదువగలరు.

### 10.3 ప్రశ్నలు - సమాధానాలు

**నాలుగు మార్కుల ప్రశ్నలు**

***1. సూచీ సంఖ్యల ప్రయోజనాలను కొన్నింటిని పేర్కొనుము.***

**జ:** 1. ధరల సూచీ ప్రజల జీవన వ్యయాన్ని లెక్కిస్తుంది. కాలగమనంలో ఉపయోగించే వస్తువులు మరియు సేవల ధరలు మారుతూ ఉంటాయి. మన ఇండ్లలోను, లేదా వ్యాపార వ్యవహారాలలో ఉపయోగించే వివిధ వస్తువులు, సేవల ధరలు నిర్ణీత కాల వ్యవధిలో పెరగడాన్ని గమనిస్తుంటాము. వాటి పెరుగుదల జీవన వ్యయం పెరగడానికి దోహదం చేస్తుంది. ధరలసూచికను ఆధారం చేసుకొని ప్రభుత్వం ఉద్యోగులకు కనీస వేతనాలను, కరువు భత్యం వంటి వాటిని నిర్ణయిస్తుంది.

2. ఆర్థిక వ్యవస్థలో సంభవించే ద్రవ్యోల్బణ, ప్రతి ద్రవ్యోల్బణ పోకడలను లెక్కించడంలో ధరల సూచి ఒక మంచి కొలమానం. ఈ పోకడలను నియంత్రించడానికి ప్రభుత్వం సరైన చర్యలను అవలంబిస్తుంది.

3. ఉత్పత్తి సూచీ సంఖ్య ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాలలో వస్తున్న ఆర్థిక ప్రగతిని తెలియజేసే ఒక మంచి సూచిక. భవిష్యత్తులో ఉత్పత్తిలో వచ్చే పోకడలను సైతం ముందుగానే కనిపెట్టడానికి దీనిని ఉపయోగించవచ్చు.

ఆ విధంగా ఈ సూచీలు ప్రణాళికలకు ఎంతో ప్రయోజనకరంగా ఉంటాయి.

4. జాతీయాదాయం, ఎగుమతులు, దిగుమతులు వంటి వాటికి సంబంధించిన ఇతర సూచీలు కూడా ఎంతో ప్రయోజనకరమైనవి. జాతీయాదాయ సూచి అభివృద్ధి రేటును తెలియజేస్తుంది. తలసరి ఆదాయ సూచి ఆర్థికాభివృద్ధి రేటును మరియు పేదరికపు స్థాయిని తెలియజేస్తుంది.

5. దేశంలోని వివిధ ప్రాంతాలను, ప్రపంచంలోని వివిధ ప్రాంతాల ఆర్థిక స్థితి గతులను పోల్చడానికి సూచీ సంఖ్యలను ఉపయోగించవచ్చు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. సూచీ సంఖ్య నిర్మించేటప్పుడు ఉన్న** సమస్యలను **వివరించండి.***

జ: సూచీ సంఖ్యలను వాస్తవంగా నిర్మించేటప్పుడు ఈ క్రింద పేర్కొన్న సమస్యలను మనం ఎదుర్కొనవలసి ఉంటుంది.

### 1. సూచీసంఖ్య నిర్మాణ ఉద్దేశ్యం

సూచీ సంఖ్యలను నిర్మించేటప్పుడు మొట్టమొదట దాని ఉద్దేశ్యాన్ని స్పష్టంగా నిర్ణయించాలి. కొలవదలచిన ఉపయోగించదలచిన వాటిని సూచీ సంఖ్య నిర్మాణంలో పేర్కొనాలి. ఒకవేళ సక్రమంగా నిర్ణయించకపోతే అది తప్పుడు నిర్ణయాలు లోపభూయిష్టమైన ఫలితాలకు దారి తీస్తాయి. ప్రతీ సూచీ సంఖ్యకు కొన్ని పరిమితులు మరియు ప్రయోజనాలు ఉంటాయి. సూచీ సంఖ్య నిర్మాణంలో చేర్చబడే వస్తువులు మరియు సేవలు, వాటి ధరలు, ఆధార సంవత్సర ఎంపిక వంటి నిర్ణయాలన్నీ సూచీ సంఖ్య నిర్మాణ ఉద్దేశ్యంపై ఆధారపడి ఉంటాయి. కాబట్టి వీటికి సంబంధించిన అత్యంత జాగరూకత అవసరం.

### 2. ఆధార సంవత్సర ఎంపిక

ధరల సూచీ సంఖ్యను ధరల సాపేక్షకాలలో వ్యక్తం చేయడం జరుగుతుంది. అందుచేత పోల్చుటకు అనువుగా సరియైన ఆధార సంవత్సరాన్ని ఎంపిక చేయాలి. దీనినే ఆధారకాలం లేదా ప్రాతిపదిక సంవత్సరం అంటారు. ఈ ఆధార సంవత్సరం గతానికి మరీ ఎక్కువ దూరంలో ఉండరాదు. దీనికి గల కారణం కాలం ఎక్కువ గడిచే కొద్దీ గతంలో ప్రజలు ఉపయోగించిన కొన్ని వస్తువుల ప్రాధాన్యత తగ్గి పోతుంది. కొన్ని నూతన వస్తువులు కోర్కెలను తీర్చడానికి పుట్టుకొస్తాయి అంతేకాకుండా ఆధార సంవత్సర కాలం సాధారణ ఆర్థిక కార్యకలాపాల కాలంగా ఉండాలి. యుద్ధాలు భూకంపాలు లేదా ప్రకృతి వైపరీత్యాలైన వరదలు, కరువు కాటకాలు, అంటువ్యాధులు వంటివి సంభవించి ఉండరాదు.

### 3. వస్తువులు మరియు సేవల ఎంపిక

ఇది కూడా సూచీ సంఖ్యల నిర్మాణ ఉద్దేశ్యం మీద ఆధారపడి ఉంటుంది. ఎంపిక చేయబడిన వస్తువులు మరియు సేవలు సూచీ సంఖ్యల ఉద్దేశ్యం ప్రకారం ఉండడమే కాక, సమూహం మొత్తానికి ప్రాతినిధ్యం వహించేటట్లు ఉండాలి. పైగా ఇవి బాగా ప్రాచుర్యం పొందినవిగా ఉండి, ఎవరికొరకు సూచీ సంఖ్య నిర్మించదలచామో వారి అభిరుచులు, అలవాట్లు ఆచారాలు, ఫ్యాషన్లకు ప్రాతినిధ్యం వహించేవిగా ఉండాలి.

## 4. ధరల వివరాల సేకరణ

వస్తు సేవల ఎంపిక తర్వాత ఎదురయ్యే మరొక సమస్య వాటి ధరలను సేకరించడం. ఈ సమస్యను పైన వివరించిన ప్రకారం కుటుంబ బడ్జెట్ విచారణ ద్వారా పరిష్కరించవచ్చు. పారిశ్రామిక కార్మికుల జీవన వ్యయ సూచీ సంఖ్యను నిర్మించడానికి గాను, వారు ఉపయోగించే వస్తు సేవల ధరలను గాని, వినియోగదారుల ధరల సూచీని గాని నిర్మించాలి.

## 5. భారాల ఎంపిక

సూచీ సంఖ్యల నిర్మాణంలో మరొక ముఖ్యమైన సమస్య భారాల ఎంపిక. కుటుంబ బడ్జెట్ విచారణ చేపట్టినట్లయితే శ్రామికులు ఉపయోగించే వస్తువులు, మరియు సేవలు సమాన ప్రాధాన్యత కల్గినవి కావని స్పష్టమవుతుంది. అంతేగాక కొన్ని వస్తు, సేవల కొనుగోలు కోసం ఆదాయంలో ఎక్కువగా వ్యయం చేయాలనే ఒత్తిడి ఉండదు. ఉదా : పారిశ్రామిక కార్మికుల బడ్జెట్‌లో ఆహార పదార్థాలపై వ్యయం చేసే శాతం ఎక్కువగా ఉంటుంది. దీనికి భిన్నంగా విద్య, వినోదాలు, ఆరోగ్య సౌకర్యాలు మందులు వంటి వాటి కోసం వ్యయం చేసే శాతం ఆదాయంలో తక్కువగా ఉంటుంది. అయితే కొన్ని సందర్భాలలో వస్త్రాల కంటే మందులు ఎక్కువ ప్రాధాన్యం కల్గి ఉండవచ్చు. అందుచేత సమూహంలోని ప్రతి వస్తువుపై ప్రజలు తమ ఆదాయంలో వ్యయం చేసే నిష్పత్తిని బట్టి భారాలను నిర్ణయించాలి.

## 6. సగటు ఎంపిక

నిర్ణీత కాలంలో పరస్పర సంబంధం గల ఒకటి లేదా అంతకంటె ఎక్కువ చలరాశులలో వచ్చే సగటు మార్పులను తెలియజేసే గణాంక పద్ధతులే సూచీ సంఖ్యలు. అయితే ఇక్కడ ఏ రకమైన సగటును ఉపయోగించాలనే ప్రశ్న ఉదయిస్తుంది. సగటులన్నింటిలోను గుణమధ్యమం ఉత్తమమైన సగటు. కాని దీనిని లెక్కించడంలో ఉన్న సమస్యల దృష్ట్యా అంక మధ్యమాన్ని విరివిగా వాడుతున్నారు. ఈ నిర్ణయం తీసుకున్న తర్వాత సూచీ సంఖ్య నిర్మాణానికి సామాన్య లేదా అభారిత సగటు పద్ధతిని ఉపయోగించాలా? లేదా భారిత సగటు పద్ధతులలో ఏ పద్ధతి నుపయోగించాలనేది మరో సమస్య. అంతగా ప్రాధాన్యత లేని అధ్యయనాల విషయంలో సామాన్య లేదా ఆధారిత సగటు పద్ధతులు సరిపోతాయి. కాని అత్యంత ప్రాధాన్యత కల్గి ఫలితాలు ఖచ్చితంగా ఉండవలసిన అధ్యయనాల విషయంలో భారిత సగటు (weighted average) పద్ధతులను తప్పక ఉపయోగించాలి.

# 11

# స్థూల అర్థశాస్త్ర పరిచయము

# (Introduction to Macro Economics)

## 11.1 పరిచయం

స్థూల అర్థశాస్త్రము ఆర్థిక వ్యవస్థను స్థూలంగా (మొత్తంగా) పరిగణనలోకి తీసుకుంటుంది. ఇది దేశం యొక్క మొత్తం ఉత్పత్తి, ఉద్యోగిత, ధరలు మరియు అంతర్జాతీయ వ్యాపారం మొదలగు స్థూల విషయాలను విశ్లేషిస్తుంది. స్థూల ఆర్థిక విశ్లేషణ, ఒక సంస్థ ఎంత ఉత్పత్తి చేయాలి? ఏమి ఉత్పత్తి చేయాలి ? ఎలా ఉత్పత్తి చేయాలి? అనే నిర్ణయాలను తీసుకోవడంలో ఉపయోగపడుతుంది. స్థూల ఆర్థిక విశ్లేషణలో స్థూల జాతీయోత్పత్తి, నిరుద్యోగిత, ద్రవ్యోల్బణం, ఎగుమతి, దిగుమతులు విదేశీ వ్యాపార చెల్లింపుల సమతౌల్యం, అంశాలను పరిగణన లోకి తీసుకుంటారు. అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక కార్యకలాపాలను దెబ్బతీసిన 1930 ఆర్థిక మాంద్యం తరువాత స్థూల ఆర్థిక శాస్త్రం యొక్క ప్రాముఖ్యత విస్తృతంగా పెరిగింది. బ్రిటిష్ ఆర్థిక వేత్త అయిన J.M. Keynes వ్రాసిన General theory of Employment Interest and Money (1936) కూడ స్థూల ఆర్థిక శాస్త్రం యొక్క ప్రాముఖ్యతను పెంచింది.

## 11.2 లక్ష్యాలు

- సాంప్రదాయ (Classical) ఉద్యోగిత సిద్ధాంతము అనగానేమి?
- కీన్స్ ఉద్యోగితా, ఉత్పత్తి మరియు ఆదాయ సిద్ధాంతము యొక్క విశదీకరణ
- ఆర్థిక లావాదేవీలలో ప్రభుత్వ పాత్ర

## 11.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. సంఘృష్ట లేదా అవస్థాపన నిరుద్యోగిత అనగానేమి?***

**జ:** ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధి జరుగుతున్నప్పుడు సాంకేతిక పరిజ్ఞానంలో మార్పులు వస్తున్నప్పుడు కొన్నిసార్లు, శ్రామికులు కలిగి ఉన్న నైపుణ్యానికి, పరిశ్రమకు అవసరమైన నైపుణ్యానికి తేడా ఉన్నప్పుడు ఏర్పడే నిరుద్యోగితను సంఘృష్ట లేదా అవస్థాపన నిరుద్యోగిత అంటారు.

***2. సార్థక డిమాండు అనగానేమి?***

జ: సమిష్టి డిమాండు ఫలం (వివిధ ఉద్యోగితా స్థాయిల వద్ద ఉత్పత్తి చేసిన వస్తువులను అమ్మటం వలన వ్యవస్థాపకులు పొందగలమని ఆశించే గరిష్ట రాబడుల మొత్తం) సమిష్టి సప్లయ్ ఫలం (వివిధ ఉద్యోగితా స్థాయిల వద్ద వ్యవస్థాపకులు

వస్తురాశిని ఉత్పత్తి చేయటానికి అయ్యే వ్యయం)నకు సమానమవుతుందో దానిని సార్ధక డిమాండు అంటారు.

*3. నిరుద్యోగం అనగానేమి?*

జ: మార్కెట్‌లో ఉన్న వేతనం లేదా పారితోషికమునకు శ్రామికులు లేదా వనరులు పనిచేయుటకు సిద్ధంగా ఉన్నప్పటికి పని దొరకక పోవడాన్ని నిరుద్యోగం అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1. సంపూర్ణ ఉద్యోగిత అనగానేమి?*

జ: సంపూర్ణ ఉద్యోగిత ఒక ప్రత్యేక మైన ఉద్యోగిత స్థితి. ఈ స్థితిలో కార్మికులు అందరికీ లేదా వనరులు అన్నింటికీ మార్కెట్ సమ్మతమైన వేతనం లేదా పారితోషికం వద్ద పని దొరుకుతుంది. సంపూర్ణ ఉద్యోగ స్థితిలో కొంతమంది శ్రామికులు లేదా కొన్ని వనరులు ఐచ్ఛిక నిరుద్యోగిత స్థితిలో ఉండవచ్చు.

*2. ఋతు సంబంధమైన నిరుద్యోగిత అనగానేమి?*

**జ:** ఋతువుల లేదా కాలము లోని మార్పుల వల్ల ఉత్పత్తి, సరఫరా మరియు డిమాండులో మార్పులు వస్తాయి. వీటివల్ల నిరుద్యోగిత ఏర్పడుతుంది. దీనిని ఋతు సంబంధమైన నిరుద్యోగిత అంటారు. ఉదాహరణకు ఏప్రిల్, మే మాసములలో వ్యవసాయ పనులు ఉండవు. అందువల్ల వ్యవసాయం మీద ఆధారపడినవారు, కాలనుగుణంగా వచ్చే మార్పుల వల్ల డిమాండులో మార్పు వచ్చే వస్తు సేవల మీద ఆధారపడిన వారు నిరుద్యోగితకు లోనవుతారు. ఇటువంటి నిరుద్యోగితను ఋతు సంబంధమైన నిరుద్యోగిత అంటారు.

***3. 'సే' యొక్క మార్కెట్ సిద్ధాంతం తెలపండి.***

జ: 'సే' సూత్రం లేదా మార్కెట్ సూత్రం, 'సరఫరా తన డిమాండును నిర్ణయించుకొనును'. (Supply creates its own demand) అని చెబుతుంది. ఫ్రెంచ్ వ్యాపారి, ప్రముఖ ఆర్థిక వేత్త అయిన జాన్ బాప్టిస్ట్ సే (J.B. Say) (1767-1932) ఈ సిద్ధాంతము యొక్క రూపకర్త.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. సాంప్రదాయ ఉద్యోగితా సిద్ధాంతం యొక్క ప్రమేయాలను విశదీకరించుము.***

జ: కీన్స్ ఉద్యోగితా సిద్ధాంతానికి పూర్వపు సిద్ధాంతం సాంప్రదాయ సిద్ధాంతం. ఈ సాంప్రదాయ సిద్ధాంతమును జె.బి.సే (J.B.Say's) మార్కెట్ సూత్రం (JB say's Law of Markets) A.C. పిగూ (Pigou) సరళ వేతన సిద్ధాంతము, ఫిషర్స్ (Fisher's) ద్రవ్య పరిమాణ సిద్ధాంతం (Quantity theory of Money) యొక్క సమన్వయంగా చెప్పవచ్చు.

### సాంప్రదాయ ఉద్యోగితా సిద్ధాంతం యొక్క ప్రమేయాలు :

సాంప్రదాయవాదులు ఆర్థిక వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగిత ఉంటుందని మరియు, సంపూర్ణ ఉద్యోగిత సరళీకృత వేతనాల వలన సాధ్యమని భావించారు. సాంప్రదాయవాదులు, ప్రభుత్వం ఆర్థిక కార్యకలాపాలలో జోక్యం చేసుకోకూడదని

భావించారు. సాంప్రదాయవాదులు వారి సిద్ధాంతం ప్రకారము ఆర్థిక వ్యవస్థ లేక మార్కెట్‌లలో పరిపూర్ణ పోటీ ఉంటుంది. వారి యొక్క మరియొక ప్రమేయము పొదుపు పెట్టుబడులు వడ్డీరేటుచే నిర్ణయింపబడతాయి.

### 'సే' యొక్క మార్కెట్ సిద్ధాంతం (Say's Law of Markets)

'సే' సూత్రం లేదా మార్కెట్ సూత్రం, 'సరఫరా తన డిమాండును నిర్ణయించుకొనును'. (Supply creates its own demand) అని చెబుతుంది. ప్రముఖ ఆర్థిక వేత్త అయిన జాన్ బాప్టిస్ట్ సే (J.B. Say) (1767–1932) ఈ సిద్ధాంతమును ప్రతిపాదించెను.

### అధికోత్పత్తికి అవకాశమే లేదు.

ఈ సిద్ధాంత ప్రకారముగా మార్కెట్ వ్యవస్థలో అధికోత్పత్తికి అవకాశమే లేదు. ఎందువలన అనగా, సప్లయ్ తనకు తగిన డిమాండును తానే సృష్టించుకుంటుంది. కనుక **సార్వత్రిక** అత్యుత్పత్తి ఉండదు. అనగా సప్లయ్, డిమాండు సమానంగా ఉంటాయి. ఒకవేళ సప్లమ్ డిమాండులో ఎప్పుడైనా అసమానతలు తలెత్తినా అవి స్వల్పకాలానికి మాత్రమే. సప్లయ్ తన డిమాండును తానే సృష్టించుకుంటుంది. ఇదే కాకుండా ధరలు సరళంగా ఉండుట వలన, సప్లయ్ డిమాండులకు అనుగుణంగా అవి మారుతూ సప్లయ్ డిమాండు సమానంగా ఉండేటటు చేస్తాయి.

### ఎ.సి పిగూ, సరళ వేతన సిద్ధాంతం (Pigou's wage flexibility theory)

ఎ.సి.పిగూ (1877–1959) ఇంగ్లండుకు చెందిన ఆర్థిక వేత్త. ఈయన అభిప్రాయం మేరకు వేతన సర్దుబాటు నిరుద్యోగితను నిర్మూలించి సంపూర్ణ ఉద్యోగితను సాధించటానికి ఉపయోగపడుతుంది. దీని ప్రకారం ధరల మరియు వేతన సర్దుబాటు వలన, ముఖ్యంగా ధరలను, వేతనాలను తగ్గించటం వలన వాస్తవిక ద్రవ్య సప్లయ్ పెరిగి ఉద్యోగితా స్థాయి పెరుగుతుంది. దీనిని ఆధారంగా సాంప్రదాయ సంపూర్ణోద్యోగితాను ప్రమేయంగా తీసుకున్నారు.

### ద్రవ్యరాశి సిద్ధాంతం (Quantity theory of Money)

ద్రవ్యరాశి సిద్ధాంతం Iriving Fisher (1867-1947) అనే అమెరికా దేశపు ఆర్థిక శాస్త్రవేత్తచే అభివృద్ధి చేయబడింది. ద్రవ్యరాశి సిద్ధాంతం ప్రకారం ద్రవ్యరాశి మారినపుడు ధరలస్థాయి కూడా మారును. ద్రవ్యరాశికి, ధరలకు అనులోమ సంబంధం ఉంది. ద్రవ్యరాశి ఏ అనుపాతంలో మారునో ధరల స్థాయి కూడా అదే అనుపాతంలో మారును.

ఫిషర్ సమీకరణ

$$MV = PT$$

### సాంప్రదాయ ఉద్యోగితా సిద్ధాంతం యొక్క విమర్శ

కీన్స్ సాంప్రదాయ ఉద్యోగితా సిద్ధాంతాన్ని విమర్శించారు. కొన్ని ముఖ్య విమర్శలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. ఆర్థిక వ్యవస్థలో సంపూర్ణ ఉద్యోగిత ఉంటుందనే ప్రమేయం నిజం కాదు. ఆర్థిక వ్యవస్థలు సంపూర్ణ ఉద్యోగిత కన్నా తక్కువ స్థాయిలో సమతౌల్యంలో ఉంటాయి.

2. వేతనాల తగ్గుదల నాగరిక ఆర్థిక వ్యవస్థలలో కనిపించుట లేదు. వేతనాలు తగ్గే దిశలో స్థిరంగా ఉంటాయి. వేతనాల తగ్గుదలను కార్మిక సంఘాలు ప్రతిఘటిస్తాయి. అందువల్ల వేతనాలు తగ్గవు.
3. పొదుపు వడ్డీరేటుచే నిర్ణయింప బడదు, ఆదాయంచే నిర్ణయింప బడుతుంది.
4. ఉత్పత్తి డిమాండును నిర్ణయించదు. డిమాండే ఉత్పత్తిని నిర్ణయిస్తుంది.
5. ద్రవ్యం యొక్క విధి వ్యాపార వ్యవహారాలకు సహకరించటమే కాకుండా విలువ నిధిగా పనిచేయటం కూడా దీని విధి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. కీన్సు ఆదాయ ఉద్యోగితా సిద్ధాంతాన్ని విశదీకరించుము.***

జ: ఆర్థిక వ్యవస్థకు సంబంధించి సాంప్రదాయ ఆర్థిక వేత్తల అభిప్రాయాలైన సంపూర్ణ ఉద్యోగిత, దీర్ఘకాల సమతౌల్యం, ధరల, వేతనాల సర్దుబాటు నిజాలు కావని కీన్స్ తదుపరి అతని అనుచరులు చెప్పారు. కీన్స్ ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయి కంటే తక్కువ సమతౌల్యంలో ఉంటుందని, ధరల, వేతనాల సర్దుబాటు అంత సులభం కాదని నివేదించటం జరిగింది. కీన్స్, తన పుస్తకమైన General theory of employment, Interest and Money కు ఆపేరు పెట్టుటకు కారణం ఆయన అభివృద్ధి చేసిన సిద్ధాంతం అన్ని కాలాలకు, విభిన్న పరిస్థితులకు ఉపయోగపడుతుందని నమ్మటం.

కీన్స్ ఆదాయ నిర్ణయ సిద్ధాంతం ప్రకారం ఎక్కడైతే సమిష్టి డిమాండు ఫలం (వివిధ ఉద్యోగితా స్థాయిల వద్ద ఉత్పత్తి చేసిన వస్తువులను అమ్మటం వలన వ్యవస్థాపకులు పొందగలమని ఆశించే గరిష్ట రాబడుల మొత్తం) సమిష్టి సప్లయ్ ఫలం (వివిధ ఉద్యోగితా స్థాయిల వద్ద వ్యవస్థాపకులు వస్తురాశిని ఉత్పత్తి చేయటానికి అయ్యే వ్యయం)నకు సమానమవుతుందో దానిని సార్థక డిమాండు అంటారు. కీన్స్ సిద్ధాంతం ప్రకారము ఉత్పత్తి, ఉద్యోగిత, ఆదాయము ఈ సార్థక డిమాండు స్థాయిని బట్టి నిర్ణయించబడతాయి. సాంప్రదాయ ఆర్థిక వేత్తల అభిప్రాయానికి విరుద్ధంగా కీన్స్ డిమాండు, సప్లయ్‌ని, అనగా ఉద్యోగితను, ఉత్పత్తిని ఆదాయమును, వినియోగమును నిర్ణయిస్తుందని చెప్పారు. సమిష్టి డిమాండు, సమిష్టి సప్లయ్ చాలా కారకాల మీద ఆధారపడి ఉన్నవి. వాటిని క్రింది పట్టిక ద్వారా చూపవచ్చు.




పైన పేర్కొన్న విధంగా సార్ధక డిమాండు, ఉద్యోగితను, ఉత్పత్తిని, ఆదాయమును మరియు వ్యయమును నిర్ణయిస్తుంది. సార్ధక డిమాండు పెరిగితే అది పెట్టుబడి దారులను ఎక్కువ పెట్టుబడి పెట్టేటట్లు చేస్తుంది. దానివల్ల ఎక్కువ ఉద్యోగిత ఉత్పత్తి, ఆదాయం ఏర్పడతాయి. అధికంగా సృష్టించబడ్డ ఆదాయంలో కొంతభాగం వినియోగంగా మిగిలినది పొదుపుగా విభజింపబడుతుంది. పొదుపు పెట్టుబడిగా మారుతుంది. ఒకరి ఖర్చు, వేరొకరి ఆదాయం. అందువల్ల ఖర్చు ఆదాయాన్ని సృష్టించడంలో ఉపయోగపడుతుంది. కీన్స్ అతని విశ్లేషణలో స్వల్పకాలానికి ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చారు మరియు స్వల్ప కాలంలో సమిష్టి సప్లయ్ ఫలం స్థిరంగా ఉంటుందని చెప్పారు.

# 12

# ఆదాయ ప్రవాహాలు

# (Income Flows)

## 13.1 పరిచయం

మీలో అనేక మంది జాతీయాదాయంను గూర్చి వినిగాని, చదివిగాని ఉంటారు. ఇది చాలా ముఖ్యమైన భావన. అయినప్పటికీ అర్థశాస్త్రంలో ఈ భావనకు ఒక ప్రత్యేకమైన అర్థముంది. జాతీయ ఆదాయంలో జాతీయ మరియు ఆదాయం అనే రెండు పదాలున్నవి. ఈ రెండు పదాలకు కూడా అర్థశాస్త్రంలో ప్రత్యేక అర్థాలున్నాయి. ఈ పాఠంలో మీరు ఆదాయం అనే భావనకు అర్థంను మరియు ఆదాయం పొందు విధానం గురించి నేర్చుకుంటారు.

## 13.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలు చదివిన తరువాత మీరు తెలుసుకొనే ముఖ్యాంశాలు

- కారక ఆదాయం, కారకం కాని ఆదాయం మధ్య గల తారతమ్యాలను గుర్తించడం.
- నాలుగు ఉత్పత్తి కారకాల అర్థాన్ని, ప్రతి ఉత్పత్తి కారకం పొందే ప్రతిఫలాన్ని గురించి వివరించడం.
- ఉత్పత్తి, వినియోగం మరియు పెట్టుబడికి సంబంధమున్న ఆదాయ కార్యకలాపాలను వివరించడం
- ఆర్థిక వ్యవస్థలోని వివిధ విభాగాలైన ఉత్పాదక సంస్థలు, కుటుంబ రంగం, సాధారణ ప్రభావం, మూలధనం మరియు మిగిలిన ప్రపంచ రంగాల గురించి వివరించడం.
- వివిధ రంగాల మధ్య ద్రవ్య నిజ ప్రవాహాలను వివరించడం.

## 13.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. కారక ఆదాయం***

**జ:** ఉత్పత్తి కారక ఆదాయం అనునది ఉత్పత్తి కారక యజమాని ఉత్పత్తి సంస్థకు అందించిన సేవలకు ప్రతిఫలంగా పొందే ఆదాయం.

***2. శ్రమ***

**జ:** శ్రమ అనేది ఉత్పత్తిలో పాల్గొనే మానవుల శారీరక మరియు మానసిక శ్రమ. ఈ శ్రమకు లభించే ప్రతిఫలమే వేతనం.

***3. భూమి***

**జ:** భూమి అంటే ప్రకృతి నుండి ఉచితంగా పొందేకానుక. భూమికి లభించే ప్రతిఫలమే భాటకం.

***4. మూలధనం***

**జ:** మూలధనం అంటే మానవ నిర్మిత మూలధన వస్తువులు మూలధనానికి లభించే ప్రతిఫలమే వడ్డీ.

***5. లాభం***

**జ:** వ్యాపార నిర్వహణ బాధ్యతలు నిర్వహించినందులకు ఉద్యమదారుడు పొందే ప్రతిఫలమే లాభం.

***6. బహిరంగ ఆర్థిక వ్యవస్థ***

**జ:** ఎగుమతులు, దిగుమతులలో ఉన్న వ్యవస్థను బహిరంగ ఆర్థిక వ్యవస్థ అందురు.

***7. నియమిత ఆర్థిక వ్యవస్థ***

**జ:** బహిరంగ ఆర్థిక వ్యవస్థ అంటే ఆర్థికవ్యవస్థ మిగిలిన ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో సంబంధము కలిగి వున్నది. నియమిత ఆర్థిక వ్యవస్థ అంటే మిగతా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలతో సంబంధం లేని ఆర్థిక వ్యవస్థ.

***8. కారకం కాని ఆదాయాలు***

**జ:** కారకం గాని ఆదాయాలు అనగా వీటికి బదులుగా ఎలాంటి కారకసేవలు అవసరం లేనివి. ఉదాహరణకు బహుమానాలు, చందాలు, పన్ను, ఫీజులు మొదలైనవి.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ఆదాయం అనగానేమి?***

జ. మీరు ఆదాయమును అనేక మార్గాల ద్వారా పొందగలరు. కొందరు వారి యజమానుల ద్వారా వేతనాలను పొందుతారు. మరి కొందరు రుణం ఇవ్వడం ద్వారా వడ్డీని పొందుతారు. మరికొందరు బహుమతులను, చందాలను మొదలగు వాటిని ఇతరుల వద్దనుండి పొందుతారు. కొందరు వ్యాపార నిర్వహణ ద్వారా లాభంను పొందుతారు. పై విధముగ పొందే కొన్ని రకాల ఆదాయాలకు ఏదో ఒక ప్రతిఫలం ఇవ్వవలసి ఉంటుంది. కొన్ని రకాల ఆదాయాలు పొందటానికి వ్యక్తి కొంత త్యాగం చేయవలసి వుంటుంది. మరికొన్నింటిని పొందుటకు ఇటువంటి త్యాగం చేయనవసరం లేదు.

***2. ఉత్పత్తి కారక ఆదాయాలు అనగానేమి?***

జ. కారకం అను పదమునకు అర్ధం ఉత్పత్తి కారకం అని చెప్పవచ్చు. ఉత్పత్తి కారకాలు నాలుగు రకములు. అవి భూమి, శ్రమ, మూలధనం మరియు వ్యవస్థాపన. ఈ ఉత్పత్తి కారకాల యజమానులు వీటి సేవలను ఉత్పత్తి చేయు సంస్థలకు విక్రయించడం జరుగుతుంది. ఉత్పత్తి సంస్థలు పొందిన ఈ సేవలకు ఉత్పత్తి కారకాల యజమానులు

కొంత ప్రతిఫలాన్ని అందిస్తారు. ఈ ప్రతిఫలం ఉత్పత్తి సంస్థలకు ఉత్పత్తి వ్యయం గాను, యజమానులకు ఉత్పత్తి కారక ఆదాయాలుగాను పరిగణిస్తారు.

*3.* ***ఉత్పత్తి సంస్థ అనగానేమి?***

జ. ఉత్పత్తి సంస్థ ఏర్పాటు అనేది నాలుగు ఉత్పత్తి కారకాల యజమానులు కలిసి వస్తుసేవల ఉత్పత్తిలో పాల్గొన్నపుడు జరుగుతుంది. కర్మాగారాలు, దుకాణాలు, కార్యాలయాలు, పాఠశాలలు, కళాశాలలు, సేవాకేంద్రాలు, వైద్యశాలలు, రైల్వేలు, రేడియో కేంద్రాలు, ప్రభుత్వ కార్యాలయాలు, పోలీసు విభాగం మొదలైనవన్నియు ఉత్పత్తి సంస్థలు. ఇవి ఏదో ఒక వస్తువును గాని, సేవనుగాని ఉత్పత్తి చేస్తాయి. ప్రతి ఒక్క సంస్థకు (ఉత్పత్తి సంస్థ) ఈ నాలుగు రకాల ఉత్పత్తి కారకాల సేవలు అవసరమవుతుంటాయి.

*4.* ***నియమిత ఆర్థిక వ్యవస్థ (Closed Economy) అనగానేమి?***

జ. ఆధునిక కాలంలో దాదాపుగా ప్రతి దేశం ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాలను కలిగి ఉంది. సుమారుగా అన్ని దేశాలు ఒకరి నుండి ఒకరు వస్తు సేవలను కొనుగోలు చేస్తుంటారు. వివిధ దేశాల మధ్య రుణాలు ఇవ్వడం, తీసుకోవడం జరుగుతుంది. ఒక దేశంలో ఉన్న ప్రజలు ఇతర దేశాలకు వెళ్లడం, రావడం జరుగుతూ ఉంటుంది. రెండు దేశాలు ఒకదాని కొకటి ఆర్థిక సంబంధాలు కలిగి వుంటే వాటి మధ్య నిజ మరియు ద్రవ్య ప్రవాహాలు ఏర్పడుతుంటాయి.

*5.* ***బహిరంగ ఆర్థిక వ్యవస్థ (Open Economy) అనగానేమి?***

జ. ఒక దేశం ప్రపంచంలోని ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాలు కలిగి ఉండటాన్ని బహిరంగ ఆర్థిక వ్యవస్థ అంటారు. ప్రపంచంలోని అనేక దేశాలు ఈ కోవకు సంబంధించి ఉంటాయి. నియమిత ఆర్థిక వ్యవస్థ అంటే ఏ దేశమైన ప్రపంచంలోని ఏ ఇతర దేశంతోను ఆర్థిక సంబంధాలు లేకుండా ఉండటం. నియమిత ఆర్థిక వ్యవస్థ కలిగిన దేశమును గుర్తించడం ప్రస్తుత ప్రపంచంలో సాధ్యపడదు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. ఉత్పత్తి కారకాలనేమిటో తెలిపి అవి పొందే ప్రతిఫలాలను గూర్చి తెలపండి.***

**జ:** ఉత్పత్తి సంస్థ ఉత్పత్తి కారక ఆదాయాలను అందిస్తుంది. ఉదాహరణకు వస్తూత్పత్తి చేసే ఒక పరిశ్రమను తీసుకుందాం. వాస్తవంగా వస్తూత్పత్తి అనేది నాలుగు ఉత్పత్తి కారకాల సమిష్టి కృషి ఫలితంగానే సాధ్యమవుతుంది. వస్తువు లేదా సేవల ఉత్పత్తికి కారకమైన భూమి, శ్రమ, మూలధనం మరియు వ్యవస్థాపన అనునవి ఈ నాలుగు ఉత్పత్తి కారకాలు.

**ఎ) శ్రమ (Labour)**

శ్రమ అనునది వస్తుసేవల ఉత్పత్తిలో మానవులు అందించే భౌతిక మరియు మానసిక శ్రమలు. వీటిని వేరు చేయలేం. శ్రామికునికి ఈ రెండు అవసరం. ఈ శ్రమలను ఉపయోగించే స్థాయిలో మాత్రమే తేడాలు ఉంటాయి. కొన్ని

రకాల ఉద్యోగాలలో మానసిక శ్రమకంటే భౌతికశ్రమ అవసరం ఎక్కువగా ఉంటుంది. శ్రామికుల సేవలకు ద్రవ్యరూపంలో చెల్లించే ప్రతిఫలాలను వేతనాలు లేదా జీతాలు అంటారు.

**బి) భూమి (Land)**

అర్థశాస్త్రంలో భూమిని ప్రత్యామ్నాయ అర్థంలో ఒక సహజవనరుగా పరిగణిస్తారు. భూ ఉపరితలం, భూమి అంతర్భాగం, మరియు భూమి ఉపరితలము పైన ప్రకృతి ప్రసాదించిన సహజ వనరులన్నింటిని భూమిగా పరిగణిస్తారు. భూమి ఉపరితలముపైన సూర్యుడు, చంద్రుడు, గాలి, వర్షము మొదలైన వనరులు ఉన్నవి. పై విధముగ భూమి అంటే మనకు ప్రకృతి ప్రసాదించిన వనరులు అన్నియు కలిసి వుంటాయి. భూస్వామి పొందే ఈ ప్రతిఫలాన్ని భాటకం అని అంటారు.

**సి) మూలధనము (Capital)**

దీనిని మానవ నిర్మిత వనరుగా పేర్కొనవచ్చు. ఇది భూమిపై నిర్మించే నిర్మాణాలు, యంత్రాలు, పరికరాలు, వాహనాలు. వివిధ రకాల వస్తువు, సేవల తయారీలో ఉపయోగపడతాయి. భూమికి మూలధనానికి గల ముఖ్యమైన తేడాలు భూమి ప్రకృతి ప్రసాదించిన ఉచిత కానుక, మూలధనం మానవనిర్మితం. భూమిని మనము ఉత్పత్తి చేయలేం. అయితే మూలధనంను ఉత్పత్తి చేయగలం. మూలధనం పొందే ప్రతిఫలంను వడ్డీగా పరిగణిస్తారు.

**డి) ఉద్యమిత్వం (Enterpreneurship)**

ఉద్యమిత్వం అనగా ఒక వ్యక్తిగాని లేదా వ్యక్తుల సముదాయంగాని ఒక వ్యాపారంను మొదలుపెట్టి దాని నిర్వహణలో ఎదురయ్యే ఇబ్బందులను ఎదుర్కొంటూ, చొరవ తీసుకోవడం వలన వచ్చే మంచి ఫలితాన్ని లాభం అని, చెడు ఫలితాన్ని నష్టం గాను పరిగణిస్తారు. ఎవరో ఒకరు చొరవ చూపనిదే ఒక వ్యాపారంను ప్రారంభించలేము. ఈ వ్యాపార నిర్వహణ బాధ్యతను తీసుకొనేవారిని ఉద్యమదారుడు అంటారు. ఇతడు శ్రామికులను, భూమి, మూలధనంను ఒక చోటికి చేర్చి ఉత్పత్తిలో ఉపయోగిస్తారు.

***2. నియమిత ఆర్థిక వ్యవస్థ మరియు బహిరంగ ఆర్థిక వ్యవస్థ మధ్య గల తేడాను తెల్పండి?***

**జ:** ఆధునిక కాలంలో దాదాపుగా ప్రతి దేశం ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాలను కలిగి ఉంది. సుమారుగా అన్ని దేశాలు ఒకరి నుండి ఒకరు వస్తు సేవలను కొనుగోలు చేస్తుంటారు. వివిధ దేశాల మధ్య రుణాలు ఇవ్వడం, తీసుకోవడం జరుగుతుంది. ఒక దేశంలో ఉన్న ప్రజలు ఇతర దేశాలకు వెళ్లడం, రావడం జరుగుతూ ఉంటుంది. రెండు దేశాలు ఒకదాని కొకటి ఆర్థిక సంబంధాలు కలిగి వుంటే వాటి మధ్య నిజ మరియు ద్రవ్య ప్రవాహాలు ఏర్పడుతుంటాయి.

ఒక దేశం ప్రపంచంలోని ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాలు కలిగి ఉండటాన్ని బహిరంగ ఆర్థిక వ్యవస్థ అంటారు. ప్రపంచలోని అనేక దేశాలు ఈ కోవకు సంబంధించి ఉంటాయి. నియమిత ఆర్థిక వ్యవస్థ అంటే ఏ దేశమైన ప్రపంచంలోని ఏ ఇతర దేశంతోను ఆర్థిక సంబంధాలు లేకుండా ఉండటం. నియమిత ఆర్థిక వ్యవస్థ కలిగిన దేశమును గుర్తించడం ప్రస్తుత ప్రపంచంలో సాధ్యపడదు.

***3. ఆర్థిక వ్యవస్థ వర్గీకరణను వివరింపుము.***

**జ:** ఉత్పత్తి వినియోగం మరియు పెట్టుబడి అనేవి మూడు ప్రాథమిక ఆర్థిక కార్యకలాపాలు. ఈ కార్యకలాపాలను నిర్వహించే వారిని ఉత్పత్తి దారులు. వినియోగదారులు, పెట్టుబడి దారులు అని అంటారు. ఈ విధమైన వర్గీకరణ ఆయా వ్యక్తులు లేదా సంస్థలు నిర్వహించే ఆర్థిక కార్యకలాపాలపై ఆధారపడి ఉంటుంది. ఒక వ్యక్తి కూడా ఈ మూడు ఆర్థిక కార్యకలాపములను నిర్వహించవచ్చు. అయితే ప్రతి ఆర్థిక కార్యకలాపమును ఒక ప్రత్యేక విభాగంగా పరిగణిస్తారు.

పై మూడు ఆర్థిక రంగాలలో వినియోగదారుల రంగాన్ని తిరిగి కుటుంబ రంగం మరియు ప్రభుత్వరంగంగా వర్గీకరించవచ్చు. వస్తుసేవలను కొనడం లేదా పొందడం వలన కోర్కెలను తీర్చుకోవడం ద్వారా వ్యక్తిగత సంతృప్తి పొందే అందరు వ్యక్తులు మరియు కుటుంబాలను కుటుంబ రంగంగా భావించవచ్చు. ప్రభుత్వం అంటే ప్రజలకు ఉచిత సేవలనందించే అన్ని ప్రభుత్వ విభాగాలు. ఇటువంటి ప్రభుత్వ విభాగాలన్నింటిని సాధారణ ప్రభుత్వంగా పిలుస్తారు.

రుణం తీసుకొనుట లేదా చెల్లించుటలో మూలధన రంగం అనే దానిని ఒక ప్రత్యేక రంగంగా పరిగణిస్తారు. సమాజంలోని అన్ని వర్గాల పొదుపు మొత్తం ఈ రంగంలో కలపబడి దీనిని తిరిగి ఉత్పత్తి సంస్థలలో పెట్టుబడిగ పెడతారు. పై విధముగ ఒక ఆర్థిక వ్యవస్థను నాలుగు ప్రాథమిక రంగాలైన ఉత్పత్తి సంస్థలు, కుటుంబాలు, సాధారణ ప్రభుత్వం మరియు మూలధనంగా విభజింపబడినది. ఇతర ప్రపంచం అను మరొక రకాన్ని వివిధ దేశాల మధ్య ప్రవాహాల గురించి జాగ్రత్త పడటానికి కలపడం జరిగింది. పై విధముగ ఒక ఆర్థిక వ్యవస్థను 5 విభాగాలుగా విభజింపవచ్చును. అవి

i) ఉత్పత్తి సంస్థలు
ii) కుటుంబాలు
iii) సాధారణ ప్రభుత్వం
iv) మూలధన విభాగం
v) ఇతర ప్రపంచం

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఆర్థిక వ్యవస్థలోని ప్రాథమిక ఆర్థిక కార్యకలాపాల గురించి వివరించండి?***

**జ:** ఉత్పత్తి అనేది ఒక్కటే ఆర్థికకార్యకలాపం కాదు. ఇతర ఆర్థిక కార్యకలాపాలు కూడా వున్నాయి. ఉత్పత్తి సంస్థలు వస్తుసేవలను ఎందుకు ఉత్పత్తి చేస్తాయి? ఉత్పత్తి సంస్థలు వస్తుసేవలను ఉత్పత్తి చేయడమనేది ప్రజల కోరికలను సంతృప్తి పరచుకోవడానికే వినియోగం అంటారు. మనం ఉత్పత్తి చేసే వస్తు సేవలను వినియోగించడం ద్వారా మరెన్నో వస్తుసేవలను ఉత్పత్తి చేయవచ్చు. అవి యంత్రాలు, యంత్ర సాధనాలు, సరుకులు మొదలైనవి. ఉత్పత్తి సంస్థలు వీటిని ఉపయోగిస్తాయి. ఉత్పత్తి ప్రక్రియలో పై వస్తువులను ఉపయోగించడాన్ని మూలధన సంచయనం లేదా పెట్టుబడి అంటారు. ఒక ఆర్థిక కార్యకలాపమే కాకుండా అర్థశాస్త్రంలో ఉత్పత్తి, వినియోగం మరియు పెట్టుబడి అనే మూడు ఆర్థిక కార్యకలాపాలు వున్నాయి.

ఈ మూడు ఆర్థిక కార్యకలాపాలు ఒక దానిపై ఒకటి పరస్పర సంబంధాన్ని కలిగి వుండుటయే గాక ఒక దానిపై

ఒకటి ఆధారపడి ఉంటాయి. వీటి మధ్యగల పరస్పర సంబంధాన్ని ఉత్పత్తియైన వస్తుసేవలను వినియోగానికి లేదా పెట్టుబడికి కూడా ఉపయోగించడం ద్వారా అర్థం చేసుకొనవచ్చు. ఈ సంబంధాన్ని మరింత స్పష్టంగా తెలుసుకొందాం. వినియోగం, పెట్టుబడి అవసరం లేకుండా ఎటువంటి ఉత్పత్తి కార్యక్రమాన్ని చేపట్టలేము. ఉత్పత్తి కార్యకలాపం లేకుండా వినియోగం లేదా పెట్టుబడి అనేవి వుండవు. పై విధంగా ఉత్పత్తితో పాటు వినియోగం మరియు పెట్టుబడి కూడా ప్రాథమిక ఆర్థిక కార్యకలాపాలు. ఆర్థిక వ్యవస్థలో ఈ మూడు ఆర్థిక కార్యకలాపాలు ఆదాయ ప్రవాహానికి కారణమవుతాయి.

**ఆర్థిక కార్యకలాపాల సమయంలో ఆదాయ ప్రవాహాలు**

ఉత్పత్తి సంస్థలు ఉత్పత్తి చేసే వస్తు సేవలను సాధారణంగా ద్రవ్యం కొరకు అమ్మడం జరుగుతుంది. ఏ వస్తుసేవల అమ్మకంలోనైనా రెండు రకాల ప్రవాహాలు కనబడుతాయి. ఒక ప్రవాహం కొనుగోలు దారునికి సంబంధించినదైతే మరొక ప్రవాహం అమ్మకం దారునికి సంబంధించినదిగా ఉంటుంది. ఈ ప్రవాహాలను నిజమైన ప్రవాహాలని మరియు ద్రవ్య ప్రవాహాలని అంటారు.

అమ్మకం దారుని నుండి జరిగే వస్తుసేవల ప్రవాహాన్ని నిజ ప్రవాహం అని, కొనుగోలు దారుడి ద్వారా జరిగే ప్రవాహాన్ని ద్రవ్య ప్రవాహం అని అంటారు. ఈ అంశాన్ని ఒక ఉదాహరణ ద్వారా వివరించవచ్చు. రాముడు రు. 200ల విలువైన వస్తువులను రహీం వద్దనుండి కొనుగోలు చేశాడనుకొందాం. ఈ ఆర్థిక కార్యకలాపంలో రహీం వద్దనుండి వస్తువులు రాముడు పొందుటను నిజ ప్రవాహముగాను రాముడు చెల్లించిన ద్రవ్యమును ద్రవప్రవాహముగాను చెప్పవచ్చు. అదే విధంగా రాముడు వస్తువులు పొందడాన్ని నిజప్రవాహంగాను, రహీం ద్రవ్యంను పొందడాన్ని ద్రవ్యప్రవాహంగాను పరిగణించవచ్చు. ప్రతి ఆర్థిక వ్యవస్థలో నిజ, మరియు ద్రవ్య ప్రవాహాలు నిరంతరాయంగా కొనసాగుతుంటాయి.

***2. పటము సహాయంతో ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాల మధ్య నిజ మరియు ద్రవ్య ప్రవాహాలు ఎలా జరుగుచున్నవో సూక్ష్మంగా వివరించండి?***

**జ:** వివిధ రంగాల మధ్య సంభవించే వివిధ ప్రవాహాల స్వభావాన్ని క్రింద సూచించిన పటం ద్వారా వివరించవచ్చు.




వివిధ రంగాల మధ్య అంతర్గత మరియు బహిర్గత ప్రవాహాలు

1) **ఉత్పత్తి సంస్థలలోనికి వచ్చే మరియు వెళ్లే ప్రవాహాలు**

ఎ) ఉత్పత్తి సంస్థలు కుటుంబ రంగం నుంచి (నిజ అంతర్గత ప్రవాహాలు) కారక సేవలను కొనుగోలు చేస్తాయి. దీనికి బదులుగా ఉత్పత్తి సంస్థలు కారక చెల్లింపులను వేతనాలు, భాటకం, వడ్డీ, మరియు లాభాల రూపములో చెల్లిస్తాయి. (ద్రవ్య బహిర్గత ప్రవాహాలు)

బి) ఉత్పత్తి సంస్థలు పొదుపును మూలధన రంగానికి జమచేస్తాయి.

సి) ఉత్పత్తి సంస్థలు వస్తుసేవలను దిగుమతి చేసుకొని వాటికి బదులుగా దిగుమతులకు చెల్లింపులను చేస్తాయి.

డి) ఉత్పత్తి సంస్థలు వస్తుసేవలను ఎగుమతి చేసి వాటికి బదులుగా ఎగుమతులకు చెల్లింపులను స్వీకరిస్తాయి.

ఇ) ఉత్పత్తి సంస్థలు సాధారణ ప్రభుత్వానికి పన్నులను చెల్లిస్తాయి.

ఎఫ్) ఉత్పత్తి సంస్థలు వస్తుసేవలను కుటుంబరంగానికి మరియు ప్రభుత్వానికి అమ్మడం చేస్తాయి. దీనికి బదులుగా కుటుంబ రంగం (ప్రైవేట్ వినియోగ వ్యయం) మరియు సాధారణ ప్రభుత్వాల (ప్రభుత్వ వినియోగ వ్యయం) నుండి చెల్లింపులను స్వీకరిస్తాయి.

జి) ఉత్పత్తి సంస్థలు ప్రభుత్వం నుంచి సబ్సిడీలను పొందుతాయి.

హెచ్) ఉత్పత్తి సంస్థలు మూలధన రంగం నుండి (ద్రవ్య అంతర్గత ప్రవాహము) రుణాలు పొందుతాయి.

2) **కుటుంబరంగాలకు వచ్చే మరియు వెళ్లే ద్రవ్య ప్రవాహాలు.**

ఎ) కుటుంబరంగాలు ఉత్పత్తి సంస్థల నుంచి వస్తుసేవలను కొనుగోలు చేస్తాయి. దీనికి బదులుగా కుటుంబ రంగాలు చెల్లింపులు (వినియోగ వ్యయం) చేస్తాయి.

బి) కుటుంబ రంగాలు వ్యక్తిగత పన్నులను సాధారణ ప్రభుత్వానికి చెల్లిస్తాయి.

సి) కుటుంబ రంగాలు వాటి పొదుపును మూలధన రంగానికి జమచేస్తాయి.

డి) కుటుంబ రంగాలు కారక సేవలను వ్యాపార సంస్థలకు అమ్మకం ద్వారా కారక ఆదాయాలను పొందుతాయి.

ఇ) కుటుంబ రంగాలు సాధారణ ప్రభుత్వం నుండి ఉచిత సేవలను మరియు బదిలీ చెల్లింపులను స్వీకరిస్తాయి.

3) **సాధారణ ప్రభుత్వాలకు వచ్చే మరియు వెళ్ళే ప్రవాహాలు.**

ఎ) సాధారణ ప్రభుత్వం ఉత్పత్తి సంస్థల నుండి వస్తుసేవలను కొనుగోలు చేసి దానికి బదులుగా ప్రభుత్వ వినియోగ వ్యయానికి సంబంధించిన చెల్లింపులను చేస్తుంది.

బి) ప్రభుత్వం ఉత్పత్తి సంస్థలకు సబ్సిడీలను అందజేస్తుంది.

సి) ప్రభుత్వం కుటుంబ రంగానికి ఉచిత సేవలను అందిస్తూ, బదిలీ చెల్లింపులను కూడా చేస్తుంది.

డి) ప్రభుత్వం పొదుపుకు సంబంధించిన జమలను పెట్టుబడి రంగానికి అందజేస్తుంది.

ఇ) ప్రభుత్వం ఉత్పత్తి సంస్థల నుంచి పన్నులను పొందుతుంది.

ఎఫ్) ప్రభుత్వం వ్యక్తిగత పన్నులను కుటుంబ రంగం నుంచి స్వీకరిస్తుంది.

**4) మూలధన రంగంలోకి వచ్చే మరియు వెళ్లే ప్రవాహాలు**

ఎ) మూలధన రంగం ఉత్పత్తి సంస్థలకు రుణాల రూపంలో పెట్టుబడిని అందిస్తుంది.

బి) మూలధన రంగం ఉత్పత్తి సంస్థల నుంచి కుటుంబరంగంల నుంచి మరియు సాధారణ ప్రభుత్వాల నుంచి పొదుపును స్వీకరిస్తుంది.

**5) ఇతర ప్రపంచంలోనికి వచ్చే మరియు వెళ్లే ప్రవాహాలు**

ఎ) ఇతర ప్రపంచ రంగమునకు వస్తుసేవలను ఎగుమతి చేయుటకు బదులుగా చెల్లింపులను స్వీకరించడం జరుగుతుంది.

బి) ఇతర ప్రపంచరంగం నుంచి వస్తుసేవలను దిగుమతి చేసుకోవటానికి బదులుగ చెల్లింపులు చేయబడతాయి.

# 13

# జాతీయాదాయము భావనలు

# (National Income - Concepts)

## 13.1 పరిచయం

ఈ పాఠం ద్వారా జాతీయాదాయం గూర్చి తెలుసుకొనే సందర్భంలో దేశీయ అంటే ఏమిటో కూడా తెలుసుకొంటాం. జాతీయాదాయానికి సంబంధించిన వివిధ రకాల భావనలను గురించి కూడ నేర్చుకుంటాం. ఈ భావనలన్నీ ముఖ్యమైన ఆర్థిక భావనలు. ఈ భావనలను అవగాహన చేసుకోకుండా జాతీయ ఆదాయ గణన చేసే మార్గాలను గురించి తెలుసుకోవడం కష్టమవుతుంది.

## 13.2 లక్ష్యాలు

దీనిని అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- దేశీయ ఆర్థిక భావనలు మరియు దేశపౌరుల గురించి తెలుసుకోవడం.
- మాధ్యమిక ఉత్పత్తులు మరియు అంతిమ ఉత్పత్తుల మధ్య గల తేడా గుర్తిస్తాం.
- వివిధ రకాల ఉత్పత్తి కారకాల ఆదాయాలను వివరించడం
- దేశీయోత్పత్తి మరియు జాతీయోత్పత్తి భావనలను పొందడం
- అంతిమ వ్యయ భావనలను వివరించడం

## 13.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

*1.* ***ఆర్థిక ప్రదేశం***

జ: ఒక దేశ ఆర్థిక ప్రదేశం అనేది ఆ దేశ భౌగోళిక ప్రదేశం నుంచి ఆ దేశంలో నడపబడుతున్న విదేశీరాయబార కార్యాలయాలు మరియు అంతర్జాతీయ సంస్థలను మినహాయించి మిగిలిన ప్రపంచ దేశాలలో ఆ దేశం నిర్వహిస్తున్న రాయబార కార్యాలయాలు మరియు సాధారణ ప్రభుత్వ కార్యాలయాలను కలపడం ద్వారా ఏర్పడుతుంది.

*2.* ***మార్కెట్ ధరలలో స్థూల విలువ***

జ: మార్కెట్ ధరలలో స్థూల విలువ = ఉత్పత్తి విలువ – మాధ్యమిక వ్యయం

***3. మార్కెట్ ధరలలో నికర విలువ***

**జ:** మార్కెట్ ధరలలో నికర విలువ = మార్కెట్ ధరలలో స్థూల విలువ – స్థిర మూలధన వినియోగం

***4. ఉత్పత్తి కారక వ్యయం వద్ద నికర విలువ***

**జ:** ఉత్పత్తి కారక వ్యయం వద్ద నికర విలువ = మార్కెట్ ధరలలో నికర విలువ – పరోక్ష పన్నులు + సబ్సిడీలు

***5. దేశీయోత్పత్తి***

**జ:** ఒక దేశంలోని ఆర్థిక ప్రదేశంలో వున్న అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం వాల్యూయాడెడ్‌ను దేశయోత్పత్తి అంటారు.

***6. జాతీయాదాయం***

**జ:** దేశీయోత్పత్తికి విదేశాల నికర ఉత్పత్తి కారక ఆదాయంను కలుపగా ఉత్పత్తి కారక వ్యయ నికర జాతీయోత్పత్తిని మనము పొందగలం. దీనిని జాతీయాదాయం అని కూడా పిలుస్తారు.

***7. మిశ్రమ ఆదాయం***

**జ:** వివిధ ఉత్పత్తికారక ఆదాయాలుగా విభజించ వీలు కాని కారక ఆదాయాల మిశ్రమమే మిశ్రమ ఆదాయం.

***8. ప్రైవేట్ అంతిమ వినియోగ వ్యయం***

**జ:** కుటుంబాలు చేసే ఖర్చులు మరియు లాభరహిత సంస్థలతో కుటుంబాలకు అందించే ఉచిత సేవల విలువల మొత్తంను కలిపి ప్రైవేట్ అంతిమ వినియోగ వ్యయంగా పరిగణిస్తారు.

***9. ప్రభుత్వ అంతిమ వినియోగ వ్యయం***

**జ:** ప్రభుత్వం ప్రజల కందించే ఉచిత సేవలపై చేసే మొత్తం వ్యయం ప్రభుత్వ అంతిమ వినియోగ వ్యయమవుతుంది.

***10. స్థూల దేశీయ మూలధన సంచయనం***

**జ:** ఒక దేశము యొక్క ఆర్థిక ప్రదేశంలోని ఉత్పత్తి సంస్థలు పెట్టుబడికై చేసే మొత్తంను స్థూల దేశీయ మూలధన సంచయనం అంటారు. ఇది స్థూల దేశీయ స్థిర మూలధన సంచయనం మరియు నికర అదనపు నిలువల మొత్తం.

***11. నికర దేశీయ మూలధన సంచయనం***

**జ:** స్థూల దేశీయ మూలధన సంచయనం నుంచి స్థిర మూలధన వ్యయంను తీసివేయడం ద్వారా మనం నికర దేశీయ మూలధన సంచయనం పొందుతాము. నికర ఎగుమతి అనేది విదేశీ పెట్టుబడికి కొలమానం.

## రెండు మార్కుల ప్రశ్నలు

**1. ఆర్థిక ప్రదేశం (Domestic Territory)**

జ. ఆర్థిక ప్రదేశం అను భావన రూపకల్పనలో భౌగోళిక ప్రదేశం అను భావనలో రెండు సర్దుబాట్లు చేయడం జరిగింది. అదేమనగా ఇతర దేశాలలో ఏర్పాటు చేసిన ఒక దేశము యొక్క అన్ని రాయబార కార్యాలయాలు మరియు అన్నీ ప్రభుత్వ కార్యాలయాలను కలుపుకోవాలి. ఉదాహరణకు భారతదేశము యొక్క ఆర్థిక ప్రదేశంలో ఇతర దేశములలో ఏర్పాటు చేసిన భారత రాయబార కార్యాలయాలు మరియు అలాంటి ప్రభుత్వ కార్యాలయాలు వస్తాయి. ఒక దేశం యొక్క భౌగోళిక సరిహద్దులలో ఏర్పాటుచేసిన అన్ని విదేశీ రాయబార కార్యాలయాలు, అంతర్జాతీయ సంస్థల కార్యాలయాలు మరియు అలాంటి ఇతర కార్యాలయాలను మినహాయించాలి. ఉదాహరణకు భారతదేశ ఆర్థిక ప్రదేశము నుండి అన్ని విదేశీ రాయబార కార్యాలయాలు, అంతర్జాతీయ సంస్థల కార్యాలయాలను మినహాయించాలి.

**2. మాధ్యమిక ఉత్పత్తులు**

జ. మాధ్యమిక ఉత్పత్తులు అనేవి ఒక ఉత్పత్తి సంస్థ తిరిగి విక్రయించడం కొరకు ఇతర ఉత్పత్తి సంస్థల నుండి కొనుగోలు చేసే ఉత్పత్తులు, ఉదాహరణకు ఒక పిండిమర కొనుగోలు చేసిన గోధుమలు ఆ మిల్లునకు మాధ్యమిక ఉత్పత్తి అవుతుంది. ఆ పిండిమర గోధుమలను పిండి రూపములోకి మార్చి తిరిగి విక్రయిస్తుంది. ఆ విధంగా పిండిమర కొనే అన్ని ఇతర కొనుగోళ్ళు అంటే విద్యుత్తు, ప్యాకింగ్ వస్తువులు, ఇంధనం మొదలగునవి మాధ్యమిక ఉత్పత్తులు. ఈ విధమైన ఇతర ఉత్పత్తి సంస్థల నుండి కొనుగోలుపై చేసే వ్యయం ఆ పిండి ఉత్పత్తి విలువలో ఒక భాగంగా ఉంటుంది. ఇటువంటి ఉత్పత్తులపై చేసే వ్యయాన్ని మాధ్యమిక వ్యయం అంటారు.

**3. అంతిమ ఉత్పత్తులు అనగానేమి?**

జ. అంతిమ ఉత్పత్తులు అనగా తిరిగి విక్రయించడం కోసం కాకుండా వినియోగం మరియు పెట్టుబడి కొరకై కొనే అన్ని రకముల వస్తు సేవలు వీటిలో కలిసి ఉంటాయి. కుటుంబాల అన్ని కొనుగోళ్ళు మరియు ఉత్పత్తి సంస్థలు కొనుగోలు చేసిన మూలధన వస్తువులు. ఉదాహరణకు యంత్రాలు, సామాగ్రి, రవాణాకు సంబంధించిన వాహనాలు మొదలగునవి. స్వంత వినియోగం లేదా పెట్టుబడికి ఈ అంతిమ వస్తువులను కొనుగోలు చేస్తారు.

**4. సబ్సిడీలు అనగానేమి?**

జ. పరోక్ష పన్నులకు భిన్నంగా ఉత్పత్తి సంస్థలు ఉత్పత్తి చేసిన వస్తువులను తక్కువ ధరలకు అమ్మడానికి ప్రభుత్వాలు కలగజేసే ఆర్థిక వెసులుబాటును 'సబ్సిడీలు' అంటారు. ఎంపిక చేసిన కొన్ని వస్తువుల ఉత్పత్తిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ఇటువంటి ఆర్థిక వెసులుబాటును కలుగజేస్తుంది. ఈ విధమైన సబ్సిడీలు లేనపుడు వినియోగదారుడు అధిక ధరల వల్ల ఆ వస్తువులను కొనుగోలు చేయలేక పోవడమో లేదా తక్కువ పరిమాణంలో కొనుగోలు చేయడం జరుగుతుంది.

ఉత్పత్తి కారక వ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్ = మార్కెట్ ధరల వద్ద నికర వాల్యూయాడెడ్ – పరోక్షపన్నులు + సబ్సిడీలు.

***5. దేశీయోత్పత్తి భావనను వివరింపుము.***

జ. ఒక దేశ ఆర్థిక ప్రదేశంలో అనేక ఉత్పాదక సంస్థల యొక్క మొత్తం వాల్యూయాడెడ్‌ను దేశీయోత్పత్తి అంటారు. ఈ విధంగా,

i) మార్కెట్ ధరల వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం, స్థూల వాల్యూయాడెడ్ అనేది మార్కెట్ ధరల వద్ద స్థూల దేశీయోత్పత్తికి సమానం.

ii) మార్కెట్ ధరల వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం నికర వాల్యూయాడెడ్ అనేది మార్కెట్ ధరల వద్ద నికర దేశీయోత్పత్తికి సమానం.

iii) ఉత్పత్తి కారక వ్యయం వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం నికర వాల్యూయుడెడ్ అనేది ఉత్పత్తి కారక వ్యయం దగ్గర నికర దేశీయోత్పత్తి కారక వ్యయం అవుతుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. వాల్యూయాడెడ్ అను భావనను ఒక సంఖ్యాత్మక ఉదాహరణ ద్వారా వివరింపుము?***

**జ:** వాల్యూయాడెడ్ భావనను వివరించడానికి పిండిమర ఉదాహరణను తీసుకుందాం. పిండిమర రు. 10,000 ల విలువ గల గోధుమలను కొనుగోలు చేసింది. ఈ వ్యయము పిండిమరకు మాధ్యమిక వ్యయం గోధుమ పిండిని రు. 12,000 లకు అమ్మడం అనేది పిండిమరకు ఉత్పత్తి అవుతుంది. గోధుమలు అనేవి పిండిమరకు మాధ్యమిక వ్యయం అవుతుందనుకొందాము.

ఇపుడు పిండి మరకు వచ్చిన మొత్తము ఉత్పత్తి విలువ అయిన రు. 12,000 లలో పిండిమరకు అందే విలువ రు. 2000 లు మాత్రమే. మిగిలిన రు. 10,000ల ఉత్పత్తి విలువ రైతులకు సంబంధించినది. పిండిమరకు అందిన రు. 2000లను వాల్యూయాడెడ్‌గా (ఉత్పత్తిలో కల్సిన అదనపు విలువ) పిలుస్తారు. అంతిమ ఉత్పత్తి విలువ నుండి మాధ్యమిక వ్యయాన్ని తీసివేయడం ద్వారా వాల్యూయాడెడ్‌ను అంచనా వేయడం జరిగింది. పై విధంగా –

వాల్యూయుడెడ్ = ఉత్పత్తి విలువ – మాధ్యమిక వ్యయం

= రు. 12,000–00 – 10,000 –00 = రు. 2000.00

ఈవిధంగా కొలిచిన వాల్యూయాడెడ్‌ను మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్ అంటారు. (GVAmp)

వాల్యూయాడెడ్ నుంచి స్థిర మూలధన వినియోగంను తీసివేయనిచో పొందే విలువను స్థూల వాల్యూయాడెడ్ అంటారు. స్థూల విలువ నుండి స్థిర మూలధన వినియోగంను తీసివేసినచో వచ్చే విలువను నికర వాల్యూయాడెట్ అని అంటారు.

***2. పరోక్షపన్నులు మరియు సబ్సిడీలు ఈ రెండు కొలమానాల మధ్య తేడాకు కారణం వివరింపుము.***

**జ: పరోక్ష పన్నులు**

ఉత్పత్తి సంస్థ (అమ్మకందారులు) కు కొనుగోలుదారులు చెల్లించే ధరనే మార్కెట్ ధర అంటారు. అమ్మకం దారులు ప్రభుత్వాలకు మార్కెట్ ధరలో కొంత భాగమును చెల్లించడాన్ని పరోక్షపన్నులు అంటారు.

పరోక్షపన్నులు అనగా ఉత్పత్తి పై వేసే అమ్మకం పన్ను, ఎక్సైజ్‌పన్ను, ఆక్ట్రాయ్ పన్ను మొదలైనవి. వీటిని పరోక్ష పన్నులు అనడానికి కారణం వీటిని అమ్మకం దారులపై మోపినప్పటికి మీరు ఈ భారంను కొనుగోలుదారులపై నెట్టి వేస్తారు. కాబట్టి ఈ పన్నులను పరోక్షంగా కొనుగోలుదారులు చెల్లిస్తారు. ఈ పన్నులను అమ్మకందారులు ప్రభుత్వానికి అందిస్తారు.

**సబ్సిడీలు**

పరోక్ష పన్నులకు భిన్నంగా ఉత్పత్తి సంస్థలు ఉత్పత్తి చేసిన వస్తువులను తక్కువ ధరలకు అమ్మడానికి ప్రభుత్వాలు కలగజేసే ఆర్థిక వెసులుబాటును 'సబ్సిడీలు' అంటారు. ఎంపిక చేసిన కొన్ని వస్తువుల ఉత్పత్తిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ఇటువంటి ఆర్థిక వెసులుబాటును కలుగజేస్తుంది. ఈ విధమైన సబ్సిడీలు లేనపుడు వినియోగదారుడు అధిక ధరల వల్ల ఆ వస్తువులను కొనుగోలు చేయలేక పోవడమో లేదా తక్కువ పరిమాణంలో కొనుగోలు చేయడం జరుగుతుంది. సబ్సిడీలనేవి ఉత్పత్తి సంస్థలకు ఉత్పత్తి కారకాల మధ్య పంచడానికి అందుబాటులో వున్న మార్కెట్‌ధర కాకుండా అదనపు చెల్లింపులు.

***3. వాల్యూయాడెడ్ యొక్క వివిధ కొలమానాలు వివరింపుము.***

**జ:** వివిధ వాల్యూయాడెడ్ కొలమానాల మధ్య గల అంతర్గత సంబంధము క్రింద తెలుపడం జరిగింది.

మార్కెట్ ధరల స్థూల వాల్యూయాడెడ్ = ఉత్పత్తి విలువ – మాధ్యమిక వ్యయం

మార్కెట్ ధరల వద్ద వాల్యూయాడెడ్ = మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్ – స్థిరమూలధన వినియోగం

ఉత్పత్తి కారక వ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్ = మార్కెట్ ధరల వద్ద నికర వాల్యూయాడెడ్ – పరోక్ష పన్నులు + సబ్సిడీలు

***4. దేశీయోత్పత్తి అను భావనను వివరింపుము?***

**జ:** ఒక దేశ ఆర్థిక ప్రదేశంలో అనేక ఉత్పాదక సంస్థలు నెలకొల్పబడి వుంటాయి. ఈ ఉత్పాదక సంస్థల యొక్క మొత్తం వాల్యూయాడెడ్‌ను దేశీయోత్పత్తి అంటారు. ఈ విధంగా,

i) మార్కెట్ ధరల వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం, స్థూల వాల్యూయాడెడ్ అనేది మార్కెట్ ధరల వద్ద స్థూల దేశీయోత్పత్తికి సమానం.

ii) మార్కెట్ ధరల వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం నికర వాల్యూయాడెడ్ అనేది మార్కెట్ ధరల వద్ద నికర దేశీయోత్పత్తికి సమానం.

iii) ఉత్పత్తి కారక వ్యయం వద్ద అన్ని ఉత్పాదక సంస్థల మొత్తం నికర వాల్యూయాడెడ్ అనేది ఉత్పత్తి కారక వ్యయం దగ్గర నికర దేశీయోత్పత్తి కారక వ్యయం అవుతుంది.

పైన తెలిపిన విషయాల మధ్య గల అంతర్గత సంబంధాన్ని క్రింది విధంగా తెలియపరచడం జరిగింది.

i) మార్కెట్ ధరలలో స్థూల దేశీయోత్పత్తి = అన్ని ఉత్పత్తి సంస్థల మొత్తం స్థూల వాల్యూయాడెడ్

ii) మార్కెట్ ధరలలో నికర దేశీయోత్పత్తి = అన్ని మార్కెట్ ధరలలో స్థూల దేశీయోత్పత్తి – తరుగుదల

iii) కారక వ్యయం వద్ద నికర దేశీయోత్పత్తి = మార్కెట్ ధరలలో నికర దేశీయోత్పత్తి – పరోక్ష పన్నులు + సబ్సిడీలు

***5. జాతీయోత్పత్తి అను భావనను వివరింపుము?***

**జ:** ఒక దేశం యొక్క ఆర్థిక ప్రదేశంలో నెలకొల్పబడిన ఉత్పత్తి సంస్థలు చేసే ఉత్పాదక కార్యకలాపమును కొనడమే దేశీయోత్పత్తి. దేశీయులు మరియు దేశీయులు కానివారు ఈ ఉత్పత్తి సంస్థలకు ఉత్పత్తి సేవలను అందిస్తారు. ఆ విధంగా ఉత్పత్తి సంస్థలు పొందిన ఆదాయమును దేశీయులు మరియు దేశీయులు కానివారు పంచుకుంటారు. దేశీయులు మాత్రమే పొందే ఈ వాటాను తెలుసుకోవడానికి దేశీయోత్పత్తి నుండి దేశీయులు కాని వారి చెల్లింపులను తీసివేయాలి.

ఒక దేశంలోని ఆర్థిక ప్రదేశంలో నెలకొల్పిన ఉత్పాదక సంస్థలకు దేశీయులు తమ సేవలను అందించడమే గాకుండా ఇతర ఆర్థిక ప్రదేశాలలో అనగా మిగిలిన ప్రపంచంలో నెలకొల్పిన ఉత్పాదక సంస్థలకు కారక సేవలను అందిస్తారు. ఈ సేవలకు బదులుగా దేశీయులు మిగిలిన ప్రపంచం నుంచి కారక చెల్లింపులను పొందుతారు.

సూక్ష్మంగా చెప్పాలంటే, దేశీయులు కారక చెల్లింపులను తమ ఆర్థిక ప్రదేశంలోని ఉత్పత్తి సంస్థల నుంచి మరియు విదేశీ ఆర్థిక ప్రదేశముల ఉత్పత్తి సంస్థల నుంచి కూడా పొందుతారు. ఈ రెండు కారక చెల్లింపుల మొత్తాన్ని జాతీయోత్పత్తి అంటారు. దీనిని క్రింది విధంగా కనుక్కోవచ్చు.

జాతీయోత్పత్తి = దేశీయోత్పత్తి – మిగిలిన ప్రపంచానికి చెల్లించే కారక ఆదాయాలు + మిగిలిన ప్రపంచము నుండి పొందే ఆదాయాలు

లేదా

జాతీయోత్పత్తి = దేశీయోత్పత్తి + విదేశాల నుండి పొందే నికర ఉత్పత్తి కారక ఆదాయం.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. వివిధ కారక ఆదాయాల పేర్లు తెల్పండి. వాటి అర్థంను సంక్షిప్తంగా వివరించండి.***

**జ:** జాతీయ ఆదాయంకు ఒక ఉత్పాదక సంస్థ అందజేసే ఒక కొలమానమే కారక వ్యయం దగ్గర నికర విలువ. నాలుగు ఉత్పత్తి కారకాలైన భూమి, శ్రమ, మూలధనం మరియు ఉద్యమిత్వం ద్వారా ఉత్పత్తి సంస్థ ఏర్పడుతుంది. ఈ విధంగా కారక వ్యయం వద్ద నికర విలువ నాలుగు ఉత్పత్తి కారకాల యజమానుల మధ్య పంచబడుతుంది. ఆ విధమైన ఉత్పాదక సంస్థ చెల్లించే చెల్లింపులనే, ఉత్పత్తి కారకాల చెల్లింపులు అంటారు. ఉత్పత్తి కారక యాజమానులు పొందే

ఇటువంటి చెల్లింపులు వారికి ఉత్పత్తి కారక ఆదాయమవుతుంది. ఈ విధంగా నాలుగు రకాల కారక ఆదాయాలను క్రింది విధంగా వర్గీకరింపవచ్చు.

**అ) ఉద్యోగుల పరిహారం**

ఉద్యోగులకు అందే అన్ని రకాల ద్రవ్య చెల్లింపులు మరియు సదుపాయాలు నగదు రూపంలోను మరియు సేవల రూపంలోను పొందేవన్నీ ఉద్యోగుల పరిహారం క్రిందకు వస్తాయి. ఉద్యోగులు వేతనాలు లేక కూలీలను పొందుతారు. వీటికి అదనంగా ఉద్యోగులు అనేక ఇతర సదుపాయాలు అయిన బోనస్, ఉద్యోగుల భవిష్య నిధి చెల్లింపులు, ఉచిత సదుపాయాలు, ఉచిత రవాణా సౌకర్యం ఉచిత ఆరోగ్య సేవలు, ఉచిత విహారయాత్ర సౌకర్యం లాంటి వాటిని పొందవచ్చు.

**ఆ) భాటకం**

వస్తుసేవల ఉత్పత్తిలో భూమి అనే ఉత్పత్తి కారకాన్ని ఉపయోగించినందుకు భూ యాజమాని పొందే ప్రతిఫలం భాటకము.

**ఇ) వడ్డీ**

ఉత్పాదక సంస్థలకు పెట్టుబడులను అందించడం ద్వారా పొందే ప్రతిఫలమే వడ్డీ. ఉత్పత్తి సంస్థలకు పెట్టుబడి కోసం అందించే పెట్టుబడులకు ప్రతిఫలముగా చెల్లించే వడ్డీ చెల్లింపులను జాతీయాదాయ అంచనాలో ఉత్పత్తి కారక చెల్లింపులుగా పరిగణిస్తారు.

**ఈ) లాభం**

ఉత్పత్తి సంస్థలకు ఉద్యమిత్వ సేవలను అందించినందుకు ఉద్యమదారుడు పొందే ప్రతిఫలమే ఆదాయం. ఉద్యోగుల పరిహారం, భాటకం మరియు వడ్డీ రూపంలో వాల్యూయాడెడ్ నుండి చెల్లించిన కారక చెల్లింపులు పోగా మిగిలిన ఆదాయమే లాభము.

**ఉ) మిశ్రమ ఆదాయం**

నాలుగు రకాల ఉత్పత్తి కారకాల ఆదాయ సమాచారంను ఉత్పత్తి సంస్థల ఆదాయ పద్దుల నుంచి పొందడం జరుగుతుంది. ఇటువంటి ఆదాయం ఒక్కలాభమే కాకుండా అందులో యజమాని జీతం, భాటకం, మరియు వడ్డీ కలిసి వుంటాయి. జాతీయ ఆదాయ అంచనాలో ఇలాంటి ఆదాయంను మిశ్రమ ఆదాయం అంటారు. ఉత్పాదక సంస్థ చెల్లించే ఉద్యోగుల పరిహారం, భాటకం, వడ్డీ మరియు లాభంల మొత్తం కారక వ్యయం వద్ద నికర విలువ ఒకే విధంగా ఉండును.

***2. అంతిమ వ్యయ వివిధ రకాలు ఏవి? వాటి అర్థాల్ని సంక్షిప్తంగా వివరించండి?***

**జ:** తిరిగి విక్రయం కొరకు కాకుండా అంతిమ వినియోగం మరియు పెట్టుబడికి పొందిన వస్తుసేవలపై చేసిన ఖర్చును అంతిమ వ్యయం అంటారు. మరొక విధంగా అంతిమ ఉత్పత్తులపై చేసే ఖర్చును అంతిమ ఖర్చు అంటారు. అంతిమ వినియోగంను కుటుంబ రంగం మరియు సాధారణ ప్రభుత్వం కొనుగోలు చేస్తాయి. ఆర్థిక ప్రదేశంలోని విదేశస్థుల మరియు ఉత్పాదక సంస్థలు పెట్టుబడి కోసం కొనుగోళ్ళు చేస్తాయి. అలాగే అంతిమ వ్యయం క్రింది విధంగా వర్గీకరింపబడింది.

**అ) ప్రైవేట్ అంతిమ వినియోగ వ్యయం**

ఇందులోనికి కుటుంబ రంగం మరియు కుటుంబరంగానికి సేవచేసే లాభరహిత సంస్థల కొనుగోళ్ళు వస్తాయి. కుటుంబ సభ్యుల కోర్కెలను సంతృప్తి పరచడానికి వస్తుసేవలను కొనుగోలు చేస్తాం. కుటుంబాలకు సేవచేసే లాభరహిత సంస్థ లేవనగా మసీదు, దేవాలయాలు, చర్చిలు, గురుద్వారాలు, దాతృత్వ వైద్యశాలలు, సంఘాలు మొదలైనవి. ఇవి కుటుంబాలకు ఉచిత సేవలనందిస్తాయి.

**ఆ) ప్రభుత్వ అంతిమ వినియోగ వ్యయం**

ప్రభుత్వం తమ ప్రజల కోసం అందించే ఉచిత సేవల వ్యయంనే ప్రభుత్వ అంతిమ వినియోగ వ్యయం అంటారు. పోలీసు సేవలు, సైనిక సేవలు, విద్యాసంస్థలు, వైద్యశాలలు, రహదారులు, వంతెనలు, శాసనసభ మరియు ఇతర ప్రభుత్వ విభాగాలు మొదలైనవి ప్రభుత్వ ఉచిత సేవలకు ప్రధాన ఉదాహరణలు.

**ఇ) స్థూల దేశీయ మూలధన వినియోగం**

ఒక దేశ ఆర్థిక ప్రదేశంలోని ఉత్పాదక సంస్థలు పెట్టుబడికై చేసే మొత్తం ఖర్చును స్థూల దేశీయ మూలధన ఏర్పాటు అంటారు. ఈ రకపు వ్యయం రెండు రకాలు అ) స్థిర ఆస్తులైన భవనం, యంత్రాలు, పరికరాలు, పర్నీచర్, రవాణా వాహనాలు మొదలైనవి వాటిపై వ్యయం, మరియు ఆ) ముడిపదార్థాముల నిల్వ, పూర్తికాని వస్తువులు మరియు పూర్తయిన వస్తువులపై ఖర్చు. ఈ రెండు రకాల ఖర్చులను (అ) స్థూల దేశీయ స్థూల స్థిర మూలధన ఏర్పాటు మరియు (ఆ) నిల్వకు నికర అదనపు ఖర్చు అంటారు.

స్థూల దేశీయ మూలధన ఏర్పాటును స్థూల అని అంటారు. ఎందుకనగా సుస్థిర మూలధన వినియోగంను తీసివేయలేదు కనుక. స్థిర మూలధన వినియోగంను తీసివేసినచో మనము నికర దేశీయ మూలధన ఏర్పాటు వస్తుంది. ఆ సంవత్సరాలు నికర దేశీయ పెట్టుబడికి కొలమానమే నికర దేశీయ మూలధన ఏర్పాటు.

**ఈ) నికర ఎగుమతులు**

దేశంలోని ఆర్థిక ప్రదేశంలో ఒక సంవత్సరంలో ఉత్పత్తి కాబడిన జాతీయ ఆదాయంను లెక్కించుటలో పెట్టుబడిగా పరిగణిస్తారు ఈ పద్ధతిలో ఎగుమతులను విదేశీ పెట్టుబడులుగా భావిస్తారు. కనుక ఎగుమతుల నుండి దిగుమతులను తీసివేయడం ద్వారా అనగా నికర ఎగుమతులను నికర విదేశీ పెట్టుబడిగా పరిగణించబడుతుంది.

ప్రైవేట్ అంతిమ వినియోగ వ్యయం ప్రభుత్వ అంతిమ వినియోగ వ్యయం మరియు స్థూల దేశీయ మూలధన సంచయనముల మొత్తం మరియు నికర ఎగుమతులతో ఒక సంవత్సరంలో ఒక దేశం యొక్క మొత్తం అంతిమ వ్యయం లెక్కించవచ్చు.

# 14

# ద్రవ్యోల్బణం (Inflation)

## 14.1 పరిచయం

ఏ ఆర్థిక వ్యవస్థకైనా ద్రవ్యోల్బణం అనేది తీవ్రమైన సమస్యలలో ఒకటి. గత కొన్ని సం॥లలో ప్రపంచం ఆహార ద్రవ్యోల్బణంతో సతమతమవుతోంది. భారతదేశం దీనికి అతీతమేమి కాదు. ద్రవ్యోల్బణాన్ని అదుపులో ఉంచటానికి తీసుకుంటున్న నిర్ణయాల గురించి భారతదేశంలో విధి విధానాలను రూపొందించుటలో బాధ్యతాయుతులైన డా॥ మన్‌మోహన్ సింగ్, ప్రొ॥ రంగరాజన్, డా॥ దువ్వూరి సుబ్బారావు మరియు ప్రణబ్ ముఖర్జి వంటి వారల ఉపన్యాసాలను మనం ప్రతినిత్యం వింటూ వుంటాం. పెరుగుతూ ఉన్న ధరలను ద్రవ్యోల్బణం అనవచ్చు. సాధారణ ధరల స్థాయి పెరుగుతున్నప్పుడు ఒక యూనిట్ ద్రవ్య కొలమానం తక్కువ వస్తువులను మరియు సేవలను కొంటుంది. అనగా ద్రవ్యం యొక్క కొనుగోలు శక్తి తగ్గుతుంది. అంటే ద్రవ్యం యొక్క విలువ తగ్గుతుంది. ద్రవ్యోల్బణానికి వ్యతిరేకం ప్రతి ద్రవ్యోల్బణం. అనగా ధరలు పడిపోవటం పడిపోతున్న ధరలు ఆర్థిక వ్యవస్థకి మరింత ప్రమాదకరమైనవి.

## 14.2 లక్ష్యాలు

దీనిని చదువుట ద్వారా మీరు ఈ క్రింది వానిని అర్థం చేసుకుంటారు.

- ద్రవ్యోల్బణం అనగానేమి
- ద్రవ్యోల్బణ రకాలు మరియు కొలతలు
- ద్రవ్యోల్బణాన్ని ప్రభావితం చేసే అంశాలు
- ద్రవ్యోల్బణం యొక్క ప్రభావం
- ద్రవ్యోల్బణాన్ని నియంత్రించే పద్ధతులు

## 14.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. ద్రవ్యోల్బణాన్ని కొలవటం***

జ: ఒక పరిమిత కాలంలో ధరలలోని పెరుగుదల ద్రవ్యోల్బణంగా చెప్పబడుతుంది.

$$\text{ద్రవ్యోల్బణం} = \left(\frac{P_1 - P_0}{P_0}\right) \times 100$$

$P_1$ = ప్రస్తుత ధర, $P_0$ = పూర్వపుధర

ధరలలో పెరుగుదల తక్కువ మోతాదులో ఉన్నప్పుడు ఈ ప్రాకే ద్రవ్యోల్బణం ఉంటుంది.

***2. బహిర్గత ద్రవ్యోల్బణం***

జ: ఏ విధంగాను మార్కెట్ వ్యవస్థ నియంత్రింపబడకుండా ఉండటం యొక్క ఫలితమే బహిర్గత ద్రవ్యోల్బణం.

***3. అణచబడ్డ ద్రవ్యోల్బణం***

జ: బహిర్గత ద్రవ్యోల్బణానికి వ్యతిరేకంగా భౌతికమైన మరియు ద్రవ్యపరమైన నియంత్రణలను ద్రవ్యోల్బణమును అదుపులో ఉంచటానికి ప్రభుత్వం అమలు చేస్తే దానిని అణచబడ్డ ద్రవ్యోల్బణం అంటారు.

***4. డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణం***

సమిష్టి సప్లయ్ కంటే సమిష్టి డిమాండు ఎక్కువగా ఉన్న కారణంగా, సాధారణ ధరల స్థాయి క్రమంగా పెరిగితే దానిని డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణం అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ద్రవ్యోల్బణం నిర్వచనం***

జ: అమెరికన్ ఆర్థిక వేత్త ప్రొ॥ శ్యామ్యుల్‌సన్ ద్రవ్యోల్బణాన్ని ఈ విధంగా నిర్వచించారు. "ద్రవ్యోల్బణం సాధారణ ధరల స్థాయి పెరగటాన్ని సూచిస్తుంది".

కీన్స్ నిజమైన ద్రవ్యోల్బణాన్ని ఈ క్రింది పదాలతో నిర్వచించారు.

"ఆర్థిక వ్యవస్థ సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకున్న తరువాత సమిష్టి డిమాండ్‌లో వచ్చే పెరుగుదలకు అనుగుణంగా ధరల స్థాయికూడా పెరుగుతుంది. దీనికి కారణం సంపూర్ణ ఉద్యోగితా స్థాయిని చేరుకున్న తరువాత ఉత్పత్తి కారకాల సప్లయ్‌ని, ఉత్పత్తిని పెంచటానికి వీలు ఉండదు. ఇటువంటి పరిస్థితులలో సమిష్టి డిమాండ్ సమిష్టి సప్లయ్‌ని మించి పెరిగిన కారణంగా ధరల స్థాయిలో వచ్చే పెరుగుదలను వాస్తవ ద్రవ్యోల్భణం అంటారు"

***2. అతిద్రవ్యోల్బణం***

జ: ధరల పెరుగుదల రెండు లేదా మూడు అంకెల స్థాయి చేరినప్పుడు అతిద్రవ్యోల్బణం అంటారు. ఈ ద్రవ్యోల్బణం ద్రవ్యోల్బణ స్థాయి కనుగొనలేని మరియు ఏవిధంగాను నియంత్రించలేని పరిస్థితికి దారితీసే అవకాశం ఉంటుంది. ప్రతిరోజు ధరల పెరుగుదల చాలా రెట్లు ఉంటుంది. ద్రవ్యం యొక్క కొనుగోలు శక్తి నిరంతరం పడిపోతూ ఉండటం, ద్రవ్యవ్యవస్థ కుప్పకూలిపోయే పరిస్థితికి దారితీస్తుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని విశదీకరించండి.***

జ: సమిష్టి సప్లయ్ కంటే సమిష్టి డిమాండు ఎక్కువగా ఉన్న కారణంగా, సాధారణ ధరల స్థాయి క్రమంగా పెరిగితే దానిని డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణం అంటారు. ఈ సమిష్టి డిమాండు వినియోగదారుల కొనుగోలు శక్తి పెరగటం వలన కానీ, కొనుగోలు ఇచ్ఛ (కోరిక) పెరగటం వలన కానీ ప్రైవేటు పెట్టుబడి పెరుగుట వలన కానీ ప్రభుత్వ వ్యయం పెరగడం వలన కానీ పెరగవచ్చు. డిమాండు ప్రేరిత ద్రవ్యోల్బణం వేగవంతమైన ఆర్థిక వృద్ధి సాధించుటలో దోహదపడుతుంది. ఎందుకనగా అధిక డిమాండు మార్కెట్‌ను ఉత్తేజ పరుస్తుంది. దీనివల్ల పెట్టుబడి పెరిగి ఉత్పత్తి, ఆదాయ వ్యయం పెరిగి ఆర్థిక వ్యవస్థ వృద్ధి సాధిస్తుంది.

**ఆర్థిక వ్యవస్థలో సమిష్టి డిమాండును పెంచే అంశాలు**

- అధికరేటులో జనాభా పెరుగుదల
- ప్రభుత్వ రాబడి కంటే వ్యయం పెరుగుట
- ప్రజల ఆదాయాల పెరుగుదల
- పన్నుల తగ్గుదల
- ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యసప్లయ్ పెరుగుదల

***2. వ్యయ ప్రేరిత ద్రవ్యోల్బణాన్ని విశదీకరించండి.***

జ: ఉత్పత్తి వ్యయంను పెంచే అంశాలన్నీ వ్యయ ప్రేరిత ద్రవ్యోల్బణానికి దోహదపడతాయి. డిమాండు స్థిరంగా ఉండి ఉత్పత్తి వ్యయం పెరుగుట వలన అదే ఉత్పత్తి ఎక్కువ ధరకు అమ్ముడవుతుంది. అనగా ధరలు పెరుగుతాయి. వేతన పెరుగుదలను డిమాండు చేస్తూ కార్మిక సంఘాలు కృషి ఫలించటం వలన వేతనాలు పెరుగుతాయి. మార్కెట్‌లో పరిమిత స్వామ్యం ఉన్నప్పుడు, ఆ పెట్టుబడి దారులందరూ కలసి వారి లాభాలను పెంచుకోవాలనే ఒప్పందానికి వచ్చి వారి లాభాలను పెంచుకుంటారు. ఉన్నట్టుండి ఒక వస్తువు సప్లయ్ తగ్గటం వలన ఆ వస్తువు యొక్క ధరలు పెరుగుతాయి. ఆ వస్తువే కాకుండా, ఆ వస్తువులను ముడి పదార్థంగా వాడి ఉత్పత్తి చేసే వస్తువుల ధరలు కూడా పెరుగుతాయి. ఉదాహరణకు, పెట్రోలు సప్లయ్ తగ్గుట వలన దాని ధర పెరుగుతుంది. అంతేకాకుండా అది రవాణా సంస్థలకు ముడి పదార్థమవుట వలన రవాణా ఖర్చులు అనగా రవాణా సంస్థల వసూలు చేసే ధరలు పెరుగుతాయి.

**ఉత్పత్తి వ్యయాన్ని పెంచే అంశాలు:–**

- ఉత్పత్తి కార్యకలాపాలకు ఇచ్చే పారితోషికం పెరుగుదల అనగా అద్దె, వేతనం, వడ్డీ, లాభం
- ముడి సరుకుల ధరల పెరుగుదల
- పన్నుల పెరుగుదల
- మూలధనం తరుగుదల రేటు

***3. ఆర్థిక వ్యవస్థపై ద్రవ్యోల్బణ ప్రభావాలు వివరించండి.***

జ: ద్రవ్యోల్బణం యొక్క ప్రభావం ఉత్పత్తి మీద, పంపిణి మీద ఉంటుంది, ద్రవ్యోల్బణం వివిధ వర్గాల ప్రజలను విభిన్నంగా ప్రభావితం చేస్తుంది. ఈ కారణంగా సమాజంలోని కొన్ని వర్గాల ప్రజలు లాభం పొందితే, మరికొన్ని తరగతుల ప్రజలు నష్టాలను పొందటం జరుగుతుంది.

**a) వనరుల కేటాయింపు సామర్థ్యం (Allocative efficiency)**

ఒక వస్తువు యొక్క డిమాండ్ సప్లయ్‌లలోని మార్పు ధర మార్పు ద్వారా ఉత్పత్తి దారులకు, వినియోగదారులకు వారియొక్క వనరులను కేటాయించుకోవడానికి సంకేతాలను అందిస్తుంది. తద్వారా కొత్త మార్కెట్ పరిస్థితులకు అనువుగా తను ఉత్పత్తులను వినియోగంను మార్చుకొనేటట్లు చేస్తుంది. కాని నిరంతరంగా పెరిగే ధరల వల్ల అనగా, ద్రవ్యోల్బణం వల్ల మార్కెట్ పరిస్థితులను అర్థం చేసుకోవడం ధర సంకేతాలకు అనుగుణంగా ఉత్పత్తి వినియోగాలను మార్పు చేసుకోవడం కష్టం అవుతుంది. దీనివల్ల వనరుల కేటాయింపు సామర్థ్యం కష్టం అవుతుంది.

**b) ఉత్పత్తి మీద ప్రభావం (On Production)**

ద్రవ్యోల్బణ కాలంలో ధరలు పెరుగుతుండటం వల్ల ధరలకి, ఉత్పత్తి వ్యయానికి తేడా పెరుగుతుంది. అనగా పెట్టుబడి దారునికి లాభం పెరుగుతుంది. దానికి కారణం ధరలు పెరిగినంత వేగంగా వేతనాలు మిగిలిన ఉత్పత్తికారకాలకు ఇచ్చే పారితోషికాలు పెరుగకపోవటం వల్ల లాభాలు పెరుగటానికి వీలౌతుంది. ఈ లాభాలకు ఆకర్షితులై పెట్టుబడిదారులు ఎక్కువ పెట్టుబడిని పెడతారు. అందువల్ల ఉత్పత్తి, ఆదాయం, వ్యయం, పెరిగి ఆర్థిక వ్యవస్థ ఉత్తేజమవుతుంది. మరియు స్థూల దేశీయ ఉత్పత్తి పెరుగుతుంది. కాని ద్రవ్యోల్బణం అతి ద్రవ్యోల్బణం స్థాయికి చేరుకుంటే ప్రజలు కనీస అవసరాలను తీర్చుకోవడంలో సతమతమౌతుంటే మిగిలిన వస్తువులకు ఉన్న డిమాండ్ తగ్గి కనీస అవసరాలకే ప్రాధాన్యత ఇస్తుంటే కనీస అవసరాలు కాకుండా మిగిలిన వస్తుసేవల ఉత్పత్తి, తద్వారా ఆ వస్తువుల మీద పెట్టుబడి దెబ్బతింటుంది. ఇది వనరుల నిరుపయోగంగా ఉండేటట్లు చేస్తుంది.

**c) పంపిణిపై ప్రభావం (On distribution)**

వస్తువుల ధరలు పెరగడం అనగా ద్రవ్యం విలువ తగ్గడం, అనగా ఒక ద్రవ్యం యూనిట్, తక్కువ సేవలను కొనుగోలు చేస్తుంది. ద్రవ్యోల్బణం యొక్క ప్రభావం వివిధ వర్గాల ప్రజలపై సమానంగా ఉండదు. ద్రవ్యోల్బణం వల్ల కొన్ని వర్గాలు లాభం పొందుతాయి. మరికొన్ని వర్గాలు నష్టపోతాయి.

**d) రుణగ్రహీతలు – రుణదాతలు (Debtors and Creditors)**

ద్రవ్యోల్బణ కాలంలో రుణదాతలు ఎక్కువ నష్టం పొందుతుంటే, రుణగ్రహీతలు లేదా రుణగ్రస్థులు ఎక్కువ లాభం పొందుతారు. రుణదాతలు రుణంగా ఇచ్చిన మొత్తానికి ప్రతిఫలంగా కొంత వడ్డీని పొందినప్పటికి ద్రవ్యోల్బణ కారణంగా ద్రవ్యం విలువ పడిపోవడం వల్ల నిజవనరుల రూపంలో వారు తిరిగి తక్కువ పొందినట్లు అవుతుంది. అనగా ద్రవ్యోల్బణం కాలంలో సంపద రుణదాతల నుండి రుణగ్రహీతలకు బదిలీ అవుతుంది.

## e) వేతనదారులు మరియు పెన్షనర్లు (Wage earners and Pensioners)

పెన్షనర్లు, స్థిర ఆదాయ వర్గాలు.

- స్థిర ఆదాయం కలిగిన వారు అనగా భాటకం, వడ్డీ, పెన్షన్‌లను పొందేవారు, జీవాలను పొందేవారు ఎక్కువగా కష్టాలకు గురిఅవుతారు. ఈ వర్గాల ప్రజలకు వచ్చే ఆదాయం స్థిరంగా ఉంటాయి. కాని ధర స్థాయిలో పెరుగుదల కారణంగా, ద్రవ్యం విలువ పడిపోతుంది. అందువల్ల ఈ వర్గాల కొనుగోలు శక్తి తగ్గుతుంది.
- షేర్లు కలిగిన వ్యక్తులు ద్రవ్యోల్బణ కాలంలో ఎక్కువ లాభం పొందుతారు. ధరలు పెరుగుచున్న కాలంలో ఆర్థిక కార్యకలాపాల స్థాయి హెచ్చుగా ఉంటుంది. అందువలన కంపెనీ లాభాలు పెరిగి, వాటాలపై చెల్లించే డివిడెండ్లు పెరుగుతాయి. సెక్యూరిటీలు, బాండ్లలో పెట్టుబడి చేసిన వ్యక్తులు నష్టాన్ని పొందుతారు.

***4. ద్రవ్యోల్బణ నియంత్రణకు ఉపయోగించే చర్యలను విశదీకరించండి.***

జ: ద్రవ్యోల్బణం ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ అస్థిరత్వానికి దారితీస్తుంది. అందువలన ద్రవ్యోల్బణం తక్కువ స్థాయిలో ఉన్నప్పుడే ప్రభుత్వం సమర్థవంతంగా ద్రవ్య, కోశ విధానపరమైన చర్యలను చేపట్టడం ద్వారా దానిని అరికట్టవలసి ఉంటుంది. అనగా ఒకవైపు ఆర్థిక వ్యవస్థలో సమిష్టి డిమాండ్‌ను తగ్గించడానికి, మరొకవైపు సమిష్టి సప్లయ్ పెంచడానికి తక్షణ చర్యలు చేపట్టవలసి ఉంటుంది. ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి ప్రభుత్వం తీసుకొనే చర్యలను ఇప్పుడు తెలుసుకుందాం.

### ద్రవ్యపరమైన చర్యలు (Monetary measures)

ద్రవ్యోల్బణ కాలంలో కేంద్రబ్యాంకు ద్రవ్యపరమైన చర్యలను తీసుకోవటం ద్వారా ఆర్థిక వ్యవస్థలో మొత్తం పరపతిని నియంత్రిస్తుంది. అందువల్ల వడ్డీరేట్లు పెరుగుతాయి. ద్రవ్యడిమాండ్ తగ్గుతుంది.

### కోశపరమైన చర్యలు (Fiscal measures)

జె.ఎమ్. కీన్స్ ద్రవ్యోల్బణాన్ని అరికట్టడంలో కోశపరమైన చర్యలు మంచి ఫలితాలను ఇస్తాయని ప్రతిపాదించారు. కోశపరమైన చర్యలు సమిష్టి డిమాండును నియంత్రించి, ధరల స్థిరీకరణ జరిగేటట్లు చేస్తాయి. సమిష్టి డిమాండును నియంత్రించడానికి ప్రభుత్వం పన్నురేట్లను ముఖ్యంగా ప్రత్యక్ష పన్ను రేట్లను పెంచడం ద్వారా, ప్రభుత్వ వ్యయంను తగ్గించడం తద్వారా ప్రభుత్వ రుణమును పెంచుట ద్వారా సాధించవచ్చు. ఈ మూడు రకాల చర్యలు ప్రజల వ్యయాలు ఆదాయాన్ని తగ్గించుట ద్వారా డిమాండును ధరలను తగ్గేటట్లు చేస్తాయి.

# 15

# జాతీయాదాయం : కొలమానం

# (National Income - Measurement)

## 15.1 పరిచయం

ఈ పాఠంలో మీరు జాతీయ ఆదాయాన్ని ఎలా కొలుస్తారో నేర్చుకుంటారు. జాతీయ ఆదాయ ప్రవాహాన్ని మూడు వేర్వేరు కోణాల నుంచి చూడగలం కనుక జాతీయ ఆదాయం మూడు వేర్వేరు పద్ధతులుగ వుంటుందని చెప్పవచ్చును. ఈ పాఠంలో ఒక్కొక్క పద్ధతిని గురించి విపులంగా తెలుసుకుందాం.

## 15.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- జాతీయ ఆదాయం నిర్వచనం
- జాతీయ ఆదాయాన్ని మూడు వేర్వేరు కోణాల నుండి చూడడం
- ప్రాథమిక, ద్వితీయ మరియు తృతీయరంగాలకు గల అర్థాన్ని వివరించడం.
- జాతీయ ఆదాయాన్ని కొలవడానికి ఉపయోగించే ఉత్పత్తి పద్ధతిని (value added method) వివరించడం.
- జాతీయ ఆదాయాన్ని గణించే ఆదాయ పంపిణీ పద్ధతిని వివరించడం.
- జాతీయ ఆదాయాన్ని అంచనా వేసే అంతిమ వ్యయాల పద్ధతిని గురించి వివరించడం.

## 15.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. జాతీయాదాయం***

**జ:** ఒక దేశము యొక్క జాతీయ ఆదాయం అంటే ఆ దేశము యొక్క దేశీయులు పొందే కారక ఆదాయాల మొత్తం.

***2. జాతీయాదాయాన్ని లెక్కించుట***

**జ:** ఒక దేశ జాతీయ ఆదాయంను మూడు పద్ధతులు ద్వారా కొలవవచ్చు. అవి ఉత్పత్తి, ఆదాయ పంపిణీ మరియు అంతిమ వ్యయ పద్ధతులు. జాతీయ ఆదాయ సృష్టి జరిగినప్పుడు (ఉత్పత్తి పద్ధతి ద్వారా) లేదా యజమానుల మధ్య పంపిణీ జరిగినప్పుడు (ఆదాయ పంపిణీ పద్ధతి ద్వారా) లేదా వినియోగం మరియు పెట్టుబడిపై వ్యయం చేసినపుడు (అంతిమ వ్యయపద్ధతి ద్వారా) జాతీయ ఆదాయంను లెక్కించవచ్చు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. వాల్యూయాడెడ్ యొక్క వివిధ కొలమానాలు*** ***వివరింపుము.***

జ. వివిధ వాల్యూయాడెడ్ కొలమానాల మధ్య గల అంతర్గత సంబంధము క్రింద తెలుపడం జరిగింది.

మార్కెట్ ధరల స్థూల వాల్యూయాడెడ్ = ఉత్పత్తి విలువ – మాధ్యమిక వ్యయం

మార్కెట్ ధరల వద్ద వాల్యూయాడెడ్ = మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్ – స్థిరమూలధన వినియోగం

ఉత్పత్తి కారక వ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్ = మార్కెట్ ధరల వద్ద నికర వాల్యూయాడెడ్ – పరోక్ష పన్నులు + సబ్సిడీలు

***2. జాతీయోత్పత్తి భావన*** ***వివరింపుము.***

జ. ఒక దేశం యొక్క ఆర్థిక ప్రదేశంలో నెలకొల్పబడిన ఉత్పత్తి సంస్థలు చేసే ఉత్పాదక కార్యకలాపమును కొనడమే దేశీయోత్పత్తి. దేశీయులు మరియు దేశీయులు కానివారు ఈ ఉత్పత్తి సంస్థలకు ఉత్పత్తి సేవలను అందిస్తారు. ఆ విధంగా ఉత్పత్తి సంస్థలు పొందిన ఆదాయమును దేశీయులు మరియు దేశీయులు కానివారు పంచుకుంటారు. దేశీయులు మాత్రమే పొందే ఈ వాటాను తెలుసుకోవడానికి దేశీయోత్పత్తి నుండి దేశీయులు కాని వారి చెల్లింపులను తీసివేయాలి.

***3. మిశ్రమ ఆదాయం*** ***అనగానేమి?***

జ. నాలుగు రకాల ఉత్పత్తి కారకాల ఆదాయ సమాచారంను ఉత్పత్తి సంస్థల ఆదాయ పద్దుల నుంచి పొందడం జరుగుతుంది. అనేక ఉత్పాదక సంస్థలు నాలుగు రకాల ఉత్పత్తి కారక చెల్లింపులు స్పష్టంగా ఉంచే విధంగా తమ ఆదాయ పద్దులను నిర్వహించవు. ఉత్పత్తి సంస్థలకు ఉద్యమదారులు తమ స్వంత భూమిని, శ్రమను మరియు మూలధన సేవలను అందించే పరిస్థితులలో ఈ విధమైన పరిస్థితిని గమనించవచ్చు. ఆదాయం ఒక్కలాభమే కాకుండా అందులో యజమాని జీతం, భాటకం, మరియు వడ్డీ కలిసి వుంటాయి. జాతీయ ఆదాయ అంచనాలో ఇలాంటి ఆదాయంను మిశ్రమ ఆదాయం అంటారు.

***4. నికర ఎగుమతులు*** ***అనగానేమి?***

జ. ఒక దేశంలోని ఆర్థిక ప్రదేశంలో ఒక సంవత్సరంలో ఉత్పత్తి కాబడిన జాతీయ ఆదాయంను లెక్కించుటలో పెట్టుబడిగా పరిగణిస్తారు ఈ పద్ధతిలో ఎగుమతులను విదేశీ పెట్టుబడులుగా భావిస్తారు. అదే విధంగా దిగుమతులను పెట్టుబడుల ఉపసంహరణగా భావిస్తారు. కనుక ఎగుమతుల నుండి దిగుమతులను తీసివేయడం ద్వారా అనగా ఎగుమతులను నికర విదేశీ పెట్టుబడిగా పరిగణించబడుతుంది.

***5. ప్రాథమిక రంగం*** ***అనగానేమి?***

వ్యవసాయం, అడవులు, చేపల పెంపకం, గనుల త్రవ్వకం, పాడి పరిశ్రమ లాంటి సహజవనరుల వెలికితీతలో నిమగ్నమైయున్న అన్ని ఉత్పాదక సంస్థలు ప్రాథమిక రంగం క్రిందకు వస్తాయి. ఈ రంగంను మొదటి ప్రాధాన్యతారంగంగా పరిగణించటానికి కారణం ఇది వస్తు సేవల ఉత్పత్తికి అవసరమైన అన్ని ముడిసరుకులకు ఆధారం.

### *6. ద్వితీయ రంగం* ***అనగానేమి?***

జ. ఒక వస్తువును మరొక వస్తువుగా మార్పిడి చేయడంలో నిమగ్నమై యున్న అన్ని ఉత్పాదక సంస్థలు ద్వితీయ రంగంగా వర్గీకరింపబడతాయి. ముడి వస్తువులను ఉపయోగించి వస్తువులను ఉత్పత్తి చేసే అన్ని తయారీ సంస్థలు లేక కర్మాగారాలు ఈ రంగం క్రిందకు వస్తాయి. గోధుమపిండి మర, ఆహార పదార్థములు రుబ్బు, బట్టలు, చెప్పులు, విద్యుత్ పరికరాలు, ఇంటి సామాగ్రి, పుస్తకాలు, విద్యుచ్ఛక్తి మొదలైనవాటిని ఉత్పత్తి చేసే ఉత్పత్తి సంస్థలు ఈ రంగానికి చెందిన కొన్ని ఉదాహరణలు. ఈ రంగం యొక్క అభివృద్ధి ప్రాథమిక రంగం నుండి వచ్చే ముడి పదార్థముల అందుబాటుపై ఆధారపడి ఉంటుంది. ఇందువలన ఈ రంగంను ద్వితీయ ప్రాధాన్యత రంగంగా పరిగణిస్తారు.

### *7. తృతీయ రంగం* ***అనగానేమి?***

జ. సేవల ఉత్పత్తిలో నిమగ్నమైన అన్ని ఉత్పాదక సంస్థలు తృతీయరంగ సంస్థలుగ వర్గీకరిస్తారు. బ్యాంకులు, భీమా సంస్థలు, ప్రభుత్వ పరిపాలన విభాగాలు, పోలీసు, రక్షణ మరియు ఇతర ప్రజా సర్వీసులు అందించే విభాగాలు, దేశీయ సేవకులు, రవాణా కంపెనీలు, వాణిజ్య సంస్థలు అనేవి తృతీయరంగ సంస్థలకు చెందిన కొన్ని ఉదాహరణలు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

### *1. జాతీయ ఆదాయాన్ని మూడు కోణాలలో చూడడం.*

**జ:** ఉత్పత్తి సంస్థలు వస్తు సేవలను ఉత్పత్తి చేస్తాయి. దీనికోసం ఉత్పత్తి సంస్థలు నాలుగు రకాల ఉత్పత్తి కారక యజమానులైన శ్రమ, మూలధనం, భూమి మరియు ఉద్యమిత్వాలను నియమిస్తాయి. ఈ ఉత్పత్తికారకాలు సమిష్టిగా వస్తు సేవలను ఉత్పత్తి చేయడమనేది 'వాల్యూయాడెడ్' అని పిలువబడే ఆదాయసృష్టికి దారి తీస్తుంది. ఈ కోణం అనగా వాల్యూయాడెడ్ అనే కోణం జాతీయ ఆదాయ ప్రవాహం వైపు చూసే మొదటి కోణం. ఈ కోణం ద్వారా కొలచిన జాతీయ ఆదాయాన్ని వాల్యూయాడెడ్ లేదా ఉత్పత్తి పద్ధతి ద్వారా కొలచిన ఆదాయంగా చెబుతారు.

ఉత్పత్తి సంస్థలు సృష్టించిన ఆదాయం నాలుగు ఉత్పత్తి కారక యజమానుల మధ్య ఉద్యోగుల పరిహారం భాటకము, వేతనం, వడ్డీ మరియు లాభముల రూపంలో పంచబడుతుంది. ఈ ఉత్పత్తి కారక ఆదాయాలన్నింటిని కలుపగా మనకు దేశీయ ఆదాయం వస్తుంది. జాతీయ ఆదాయంను లెక్కించే ఆదాయ పంపిణీ విధానానికి దారితీసే రెండవ కోణం ఇది.

ఉత్పత్తి కారక యజమానులు వారు పొందిన ఆదాయాలను వినియోగం మరియు పెట్టుబడి కొరకు ఉత్పత్తి సంస్థల నుండి వస్తుసేవల కొనుగోలుకు ఖర్చు చేస్తారు. అంతిమ వ్యయంను కలపడం ద్వారా జాతీయ ఆదాయంను లెక్కించే ఈ మూడవ కోణం జాతీయ ఆదాయంను లెక్కించే అంతిమ వ్యయ విధానంకు దారి తీస్తుంది.

జాతీయ ఆదాయం సృష్టించబడినప్పుడు ఉత్పత్తి మదింపు విధానం ద్వారా, ఉత్పత్తి కారక యజమానుల మధ్య పంపిణీ జరిగినపుడు ఆదాయ పంపిణీ పద్ధతి ద్వారా లేదా వినియోగం మరియు పెట్టుబడిపై ఖర్చు చేసినపుడు అంతిమ వ్యయ పద్ధతి ద్వారా జాతీయ ఆదాయంను కొలవడం జరుగుతుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఉత్పాదక సంస్థల పారిశ్రామిక వర్గీకరణను వివరించండి.***

**జ:** ఒక ఆర్థిక ప్రదేశంలో నున్న అన్ని ఉత్పాదక సంస్థలను మొదటగా ఒక రంగానికి లేదా ఒక విభాగానికి చెందినవిగా వర్గీకరిస్తారు. అదే విధంగా బ్యాంకింగ్ రంగ కార్యకలాపాలకు సంబంధించిన అన్ని ఉత్పాదక సంస్థలను బ్యాంకింగ్ రంగంగా వర్గీకరిస్తారు. వర్గీకరణ తర్వాత ప్రతి రంగం నుండి వచ్చిన జాతీయ ఆదాయంను వేరువేరుగా అంచనా వేస్తారు. ప్రతి రంగం నుండి వచ్చిన మొత్తం జాతీయ ఆదాయంను దేశీయ ఆదాయం అంటారు.

భావనాత్మకంగా ఒక దేశం యొక్క మొత్తం ఉత్పాదక కార్యకలాపమును మూడు ప్రధాన రంగాలుగా విభజిస్తారు. అవి : ప్రాథమిక, ద్వితీయ మరియు తృతీయ రంగాలు.

**అ) ప్రాథమిక రంగం**

వ్యవసాయం, అడవులు, చేపల పెంపకం, గనుల త్రవ్వకం, పాడి పరిశ్రమ లాంటి సహజవనరుల వెలికితీతలో నిమగ్నమైయున్న అన్ని ఉత్పాదక సంస్థలు ప్రాథమిక రంగం క్రిందకు వస్తాయి. ఈ రంగంను మొదటి ప్రాధాన్యతారంగంగా పరిగణించటానికి కారణం ఇది వస్తు సేవల ఉత్పత్తికి అవసరమైన అన్ని ముడిసరుకులకు ఆధారం.

**ఆ) ద్వితీయ రంగం**

ఒక వస్తువును మరొక వస్తువుగా మార్పిడి చేయడంలో నిమగ్నమై యున్న అన్ని ఉత్పాదక సంస్థలు ద్వితీయ రంగంగా వర్గీకరింపబడతాయి. ముడి వస్తువులను ఉపయోగించి వస్తువులను ఉత్పత్తి చేసే అన్ని తయారీ సంస్థలు లేక కర్మాగారాలు ఈ రంగం క్రిందకు వస్తాయి. పిండి మర, బట్టలు, చెప్పులు, విద్యుత్ పరికరాలు, ఇంటి సామాగ్రి, పుస్తకాలు, విద్యుచ్ఛక్తి మొదలైనవాటిని ఉత్పత్తి చేసే ఉత్పత్తి సంస్థలు ఈ రంగానికి చెందిన కొన్ని ఉదాహరణలు.

ఈ రంగం యొక్క అభివృద్ధి ప్రాథమిక రంగం నుండి వచ్చే ముడి పదార్థముల అందుబాటుపై ఆధారపడి ఉంటుంది. ఇందువలన ఈ రంగంను ద్వితీయ ప్రాధాన్యత రంగంగా పరిగణిస్తారు.

**ఇ) తృతీయ రంగం**

సేవల ఉత్పత్తిలో నిమగ్నమైన అన్ని ఉత్పాదక సంస్థలు తృతీయరంగ సంస్థలుగా వర్గీకరిస్తారు. బ్యాంకులు, భీమా సంస్థలు, ప్రభుత్వ పరిపాలన విభాగాలు, పోలీసు, రక్షణ మరియు ఇతర ప్రజా సర్వీసులు అందించే విభాగాలు, దేశీయ సేవకులు, రవాణా కంపెనీలు, వాణిజ్య సంస్థలు అనేవి తృతీయరంగ సంస్థలకు చెందిన కొన్ని ఉదాహరణలు.

ఈ రంగం యొక్క అభివృద్ధి ప్రధానంగా ప్రాథమిక మరియు ద్వితీయ ఆర్థిక రంగాలపై ఆధారపడి ఉంటుంది. అందువలన ఈ రంగంను తృతీయ ప్రాధాన్యత రంగంగా పరిగణిస్తారు.

పైన తెలిపిన మూడు రంగాలు స్థూలంగా వర్గీకరించిన సమూహాలు మాత్రమే. వీటిని ఇంకను సమూహాలు లేదా ఉపరంగాలుగ కూడా విభజిస్తారు.

***2. జాతీయ ఆదాయం కొలుచు పద్ధతులను వివరించండి.***

**జ:** జాతీయ ఆదాయం కొలుచు పద్ధతులు క్రింద వివరించబడినవి.

అవి A) ఉత్పత్తి పద్ధతి (వాల్యూయాడెడ్ పద్ధతి)

వాల్యూయాడెడ్ కోణంలో, జాతీయ ఆదాయాన్ని కొలుచుటకు ఉద్దేశించబడిన పద్ధతి ఇది. ఈ పద్ధతి ద్వారా జాతీయ ఆదాయంను కొలుచుటలోని ప్రధాన పద్ధతులు క్రింది విధంగా ఉన్నాయి.

అ) ఒక ఆర్థిక ప్రదేశంలో స్థాపించబడిన ఉత్పాదక సంస్థలను వ్యవసాయం, గనులు, తయారీ సంస్థలు, బ్యాంకింగ్, వర్తకం వంటి ప్రత్యేక పారిశ్రామిక సంస్థలుగా వర్గీకరించుట.

ఆ) ప్రతి పారిశ్రామిక రంగం యొక్క కారకవ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్‌ను క్రింది ఉపసోపానముల ద్వారా అంచనా వేయుట.

i) ఉత్పత్తి విలువ అంచనా వేయటం.

ii) మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్‌ను పొందుటకు మాధ్యమిక వినియోగ విలువను అంచనా వేసి దీనిని ఉత్పత్తి విలువ నుండి తీసివేయడం.

iii) కారక వ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్‌ను పొందుటకు మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్ నుండి స్థిర మూలధన వినియోగం మరియు పరోక్ష పన్నులను తీసివేసి, సబ్సిడీలను కలపడం. దీని సారాంశమేమనగా మార్కెట్ ధరల వద్ద స్థూల వాల్యూయాడెడ్ = ఉత్పత్తి విలువ (–) మాధ్యమిక వినియోగవిలువ.

ఇ) కారక వ్యయం వద్ద నికర దేశీయోత్పత్తి తెల్సుకోవడానికి కారక వ్యయం వద్ద అన్ని పారిశ్రామిక రంగాల మొత్తం నికర వాల్యూయాడెడ్‌ను తీసుకోవాలి.

ఉత్పత్తి కారకాల ఖరీదు దృష్ట్యా జాతీయాదాయాన్ని పొందడానికి, ఉత్పత్తి కారకాల ఖరీదు దృష్ట్యా నికర దేశీయోత్పత్తికి విదేశాల నుండి పొందిన నికర ఆదాయాన్ని కలపాలి. దీన్నే జాతీయాదాయం అంటారు.

**ముందు జాగ్రత్తలు**

ఉత్పత్తి పద్ధతి ద్వారా జాతీయ ఆదాయంను అంచనా వేయుటకు క్రింద తెలిపిన ముందు జాగ్రత్తలు అవసరం.

అ) ఉత్పత్తిని రెండు సార్లు లెక్కించకూడదు.

ఆ) స్వంత వినియోగంకు ఉత్పత్తి చేసిన ఉత్పత్తి మరియు అంచనా వేయగల్గిన వాటి విలువను ఉత్పత్తి అంచనాలో తప్పనిసరిగ కలపాలి.

ఇ) వినియోగింపబడిన రెండవ రకపు వస్తువుల (sceond hand goods) విక్రయాన్ని ప్రస్తుత ఉత్పత్తిలో కలుపకూడదు.

**B) ఆదాయ పంపిణీ పద్ధతి**

ఉత్పత్తి సంస్థలు ఉత్పత్తికారక యజమానులకు ఉత్పత్తికారక ఆదాయాలను పంపిణీ చేసినపుడు ఈ పద్ధతిలో జాతీయ ఆదాయంను లెక్కిస్తారు. ఈ పద్ధతిలో గల ప్రధానసోపానాలు క్రింది విధంగా ఉన్నవి.

a) ఉత్పత్తి సంస్థలను వ్యవసాయం, అడవులు, బ్యాంకింగ్, తయారీ, వాణిజ్యం మొదలైన ప్రధాన రంగాలుగా వర్గీకరించడం.

b) ప్రతి పారిశ్రామికరంగంలో ఉత్పత్తి సంస్థలు చెల్లించిన క్రింద చూపిన కారక ఆదాయాల అంచనా.

(i) ఉద్యోగుల వేతనం (ii) భాటకం (iii) వడ్డీ (iv) లాభం

పైన తెలిపిన చెల్లించబడిన కారక ఆదాయాల మొత్తం పారిశ్రామిక రంగంకు వచ్చిన కారక వ్యయం వద్ద నికర వాల్యూయాడెడ్‌కు సమానం.

c) కారక వ్యయం వద్ద నికర దేశీయోత్పత్తిని పొందుటకు అన్ని పారిశ్రామిక రంగాలు చెల్లించిన కారక చెల్లింపుల మొత్తంను తీసుకోవాలి.

d) ఉత్పత్తి కారకాల ఖరీదు దృష్ట్యా వద్ద నికర జాతీయోత్పత్తిని పొందటానికి కారక వ్యయం వద్ద నికరదేశీయోత్పత్తికి విదేశాల నుండి పొందిన నికర కారక ఆదాయంను కలపాలి.

**ముందు జాగ్రత్తలు**

ఆదాయ పంపిణీ పద్ధతి ద్వారా జాతీయ ఆదాయంను అంచనా వేయడానికి తీసుకోవలసిన ప్రధాన ముందు జాగ్రత్తలు కొన్ని క్రింది విధంగా ఉన్నాయి.

అ) ఉద్యోగులు పొందే పరిహారంను అంచనా వేసే సమయంలో వారు పొందే అన్ని రకాల సదుపాయాలు నగదు రూపం లేదా దయ రూపములను తప్పనిసరిగ కలుపవలెను.

ఆ) వడ్డీని అంచనా వేయడంలో ఉత్పత్తి కోసం తీసుకొన్న ఋణాలపై వచ్చే వడ్డీని మాత్రమే లెక్కించాలి.

ఇ) బహుమతులు, చందాలు, వితరణలు, పన్నులు, జరిమానాలు, లాటరీ ద్వారా గెలుపొందినవి మొదలైనవి కారక ఆదాయాలు కావు. అవి బదిలీ ఆదాయాలు. జాతీయ ఆదాయ అంచనాలో వీటిని కలుపరాదు.

**C) అంతిమ వ్యయ పద్ధతి**

వ్యయం వద్ద కూడ జాతీయ ఆదాయంను కొలువవచ్చును. ఈ పద్ధతి ప్రకారము మనం మొదటగా మార్కెట్ ధరల వద్ద స్థూలదేశీయ ఉత్పత్తిని అంచనా వేయాలి. ఇది వినియోగం మరియు పెట్టుబడి కొరకు ఉపయోగింపబడుటకు ఆర్థిక ప్రదేశంలోని ఉత్పత్తి చేసిన అంతిమ ఉత్పత్తులపై చేసే మొత్తం వ్యయం. దీని నుండి మనం జాతీయ ఆదాయంను పొందుటకు స్థిర మూలధన వినియోగం మరియు నికర పరోక్ష పన్నులను తీసివేసి విదేశాల నుండి పొందే నికరకారక ఆదాయంను కలుపవలెను.

**ముందు జాగ్రత్తలు**

a) వ్యయ మదింపు పద్ధతి ద్వారా జాతీయ ఆదాయంను అంచనా వేయుటకు క్రింద తెల్పిన ముందు జాగ్రత్తలు అవసరం.

b) మాధ్యమిక ఉత్పత్తులపై చేసే వ్యయంను కలుపకుండా అంతిమ ఉత్పత్తులపై చేసిన వ్యయంను మాత్రమే కలపడం ద్వారా వ్యయంను రెండుసార్లు లెక్కించడాన్ని అరికట్టవచ్చు.

c) బహుమతులు, చందాలు, పన్నులు, ఉపకార వేతనాలు, మొదలైన వాటిపై చేసే వ్యయం, అంతిమ ఉత్పత్తులపై చేసే వ్యయం కాదు. ఇది బదిలీ వ్యయం – మరియు దీనిని అంతిమ మార్గంలో కలపకూడదు.

d) రెండవ రకపు వినియోగ వస్తువుల కొనుగోలుపై చేసే వ్యయంను కలుపకూడదు. ఈ వ్యయం వీటిని మొదటిసారి కొనుగోలు చేసినపుడు కలిసి ఉంటుంది.

# 16

# జాతీయ ఆదాయ అంచనాల ఉపయోగాలు

# (Advantages of National Income Estimates)

## 16.1 ఉపోద్ఘాతం

ప్రాథమికంగా జాతీయ ఆదాయం అనేది ఉత్పత్తి ప్రక్రియలో వచ్చే కారక ఆదాయాల కొలమానమని కూడ మీరు చదివారు. దీనిని మూడు భిన్న కోణాలలో కూడా చూడొచ్చని చదివారు. ఈ రకమైన జాతీయ ఆదాయ అంచనాల వలన కలిగే ఉపయోగాలేమిటనే స్పష్టమైన ప్రశ్న మీ మనసులో కలుగుతుంది. ఒక దేశ జాతీయ ఆదాయ అంచనాల వలన కలిగే కొన్ని ఉపయోగాలను ప్రముఖంగా ప్రసావించుటయే ఈ పాఠము యొక్క లక్ష్యం.

## 16.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- నిజ జాతీయ ఆదాయ (వాస్తవ) భావనను వివరించటం.
- ప్రస్తుత ధరల వద్ద జాతీయ ఆదాయానికి మరియు నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయానికి మధ్యగల తేడా గుర్తించటం.
- నిలకడ ధరలలో జాతీయ వృద్ధి రేటు అనేది ఒక దేశం యొక్క ఆర్థిక వృద్ధి రేటుకు కొలమానమని తెలియచేయుట.
- ఒక ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాల సాపేక్ష ప్రాధాన్యతను అంచనా చేయుటంలో జాతీయాదాయ దత్తాంశం యొక్క ఉపయోగాన్ని వివరించటం.
- వివిధ దేశముల జాతీయ ఆదాయ దత్తాంశముల సహాయంతో దేశాల మధ్య పోలికలు సాధ్యమని నిరూపించటం.

## 16.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

**1.** ***ప్రస్తుత ధరలలో జాతీయాదాయం***

**జ:** ఏ సంవత్సరం జాతీయ ఆదాయంనైన అంచనా వేయుటకు ఆ సంవత్సరపు భౌతిక ఉత్పత్తిని ఆ సంవత్సరంలో నున్న ధరలతో గుణించవలయును. ఉదాహరణకు 1996 వ సంవత్సరపు జాతీయాదాయాన్ని కనుక్కోవడానికి 1996వ సంవత్సరపు భౌతిక ఉత్పత్తిని ఆ సంవత్సర ధరలతో గుణించవలయును. దీనిని ప్రస్తుత ధరలలో జాతీయ ఆదాయం అని పిలుస్తారు.

**2.** ***నిలకడ ధరల వద్ద జాతీయాదాయం***

**జ:** వాస్తవానికి, జాతీయ ఆదాయం మొదట ప్రస్తుత ధరలలో లెక్కించబడి తర్వాత ధరల సూచీ సహాయముతో

నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయంగా మార్చబడుతుంది. ధరల సూచితో ప్రస్తుత ధరల అంచనాలను భాగించి నిలకడ ధరల అంచనాలను పొందుతారు.

**3. *ఆధార సంవత్సరం***

**జ:** ధరల సూచీని తయారుచేయడానికి ఒక ఖచ్చితమైన సంవత్సరంను ఎన్నుకుంటారు. ఆ విధంగా ఎన్నుకున్న సంవత్సరాన్ని ఆధార సంవత్సరమని పిలుస్తారు.

**4. *వాస్తవిక ఆదాయం***

**జ:** ఒక సంవత్సర కాలంలో ప్రజలు పొందే ఆదాయమే ద్రవ్య ఆదాయం. ద్రవ్యఆదాయం ద్వారా వస్తుసేవలను కొనుగోలు చేయడానికయ్యే మొత్తమే వాస్తవిక ఆదాయం.

**5. *ఉత్పత్తి పద్ధతి ఉపయోగం***

**జ:** ఉత్పత్తి పద్ధతి ద్వారా సేకరించిన జాతీయ ఆదాయ దత్తాంశమును ఒక ఆర్థిక వ్యవస్థలోని వివిధ పారిశ్రామిక రంగాల సాపేక్ష ప్రాధాన్యతను అంచనా వేయుటకు ఉపయోగించవచ్చు.

**6. *ఆదాయ పంపిణీ పద్ధతి ఉపయోగం***

**జ:** ఆదాయ పంపిణీ పద్ధతి ద్వారా సేకరించిన జాతీయ దత్తాంశమును ఒక దేశంలో ఆదాయ పంపిణీ యొక్క సమతౌల్యతను అంచనా వేయటంలో ఉపయోగించవచ్చు.

**7. *వ్యయ పద్ధతి ఉపయోగం***

**జ:** వ్యయ పద్ధతి ద్వారా సేకరించిన జాతీయ ఆదాయ దత్తాంశమును ఒక సంవత్సరములో ఒక దేశంలోని ప్రజల జీవన ప్రమాణస్థాయి మరియు పెట్టుబడి నమూనా మరియు స్థాయిలను అంచనా వేయుటకు ఉపయోగించవచ్చు.

**8. *ద్రవ్యాదాయం***

**జ:** మనం సంపాదించే ఆదాయమే ద్రవ్య ఆదాయం.

**9. *వాస్తవిక ఆదాయం***

**జ:** ద్రవ్య ఆదాయయంతో మనం కొనగలిగే వస్తు సేవల మొత్తం

## రెండు మార్కు ల ప్రశ్నలు

**1. *నిజ జాతీయ ఆదాయ భావన***

జ. ఉత్పత్తి కారకాలు ఉత్పత్తి సంపాదించిన ఆదాయాలు కలపడంలో ఒక దేశం యొక్క జాతీయాదాయాన్ని కొలవవచ్చు. ఉత్పత్తి సంస్థలలో కారక ఆదాయాలు సృష్టింపబడతాయి. ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొన్నందులకు గాను ఉత్పత్తి కారకాల యజమానులకు ఈ ఆదాయాలు పంపిణీ చేయబడతాయి. ఆర్జించిన ఆదాయం పెట్టుబడి మరియు వినియోగంపై ఖర్చు చేయబడుతుంది. ప్రజలు తమ కోరికలను సంతృప్తి పరచుకొనుటకు వినియోగం పై ఖర్చు చేస్తారు. ఆదాయ సృష్టి కార్యకలాపాలను పెంచుటకు వారు పెట్టుబడి పై ఖర్చు పెడతారు.

***2. వాస్తవిక జాతీయ ఆదాయ అనగానేమి?***

జ. ఒక సంవత్సరములో ఒక దేశంలో ఉత్పత్తి అయిన అంతిమ వస్తు సేవల ద్రవ్య కొలమానమే జాతీయ ఆదాయం అని మీకు తెలుసు. మరొక విధంగా

జాతీయ ఆదాయం = అంతిమ ఉత్పత్తులు × ధరల స్థాయి

కాబట్టి కొంత కాలవ్యవధిలో జాతీయ ఆదాయంలోని మార్పు ఆ కాల వ్యవధిలో ఉత్పత్తిలో వచ్చిన మార్పు లేదా ధరల స్థాయిలో వచ్చిన మార్పు లేదా ఈ రెండింటింలో వచ్చిన మార్పుకు కారణమై వుంటుంది. సాధారణముగా ధరల స్థాయి పెరుగును. ధరల స్థాయిలో వచ్చిన మార్పు కారణంగా జాతీయ ఆదాయంలో వచ్చే మార్పును మనం తొలగించినచో జాతీయ ఆదాయంలో వాస్తవమైన మార్పు లేదా వాస్తవిక జాతీయ ఆదాయాన్ని పొందవచ్చు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. నిజ జాతీయ ఆదాయ భావన ఆవశ్యకత ను వివరించండి.***

**జ:** ఉత్పత్తి కారకాలు ఉత్పత్తి సంపాదించిన ఆదాయాలు కలపడంలో ఒక దేశం యొక్క జాతీయాదాయాన్ని కొలవవచ్చు. ఉత్పత్తి సంస్థలలో కారక ఆదాయాలు సృష్టింపబడతాయి. ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొన్నందులకు గాను ఉత్పత్తి కారకాల యజమానులకు ఈ ఆదాయాలు పంపిణీ చేయబడతాయి. ఆర్జించిన ఆదాయం పెట్టుబడి మరియు వినియోగంపై ఖర్చు చేయబడుతుంది. ప్రజలు తమ కోరికలను సంతృప్తి పరచుకొనుటకు వినియోగం పై ఖర్చు చేస్తారు. ఆదాయ సృష్టి కార్యకలాపాలను పెంచుటకు వారు పెట్టుబడి పై ఖర్చు పెడతారు.

జాతీయ ఆదాయ అంచనా ప్రక్రియలో ఉత్పత్తి సంస్థల వాల్యూయాడెడ్ దత్తాంశమును, ఉత్పత్తి కారక యాజమానుల మధ్య వారు అందించిన కారక సేవలకు గాను ఈ వాల్యూయాడెడ్‌ను పెంచడం పెట్టుబడి మరియు వినియోగం పై చేసే వ్యయమునకు సంబంధించిన దత్తాంశమును సేకరిస్తారు. ఆ విధముగా సేకరించిన దత్తాంశము ఒక ఆర్థిక వ్యవస్థ యొక్క వివిధ అంశాలను అవగాహన చేసుకొనుటకు సహాయపడగలదు. ఉదాహరణకు మొత్తం ఉత్పత్తిలో ఒక్కొక్క పారిశ్రామిక రంగం వాటా ఏమిటి? ఒక ఆర్థిక వ్యవస్థలో సమంగా లేదా అసమంగా పంచే ఆదాయాలు ఎంత? జాతీయ ఆదాయంలో శ్రామిక వర్గం మరియు సంపద వర్గముల సాపేక్ష వాటాలు ఎంత? ప్రజలు వారి జీవన ప్రమాణస్థాయిని పెంచుకొనుటకు వినియోగం పై ఎక్కువగా ఖర్చు చేస్తున్నారా? ప్రతి సంవత్సరం ఎంత పెట్టుబడి పెడుతున్నారు? ఏ రేటులో ఆర్థిక వ్యవస్థ వృద్ధి చెందుతున్నది? ఇతర ఆర్థిక వ్యవస్థ లలో కంటె ఇది వేగముగా లేదా నిదానముగా పెరుగుతున్నదా? ఈ ప్రశ్నలు మరియు సంబంధిత ఇతర ప్రశ్నలకు జాతీయ ఆదాయ అంచనా క్రమములో సేకరించిన దత్తాంశముల సహాయముతో సౌలభ్యంగా సమాధానములను పొందవచ్చు.

***2. వాస్తవిక జాతీయ ఆదాయ కొలమానం భావన ఆవశ్యకతను వివరించండి.***

**జ:** ఒక సంవత్సరములో ఒక దేశంలో ఉత్పత్తి అయిన అంతిమ వస్తు సేవల ద్రవ్య కొలమానమే జాతీయ ఆదాయం. మరొక విధంగా

జాతీయ ఆదాయం = అంతిమ ఉత్పత్తులు × ధరల స్థాయి

కాబట్టి కొంత కాలవ్యవధిలో జాతీయ ఆదాయంలోని మార్పు ఆ కాల వ్యవధిలో ఉత్పత్తిలో వచ్చిన మార్పు లేదా ధరల స్థాయిలో వచ్చిన మార్పు లేదా ఈ రెండింటింలో వచ్చిన మార్పుకు కారణమై వుంటుంది.

సాధారణముగా ధరల స్థాయి పెరగడం కూడా మీకు తెలుసు. కాబట్టి కాలక్రమములో జాతీయ ఆదాయంలో వచ్చే పెరుగుదలకు కారణం వస్తుసేవల ధరలలో సంభవించే పెరుగుదలయే కాబట్టి ఒక ఆర్థిక వ్యవస్థలోని మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదల మాత్రమే జాతీయ ఆదాయంలోని పెరుగుదలకు కారణం కాదు. మరొరకంగా ఇది నిజమైన పెరుగుదల కాదు. మొత్తం ఉత్పత్తి యొక్క ద్రవ్య విలువ పెరిగినప్పటికి పరిమాణాత్మకంగా మొత్తం ఉత్పత్తి అదే స్థాయిలో పెరగక పోవచ్చు. పరిమాణాత్మక పెరుగుదలయే అర్థవంతమైనది. దీని కొరకు వాస్తవిక జాతీయదాయం ఎంతో కనుగొనవలెను. ఉత్పత్తి పరిమాణంలో మార్పుకు ద్రవ్యజాతీయ ఆదాయం సూచిక కాదు. సాధారణంగా రెండింటిలో అనగా ఉత్పత్తి పరిమాణం మరియు ధరల స్థాయిలో మార్పులు వస్తాయి. ధరల స్థాయిలో వచ్చిన మార్పు కారణంగా జాతీయ ఆదాయంలో వచ్చే మార్పును మనం తొలగించినచో జాతీయ ఆదాయంలో వాస్తవమైన మార్పు లేదా వాస్తవిక జాతీయ ఆదాయాన్ని పొందవచ్చు.

పై విధంగా ఒక ఆర్థిక వ్యవస్థలో ఇచ్చిన సమయంలో ఏ మార్పు చోటు చేసుకుందో కనుగొనుటకు ఆ ఇచ్చిన సమయంలో వాస్తవిక జాతీయ ఆదాయంలోని మార్పును తీసుకోవాలి. మరో విధంగా చెప్పాలంటే వాస్తవిక జాతీయ ఆదాయం అనేది ఆ సంవత్సరంలో ఉత్పత్తి అయిన అంతిమ వస్తు సేవల మొత్తం పరిమాణం.

ఈ వాస్తవిక జాతీయ ఆదాయాన్ని వేరొక సంవత్సరపు జాతీయ ఆదాయంతో పోల్చేటప్పుడు ఆకాలంలో ధరలలో వచ్చిన మార్పు కారణంగా జాతీయ ఆదాయంలో వచ్చే మార్పును తొలగించి వాటిని పోల్చాలి.

ధరలలో మార్పు వలన జాతీయ ఆదాయంలో కలిగే మార్పును మనం ఏ విధంగా తొలగించాలి. దీని కోసం మనం నిలకడ ధరలలో జాతీయ ఆదాయం మరియు ప్రస్తుత ధరలలో జాతీయ ఆదాయం అనే భావనలను ఉపయోగించి ఈ మార్పు అర్థం చేసుకోవాలి.

***3. ప్రస్తుత ధరల వద్ద జాతీయ ఆదాయం మరియు నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయంల మధ్యగల భేదంను వివరింపుము?***

**జ:** ఏ సంవత్సరం జాతీయ ఆదాయంనైన అంచనా వేయుటకు ఆ సంవత్సరపు భౌతిక ఉత్పత్తిని ఆ సంవత్సరంలో నున్న ధరలతో గుణించవలయును. ఉదాహరణకు 2010 వ సంవత్సరపు జాతీయాదాయాన్ని కనుక్కోవడానికి 2010వ సంవత్సరపు భౌతిక ఉత్పత్తిని ఆ సంవత్సర ధరలతో గుణించవలయును. దీనిని ప్రస్తుత ధరలలో జాతీయ ఆదాయం అని పిలుస్తారు.

ఇపుడు మనం 2010 వ సంవత్సరపు జాతీయ ఆదాయాన్ని2005 వ సంవత్సరపు జాతీయ ఆదాయంతో పోల్చ వలెననుకుందాం. ఈ రెండు సంవత్సరాల భౌతిక ఉత్పత్తుల స్థాయి మరియు ధరలస్థాయి వేరుగా వుంటుంది. ఈ రెండు సంవత్సరాల ఉత్పత్తిని అదే ధరలస్థాయితో మనము గుణించినట్లయితే జాతీయ ఆదాయ అంచనాలలో ధరల స్థాయిలో వచ్చే మార్పులను తొలగించవచ్చు. ఇపుడు మనము 2010వ సంవత్సరపు ఉత్పత్తిని 2005 వ సంవత్సరపు ధరలతో గుణించినట్లయిన దానిని మనము నిలకడ ధరలలో 2010 వ సంవత్సరపు జాతీయ ఆదాయంగా పిలుస్తాము.

వాస్తవానికి, జాతీయ ఆదాయం మొదట ప్రస్తుత ధరలలో లెక్కించబడి తర్వాత ధరల సూచీ సహాయముతో నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయంగా మార్చబడుతుంది. ధరల సూచితో ప్రస్తుత ధరల అంచనాలను భాగించి నిలకడ ధరల అంచనాలను పొందుతారు.

ధరల సూచీని తయారుచేయడానికి ఒక ఖచ్చితమైన సంవత్సరంను ఎన్నుకుంటారు. ఆ విధంగా ఎన్నుకున్న సంవత్సరాన్ని ఆధార సంవత్సరమని పిలుస్తారు. ఆధార సంవత్సర ధరల స్థాయిని 100కు సమానంగ తీసుకోవాలి. ఇతర అన్ని సంవత్సరాల ధరల స్థాయిలను ఆధార సంవత్సర ధరల స్థాయికి శాతాలలో తెలియపరుస్తారు. ఈ విధంగ 2005 వ సంవత్సరం ఆధార సంవత్సరమైతే దాని ధర స్థాయిని 100 గా తీసుకుంటాం. 2010 వ సంవత్సరానికి ధరలస్థాయి 50% శాతానికి పెరిగిందనుకుందాం. 2010 వ సంవత్సరపు ధరల స్థాయిని 150 గా తీసుకుంటాం. ఈ విధంగా అన్ని సంవత్సరములకు ధరల సూచినీ ఆ సంవత్సరాల జాతీయ ఆదాయ అంచనాలను పోల్చడానికి తయారుచేస్తారు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1 జాతీయ ఆదాయ అంచనాల ఉపయోగాలను వివరింపుము?***

**జ:** జాతీయ ఆదాయ అంచనాలతో పాటు ఆదాయ అంచనా క్రమంలో సేకరించిన దత్తాంశం ఒక ఆర్థిక వ్యవస్థలోని వివిధ రంగాల నిర్వహణ ఆర్థిక వ్యవస్థలలో చోటు చేసుకొనే వ్యవస్థీకృత మార్పులు, ఆర్థిక వృద్ధి మరియు ప్రజల జీవన స్థాయిలోని మార్పులను గురించి చదువుకోవడానికి ఈ రెండూ చాలా ఉపయోగపడతాయి.

ఈ అధ్యయనాలు ఆర్థిక విధానాల రూపకల్పనకు మరియు భవిష్యత్ ప్రణాళికలకు కూడా సహాయ పడతాయి. జాతీయాదాయ దత్తాంశంలోని కొన్ని ముఖ్యమైన ఉపయోగాలు క్రింది విధంగా ఉన్నాయి.

**1. ఆర్థిక వృద్ధికి కొలమానము జాతీయ ఆదాయం**

ఒక దేశం యొక్క ఆర్థిక వృద్ధిని నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయ అంచనాలు సూచిస్తాయి. ఒక దేశం యొక్క ఆర్థిక వృద్ధి రేటును నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయ వృద్ధి రేటుతో కొలుస్తారు. ఉదాహరణకు 1993-94 సంవత్సరంనకు భారతదేశ ఆర్థిక వృద్ధి రేటు 4.4 శాతం. దీని అర్థమేమనగ 1992-93 సంవత్సరపు నిలకడ ధరలలో జాతీయ ఆదాయంతో 1993-94 సంవత్సరపు నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయంను పోల్చినపుడు 4.4 శాతం వృద్ధి నమోదు అయినట్లు చెప్పవచ్చు. స్థూలంగా ఆర్థిక వృద్ధి అనేది ఒకదేశం యొక్క భౌతిక వస్తు సేవల ఉత్పత్తి స్థాయిలోని పెరుగుదలకు సూచికగా చెపుతాం.

**2. ప్రణాళిక విజయం / వైఫల్యమునకు జాతీయ ఆదాయం ఒక సూచిక**

ఆర్థిక వృద్ధి సాధనకు భారతదేశం ప్రణాళికా విధానం అనుసరిస్తున్నది. ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి సాధన లక్ష్యాలు మరియు ఆర్థికవృద్ధి రేటు నిర్ణయించబడి తదనుగుణంగా వనరులు కేటాయించబడతాయి. పారిశ్రామిక రంగాల ఉత్పత్తుల వృద్ధి రేటు మరియు నిలకడ ధరల వద్ద జాతీయ ఆదాయం ఈ లక్ష్యాలు సాధింపబడినదో లేదో తెలుసుకోవడానికి గుర్తు. ఈ విధముగ జాతీయ ఆదాయ దత్తాంశం ప్రణాళికా లక్ష్య సాధనను అంచనావేయుటకు ఉపయోగపడుతుంది. ఈ లక్ష్యములు సాధింపబడకపోతే ప్రభుత్వం పరిస్థితిని పునర్విమర్శ చేసి ఆ పరిస్థితిని సరిదిద్దడానికి చర్యలు చేపడుతుంది.

**3. తలసరి ఆదాయ అంచనాకు ఉపయోగం**

ఒకదేశ జాతీయ ఆదాయంను ఆ దేశ మొత్తము జనాభాతో భాగించగా తలసరి ఆదాయం వస్తుంది. ఒక సంవత్సర కాలానికి ప్రజలకు అందుబాటులో వున్న వస్తు సేవల సగటును తలసరి ఆదాయం సూచిస్తుంది. తలసరి ఆదాయం పెరిగినపుడు ప్రజలకు అందుబాటులో వుండే వస్తు సేవల సగటు మరియు వారి సగటు జీవన ప్రమాణం కూడ పెరుగుతాయి.

**4. వివిధ ఉత్పత్తి రంగాల పనితీరును అంచనా వేయుటలో ఉపయోగం**

ఒక దేశంలోని ఉత్పత్తి సంస్థలను స్థూలంగా ప్రాథమిక, ద్వితీయ మరియు తృతీయ రంగాలుగ వర్గీకరిస్తారు. సహజ వనరులను వెలికి తీయుటలో నిమగ్నమై యున్న ఉత్పాదక సంస్థలైన వ్యవసాయం, చేపల పెంపకం, గనులు మొదలైనవి ప్రాథమిక రంగానికి సంబంధించినవి. ద్వితీయ రంగం వస్తువుల తయారీ రంగం. తృతీయ రంగం రవాణా, బ్యాంకింగ్, భీమా, ప్రభుత్వం మొదలైన సేవల ఉత్పత్తికి సంబంధించిన ఈ రంగాలు కారక ఆదాయాలను సృష్టిస్తాయి. జాతీయ ఆదాయంనకు ఈ రంగాలు అందించే వాటాలను కొలుచుటకు ఇవి సృష్టించిన కారక ఆదాయంల సమాచారం ఉపయోగపడుతుంది.

**5. ఆదాయ పంపిణీలోని అసమానతలను కొలుచుటలో ఉపయోగం**

అందరు వ్యక్తులు ఒకే రకము అయిన ఆదాయం కలిగివుండరు. కొందరు ఇతరుల కంటె ఎక్కువగా ఆదాయంను సంపాదిస్తారు. ఇంకో విధంగా చెప్పాలంటే కొందరు ధనవంతులు మరికొందరు పేదవారు. దీని అర్థం జాతీయ ఆదాయం వ్యక్తుల మధ్య అసమానంగా పంచబడింది. ఆదాయ పంపిణీలో కొంతమేర అసమానతలకు వ్యక్తుల వయస్సులో, లింగ భేదం, అర్హతలు, పని అనుభవం, శారీరక ధారుఢ్యం, ప్రమాదకర పనులను చేపట్టంలో ఇష్టత మొదలైన వాటిలో తేడాలుండుటం కారణం. అయితే ఈ అసమానతలు చాలా ఎక్కువగా వున్నపుడు మరియు సహేతుక కారణాలతో వివరించలేనపుడు ఇది ఆశించదగని విషయం.

**6. జీవన ప్రమాణాన్ని కొలవడంలో ఉపయోగం**

ఒక దేశంలో నివసిస్తున్న ప్రజల జీవన ప్రమాణస్థాయిని వారు వినియోగిస్తున్న వస్తుసేవలైన ఆహారం, నివాసం, విద్య, బట్టలు మొదలైన ఇతర అవసరాలు, సౌకర్యాలు మరియు విలాసాలపై చేసే ఖర్చు నిర్ణయిస్తుంది. వినియోగ వ్యయం ఎక్కువగా ఉన్నపుడు వారి జీవన ప్రమాణస్థాయి కూడా ఎక్కువగా ఉంటుంది.

**7. వినియోగ నమూనాను తెలుసుకోవడంలో ఉపయోగం**

వినియోగం పై ప్రజల వస్తువువారీ వ్యయ సమాచారం వారి వినియోగ నమూనాను తెలుపుతుంది. ఒక దేశంలోని ప్రజల వినియోగ నమూనాలోని మార్పులను గురించి మనం కాలక్రమేణా వచ్చిన వినియోగ వ్యయ దత్తాంశముల పోలిక ద్వారా తెలుసుకోగలుగుతాం.

**8. పెట్టుబడి నమూనా మరియు స్థాయిలను కొలుచుటలో ఉపయోగం**

జాతీయ ఆదాయంను అంచనా వేసే వ్యయపద్ధతి ద్వారా పెట్టుబడి వ్యయంను కూడా కొలువ వచ్చును. ఒక సంవత్సరంలో దేశంలో పెట్టిన మొత్తం తాజా పెట్టుబడి సమాచారంను ఇది మనకు ఇస్తుంది. ఆర్థిక వ్యవస్థ వృద్ధి రేటును ప్రభావితం చేయు ఉత్పత్తి సామర్థ్యంను పెట్టుబడి నిర్ణయిస్తుంది.

**9. అంతర్జాతీయ పోలికలను సాధ్యం చేస్తుంది**

జాతీయ ఆదాయ దత్తాంశాల ఆధారంగ ఏ రెండు దేశాల ఆర్థిక వ్యవస్థలనైనా మనం పోల్చవచ్చును. ఒక దేశం ధనిక లేదా పేద అను విషయాన్ని మనం తెలుసుకోగలం. ఇతర దేశములతో పోల్చడం ద్వారా ఒక దేశంలో వ్యవసాయానికి ఎంత ప్రాధాన్యత వుంది లేదా ఏ వృత్తికి ఎంత ప్రాధాన్యత వుంది అనే విషయం మనం తెలుసుకోవచ్చును.

# 17

# సూక్ష్మ అర్థశాస్త్రం

# (What Micro Economics is all about?)

## 17.1 పరిచయం

ఒక ఆర్థిక వ్యవస్థ గూర్చిన అధ్యయనంలో దానికి సంబంధించిన ఒకటి లేదా అన్ని ఆర్థిక ఏజంట్ల గూర్చిన పరిశీలన ఉంటుంది. ఉదాహరణకు ఏ ఉత్పత్తి ప్రక్రియకు సంబంధించిన పరిశీలనలోనైనా, దానికి చెందిన పెట్టుబడి, ఉత్పత్తి, వినియోగాలకు చెందిన కార్యకలాపాలు ఉంటాయి. ఈ పాఠ్యభాగంలో ఆర్థిక సమస్యల పరిష్కారంలో సహాయపడే పరిశీలనల గురించి వివరించబడ్డాయి.

## 17.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొనే ముఖ్యాంశాలు.

- సూక్ష్మ, స్థూల అర్థశాస్త్రాల మధ్యగల తేడాలు
- సూక్ష్మ అర్థశాస్త్రంలో సిద్ధాంతాల రూపకల్పన
- అర్థశాస్త్ర అవగాహనకు రేఖా పటములు ఎలా తోడ్పడతాయి.

## 17.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. సూక్ష్మ అర్థశాస్త్రం***

**జ:** ఒక వినియోగదారుడు, ఒక సంస్థ, ఒక వస్తువుకు గల డిమాండ్, సప్లయ్ – వీటిని గురించిన పరిశీలనే సూక్ష్మ అర్థశాస్త్రం.

***2. స్థూల అర్థశాస్త్రం***

**జ:** ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని పరిశీలించేది స్థూల అర్థశాస్త్రం. మొత్తం ఉద్యోగిత, సాధారణ ధరలస్థాయి, ఆర్థికాభివృద్ధి – ఇలా వైయక్తిక యూనిట్లను కాక మొత్తాలను గురించిన పరిశీలనే స్థూల అర్థశాస్త్రం.

***3. నిగమన పద్ధతిలోని దశలు***

**జ:** ఆర్థిక సమస్యలను విశ్లేషించి, సూత్రాలను రూపొందించుటకు రెండు పద్ధతులున్నాయి. అవి –

1. నిగమన పద్ధతి 2. ఆగమన పద్ధతి

*4. ఆగమన పద్ధతిలోని దశలు*

**జ:** ఆగమన పద్ధతిలోని దశలు – (ఎ) సమస్యను గుర్తించుట (బి) కొన్ని ప్రమేయాలు చేయుట (సి) సమస్యకు సంబంధించిన సమాచార సేకరణ, విశ్లేషణ (డి) సూత్ర ప్రతిపాదన

*5. రేఖ*

**జ:** రెండు చలాంకాల సమానత్వం వల్ల కొన్ని బిందువులు ఏర్పడతాయి. ఈ బిందువులను కలపగా వచ్చేదే రేఖ.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1. సూక్ష్మ అర్ధశాస్త్ర పరిధిని తెలుపుము ?*

జ. అర్థశాస్త్రాన్ని సూక్ష్మ – స్థూల అర్ధశాస్త్రాలుగా 1933 సంవత్సరములో రాగ్నార్ ఫ్రెష్ విభజించారు. సూక్ష్మ అర్ధశాస్త్రం వైయక్తిక లేదా వ్యక్తిగత లేదా చిన్న అంశాలను గూర్చి వివరిస్తుంది. అనగా ఒక వ్యక్తి, ఒక సంస్థ, ఒక పరిశ్రమ మొదలయిన అంశాలను గూర్చి తెలుపుతుంది. వినియోగం, వినిమయం, ఉత్పత్తి, పంపిణి అనే అంశాలను గూర్చి ఇది వివరిస్తుంది. దీనికి మరో పేరు ధరల సిద్ధాంతం.

*2. స్థూల అర్ధశాస్త్రాన్ని నిర్వచింపుము ?*

జ. అర్థశాస్త్రాన్ని సూక్ష్మ, స్థూల అర్ధశాస్త్రాలుగా రాగ్నార్ ఫ్రెష్ 1933 సంవత్సరములో విభజించారు. స్థూల అర్ధశాస్త్రం ఆర్థిక వ్యవస్థలోని మొత్తాలను గూర్చి పరిశీలిస్తుంది. అంటే ఆర్థిక వ్యవస్థ మొత్తానికి చెందిన సమిష్టి యూనిట్ల పరిశీలనే స్థూల అర్ధశాస్త్రం. జాతీయాదాయం, సమిష్టి ఉద్యోగిత, వ్యాపార చక్రాలు మొదలైన అంశాలను ఇది వివరిస్తుంది. దీనికి మరో పేరు ఆదాయ ఉద్యోగితా సిద్ధాంతం.

*3. ఆర్థిక ఏజంట్లు ఎవరు ?*

జ. ఉత్పత్తి, వినియోగం, పెట్టుబడి వంటి ఆర్థిక కార్యకలాపాలతో నిమిగ్నమైన వారిని ఆర్థిక ఏజంట్లు అంటారు. ఉత్పత్తి కారకాల యజమానులు, ఉత్పత్తిదారులు, వినియోగదారులు, ప్రభుత్వం మొదలైన వాటిని ఆర్థిక ఏజంట్లుగా వ్యవహరిస్తారు. ఒక సమూహామునకు చెందిన ఏజంట్లు వేరొక సమూహాము యొక్క ఆర్థిక కార్యకలాపాలను ప్రభావితం చేస్తాయి.

*4. నిగమన పద్ధతి* ***అనగానేమి?***

నిగమన పద్ధతి ద్వారా ఆర్థికసూత్ర రూపకల్పనలో కింది నాలుగు దశలు కలవు.

**i) విశ్లేషణకు సమస్యను గుర్తించటం**

**ii)** విశ్లేషణా సౌలభ్యం కోసం ప్రతిపాదనలు చేయబడతాయి.

**iii)** హేతుబద్ధమైన ఆలోచన ద్వారా పరికల్పనను రూపొందించుట ప్రమేయాల ఆధారంగా, కార్యాకారణ సంబంధాన్ని తర్కించి, కొన్ని ప్రతిపాదనలు చేయబడతాయి. దీనినే పరికల్పనా రూపకల్పనగా చెప్పవచ్చు.

ఆర్థిక సూత్ర రూపకల్పనకు ముందు పరికల్పనలు పరిశీలించడం.

***5. ఆగమన పద్ధతి అనగానేమి?***

జ. ఆగమన పద్ధతి ద్వారా సూత్రాన్ని రూపొందించుటలో దిగువ దశలు ఉంటాయి.

i) **విశ్లేషణకు సమస్యను గుర్తించుట.**

ఈ దశ నిగమన పద్ధతిలో వలె ఉంటుంది.

ii) **సమాచార సేకరణ, వర్గీకరణ**

iii) తర్కం ద్వారా సంబంధాన్ని నిర్ధారించుట

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. సూక్ష్మ మరియు స్థూల అర్థశాస్త్రాలు గూర్చి వివరింపుము.***

**జ:** అర్థశాస్త్రంలో 'సూక్ష్మ' అర్థశాస్త్రం, 'స్థూల' అర్థశాస్త్రం అని రెండు భాగాలు ఉన్నాయి. 'సూక్ష్మ' అనగా చిన్న అని అర్థం. ఆర్థిక వ్యవస్థలోని వ్యక్తిగత యూనిట్ల పరిశీలనే సూక్ష్మ అర్థశాస్త్రం. 'స్థూల' అంటే పెద్ద లేదా మొత్తం అని అర్థం. ఆర్థిక వ్యవస్థ మొత్తానికి చెందిన సమిష్టి యూనిట్ల పరిశీలనే స్థూల అర్థశాస్త్రం.

ఒక ఉదాహరణ ద్వారా ఈ రెండు భావనలను గూర్చి స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. పరస్పర సంబంధం కలిగి పనిచేసే అనేక కణాలు, అవయవాలు కలిగి ఉన్నదే మానవ శరీరం. ఇందులో ఏ ఒక్క కణం లేదా అవయవం గురించిన పరిశీలనే సూక్ష్మ అర్థశాస్త్రం. మొత్తం మీద మానవ శరీరం గూర్చిన పరిశీలనే స్థూల అర్థశాస్త్రం. అదేవిధంగా ఆర్థిక వ్యవస్థలోని పెట్టుబడి, ఉత్పత్తి, వినియోగం అనే ప్రక్రియలు పరస్పర సంబంధం కలిగి ఉంటాయి. ప్రతి ప్రక్రియలోనూ వేలాది వ్యక్తులు, సంస్థలు నిమగ్నమై ఉంటారు. వీరినే ఆర్థిక ఏజంట్లుగా పిలుస్తారు. వ్యక్తిగతంగా లేదా ఉమ్మడిగా ఈ ఆర్థిక ఏజంట్ల పరస్పర సంబంధిత అంశాలు సూక్ష్మ అర్థశాస్త్రంలో పరిశీలించబడతాయి. మరోవైపు ఆర్థిక వ్యవస్థలోని సమిష్టి అంశాల స్వరూపం, ప్రవర్తన, వాటి మధ్యగల పరస్పర సంబంధం – వీటితో ఏర్పడే ఒడిదుడుకులను స్థూల అర్థశాస్త్రం పరిశీలిస్తుంది.

**2. సూక్ష్మ, స్థూల అర్థశాస్త్రాల మధ్యగల పరస్పర సంబంధం వివరింపుము.**

అర్థశాస్త్రంలో రెండు భాగాలైన సూక్ష్మ అర్థశాస్త్రం, స్థూల అర్థశాస్త్రం పరస్పర సంబంధం కలవి. మరో విధంగా చెబితే అవి పరస్పర ఆధారితాలు. స్థూల ఆర్థిక చలాంకాలను అర్థం చేసుకోవటానికీ, వాటి విశ్లేషణకు, సూక్ష్మ ఆర్థిక పరిశీలనలు తోడ్పడతాయి. వీటి మధ్యగల సంబంధాన్ని అర్థం చేసుకోవటానికి కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. ఒక వస్తువు ధర ఎలా నిర్ణయించబడుతుంది, ధర నిర్ణయంలో అమ్మకం దార్లు, కొనుగోలు దార్ల పాత్ర మనకు తెలిసినట్లయితే, అది ఆర్థిక వ్యవస్థలోని సాధారణ ధరల స్థాయిలో వచ్చే మార్పుల విశ్లేషణకు ఉపయోగపడుతుంది. ధర నిర్ణయ ప్రక్రియ, అందులో అమ్మకం దార్లు, కొనుగోలు దార్ల పాత్ర, సూక్ష్మ ఆర్థిక పరిశీలన కాగా, ఆర్థిక వ్యవస్థ లోని సాధారణ ధరల స్థాయి పరిశీలన, స్థూల ఆర్థిక పరిశీలనగా చెప్పవచ్చు. అలానే ఆర్థిక వ్యవస్థలోని ప్రతి ఉత్పత్తి యూనిట్, ప్రతి రంగం పనితీరును తెలుసుకోవటం ద్వారా మొత్తం ఆర్థిక వ్యవస్థ పనితీరును గ్రహించవచ్చు. ప్రతి ఉత్పత్తి యూనిట్, ప్రతి రంగాన్ని గురించిన పరిశీలన, సూక్ష్మ ఆర్థిక పరిశీలన కాగా, మొత్తం మీద ఆర్థిక వ్యవస్థ పనితీరును తెలిపేది స్థూల

ఆర్థిక పరిశీలన. ఈ విధంగా అర్థశాస్త్రానికి సంబంధించిన సూక్ష్మ అర్థశాస్త్రం, స్థూల అర్థశాస్త్రం రెండూ పరస్పర సంబంధం కలవి.

### 3. సూక్ష్మ అర్థశాస్త్ర పరిధిని వివరింపుము.

జ. ఉత్పత్తి, వినియోగం, పెట్టుబడి అనేవి ఆర్థిక వ్యవస్థలో గల పరస్పర సంబంధం గల మూడు ముఖ్యమైన ప్రక్రియలని చదువుకున్నాం. అన్ని ఆర్థిక కార్యక్రమాలు ఈ ప్రక్రియలతోనే ముడిపడి ఉంటాయి. ఈ కార్యకలాపాలలో నిమగ్నమయిన వారిని ఆర్థిక యూనిట్లు లేదా ఆర్థిక ఏజంట్లుగా వ్యవహరిస్తారు. ఉత్పత్తి కారకాల యజమానులు, ఉత్పత్తి దారులు, వినియోగదారులు – ఉత్పత్తియూనిట్లు లేదా ఆర్థిక ఏజంట్లు అని పిలువవచ్చు. ఒక సమూహానికి చెందిన ఆర్థిక ఏజంట్ల చర్యలు వేరొక సమూహం మొక్క ఆర్థిక కార్యకలాపాలను ప్రభావితం చేస్తాయి. పరస్పర ప్రభావం, అనేక ఆర్థిక చలాంకాలైన వస్తుధర, ఉత్పత్తి కారకం ధర, వినియోగదార్ల మరియు ఉత్పత్తిదార్ల సంఖ్య మొదలైన వాటిని ప్రభావితం చేస్తుంది.

ఈ ఆర్థిక యూనిట్ల ప్రవర్తనా పరిశీలనే సూక్ష్మ అర్థశాస్త్ర విషయవస్తువు. గృహాలు లేదా వ్యక్తులు వినియోగ దారులుగా, తమతమ ఆదాయాలను వివిధ ఉపయోగాల మధ్య ఎలా కేటాయిస్తారు? సంస్థలు లేదా ఉత్పత్తిదారులు, వివిధ వస్తుసేవల ఉత్పత్తి మధ్య తమ వనరులను ఎలా కేటాయిస్తారు? ఒక వస్తువు ధర ఎలా నిర్ణయించబడుతుంది? ఇవీ – సూక్ష్మ అర్థశాస్త్రంలో అధ్యయనం చేయబడే కొన్ని ప్రశ్నలు.

వివిధ ఆర్థిక యూనిట్లు, వాటి ప్రవర్తన, వాటి మధ్యగల పరస్పర సంబంధం కొన్ని ఆర్థిక సిద్ధాంతాల రూపకల్పనకు దారి తీసింది. అవి – వినియోగదారుని ప్రవర్తనా సిద్ధాంతం, సంస్థ సిద్ధాంతం, ధరల సిద్ధాంతం వేతన సిద్ధాంతం, భాటక సిద్ధాంతం, వడ్డీ సిద్ధాంతం, లాభ సిద్ధాంతం మొదలైనవి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

### 1. ఆర్థిక సూత్రాల రూపకల్పనా పద్ధతులు వివరింపుము.

**జ:** ఆర్థిక సూత్రాల ఏజెంట్లు, వాటి మధ్యగల పరస్పర సంబంధాన్ని అధ్యయనం చేయడం అంత సులభం కాదు. ఒక ఆర్థిక ఏజెంట్ల సమూహం నుండి కొన్నింటి ప్రవర్తనను అధ్యయనం చేసి, దాని ఆధారంగా కొన్ని నిర్ణయాలకు రావచ్చు. ఈ నిర్ణయాలు లేదా తీర్మానాలు ఆ సమూహం యొక్క సాధారణ ప్రవర్తనగా చెప్పవచ్చు. ఈ తీర్మానాలను పరీక్షించి, వాటి ఆధారంగా ఆర్థిక సూత్రాలు లేదా సిద్ధాంతాలు రూపొందించబడతాయి. ఆర్థిక సూత్రాల రూపకల్పనకు రెండు పద్ధతులు కలవు.

1) నిగమన పద్ధతి 2) ఆగమన పద్ధతి

**ఎ) నిగమన పద్ధతి**

నిగమన పద్ధతి ద్వారా ఆర్థికసూత్ర రూపకల్పనలో కింది నాలుగు దశలు కలవు.

**i) విశ్లేషణకు సమస్యను గుర్తించటం**

సమస్యను గుర్తించటం మొదటిదశ. పరస్పర సంబంధం గల ఏ చలాంకాల ప్రవర్తనా తీరును విశ్లేషించాలో అవి స్పష్టంగా తెలిసి ఉండాలి.

**ii)** విశ్లేషణా సౌలభ్యం కోసం ప్రతిపాదనలు చేయబడతాయి. వీటివలన అధ్యయన పరిధి అర్థం అవుతుంది. ఈ పతిపాదనలు ఆర్థిక చలాంకాల ప్రవర్తనకు సంబంధించినవై ఉండవచ్చు. ఈ ప్రమేయాలు పూర్తిగా సాంకేతిక పరమైనవి కావచ్చు.

**iii)** హేతుబద్ధమైన ఆలోచన ద్వారా పరికల్పనను రూపొందించుట ప్రమేయాల ఆధారంగా, కార్యాకారణ సంబంధాన్ని తర్కించి, కొన్ని ప్రతిపాదనలు చేయబడతాయి. దీనినే పరికల్పనా రూపకల్పనగా చెప్పవచ్చు.

**iv) పరికల్పనను పరిశీలించుట లేదా పరీక్షించుట**

ఆర్థిక సూత్ర రూపకల్పనకు ముందు పరికల్పనలు పరిశీలించబడవలె. ఇందుకోసం, సంబంధిత అంశాల గురించి సమాచారం సేకరించబడవలె. సమాచారం, పరికల్పనను ఋజువు చేస్తే అప్పుడు అది సిద్ధాంతంగా రూపు దిద్దుకుంటుంది. ఒకవేళ వాస్తవాలు సేకరించిన సమాచారాన్ని ఋజువు చేయలేకపోతే దానిని మార్చవలె, లేదా మరలా రూపొందించి పరీక్షించవలె. సూక్ష్మ ఆర్థిక సిద్ధాంత రూపకల్పనకు ఎంచుకున్న సమస్య ఒకటి లేదా ఆర్థిక ఏజెంట్ల సమూహానికి చెందవలె.

**బి) ఆగమన పద్ధతి :** ఆగమన పద్ధతి ద్వారా సూత్రాన్ని రూపొందించుటలో దిగువ దశలు ఉంటాయి.

i) **విశ్లేషణకు సమస్యను గుర్తించుట :** ఈ దశ నిగమన పద్ధతిలో వలె ఉంటుంది.

ii) **సమాచార సేకరణ, వర్గీకరణ** : సమస్యకు సంబంధించిన సమాచాంం సేకరించి, విశ్లేషించి, వర్గీకరించబడవలె. అనేక పరిశీలనపై ఆధారపడి సమాచారం సేకరించబడాలి. గణాంక పద్ధతులను వాడి వివిధ చలాంకాల మధ్యగల కార్యకారణ సంబంధాన్ని కనుగొనవలె.

iii) **తర్కం ద్వారా సంబంధాన్ని నిర్ధారించుట :** కనుగొన్న తర్కం ఆధారంగా సిద్ధాంతం రూపొందించబడవలె. ఆర్థిక సిద్ధాంత రూపకల్పనలో భ్రమను నివారించేందుకు సరైన పదాలు వాడబడాలి.

# 18

# వినియోగ సిద్ధాంతం

# [The theory of Consumption]

## 18.1 పరిచయం

మొత్తం ఆర్థిక కార్యకలాపాలకు మూలం వినియోగం. ప్రజలు తమ కోరికలను తీర్చుకోవడానికి ప్రయోజనం ఉన్న వస్తు, సేవలను వినియోగిస్తారు. వస్తువులకు ఉండే మానవ కోరికలను సంతృప్తి పరచగలిగే శక్తిని ప్రయోజనం అంటారు. ప్రయోజన సూత్రాలు, వినియోగ దారుని ప్రవర్తనను అధ్యయనం చేయటం ఈ అధ్యాయం ముఖ్య ఉద్దేశ్యం.

## 18.2 లక్ష్యాలు

ఈ పాఠ్య భాగం నుండి ఈ క్రింది అంశాలను అర్థం చేసుకోగలరు.

- ప్రయోజనం దాని అర్థం
- కార్డినల్ ప్రయోజనం
- ఆర్డినల్ ప్రయోజనం
- క్షీణోపాంత ప్రయోజన సూత్రం - పరిమితులు
- సమోపాంత ప్రయోజన సూత్రం - పరిమితులు
- వినియోగదారుని సమతౌల్యం

## 18.3 ప్రశ్నలు - సమాధానాలు

**ఒక్క మార్కు ప్రశ్నలు**

***1. ప్రయోజనం అనగానేమి?***

జ: వస్తువు లేదా సేవ యొక్క మానవ కోరికలను తీర్చగల శక్తిని ప్రయోజనం అంటారు.

***2. ప్రయోజనాన్ని ఏ రూపంలో కొలవవచ్చు?***

జ: కార్డినల్ పద్ధతి ద్వారా ప్రయోజనాన్ని సంఖ్యా రూపంలో కొలవవచ్చు.

***3. ఆర్డినల్ పద్ధతి?***

జ: ఆర్డినల్ పద్ధతిలో ప్రయోజనాన్ని సంఖ్యా రూపంలో కొలవలేము, పోల్చగలం

***4. సమోపాంత ప్రయోజన సూత్రం?***

జ: సమోపాంత ప్రయోజన సూత్రం వినియోగ దారుని సమతౌల్యాన్ని వివరిస్తుంది.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. కార్డినల్ ప్రయోజనంను వివరించుము.***

జ: ఆల్ఫ్రెడ్ మార్షల్ కార్డినల్ ప్రయోజన విశ్లేషణ ఆధారంగా వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేశాడు. కార్డినల్ విశ్లేషణ ప్రకారం ప్రయోజనాన్ని కొలవవచ్చు. ఈ పద్ధతి ప్రకారం వస్తు వినియోగం ద్వారా వచ్చే ప్రయోజనాన్ని "యుటిల్స్' అనే ఊహాత్మక యూనిట్ల ద్వారా కొలవవచ్చు. 1,2,3,4 మొదలైనవి కార్డినల్ సంఖ్యలు. ఈ పద్ధతి ప్రకారం వివిధ వస్తువుల నుండి పొందే ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవడానికి, పోల్చడానికి వీలవుతుంది.

***2. ఆర్డినల్ ప్రయోజనంను వివరించుము.***

జ: హిక్స్, అలెన్ మొదలైన ఆర్థికవేత్తలు ఆర్డినల్ ప్రయోజన విశ్లేషణను సమర్థించారు. ఈ విశ్లేషణ ద్వారా ప్రయోజనాన్ని కొలవలేము కాని పోల్చగలం. ఉదాహరణకు అరటిపండుకంటే యాపిల్ ద్వారా ఎక్కువ ప్రయోజనం లభించిందని చెప్పవచ్చు. ఉదాసీనతా వక్రరేఖల విశ్లేషణ ఆర్డినల్ ప్రయోజన విశ్లేషణపై ఆధారపడి రూపొందించబడింది.

***3. మొత్తం ప్రయోజనంను వివరించుము.***

జ: ఈ సూత్రాన్ని అధ్యయనం చేయటానికి మొత్తం ప్రయోజనం, ఉపాంత ప్రయోజనం భావనలను గురించి సమగ్రంగా తెలుసుకోవాలి. వినియోగదారుడు మొత్తం వస్తువుల నుంచి పొందగలిగే మొత్తం సంతృప్తిని మొత్తం ప్రయోజనం అంటారు. ఉదా॥ కు ఒక వ్యక్తి మూడు యాపిల్ పండ్లను వినియోగించాడు అనుకుందాం. మొదటి యాపిల్ నుండి 20 యుటిల్స్, రెండవ పండు నుండి 15 యుటిల్స్, మూడవ పండు నుండి 10 యుటిల్స్ ప్రయోజనం పొందితే, 20+15+10= 45 యుటిల్స్ మొత్తం ప్రయోజనం.

***4. ఉపాంత ప్రయోజనంను వివరించుము.***

జ: ఉపాంత ప్రయోజనం అనగా అదనపు ప్రయోజనం – ఇంతకుముందు ఉదా॥ ను తీసుకున్నట్లయితే 3 యాపిల్స్ వినియోగం ద్వారా వచ్చిన ప్రయోజనం 45 యుటిల్స్ – 4 పండ్లను వినియోగిస్తే వచ్చే ప్రయోజనం 50 యుటిల్స్. ఉపాంత ప్రయోజనం 50–45 = 05 యుటిల్స్.

దీనినే కింది విధంగా చెప్పవచ్చు.

$$MUn = TUn - TUn\text{-}1$$

***5. వినియోగదారుని సమతౌల్యంను గురించి వివరించుము.***

జ: సమోపాంత ప్రయోజన సూత్రం వినియోగదారుని సమతౌల్యాన్ని వివరిస్తుంది. ఈ సూత్రం ప్రకారం, ద్రవ్యం ఉపాంత ప్రయోజనం, అన్నీ ఉపయోగాలలోనూ సమానం అయినప్పుడు వినియోగదారుడు సమతౌల్య స్థితిని చేరుతాడు.

వినియోగదారుని సమతౌల్యానికి కావలసిన నిబంధనను ఈ విధంగా చెప్పవచ్చు.

$$\frac{MU_A}{P_A} = \frac{MU_B}{P_B} = \frac{MU_N}{P_N}$$

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

**1. *క్షీణోపాంత ప్రయోజన సూత్రాన్ని వివరించి, దాని పరిమితులు, ప్రాముఖ్యత తెలియజేయుము.***

జ: క్షీణోపాంత ప్రయోజన సూత్రాన్ని మొదటిసారిగా H.H గాసెన్ అనే జర్మన్ ఇంజనీరు తెలియజేయగా, మార్షల్ దానిని అభివృద్ధి పరచాడు. వస్తుపరిమాణానికీ, దాని నుండి లభించే ప్రయోజనానికి మధ్య గల సంబంధాన్ని ఈ సూత్రం వివరిస్తుంది.

**సూత్రం – నిర్వచనం :** "ఇతర వస్తువులను స్థిరంగా ఉంచి ఒక వినియోగదారుడు ఏ వస్తువునైనా అధికంగా వినియోగిస్తూ పోతే ఆ వస్తువు యొక్క ఉపాంత ప్రయోజనం క్షీణిస్తుంది" కె.ఇ. బోల్డింగ్. సాధారణంగా మనకు కలిగే అనుభవం ఏమిటంటే ఒక వస్తువును అదే పనిగా వినియోగిస్తూ పోతే అదనపు యూనిట్ల నుంచి అతడు పొందే అదనపు ప్రయోజనం క్రమంగా క్షీణిస్తుంది. ఉదా॥ కు ఒక వ్యక్తికి యాపిల్ అంటే చాల ఇష్టమని అనుకుందాం. మొదటి యాపిల్‌ను వినియోగదారుడు వినియోగించినప్పుడు చాలా ఎక్కువ ప్రయోజనం పొందుతాడు. కాని రెండవ, మూడవ యాపిల్‌ను వినియోగిస్తూ పోతే తరువాత యాపిల్ నుంచి అతడు పొందే ప్రయోజనం తగ్గుతుంది. ఒక దశ దాటిన తరువాత అతడు అదనపు యాపిల్‌ను వినియోగించినట్లయితే అతనికి యాపిల్. ఆ వస్తువుల నుంచి వచ్చే అదనపు ప్రయోజనం తగ్గును.

**ప్రమేయాలు**

క్షీణోపాంత ప్రయోజన సూత్రం యొక్క ముఖ్యమైన ప్రమేయాలు

1. ప్రయోజనాన్ని సంఖ్యాత్మకంగా కొలవవచ్చు.
2. వినియోగ దారుడు హేతుబద్ధంగా ప్రవర్తిస్తాడు..
3. వినియోగదారుని అభిరుచులు అలవాట్లు ప్రాధాన్యతలు స్థిరంగా ఉంటాయి.
4. వస్తువు యొక్క అన్నీ యూనిట్లు పరిమాణంలోనూ, రుచిలోనూ ఒకే విధంగా ఉంటాయి.

**మొత్తం ప్రయోజనం, ఉపాంత ప్రయోజనం [Total utility and Marginal utility]**

**మొత్తం ప్రయోజనం :**

ఈ సూత్రాన్ని అధ్యయనం చేయటానికి మొత్తం ప్రయోజనం, ఉపాంత ప్రయోజనం భావనలను గురించి సమగ్రంగా తెలుసుకోవాలి. వినియోగదారుడు మొత్తం వస్తువుల నుంచి పొందగలిగే మొత్తం సంతృప్తిని మొత్తం ప్రయోజనం అంటారు. ఉదా॥ కు ఒక వ్యక్తి మూడు యాపిల్ పండ్లను వినియోగించాడు అనుకుందాం. మొదటి యాపిల్ నుండి 20 యుటిల్స్, రెండవ పండు నుండి 15 యుటిల్స్, మూడవ పండు నుండి 10 యుటిల్స్ ప్రయోజనం పొందితే, 20+15+10= 45 యుటిల్స్ మొత్తం ప్రయోజనం.

$TU_n = f(Qn)$

ఇక్కడ $TU_n$ = n వస్తువుల యొక్క మొత్తం ప్రయోజనం

$f$ = ప్రమేయ సంబంధం

$Q_n$ = n - వస్తువు పరిమాణం

$f$ = ప్రమేయ సంబంధం

**ఉపాంత ప్రయోజనం [Marginal Utility]**

ఉపాంత ప్రయోజనం అనగా అదనపు ప్రయోజనం – ఇంతకుముందు ఉదా॥ ను తీసుకున్నట్లయితే 3 యాపిల్స్ వినియోగం ద్వారా వచ్చిన ప్రయోజనం 45 యుటిల్స్ – 4 పండ్లను వినియోగిస్తే వచ్చే ప్రయోజనం 50 యుటిల్స్. ఉపాంత ప్రయోజనం 50–45 = 05 యుటిల్స్.

దీనినే కింది విధంగా చెప్పవచ్చు.

$MUn^{th} = TUn - TUn\text{-}1$

ఇక్కడ n – సంఖ్యను తెలియజేస్తుంది.

MUn = nవ యూనిట్ ఉపాంత ప్రయోజనం

TUn = n యూనిట్ల మొత్తం ప్రయోజనం

TUn-1 = (n-1) యూనిట్ c మొత్తం ప్రయోజనం

ఈ సూత్రాన్ని ఈ క్రింది పట్టిక, పటముల సహాయంతో వివరించవచ్చు.

**పట్టిక దాని వివరణ**

| వస్తురాశి(యాపిల్స్) | మొత్తం ప్రయోజనం (యుటిల్స్) | | ఉపాంత ప్రయోజనం (యుటిల్స్) | |
|---|---|---|---|---|
| 1 | 20 | | 20 | |
| 2. | 35 | పెరుగుతుంది | 15 | ధనాత్మకం |
| 3. | 45 | | 10 | |
| 4. | 50 | | 05 | |
| 5. | 50 | గరిష్టం | 0 సున్నాకి సమానం | |
| 6. | 45 | | – 5 | |
| 7. | 35 | తగ్గుతుంది | – 10 | ఋణాత్మకం |

పై పట్టిక సహాయంతో మొత్తం, ఉపాంత ప్రయోజనాల మధ్య సంబంధాన్ని ఇలా వివరించవచ్చు.

A) ఉపాంత ప్రయోజనం ధనాత్మకంగా ఉండి తగ్గుతున్నప్పుడు, మొత్తం ప్రయోజనంలో పెరుగుదల ఉపాంత ప్రయోజనంలో తగ్గుదలకు సమానంగా ఉండును.

B) ఉపాంత ప్రయోజనం సున్నాకి సమానంగా ఉన్నప్పుడు మొత్తం ప్రయోజనం గరిష్టమవుతుంది.

C) ఉపాంత ప్రయోజనం ఋణాత్మకమైనప్పుడు, మొత్తం ప్రయోజనం తగ్గుతుంది.




పై పటంలో మొత్తం ప్రయోజనాన్ని, ఉపాంత ప్రయోజనాన్ని చూపుతున్నాయి. ఉపాంత ప్రయోజనం శూన్యం అయినప్పుడు మొత్తం ప్రయోజనం గరిష్టం.

**సూత్రం – పరిమితులు (Limitations of the law)**

ఈ సూత్రానికి ఈ క్రింది పరిమితులున్నవి. అవి :

1. ఈ సూత్రం అవాస్తవిక ప్రమేయాలపై ఆధారపడి ఉన్నది.
2. అవిభాజ్య వస్తువులు, మన్నికగల వస్తువుల విషయంలో ఈ సూత్రం వర్తించదు.
3. వినియోగ దారుడు ఎల్లప్పుడూ హేతుబద్ధంగా వ్యవహరించకపోవచ్చు.
4. పిసినారి వ్యక్తులు, త్రాగుబోతుల విషయంలో ఇది వర్తించదు.
5. స్టాంపులు, నాణేల సేకరణ వంటి హాబీలు ఈ సూత్రానికి మినహాయింపులు.

**ప్రాధాన్యత (Importance of the law)**

ఈ సూత్రం ఉపయోగితా విలువ, వినిమయ విలువల మధ్య తేడాలను తెలియజేస్తుంది.

1. పన్ను విధానాలను రూపొందించుటలో ఈ సూత్రం ప్రభుత్వానికి సహాయపడుతుంది.
2. క్షీణోపాంత ప్రయోజన సూత్రం డిమాండ్ సూత్రానికి ప్రాతిపదిక.
3. ఆదాయ, సంపద పంపిణీలో కూడా ఈ సూత్రం ముఖ్య పాత్ర వహిస్తుంది.

***2. వినియోగదారుని సమతౌల్యం అనగానేమి? సమోపాంత ప్రయోజన సూత్రాన్ని వివరించి, దాని ప్రాముఖ్యతను తెలియజేయుము.***

జ: సమోపాంత ప్రయోజన సూత్రాన్ని మరొక వినియోగ సూత్రంగా చెప్పవచ్చు. ఈ సూత్రానికే మరో పేరు 'గరిష్ట ప్రయోజన సూత్రం', క్షీణోపాంత ప్రయోజన సూత్రం, ఒక వస్తువు వినియోగంలో వినియోగదారుని ప్రవర్తనను అధ్యయనం చేస్తుంది. కాని వాస్తవంలో వ్యక్తులకు అనేక కోరికలు ఉంటాయి. వాటిని అనేక వస్తువుల సహాయంతో తీర్చుకుంటాడు. ఈ సందర్భంలో వినియోగదారుడు తన పరిమిత ఆదాయంతో గరిష్ట సంతృప్తిని ఏ విధంగా పొందుతాడో సమోపాంత ప్రయోజన సూత్రం వివరిస్తుంది.

**సూత్రం – నిర్వచనం**

మార్షల్ మాటల్లో చెప్పాలంటే, "ఒక వ్యక్తి వద్ద ఉన్న ఒక వస్తువుకు అనేక ఉపయోగాలున్నప్పుడు అతను ప్రతి ఉపయోగం నుంచి వచ్చే ఉపాంత ప్రయోజనం సమానంగా ఉండేట్లు, ఆ వస్తువును వినియోగించటం జరుగుతుంది. వినియోగదారుడు వస్తుసేవలను కొనుగోలు చేసేటప్పుడు ప్రతిస్థాపక సూత్రాన్ని అనుసరించటం ద్వారా వివిధ వస్తువుల నుంచి పొందే ఉపాంత ప్రయోజనం ఎప్పుడూ సమానమయ్యేట్లుగా చూసుకుంటాడు. ఉదా॥ కు వినియోగదారుడు తన దగ్గర ఉన్న ద్రవ్యాన్ని అరటిపండు, కేక్ అనే రెండు వస్తువులపై ఖర్చు చేయాలని భావించాడనుకుందాం. కేక్ ధర ఒక రూపాయి అయితే వినియోగదారుడు ఒక కేక్ కొనటం ద్వారా 20 యుటిల్స్ ప్రయోజనం పొందాడు అనుకుందాం. అదే రూపాయిని ఒక అరటి పండు పై ఖర్చు చేయటం వల్ల అతనికి ఎక్కువ ప్రయోజనం వచ్చినట్లయితే అతను కేక్ కు బదులు అరటి పండును ప్రతిస్థాపన చేస్తాడు. వినియోగ దారుడు ఖర్చు చేసే చివరి రూపాయి నుంచి అతను పొందే ఉపాంత ప్రయోజనం రెండు వస్తువులలోను సమానంగా ఉండే వరకు ఈ ప్రక్రియ కొనసాగుతుంది. అప్పుడు వినియోగదారుడు గరిష్ట సంతృప్తిని పొందగలుగుతాము. అందువల్లనే ఈ సూత్రాన్ని 'ప్రతిస్థాపన సూత్రం" అని కూడా అంటారు.

**వినియోగదారుని సమతౌల్యం (Consumer's equilibrium)**

సమోపాంత ప్రయోజన సూత్రం వినియోగదారుని సమతౌల్యాన్ని వివరిస్తుంది. ఈ సూత్రం ప్రకారం, ద్రవ్యం ఉపాంత ప్రయోజనం, అన్నీ ఉపయోగాలలోనూ సమానం అయినప్పుడు వినియోగదారుడు సమతౌల్య స్థితిని చేరుతాడు.

వినియోగదారుని సమతౌల్యానికి కావలసిన నిబంధనను ఈ విధంగా చెప్పవచ్చు.

$$\frac{MU_A}{P_A} = \frac{MU_B}{P_B} = \frac{MU_N}{P_N}$$

ఇక్కడ $MU_A$ = A వస్తువు ఉపాంత ప్రయోజనం

$P_A$ = A వస్తువు ధర

$MU_B$ = B వస్తువు ఉపాంత ప్రయోజనం

$P_B$ = B వస్తువు ధర

$MU_n$ = n వస్తువు ఉపాంత ప్రయోజనం

$P_n$ = n వస్తువు ధర

**ప్రమేయాలు [Assumptions of the Law]**

1. ప్రయోజనాన్ని సంఖ్యారూపంలో కొలవ వచ్చు.
2. వినియోగదారుడు హేతుబద్ధంగా వ్యవహరిస్తాడు.
3. ద్రవ్యం ఉపాంత ప్రయోజనం స్థిరంగా ఉంటుంది.
4. వస్తువుల ధరలు స్థిరంగా ఉంటాయి.

**సూత్రానికి వివరణ [Explanation of the Law]**

ఈ సూత్రానికి పట్టిక, పటం సహాయంతో వివరించవచ్చు.

పట్టిక - దాని వివరణ

| ద్రవ్యం యూనిట్లు (యుటిల్స్‌లో) | ఉపాంత ప్రయోజనం A (యుటిల్స్ లో) | ఉపాంత ప్రయోజనం B |
|---|---|---|
| 1 | 15 (1వ) | 14 (3వ) |
| 2 | 14 (2వ) | 13 (5వ) |
| 3 | 13 (4వ) | 12 |
| 4 | 12 | 11 |
| 5 | 11 | 10 |
| మొత్తం ప్రయోజనం | **65** | **60** |

పట్టికలో చూపిన దాన్ని బట్టి వినియోగదారుడు 3 రూ॥ లకు 'A' వస్తువు మీద, 2 రూ॥ లకు 'B' వస్తువు మీద ఖర్చు చేస్తాడు. 'A' వస్తువు పై 3రూ॥ లు ఖర్చు చేయటం ద్వారా 42 యూనిట్లు, 'B' వస్తువు పై 2 రూ॥ లు ఖర్చు చేయటం ద్వారా 27 యూనిట్లు ప్రయోజనం పొందగలుగుతున్నాడు. కనుక 'A' మరియు 'B' వస్తువులపై 5 రూ॥ లను ఖర్చు పెట్టటం ద్వారా అతను పొందే మొత్తం ప్రయోజనం 42+27 = 69 యూనిట్లు. ఈ విధంగా 3 రూ॥లు 'A' పైన, 2 రూ॥ లు 'B' పై ఖర్చు చేయటం ద్వారా రెండు వస్తువుల విషయంలో ఉపాంత ప్రయోజనం సమానం అవుతుంది.

కనుక

**పటము - వివరణ**







పై పటంలో 'AA' రేఖ A వస్తువు ఉపాంత ప్రయోజన రేఖ. BB రేఖ B వస్తువు ఉపాంత ప్రయోజన రేఖ. A వస్తువు పై 3 రూపాయలు, B వస్తువుపై 2 రూ॥ లు ఖర్చు పెట్టడం ద్వారా రెండు వస్తువుల నుండి వినియోగదారుడు పొందే ఉపాంత ప్రయోజనం సమానం, అది 13 యూనిట్లు.

## సూత్రానికి గల పరిమితులు

ఈ సూత్రానికి కొన్ని పరిమితులు కలవు. అవి ః

1. అవిభాజ్య వస్తువుల విషయంలో ఈ సూత్రం వర్తించదు.
2. ఈ సూత్రం కొన్ని అవాస్తవ ప్రమేయాలపై ఆధారపడి ఉంది
3. వినియోగదారునికి వివిధ విషయాలలో అవగాహన లేనప్పుడు ఈ సూత్రం వర్తించదు.
4. వాస్తవానికి ద్రవ్యం ఉపాంత ప్రయోజనం స్థిరంగా ఉండదు.

## సూత్రం - ప్రాధాన్యత

1. వినియోగ దారుని వ్యయానికి ఈ సూత్రం ఆధారం
2. ఉత్పత్తి సిద్ధాంతంలో కూడా ఇది ఉపయోగపడుతుంది.
3. వినిమయం పంపిణీలో కూడా ఈ సూత్రం ఇమిడి ఉంటుంది.
4. ప్రభుత్వ విత్త విధానంలో కూడా ఈ సూత్రం వర్తిస్తుంది.

# 19

# ఉదాసీనతా వక్రరేఖల విశ్లేషణ

# [Indifference Curve Analysis]

## 19.1 పరిచయం

మార్షల్ ప్రతిపాదించిన కార్డినల్ ప్రయోజన విశ్లేషణలో ప్రధానమైన లోపం ప్రయోజనాన్ని సంఖ్యాత్మకంగా కొలవగలమనే ప్రమేయం. అయితే సంఖ్యాత్మకంగా ప్రయోజనాన్ని చెప్పగలగడం, దానిని కొలవగలగడం ( యూనిట్లలో) సాధ్యం కాదు. ఒక వినియోగదారుడు తాను వినియోగించే వస్తువుల స్థూల ర్యాంకును కొలచి అతడు ఎంత ప్రయోజనాన్ని పొందాడో చెప్పలేము. సాధారణంగా రెండు స్థానాల మధ్య దూరాన్ని లేదా వస్తువుల బరువును మాత్రమే కొలవగలం కార్డినల్ పద్ధతిలో కొలత సాధ్యం కానప్పుడు, ఆర్డినల్ ర్యాంకింగ్ సాధ్యమగును. కార్డినల్ విశ్లేషణలోని లోపాలను తొలగిస్తూ ఆర్థికవేత్తలు ఆర్డినల్ విశ్లేషణ సహాయంతో డిమాండ్ సిద్ధాంతాన్ని వివరించారు. దీనినే ఉదాసీనత వక్రరేఖల విశ్లేషణ అంటారు.

రష్యన్ ఆర్థిక వేత్త స్లట్స్కి (Slutsky) 1915 వ సంవత్సరంలో మొదటి సారిగా డిమాండ్ సూత్రాన్ని ఈ ఆర్డినల్ సహాయంతో పరిశీలించాడు. మొదటిసారిగా ఉదాసీనతా వక్రరేఖల విధానాన్ని తెలియచేసింది ఎడ్జ్‌వర్త్ [Edgeworth] అనే ఆర్థిక వేత్త.

ఆ తరువాత 1928 వ సం॥లో జె.ఆర్. హిక్స్ (J.R. Hicks), R.J.D. ఎలెన్ అను ఆర్థిక వేత్తలు కార్డినల్ విశ్లేషణ పై విమర్శలు సంధించారు. వారు దీనికి ప్రతిగా ఆర్డినల్ విశ్లేషణ సహాయంతో ఈ ఉదాసీనతా వక్రరేఖల భావాన్ని వివరించారు.

## 19.2 లక్ష్యాలు

- ఉదాసీనతా వక్రరేఖల అర్థాన్ని వివరించుట.
- ఉదాసీనతా వక్రరేఖల ప్రమేయాలు వివరించుట.
- ఉదాసీనతా పట్టికను ఉదాసీనతా వక్రరేఖను రాబట్టుట.
- ఉపాంత ప్రతిస్థాపనోపాంతరేటు భావన వివరణ.
- ధరల రేఖను వివరించుట.
- వినియోగదారుని సమతౌల్య వివరణ.
- ఉదాసీనతా వక్రరేఖల ప్రాముఖ్యతను వివరించుట.
- ఉదాసీనతా వక్రరేఖల లోపాలను పరిశీలించుట.

## 19.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. ఆర్డినల్ విశ్లేషణ?***

జ: ఆర్డినల్ విశ్లేషణ ప్రయోజనాన్ని పోల్చగలమేగానీ, కొలవలేము అనే ప్రమేయాన్ని చేస్తుంది.

***2. వినియోగదారుని అభిరుచి తరహా ఆధారంగా ఏది రాబట్టబడుతుంది?***

జ: వినియోగదారుని అభిరుచి తరహా ఆధారంగా ఉదాసీనతా వక్రరేఖ రాబట్టబడుతుంది.

***3. వినియోగదారునికి సమాన సంతృప్తినిచ్చే రెండు వస్తువుల వివిధ సముదాయాలను పట్టిక తెలియజేస్తుంది.***

జ: వినియోగదారునికి సమాన సంతృప్తినిచ్చే రెండు వస్తువుల వివిధ సముదాయాలను ఉదాసీనతా పట్టిక తెలియజేస్తుంది.

***4. ఉపాంత ప్రతిస్థాపనోపాంత రేటు వివరించేది?***

జ: అదనంగా మరో వస్తువుని పొందటానికి వినియోగదారుడు ఒక వస్తువుని ఏ రేటులో ప్రతిస్థాపన చేస్తాడో ఉపాంత ప్రతిస్థాపనోపాంత రేటు వివరిస్తుంది.

***5. ధరల రేఖ వివరించేది?***

జ: రెండు వస్తువులను వినియోగదారుడు తన పరిమిత ఆదాయంతో ఎంత మొత్తాలలో కొనుగోలు చేయగలడో ధరల రేఖ వివరిస్తుంది.

***6. ఉదాసీనతా వక్రరేఖ దేనిని తాకినపుడు వినియోగదారుడు సమతౌల్యంగా ఉంటాడు?***

జ: ఉదాసీనతా వక్రరేఖ బడ్జెట్ రేఖను తాకినపుడు వినియోగదారుడు సమతౌల్యంగా ఉంటాడు.

వినియోగదారుని సమతౌల్యం వద్ద,

$$MRS_{xy} = \frac{Px}{Py}$$

### రెండు మార్కుల ప్రశ్నలు

***1. ఉపాంత ప్రతిస్థానోపాంత రేటు అనగా నేమి?***

జ: "అదనంగా మరో వస్తువును పొందడానికి ఒక వస్తువును వినియోగదారుడు ఏ రేటులో కోల్పోతాడో" దానిని ఉపాంత ప్రతిస్థాపనోపాంత రేటు అంటారు. అంటే, అదనంగా ఒక చాక్లెట్ ను పొందడానికి ఎన్ని బిస్కట్లను వినియోగదారుడు కోల్పోతాడో ఇది వివరిస్తుంది. మనం పట్టికలో MRS క్రమంగా క్షీణించడం గమనించవచ్చు. దీనిని, ఈ క్రింది సమీకరణం ద్వారా వ్రాయవచ్చు.

$$MRS_{xy} = \frac{\text{y లో మార్పు}}{\text{x లో మార్పు}} = \frac{\Delta y}{\Delta x}$$

***2. ధర రేఖ లేదా బడ్జెట్ రేఖ వివరించుము.***

జ: వినియోగదారుడు ఎల్లప్పుడూ, ఎగువ స్థాయి ఉదాసీనతా వక్రరేఖను కోరుకుంటాడని ఉదాసీనతా వక్రరేఖ లక్షణాలలో తెలుసుకున్నాము. అయితే వస్తువులు ఉచితంగా లభించవు. వాటికి ధరలను చెల్లించవలసి ఉంటుంది. అయితే అతని ఆదాయం పరిమితం. అందువల్లనే మనం బడ్జెట్ రేఖ భావనను పరిశీలించాలి. వినియోగదారుడు తన పరిమిత ఆదాయంతో, ఇవ్వబడిన ధరల వద్ద రెండు వస్తువులను ఎన్ని సముదాయాలలో కొనగలడో బడ్జెట్ రేఖ తెలియజేస్తుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. ఉదాసీనతా వక్రరేఖల ప్రమేయాలను వ్రాయుము.***

జ: ఉదాసీనతా వక్రరేఖల విశ్లేషణ ఈ క్రింది ప్రమేయాలపై ఆధారపడి ఉంది.

1. ప్రయోజనం మానసిక భావన కావున కేవలం వినియోగ దారుడే తన అభిరుచి తరహాను వ్యక్తపరచగలడు. అతడు పొందే వస్తు సముదాయాల మొత్తాన్ని ఒక క్రమపద్ధతిలో అమరుస్తాడు. అతడు తన అభిరుచి తరహాను మార్కెట్ ధరలతో సంబంధం లేకుండా తెలియచేస్తాడు.
2. ప్రయోజనం ఆర్డినల్ గా పోల్చవచ్చు. వివిధ సముదాయాల వస్తువుల నుండి లభించే ప్రయోజనాలతో పోల్చవచ్చు. ఒక సముదాయం కంటే మరొక సముదాయాలను వినియోగదారులు ఎగువ స్థాయిలో ఉంచుతారు.
3. వినియోగదారుడు హేతుబద్ధంగా వ్యవహరిస్తాడు. అంటే ఇవ్వబడిన మార్కెట్ ధరలకు, తన పరిమిత ఆదాయాన్ని అధిక ప్రయోజనం వచ్చే విధంగా చూస్తాడు.
4. వినియోగదారుని వద్ద మార్కెట్ ధరల పూర్తి సమాచారం ఉంటుందనేది మరో ప్రమేయం.
5. ఉదాసీనతా వక్ర రేఖలు మూలబిందువుకు కుంభాకారంగా ఉంటాయి. అంటే, ఉపాంత ప్రతిస్థాపనకు ఉపాంత రేటు క్రమంగా క్షీణిస్తుంది.
6. ఇవ్వబడిన ఏ రెండు వస్తువుల యొక్క వివిధ సముదాయాలను (ఉదా॥ కు ఎ,బి) వినియోగదారుడు పోల్చగలుగుతాడు.
7. వినియోగదారుని అభిరుచులు, అలవాట్లు, ఆదాయం, స్థిరంగా ఉంటాయి.
8. వినియోగదారుని ఎంపిక పారదర్శకంగా, సకర్మతాధర్మ లక్షణాన్ని కలిగి ఉంటాయి.
9. ఎంపికలో బలహీనత మరో ప్రమేయం. అంటే రెండు సముదాయాల ఎంపికలో వినియోగ దారుడు ఉదాసీనంగా వ్యవహరిస్తాడు.

***2. ఉదాసీనతా వక్రరేఖల లక్షణాలు ఏమిటి?***

జ: ఉదాసీనతా వక్రరేఖలు కొన్ని నిర్ధిష్టమైన లక్షణాలను కలిగి ఉన్నాయి. అవి :

1. ఉదాసీనతా వక్రరేఖలు ఎడమ నుండి కుడికి క్రిందకు వాలి, మూలబిందువుకు కుంభాకారంగా ఉంటాయి.
2. ఎగువస్థాయి ఉదాసీనతా వక్రరేఖలు అధిక ప్రయోజనాన్ని సూచిస్తాయి.
3. ఏ రెండు ఉదాసీనతా వక్రరేఖలు ఖండించుకోవు.
4. ఉదాసీనతా వక్రరేఖలు ఏ అక్షాన్నీ తాకవు.
5. ప్రత్యామ్నాయ వస్తువుల విషయాలలో ఉదాసీనతా వక్రరేఖ సరళరేఖ గానూ, పూరక వస్తువుల ఉదాసీనతా వక్రరేఖ 'L' ఆకారంగానూ ఉంటాయి.
6. ఉదాసీనతా వక్రరేఖ ఆవరణ మొత్తానికీ వ్యాపిస్తుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఉదాసీనతా వక్రరేఖల సహాయంతో వినియోగదారు సమతౌల్యాన్ని వివరింపుము.***

జ: ఇప్పుడు మనం ఆర్డినల్ ప్రయోజన విశ్లేషణ ద్వారా ఒక వినియోగదారుడు ఎలా సమతౌల్యాన్ని సాధిస్తాడో ఉదాసీనతా వక్రరేఖ, బడ్జెట్ రేఖల సహాయంతో చూద్దాం. వినియోగదారుడు తన ఆదాయంతో, రెండు వస్తువుల ధరల వద్ద, ఎక్కడైతే గరిష్ట ప్రయోజనాన్ని పొందుతాడో అక్కడ సమతౌల్యం లో ఉంటాడు. అంటే, ఎక్కడైతే బడ్జెట్ రేఖ ఉదాసీనతా వక్రరేఖను తాకుతుందో అక్కడ సమతౌల్యంలో ఉంటాడు.

### ప్రమేయాలు :-

1. వినియోగదారుడు రెండు వస్తువులు (బి మరియు సి) లను పొందగోరే వివిధ సముదాయాలతో ఉదాసీనతా వక్రరేఖను కలిగి ఉంటాడు. అతని ఎంపిక తీరు స్థిరంగా ఉంటుంది.
2. బి మరియు సి, రెండు వస్తువుల ధరలు ఇవ్వబడి ఉంటాయి. అవి స్థిరంగా ఉంటాయి.
3. అన్నీ వస్తువులు సజాతీయాలు మరియు విభజించే వీలు ఉంటుంది.
4. వినియోగ దారుడు వ్యయం చేయడానికి పరిమిత ఆదాయాన్ని కలిగి ఉంటాడు.
5. వినియోగదారుని అభిరుచులు, అలవాట్లు, కోర్కెలు, ఆదాయాలు స్థిరంగా ఉంటాయి.
6. వినియోగదారుడు ప్రయోజన గరిష్టీకరణకు ప్రయత్నిస్తూ, హేతుబద్ధంగా ఉంటాడు.

### వినియోగదారు సమతౌల్య వివరణ [Illustration of Consumer's equilibrium]

మనకు వినియోగదారుని ఉదాసీనతా వక్రరేఖ మరియు బడ్జెట్ రేఖలు తెలిసినట్లయితే వినియోగదారుని సమతౌల్యాన్ని పొందవచ్చు. ఈ సమతౌల్య స్థితిని క్రింది విధంగా, నిర్వచించవచ్చు "ఇతర పరిస్థితులన్నీ స్థిరంగా ఉన్నప్పుడు వినియోగదారుడు మారడానికి ఇష్టపడని స్థితి". ఎక్కడయితే ఉదాసీనతా వక్రరేఖ బడ్జెట్ రేఖను తాకుతుందో అక్కడ ఈ స్థితి వస్తుంది. ఈ సమతౌల్య స్థితి వద్ద ఉపాంత ప్రతిస్థాపనోపాంతరేటు రెండు వస్తువుల ధరల నిష్పత్తికి సమానంగా ఉంటుంది. కాబట్టి బిందువు E వద్ద,

$$MRS_{BC} = \frac{P_B}{P_C}$$




పై పటం – 3.6 నందు బిస్కెట్లను X – అక్షంపైనా, చాక్లెట్లను Y – అక్షంపైనా తీసుకున్నాము. వినియోగదారుడు BC బడ్జెట్ రేఖకు $IC_2$ ఉదాసీనతా వక్రరేఖ తాకిన చోట బిందువు వద్ద E సమతౌల్యంలో ఉన్నాడు. వినియోగదారుడు తన వినియోగాన్ని IC పై బిందువు A వద్దగానీ, B వద్ద కానీ ఆపడు. కారణం బిందువు E వద్ద ఎక్కువ ప్రయోజనాన్ని $IC_2$ సూచిస్తుంది. అదేవిధంగా తన పరిమిత ఆదాయంతో $IC_3$ ను చేరలేడు. కాబట్టి బిందువు E వద్ద స్థిరత్వ స్థాయిలో ఉండి సమతౌల్యాన్ని పొందుతాడు.

# 20

# డిమాండ్ - దానిని ప్రభావితం చేసే అంశాలు

## 20.1 పరిచయం

అర్ధశాస్త్రంలో డిమాండ్‌కు ఎంతో ప్రాముఖ్యత కలదు. తమ కోరికలను తీర్చుకోవడానికి వినియోగ దారులు, ఉత్పత్తి చేయుటకు ఉత్పత్తి దారులు వస్తు, సేవలను కోరుకుంటారు. ఈ పాఠ్యభాగంలో డిమాండ్ యొక్క అర్ధం, దానిని ప్రభావితం చేసే అంశాలను గూర్చి తెలుసుకుంటారు.

## 20.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- డిమాండ్ – దాని అర్థం – రకాలు
- కోరిక, డిమాండ్‌ల మధ్య గల తేడాలు
- డిమాండ్‌ను ప్రభావితం చేసే అంశాలు
- వినియోగదారుని డిమాండ్‌ను ధర ఎలా ప్రభావితం చేస్తుంది.
- డిమాండ్ సూత్రం – మినహాయింపులు
- డిమాండ్‌ను ప్రభావితం చేసే ఇతర అంశాలు
- డిమాండ్ పరిమాణంలో మార్పు, డిమాండ్‌లో మార్పు

## 20.3 ప్రశ్నలు – సమాధానాలు

### రెండు మార్కుల ప్రశ్నలు

**1. *వ్యక్తిగత డిమాండ్ అనగానేమి?***

జ. అర్థశాస్త్రంలో డిమాండ్ అనే పదానికి ప్రత్యేకమైన అర్థం ఉంది. వివిధ ధరల వద్ద వినియోగదారుడు ఎంత పరిమాణంలో వస్తువును కొనుగోలు చేయటానికి ఇష్టపడుతున్నాడో తెలిపేదే వ్యక్తిగత డిమాండ్. నిర్ణీత కాలంలో ఒకానొక ధర వద్ద ఒక వ్యక్తి, వస్తువును ఎంత పరిణామంలో కొంటాడో, దానినే ఆ వస్తు డిమాండ్ అంటారు. డిమాండ్ అనేది – (ఎ) నిర్ణీత కాలానికి (బి) ధరకు (సి) పరిమాణానికి చెందినది.

**2. *మార్కెట్ డిమాండ్ అనగానేమి?***

జ. మార్కెట్‌లో అనేకమంది వినియోగదారులుంటారు. వినియోగ దారులందరూ వివిధ ధరల వద్ద కొనుగోలు చేసిన వస్తు పరిమాణాన్ని మార్కెట్ డిమాండ్ అంటారు.

**3. ప్రత్యామ్నాయ ప్రభావం అనగానేమి?**

జ. ఒక వస్తువుకు అనేక ప్రత్యామ్నాయ వస్తువులుండవచ్చు. ఉదాహరణకు కాఫీకి, టీ ప్రత్యామ్నాయ వస్తువు. 'టీ' ధర స్థిరంగా ఉండి, కాఫీ ధర పెరిగితే కొనుగోలు దారుడు కాఫీకి బదులు టీ కొంటాడు. అనగా ప్రత్యామ్నాయ వస్తు లభ్యత వల్ల వస్తువు ధర పెరిగితే దాని డిమాండ్ తగ్గి ఈ వస్తువు డిమాండ్ పెరుగుతుంది.

**4. డిమాండ్ సూత్రంను వివరింపుము.**

జ. వస్తు ధరలోని మార్పులు, డిమాండ్ పరిమాణంపై ఏర్పరచే ప్రభావాన్ని సిద్ధాంత రూపంలో చెప్పేదానినే డిమాండ్ సూత్రం అంటారు. మిగతా పరిస్థితులు స్థిరంగా ఉన్నప్పుడు, ఒక వస్తుధర పెరిగితే, దాని డిమాండ్ తగ్గుతుంది. ధర తగ్గితే డిమాండ్ పెరుగుతుంది.

**5. గౌరవ సూచక వస్తువులు**

జ. ధనవంతులు, వజ్రాలు, విలాసవంతమైన కార్లు కలిగి ఉండటం ప్రతిష్టగా భావిస్తారు. ఈ వస్తువుల నుండి పొందే గౌరవం వాటి ధరపై ఆధారపడి ఉంటుంది. వజ్రాల ధర పెరిగితే ఇంకా ఎక్కువ కొంటారు. అలానే వజ్రాల ధర తగ్గితే వాటి వల్ల వచ్చే ప్రతిష్ట తగ్గుతుందని భావించి వాటిని తక్కువగా కొంటారు. వీటి విషయంలో ధరకు, డిమాండ్‌కు విలోమ సంబంధం కాక ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. కనుక ఇది డిమాండ్ సూత్రానికి మినహాయింపు.

**6. గిఫెన్ వస్తువులు**

జ. 19వ శతాబ్దం ప్రారంభంలో బ్రిటన్‌లో రొట్టె ధర పెరిగినప్పుడు శ్రామికులు ఎక్కువ రొట్టెలు కొనటాన్ని బ్రిటిష్ ఆర్థికవేత్త అయిన రాబర్ట్ గిఫెన్ గమనించాడు. దీని ప్రకారం నిత్యావసర వస్తువుల ధర పెరిగితే ప్రజలు ఇతరత్రా ఖర్చు తగ్గించుకుని వీటిని మరింత కొనుగోలు చేస్తారు. అంటే ప్రధాన ఆహార వస్తువుల ధర పెరిగినా వాటి డిమాండ్ తగ్గదు. దీనిని గిఫెన్ ప్రతిపాదించాడు. కాబట్టి వీటిని గిఫెన్ వస్తువులు అందురు. వీటి విషయంలో డిమాండ్ సూత్రం వర్తించదు.

**7. డిమాండ్‌లో విస్తరణ**

**జ.** డిమాండ్‌లో విస్తరణకు, డిమాండ్‌లో పెరుగుదలకు మధ్య తేడా ఉంది. డిమాండ్‌లో పెరుగుదల అనగా మిగతా పరిస్థితులు స్థిరంగా ఉండగా, ధర తగ్గడం వల్ల డిమాండ్ పరిమాణంతో వచ్చేది. వస్తుధర స్థిరంగా ఉండగా మిగతా అంశాలలో వచ్చిన మార్పు వల్ల డిమాండ్‌లో సంభవించే దానిని డిమాండ్ విస్తరణ అని చెప్పవచ్చు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. వస్తు ధరకు, డిమాండ్ పరిమాణానికి గల సంబంధాన్ని వివరించుము. ఊహా జనితమైన డిమాండ్ పట్టిక ఆధారంగా డిమాండ్ రేఖను గీయుము.***

**జ:** అర్థశాస్త్రంలో డిమాండ్ అనగా కేవలం ఒక వస్తువు కావాలనే కోరిక మాత్రమే కాదు. ఉదాహరణకు ఒక వ్యక్తికి కారు కావాలనే కోరిక ఉన్నంత మాత్రాన అది కారుకుగల డిమాండ్ కాదు. ఒక వస్తువును కొనాలనే కోరికతోపాటు, కొనగల శక్తి కూడా ఉండి, వాస్తవంగా కొంటేనే దానిని అర్థశాస్త్రంలో డిమాండ్ అంటారు.

**వ్యక్తిగత డిమాండ్ పట్టిక**

వివిధ ధరల వద్ద వ్యక్తి యొక్క కొనుగోలు పరిమాణాలను చూపేదే వ్యక్తిగత డిమాండ్ పట్టిక

| పాలధర లీ॥ ఒక్కంటికి (రూ॥లలో) | రోజుకు కొనుగోలు దారుని డిమాండ్ (లీటర్లలో) |
|---|---|
| 12 | 1.0 |
| 10 | 1.5 |
| 8 | 2.0 |
| 6 | 2.5 |
| 4 | 3.0 |

పై పట్టిక పాలధరలో వచ్చిన మార్పుల కారణంగా వ్యక్తి పాల డిమాండ్‌లో వచ్చిన మార్పులను తెల్పుతున్నది. పాల ధర తగ్గితే, పాలకు డిమాండ్ పెరిగింది.

**వ్యక్తిగత డిమాండ్ రేఖ**

వ్యక్తిగత డిమాండ్ పట్టికను గ్రాఫ్ రూపంలో చూపగా వ్యక్తిగత డిమాండ్ రేఖ వచ్చింది.




పాల డిమాండ్ (లీ.లలో)

పటంలోని A,B,C,D,E బిందువులు, వివిధ ధరల వద్ద ఒక వ్యక్తి ఎన్ని పాలు కొనుగోలు చేస్తాడో తెలుపుతాయి. ఈ బిందువులన్నీ కలపగా DD అనే డిమాండ్ రేఖ వస్తుంది. పాలధరకు, డిమాండ్‌కు గల విలోమ సంబంధం కారణంగా, ఈ రేఖ ఎడమ నుండి కుడికి కిందికి వాలుతున్నది.

**మార్కెట్ డిమాండ్ పట్టిక**

బిందువు 'A' చూపిన విధంగా పాలధర లీటరు రూ. 12 ఉన్నప్పుడు రోజుకు డిమాండ్ 1 లీటరు. ధర లీటరు ఒక్కింటికి రూ. 10 అయినప్పుడు బిందువు 'B' చూపిన విధంగా డిమాండ్ 1.5 లీటర్లకు పెరిగింది. కనుక ధరకు డిమాండ్‌కు గల విలోమ సంబంధం వల్లనే డిమాండ్ రేఖ వాలు ఎడమనుండి కుడికి కిందికి వాలుతున్నది.

మార్కెట్‌లో అనేక మంది వినియోగదారులు ఉంటారు. వివిధ వినియోగదారులు, వస్తువు వివిధ ధరల వద్ద ఒక వస్తువును ఎంతెంత పరిమాణంలో కొనుగోలు చేస్తారో తెల్పేదే మార్కెట్ డిమాండ్ పట్టిక. వ్యక్తిగత డిమాండ్ పట్టికల ఆధారంగా మార్కెట్ డిమాండ్ పట్టిక ఏర్పడుతుంది. ఒక ఉదాహరణకు మార్కెట్‌లో A,B,C లు పాలను కొంటున్నారు అనుకుందాం. ఈ ముగ్గురి డిమాండ్ పట్టికలు పట్టికలో పొందుపరచబడ్డాయి.

| పాలధర లీ॥ ఒక్కంటికి (రూ॥లలో) | రోజుకు ఒక్కో కొనుగోలు దారుని డిమాండ్ (లీటర్లలో) | | |
|---|---|---|---|
| | A | B | C |
| (1) | (2) | (3) | (4) |
| 12 | 1.0 | 0.5 | 0.0 |
| 10 | 1.5 | 1.0 | 0.5 |
| 8 | 2.0 | 1.5 | 1.0 |
| 6 | 2.5 | 2.0 | 1.5 |
| 4 | 3.0 | 2.5 | 2.0 |

**మార్కెట్ డిమాండ్ రేఖ**




పాల కొనుగోళ్ళ పరిమాణం

***2. డిమాండ్ సూత్రాన్ని వివరించి, దానికి గల మినహాయింపులను పేర్కొనుము. (8 మార్కుల ప్రశ్న)***

**జ:** వస్తు ధరలోని మార్పులు, డిమాండ్ పరిమాణంపై ఏర్పరచే ప్రభావాన్ని సిద్ధాంత రూపంలో చెప్పేదానినే డిమాండ్ సూత్రం అంటారు.

మిగతా పరిస్థితులు స్థిరంగా ఉన్నప్పుడు, వస్తుధర పెరిగితే, దాని డిమాండ్ తగ్గుతుంది. ధర తగ్గితే డిమాండ్ పెరుగుతుంది. అని డిమాండ్ సూత్రం తెలియజేస్తుంది. ఈ సూత్రానికి పట్టిక రూప వివరణ మార్కెట్ డిమాండ్ పట్టిక ఇవ్వగా, మార్కెట్ డిమాండ్ రేఖ పట రూపమైన వివరణ ఇస్తుంది.

**డిమాండ్ సూత్రానికి గల మినహాయింపులు**

కొన్ని సందర్భాలలో డిమాండ్ సూత్రం వర్తించదు. వాటినే డిమాండ్ సూత్రానికి గల మినహాయింపులు అంటారు అవి –

**1. గౌరవ సూచక వస్తువులు**

ధనవంతులు, వజ్రాలు, విలాసవంతమైన కార్లు కలిగి ఉండటం ప్రతిష్టగా భావిస్తారు. ఈ వస్తువుల నుండి పొందే గౌరవం వాటి ధరపై ఆధారపడి ఉంటుంది. వజ్రాల ధర పెరిగితే ఇంకా ఎక్కువ కొంటారు. అలానే వజ్రాల ధర

తగ్గితే వాటి వల్ల వచ్చే ప్రతిష్ట తగ్గుతుందని భావించి వాటిని తక్కువగా కొంటారు. వీటి విషయంలో విలోమ సంబంధం కాక ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. కనుక ఇది డిమాండ్ సూత్రానికి మినహాయింపు.

**2. గిఫెన్ వస్తువులు**

19వ శతాబ్దం ప్రారంభంలో బ్రిటన్‌లో రొట్టె ధర పెరిగినప్పుడు శ్రామికులు ఎక్కువ రొట్టెలు కొనటాన్ని బ్రిటిష్ ఆర్థికవేత్త అయిన రాబర్ట్ గిఫెన్ గమనించాడు. దీని ప్రకారం నిత్యావసర వస్తువుల ధర పెరిగితే ప్రజలు ఇతరత్రా ఖర్చు తగ్గించుకుని వీటిని కొనుగోలు చేస్తారు. అంటే ఇతర ఆహార వస్తువుల ధర పెరిగినా వీటి డిమాండ్ తగ్గదు. కాబట్టి గిఫెన్ వస్తువుల విషయంలో డిమాండ్ సూత్రం వర్తించదు.

**3. అంచనాలు**

ఒక వస్తువు ధర పెరగటాన్ని గమనించిన కొనుగోలుదారులు, భవిష్యత్తులో దాని ధర మరింత పెరగవచ్చని భావించి, పెరిగిన ధర వద్ద వాటిని ఎక్కువగా కొంటారు. అలానే ఒక వస్తువు ధర తగ్గుతుంటే, అది మరింత తగ్గవచ్చని భావించి దాని కొనుగోలును వాయిదా వేయవచ్చు. అంటే ధర తగ్గితే డిమాండ్ తగ్గుతుంది. ధర పెరిగితే డిమాండ్ పెరుగుతుంది. కనుక ఇది కూడా డిమాండ్ సూత్రానికి మినహాయింపు. వీటిని మినహాయిస్తే చాలా సందర్భాలలో డిమాండ్ సూత్రం వర్తిస్తుంది.

***3. డిమాండ్‌ను నిర్ధారించే అంశాలేవి? వివరించుము.***

**జ:** ఇతర పరిస్థితులు మారనంత వరకు అనే పదం అర్థం ధర కాకుండా ఇతర కారకాలు అని అవి:

ఎ) వస్తువు ధర  బి) కొనుగోలుదారుని ఆదాయం  సి) అభిరుచులు  డి) సంబంధిత వస్తు ధరలు

వస్తుధర నిలకడగా ఉందనే ప్రమేయం చేసి డిమాండ్ పై ఈ అంశాల ప్రభావాన్ని పరిశీలిద్దాం. ఈ పరిస్థితిలో ధర స్థిరంగా ఉండును.

**ఎ) వస్తువు ధర**

ఒక వస్తువు ధరలోని మార్పు డిమాండ్‌ను ప్రభావితం చేసే అతి ముఖ్యమైన అంశం. వస్తువు ధరకు, డిమాండ్‌కు మధ్య విలోమ సంబంధం ఉంటుంది. అంటే, ధర పెరిగితే డిమాండ్ తగ్గుతుంది, ధర తగ్గితే డిమాండ్ పెరుగుతుంది.

**బి) కొనుగోలు దారుని ఆదాయం**

వస్తు ధర స్థిరంగా ఉండగా, కొనుగోలుదారుని ఆదాయం పెరిగితే డిమాండ్ పెరుగుతుంది. ఆదాయం తగ్గితే డిమాండ్ తగ్గుతుంది. అంటే డిమాండ్‌కూ, ఆదాయానికీ ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. కాని నాసిరకం వస్తువుల విషయంలో దీనికి భిన్నంగా జరుగుతుంది. ఆదాయం పెరిగే కొద్దీ నాసిరకం వస్తువులను తక్కువ కొని, వాటికి బదులుగా, మేలురకం వస్తువులను కొనవచ్చు. కనుక నాసిరకం వస్తువుల విషయంలో ఆదాయం పెరిగితే డిమాండ్ తగ్గుతుంది. సాధారణ వస్తువుల విషయంలో ఆదాయానికీ డిమాండ్‌కూ ప్రత్యక్ష సంబంధం ఉండగా, నాసిరకం వస్తువుల విషయంలో విలోమ సంబంధం ఉంటుంది.

**సి) అభిరుచులు**

కొనుగోలు దారుని అభిరుచులు, ప్రాధాన్యతలు, అభిరుచులలో వచ్చే మార్పులు కూడా డిమాండ్‌ను ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు వ్యక్తికి నూతన వస్తువు పట్ల కోరిక కలిగినా, పాత వస్తువు పట్ల మోజు తగ్గినా డిమాండ్ మారుతుంది.

**డి) ఇతర వస్తువుల ధరలు**

వస్తువుల మధ్య సంబంధం రెండు రకాలు – 1. పూరక సంబంధం, 2. ప్రత్యామ్నాయ సంబంధం

**i) ప్రత్యామ్నాయ వస్తువుల ధర**

ఒక కోరికను సంతృప్తి పరచగల శక్తి యించు మించు సమానంగా ఉండే వస్తువులను ప్రత్యామ్నాయ వస్తువులంటారు. ఉదాహరణకు  కాఫీకి, టీ ప్రత్యామ్నాయ వస్తువు. ప్రత్యామ్నాయ వస్తువుల విషయంలో ఒక వస్తువు ధర పెరిగితే, దానికి ప్రత్యామ్నాయ సంబంధం గల వస్తువు డిమాండ్ పెరుగుతుంది. ధర తగ్గితే, డిమాండ్ తగ్గుతుంది.

**ii) పూరక సంబంధమైన వస్తువుల ధరలు**

ఒక కోరికను సంతృప్తిపరచటానికి ఒకటి కంటే ఎక్కువ అవసరమయ్యే వస్తువులను పూరక వస్తువులు అంటారు. అంటే వస్తువుల సమ్మేళనం మాత్రమే కోరికను సంతృప్తి పరుస్తుంది. ఉదా॥కు కారు. పెట్రోలు కార్ల ధర తగ్గితే వాటికి డిమాండ్ పెరిగి, పెట్రోలుకు కూడా డిమాండ్ పెరుగుతుంది. ఈ విధంగా ధర కాక డిమాండ్‌ను ప్రభావితం చేసే వాటిని ఇతర అంశాలు అంటారు.

ధర కాక వస్తు డిమాండ్‌ను ప్రభావితం చేసే వాటిని ఇతర అంశాలు అంటారు. వీటిలో ఒకటి లేదా ఎక్కువ అంశాలు డిమాండ్‌పై కన్పరచే ప్రభావాన్ని పరిశీలిస్తున్నప్పుడు, వస్తు ధర స్థిరంగా ఉంది అనే ప్రమేయం చేస్తాము. మరో మాటలో చెబితే, ధర స్థిరంగా ఉన్నప్పటికీ, మిగతా అంశాలలో ఒకటి లేదా కొన్ని మారినందువల్ల వస్తు డిమాండ్ పెరగవచ్చు, లేదా తరగవచ్చు.

***4. డిమాండ్‌లో విస్తరణ మరియు డిమాండ్‌లో పెరుగుదల అనగా వివరించుము.***

జ: **డిమాండ్‌లో విస్తరణ మరియు డిమాండ్‌లో పెరుగుదల:** డిమాండ్‌లో విస్తరణకు, డిమాండ్‌లో పెరుగుదలకు మధ్య తేడా ఉంది. డిమాండ్‌లో పెరుగుదల అనగా మిగతా పరిస్థితులు స్థిరంగా ఉండగా, ధర తగ్గడం వల్ల డిమాండ్ పరిమాణంతో వచ్చేది. వస్తుధర స్థిరంగా ఉండగా మిగతా అంశాలలో వచ్చిన మార్పు వల్ల డిమాండ్‌లో సంభవించే దానిని డిమాండ్ విస్తరణ అని చెప్పవచ్చు. పటంలోని డిమాండ్ రేఖను పరిశీలిద్దాం.



రోజు ఒక్కంటికి పాల డిమాండ్ (లీటర్లలో)

ధర OP నుండి $OP_1$ కు తగ్గటం వల్ల డిమాండ్ రేఖపై బిందువు 'A' నుండి 'B' కి ఏర్పడిన కదలికను డిమాండ్‌లో వచ్చిన విస్తరణగా చెప్పవచ్చు. పటంలోని డిమాండ్ రేఖ DD కిందికి వాలినప్పుడు సంభవించేది డిమాండ్ విస్తరణ. డిమాండ్‌ను ప్రభావితం చేసే అంశాలలో ఒకటి లేదా అంతకన్నా ఎక్కువ అంశాలలో మార్పులు వచ్చినట్లయితే దానిని డిమాండ్‌లో పెరుగుదలగా చెప్పవచ్చు.

**డిమాండ్‌లో పెరుగుదలను చూపే పట్టిక**

| పాలధర (లీటరు ఒక్కంటికి) (రూ.లలో) | డిమాండ్ పరిమాణం రోజుకు (లీటర్లలో) | డిమాండ్ పరిమాణం (డిమాండ్ పెరిగినప్పుడు) |
|---|---|---|
| (1) | (2) | (3) |
| 12 | 1.0 | 1.5 |
| 10 | 1.5 | 2.0 |
| 8 | 2.0 | 2.5 |
| 6 | 2.5 | 3.0 |
| 4 | 3.0 | 3.5 |

పట్టిక జాగ్రత్తగా చదివినట్లయితే, లీటరు పాలధర రూ.12 వద్ద, రోజుకు పాలకు గల డిమాండ్ పెరిగింది. పాల డిమాండ్‌లోని ఈ పెరుగుదల ఒకే ధర వద్ద సంభవించింది. అంటే ఇతర అంశాలలోని మార్పుల ఫలితంగా డిమాండ్ పెరిగింది. పట్టికను పటం రూపంలో చూపుదాం.




పాలకు గల డిమాండ్ పరిమాణం (రోజుకు లీటర్లలో)

**డిమాండ్‌లో పెరుగుదల**

# 21

# డిమాండ్ వ్యాకోచత్వము

# [Elasticity of Demand]

## 21.1 పరిచయం

సాధారణ డిమాండ్ సూత్రం, ఇతర పరిస్థితులు స్థిరంగా ఉన్నప్పుడు ఒక వస్తువు ధర తగ్గితే డిమాండ్ పెరుగుతుందనీ చెపుతుంది. ఇది కేవలం గమనాన్ని సూచిస్తుందే తప్ప స్థూలత్వాన్ని కాదు. అంటే, ధరకు డిమాండ్ కు గల గుణాత్మక సంబంధాన్ని మాత్రమే తెలుపుతుంది కానీ, ధరలోని ఎంత మార్పు డిమాండ్‌లోని ఎంత మార్పుకు దారితీస్తుందో వివరించదు. ఈ కారణం వల్లనే మనం డిమాండు వ్యాకోచత్వ భావనను పరిశీలించవలసి వచ్చింది. ఇది ధరకు డిమాండ్ కు మధ్య గల పరిమాణాత్మక సంబంధాన్ని వివరిస్తుంది.

## 21.2 లక్ష్యాలు

ఈ పాఠం పూర్తయిన తర్వాత మీరు తెలుసుకొనే అంశాలు.

- డిమాండ్ వ్యాకోచత్వం
- వివిధ డిమాండ్ వ్యాకోచత్వ రకములు
- ధర డిమాండ్ వ్యాకోచత్వాన్ని కొలిచే వివిధ పద్ధతులు
- డిమాండ్ వ్యాకోచత్వాన్ని నిర్ణయించే వివిధ అంశాలు
- డిమాండ్ వ్యాకోచత్వ ప్రాధాన్యత

## 21.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. డిమాండ్ వ్యాకోచత్వం***

**జ:** వస్తువు ధరను ఆ వస్తువు డిమాండ్‌ను నిర్ణయించే అంశాలకు మధ్య గల పరిమాణాత్మక నిష్పత్తి సంబంధాన్ని డిమాండ్ వ్యాకోచత్వం వివరిస్తుంది.

***2. ధర డిమాండ్ వ్యాకోచత్వం***

**జ:** ధరలో వచ్చిన అనుపాతపు మార్పు కు ఫలితంగా డిమాండ్ లో వచ్చే అనుపాతపు మార్పుకు గల సంబంధాన్ని ధర డిమాండ్ వ్యాకోచత్వం అందురు.

### *3. ధర, డిమాండ్ వ్యాకోచత్వ రకములు*

జ: ధర డిమాండ్ వ్యాకోచత్వం ఐదు రకాలు. అవి 1) పూర్తి వ్యాకోచ డిమాండ్, 2) పూర్తి అవ్యాకోచడిమాండ్, 3) సాపేక్ష వ్యాకోచ డిమాండ్, 4) సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ మరియు 5) ఏకత్వ వ్యాకోచ డిమాండ్.

### *4. ధర, డిమాండ్ వ్యాకోచత్వాన్ని కొలుచు పద్ధతులు*

జ: శాతముల పద్ధతి, మొత్తం ఖర్చు పద్ధతి, బిందు వ్యాకోచ పద్ధతి, ఆర్క్ వ్యాకోచ పద్ధతి. ఈ నాలుగు ధర డిమాండ్ వ్యాకోచత్వాన్ని కొలచే పద్ధతులు.

## రెండు మార్కుల ప్రశ్నలు

### *1. ధర డిమాండ్ వ్యాకోచత్వం అనగా నేమి?*

"ఒక వస్తువు ధరలోని అనుపాతపు మార్పు ఫలితంగా డిమాండ్ లో వచ్చే అనుపాతపు మార్పు ను ఇది వివరిస్తుంది. కాబట్టి దీనిని క్రింది విధంగా వ్రాయవచ్చు.

$$\text{ధర డిమాండ్ వ్యాకోచత్వం} = E_p = \frac{\text{డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు}}{\text{ధరలో వచ్చిన అనుపాతపు మార్పు}}$$

$$= \frac{\text{డిమాండ్‌లో మార్పు}}{\text{మొదటి డిమాండ్}} \div \frac{\text{ధరలో మార్పు}}{\text{మొదటి ధర}}$$

$$= \frac{\Delta Q}{Q} \div \frac{\Delta P}{P}$$

$$E_p = \frac{\Delta Q}{Q} \times \frac{P}{\Delta P} \quad \text{లేదా} \quad \frac{\Delta Q}{PQ} \cdot \frac{P}{Q}$$

## నాలుగు మార్కుల ప్రశ్నలు

### *1. ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వాన్ని వివరింపుము.*

జ: వినియోగదారుని ఆదాయంలో వచ్చిన మార్పుకు వస్తు డిమాండ్ లో వచ్చిన మార్పుకు మధ్యగల సంబంధాన్ని ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం వివరిస్తుంది. మేలు రకం వస్తువుల విషయంలో ఇది ధనాత్మకంగానూ, నాసి రకం వస్తువుల విషయంలో రుణాత్మకంగాను ఉంటుంది. దీనిని క్రింది సమీకరణం ద్వారా వివరింపవచ్చు.

$$Ey = \frac{\text{డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు}}{\text{ఆదాయంలో వచ్చిన అనుపాతపు మార్పు}}$$

$$= \frac{\text{డిమాండ్‌లో మార్పు}}{\text{డిమాండ్}} \div \frac{\text{ఆదాయంలో మార్పు}}{\text{ఆదాయం}}$$

$$Ey = \frac{\Delta Q}{Q} \div \frac{\Delta Y}{Y} = \frac{\Delta Q}{\Delta Y} . \frac{Y}{Q}$$

**ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వ రకములు :**

వినియోగదారుని ఆదాయంలో మార్పులు వస్తు డిమాండ్ పై మూడు రకములైన మార్పులకు దారి తీస్తాయి.

(i) ధనాత్మక ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం (Positive Income Elasticity)

(ii) ఋణాత్మక ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం (Negative Income Elasticity)

(iii) శూన్య ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం (Zero Income Elasticity)

**(i) ధనాత్మక ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం :**

సాధారణంగా మేలు రకం వస్తువులు ధనాత్మక ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వాన్ని కలిగి ఉంటాయి. అంటే వీటి విషయంలో వినియోగదారుని ఆదాయం పెరిగితే వీటి డిమాండ్ పెరుగుతుంది.

**(ii) ఋణాత్మక ఆదాయ డిమాండ్ వ్యాకోచత్వం :-**

నాశిరకం వస్తువుల విషయంలో ఆదాయ డిమాండ్ వ్యాకోచం రుణాత్మకంగా ఉంటుంది. అంటే వినియోగదారుని ఆదాయం పెరిగితే వీటి డిమాండ్ తగ్గుతుంది.

**(iii) శూన్య ఆదాయ డిమాండ్ వ్యాకోచం :-**

కొన్ని వస్తువుల విషయంలో వినియోగదారుని ఆదాయంలో మార్పు వస్తు డిమాండ్ పై ప్రభావం చూపదు, ఇది అరుదుగా కనిపించే స్థితి ఇచ్చుట వ్యాకోచ విలువ సున్నా గా ఉంటుంది.

***2. జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వాన్ని చర్చింపుము.***

జ: వస్తువు Y ధరకు, వస్తువు X డిమాండ్ కు మధ్యగల సంబంధాన్ని జాత్యాంతర డిమాండ్ వివరిస్తుంది. అనగా Y వస్తువు ధరలోని అనుపాతపు మార్పుకు, తత్ఫలితంగా X వస్తువు డిమాండ్‌లో వచ్చిన మార్పుకు మధ్యగల సంబంధాన్ని ఇది వివరిస్తుంది.

దీనిని ఈ క్రింది విధంగా వ్రాయవచ్చు.

$$Ec = \frac{\text{X వస్తువు డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు}}{\text{Y వస్తువు ధరలో వచ్చిన అనుపాతపు మార్పు}}$$

$$= \frac{\text{X వస్తువు డిమాండ్‌లో మార్పు}}{\text{X వస్తువు డిమాండ్}} \div \frac{\text{Y వస్తువు ధరలో మార్పు}}{\text{Y వస్తువు ధర}}$$

$$= \frac{\Delta QX}{QX} \div \frac{\Delta Py}{Py}$$

$$Ex = \frac{\Delta Qx}{Qx} \times \frac{Py}{\Delta Py} \text{(or)} \frac{\Delta Qx}{\Delta Py} \times \frac{Py}{Qx}$$

**జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వ రకములు :-**

జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వాన్ని మూడు రకములుగా విభజించవచ్చు.

(i) ధనాత్మక జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం (Positive Cross Elasticity)

(ii) ఋణాత్మక జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం (Negative Cross Elasticity)

(iii) శూన్య జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం (Zero Cross Elasticity)

(i) **ధనాత్మక జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం :-**

ప్రత్యామ్నాయ వస్తువుల మధ్య ధనాత్మక జాత్యంతర వ్యాకోచత్వం ఉంటుంది. ఇచ్చట Y వస్తువు ధరలోని అనుపాతపు పెరుగుదల, X వస్తువు డిమాండ్ లోని అనుపాతపు పెరుగుదలకు దారి తీస్తుంది.

(ii) **ఋణాత్మక జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం :-**

పూరక వస్తువుల విషయంలో ఋణాత్మక జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం ఉంటుంది. ఇచ్చట Y వస్తువు ధరలోని అనుపాతపు పెరుగుదల, X వస్తువు డిమాండ్ లో అనుపాతపు తగ్గుదలకు దారితీస్తుంది.

(iii) **శూన్య జాత్యంతర డిమాండ్ వ్యాకోచత్వం :-**

X వస్తువు ధరలోని అనుపాతపు మార్పు, Y వస్తువు డిమాండ్ పై ఏ విధమైన ప్రభావాన్నీ చూపనట్లయితే దానిని శూన్య జాత్యంతర వ్యాకోచత్వం అంటారు. సాధారణంగా రెండు సంబంధంలేని వస్తువుల మధ్య డిమాండ్ వ్యాకోచత్వం శూన్యంగా ఉంటుంది.

***3. డిమాండ్ వ్యాకోచత్వాన్ని నిర్ణయించే వివిధ అంశాలు ఏవి?***

జ: ఒక వస్తువు యొక్క డిమాండ్ వ్యాకోచత్వం అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది.

(1) **కాలభావన :-** కాలాన్ని బట్టి డిమాండ్ వ్యాకోచత్వం మారుతుంది. సాధారణంగా, స్వల్ప కాలంలో డిమాండ్ వ్యాకోచం ఎక్కువగానూ, దీర్ఘకాలంలో తక్కువగాను ఉంటుంది.

(2) **మొత్తం కుటుంబ వ్యయంలో అనుపాతం :**

వినియోగదారుడు తన మొత్తం ఆదాయంలో ఎక్కువ భాగం ఒక వస్తువు పై ఖర్చు చేస్తే డిమాండ్ వ్యాకోచం

ఎక్కువగా ఉంటుంది. అంటే, ధరలోని కొద్దిపాటి వాటా గల వస్తువుల విషయంలో (ఉదా॥ కు అగ్గిపెట్టె, ఉప్పు మొదలైనవి) డిమాండ్ తక్కువ వ్యాకోచంగా ఉంటుంది.

(3) **ధరల స్థాయి :-** సాధారణంగా అధిక ధరల స్థాయిల వద్ద డిమాండ్ వ్యాకోచం ఎక్కువగా ఉంటుంది. తక్కువ ధరల స్థాయి వద్ద తక్కువగా ఉంటుంది.

(4) **వస్తు స్వభావం :-** ఒక వస్తు స్వభావం కూడా దాని వ్యాకోచత్వాన్ని నిర్ణయిస్తుంది. వస్తువు అవసర వస్తువైతే డిమాండ్ అవ్యాకోచం ఎక్కువగాను, విలాసవస్తువైతే డిమాండ్ వ్యాకోచం తక్కువగాను ఉంటుంది.

(5) **పూరక వస్తుతత్వము :-** రెండు వస్తువుల మధ్యగల పూరక తత్వము కూడా వ్యాకోచత్వాన్ని నిర్ణయిస్తుంది. ఈ వస్తువుల విషయంలో డిమాండ్ వ్యాకోచత్వం తక్కువగా ఉంటుంది.

(6) **ప్రత్యామ్నాయ వస్తువుల లభ్యత :-** అనేక ప్రత్యామ్నాయ వస్తువులు ఉన్నప్పుడు డిమాండ్ వ్యాకోచంగానూ, తక్కువ ప్రత్యామ్నాయాలు ఉన్నప్పుడు అవ్యాకోచంగానూ ఉంటుంది.

(7) **వివిధ ఉపయోగాలు :-** ఒక వస్తువుకు అనేక ఉపయోగాలు ఉన్నట్లయితే ( ఉదా॥ కు విద్యుచ్ఛక్తి) దాని డిమాండ్ ఎక్కువ వ్యాకోచంగా ఉంటుంది.

(8) **వాయిదాకు అవకాశం :-** వస్తు కొనుగోలు వాయిదాకు అవకాశం ఉంటే, డిమాండ్ వ్యాకోచంగానూ, వాయిదాకు అవకాశం లేకపోతే అవ్యాకోచంగానూ ఉంటుంది.

***4. డిమాండ్ వ్యాకోచత్వ భావన ప్రాధాన్యతను వివరింపుము.***

జ: 1. ఈ భావన ఒక వ్యాపారస్థునికి ఎంతో ఉపయోగకారిగా ఉంటుంది. సాధారణంగా డిమాండ్ స్వభావం వస్తు ధరను నిర్ణయిస్తుంది. వస్తువు అవసరవస్తువైతే, డిమాండు అవ్యాకోచంగా ఉన్నప్పుడు, అమ్మకందారుడు ఎక్కువ ధరను, డిమాండ్ వ్యాకోచంగా ఉన్నప్పుడు తక్కువ ధరను నిర్ణయిస్తాడు.

2. ఏకస్వామ్య మార్కెట్ లో ధర నిర్ణయంలో కూడా డిమాండ్ వ్యాకోచత్వం భావన ప్రాధాన్యతను కలిగి ఉంటుంది. ఏకస్వామ్యదారుడు ధరను నిర్ణయించేటప్పుడు వినియోగదారునికి మిగులు లేకుండా చేస్తాడు. అతడు డిమాండ్ వ్యాకోచత్వాన్ని బట్టి ధర విచక్షణ చేస్తాడు.

3. ఆర్థిక మంత్రికి కూడా ఈ భావన ఎంతగానో ఉపయోగపడుతుంది. ఆ వ్యాకోచ డిమాండ్ ఉన్న వస్తువులపై అధిక పన్నులను మంత్రి విధిస్తారు. పెరిగిన పన్ను రేటు పన్ను రాబడిని పెంచుతుంది.

4. అంతర్జాతీయ వ్యాపారంలో ఈ భావన కీలక పాత్రను పోషిస్తుంది. వ్యాకోచ డిమాండ్ గల వస్తువులను ఎక్కువగా ఎగుమతి చేయడం ద్వారా అధిక విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జింపవచ్చు. కారణం ధరలోని కొద్దిపాటి తగ్గుదల, డిమాండ్ లో ఎక్కువ శాతం పెరుగుదలకు దారితీస్తుంది.

5. వర్తక నిబంధనల సర్దుబాట్లలో కూడా డిమాండ్ వ్యాకోచత్వ భావన ప్రాధాన్యతను కల్గి ఉంది. మారక తరుగుదలకు, ఎగుమతి మరియు దిగుమతుల వ్యాకోచత్వ పరిశీలన అవసరం.

ఈ విధంగా డిమాండ్ వ్యాకోచత్వ భావన అర్థశాస్త్రంలో ఎంతో ప్రాధాన్యతను కలిగి ఉంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ధర డిమాండ్ వ్యాకోచత్వం అనగా నేమి? దాని రకములు వివరింపుము?***

జ: "ఒక వస్తువు ధరలోని అనుపాతపు మార్పు ఫలితంగా డిమాండ్ లో వచ్చే అనుపాతపు మార్పును ఇది వివరిస్తుంది. కాబట్టి దీనిని ఈ క్రింది విధంగా వ్రాయవచ్చు.

$$\text{ధర డిమాండ్ వ్యాకోచత్వం} = E_p = \frac{\text{డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు}}{\text{ధరలో వచ్చిన అనుపాతపు మార్పు}}$$

$$= \frac{\text{డిమాండ్‌లో మార్పు}}{\text{మొదటి డిమాండ్}} \div \frac{\text{ధరలో మార్పు}}{\text{మొదటి ధర}}$$

$$= \frac{\Delta Q}{Q} \div \frac{\Delta P}{P}$$

$$E_p = \frac{\Delta Q}{Q} \times \frac{P}{\Delta P} \quad \text{లేదా} \quad \frac{\Delta Q}{PQ} \cdot \frac{P}{Q}$$

### ధర డిమాండ్ వ్యాకోచత్వ రకములు (Types of Price elasticity of demand) :

ధర వ్యాకోచత్వ విలువను బట్టి డిమాండ్ వ్యాకోచత్వమును పేర్కొనవచ్చు.

1. పూర్తి వ్యాకోచ డిమాండ్ ($E_p = \propto$)
2. పూర్తి అ వ్యాకోచ డిమాండ్ ($E_p = o$)
3. సాపేక్ష వ్యాకోచ డిమాండ్ ($E_p > 1$)
4. సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ ($E_p < 1$)
5. ఏకత్వ వ్యాకోచ డిమాండ్ ($E_p = 1$)

(i) **పూర్తి వ్యాకోచ డిమాండ్ :**

ఇది ఒక విపరీత మైన స్థితి. ధరలో కొద్దిపాటి మార్పు డిమాండ్ అదృశ్యం కావడానికి దారి తీస్తుంది. అయితే ధరలో మార్పు లేనప్పటికీ ఒక్కొక్క సారి డిమాండ్ పెరగవచ్చు లేదా తగ్గవచ్చు. ఈ పూర్తి వ్యాకోచ డిమాండ్ రేఖ

పటంలో చూపబడింది. ఈ రేఖ X – అక్షానికి సమాంతరంగా ఉంటుంది.

ఇచ్చట

$$\frac{\Delta Q}{Q}.\frac{P}{\Delta P} = E_p = \alpha$$




(ii) **పూర్తి అవ్యాకోచ డిమాండ్ :–**

ఇది మరో విపరీత పరిస్థితి. ఇచ్చట ఎంత మార్పు వచ్చినా డిమాండ్ ప్రభావితం కాదు. ఇచ్చట వ్యాకోచత్వ విలువ సున్నాగా ఉంటుంది. అంటే ధర పెరిగినా, తగ్గినా డిమాండ్ మాత్రం స్థిరంగా ఉంటుంది. పూర్తి అవ్యాకోచ డిమాండ్ రేఖ క్రింది పటం లో చూపబడింది. ఈ రేఖ Y – అక్షానికి సమాంతరంగా ఉంటుంది. పటం లో ధరలో మార్పు OP నుండి $OP_1$ కు పెరిగినప్పటికీ డిమాండ్‌లో మార్పు లేకపోవడం గమనింపవచ్చు.

$$Ep = \frac{\Delta Q}{Q}.\frac{P}{\Delta P} = 0$$




(iii) **సాపేక్ష వ్యాకోచ డిమాండ్ :–**

ధరలోని కొద్దిశాతం మార్పు డిమాండ్ లో ఎక్కువ శాతం మార్పుకు దారి తీసినట్లయితే దానిని సాపేక్ష వ్యాకోచ డిమాండ్ అంటారు. అనగా ధరలోని ఒక శాతం మార్పు డిమాండ్ లో 1 కన్నా ($QQ_1$), ఎక్కువగా ఉండటం చూడవచ్చు. ఇచట డిమాండ్ రేఖ ఏటవాలుగా ఉంటుంది.

$$OBP_1Q_1 > OAPQ$$

$$\therefore E_p > 1$$



(iv) **సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ :-**

సాపేక్ష ఆవ్యాకోచ డిమాండ్ విషయంలో ధరలోని మార్పు కన్నా డిమాండ్ లో మార్పు తక్కువగా ఉంటుంది. అనగా ధరలోని ఒక శాతం మార్పు డిమాండ్ లో ఒకటి కన్నా తక్కువ శాతం మార్పుకు దారి తీస్తుంది. పటంలో సాపేక్ష అవ్యాకోచ డిమాండ్ రేఖ చూపబడింది. ధరలోని ఎక్కువ మార్పు ($PP_1$) డిమాండ్ లో తక్కువ మార్పు ($QQ_1$) కు దారితీస్తుంది. ఇచ్చట డిమాండ్ రేఖ Y - అక్షంవైపు వంగి ఉండును.

$OPBQ_1 < OP_1AQ$

$\therefore Ep < 1$




(v) **ఏకత్వ వ్యాకోచ డిమాండ్ :-**

ఏకత్వ వ్యాకోచ డిమాండ్ నందు ధరలోని ఒక శాతం మార్పు, డిమాండ్ లో కూడా ఒకే శాతం మార్పుకు దారి తీస్తుంది. అంటే, ధరలోని అనుపాతపు మార్పుకు డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు సమానంగా ఉంటుంది. పటంలో ఏకత్వ వ్యాకోచ డిమాండ్ రేఖను చూపుతుంది. ఇది లంబ అతి పర్వావలయంగా ఉంటుంది.

$$Ep = \frac{\Delta Q}{Q} \times \frac{Q}{\Delta Q} = 1$$

$OP_1AQ = OPBQ_1$

$\therefore Ep = 1$




డిమాండు వ్యాకోచత్వాన్ని పటం రూపంలో పరిశీలించునపుడు గుర్తుంచుకోవలసిన ముఖ్యాంశం ఏమిటంటే, డిమాండ్ వ్యాకోచత్వం మరియు డిమాండ్ రేఖ వాలు ఒకటే కాదు. రెండూ వేర్వేరు. ఒక సరళ రేఖీయమైన డిమాండ్ రేఖ వాలు మొత్తానికి సమానంగా ఉంటుంది. కానీ డిమాండ్ వ్యాకోచత్వం ఒకే రేఖపై ఒక్కొక్క బిందువు వద్ద ఒక్కొక్క విధంగా ఉంటుంది.

*2. ధర డిమాండ్ వ్యాకోచత్వాన్ని కొలవడానికి గల వివిధ పద్ధతులేవి?*

జ: సాధారణంగా డిమాండ్ వ్యాకోచత్వాన్ని ఈ క్రింది నాలుగు పద్ధతుల సహాయంతో కొలవచ్చు.

(i) అనుపాతాల లేదా శాతపు పద్ధతి. (Proportionate or percentage method)

(ii) మొత్తం ఖర్చు పద్ధతి. (Total outlay method)

(iii) బిందు వ్యాకోచ పద్ధతి. (Point elasticity method)

(iv) ఆర్క్ వ్యాకోచ పద్ధతి. (Arc elasticity method)

**(i) అనుపాతాల లేదా శాతపు పద్ధతి :**

ఈ పద్ధతి లో మనం ధరలో వచ్చిన శాతం మార్పు ఫలితంగా డిమాండ్ లో వచ్చే శాతం మార్పును పరిశీలిస్తాము. లేదా ధరలో వచ్చిన అనుపాతపు మార్పుకు తత్ఫలితంగా డిమాండ్ లో వచ్చిన అనుపాతపు మార్పుకు మధ్యగల సంబంధాన్ని పరిశీలిస్తాం.

$$Ep = \frac{\text{డిమాండ్‌లో వచ్చిన శాతపు మార్పు}}{\text{ధరలో వచ్చిన శాతపు మార్పు}}$$

$$Ep = \frac{\text{డిమాండ్‌లో వచ్చిన అనుపాతపు మార్పు}}{\text{ధరలో వచ్చిన అనుపాతపు మార్పు}}$$

$$= \frac{\text{డిమాండ్‌లో మార్పు}}{\text{మొదటి డిమాండ్}} \div \frac{\text{ధరలో మార్పు}}{\text{మొదటి ధర}}$$

$$= \frac{\Delta Q}{Q} \div \frac{QP}{P}$$

$$= \frac{\Delta Q}{Q} \times \frac{P}{\Delta P} \text{ లేదా } \frac{\Delta Q}{\Delta P} \times \frac{P}{Q}$$

**(ii) మొత్తం ఖర్చు పద్ధతి :-**

ఈ పద్ధతిని ఆల్ఫ్రెడ్ మార్షల్ ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతి లో మనం ధరలో వచ్చిన మార్పుకు తత్ఫలితంగా వినియోగదారుని మొత్తం ఖర్చులో వచ్చిన మార్పుకు మధ్యగల సంబంధాన్ని పరిశీలిస్తాం. మార్షల్ ప్రకారం వ్యాకోచత్వం మూడు రకాలుగా ఉంటుంది. అవి మొదటిది ఒకటి కన్నా ఎక్కువ, రెండవది ఒకటికి సమానం మూడవది ఒకటికన్నా తక్కువ. ఈ పద్ధతిని మరింత విపులంగా క్రింది పట్టిక సహాయంతో తెలుసుకోవచ్చు.

(iii) **బిందు వ్యాకోచ పద్ధతి :-**

ఈ పద్ధతిని కూడా మార్షల్ ప్రవేశపెట్టినారు. ఈ పద్ధతిని రేఖాగణితీయ పద్ధతి అని కూడా అంటారు. డిమాండ్ రేఖ పై గల ఒక బిందువు వద్ద వ్యాకోచత్వాన్ని కొలవడానికి దీనిని వాడతారు. ఇది అవకలనాల సూత్రాలపై ఆధారపడి ధర, డిమాండ్ సంబంధాన్ని వివరిస్తుంది.

$$Ep = \frac{dq}{q} \div \frac{dp}{p} = \frac{dq}{q} \times \frac{p}{dp} = \frac{dq}{dp} \times \frac{p}{q}$$

ఇచ్చట $\frac{dq}{dp}$, ఒక బిందువు వద్ద డిమాండ్ ప్రమేయ అవకలనము

**డిమాండ్ రేఖ సరళరేఖ అయినప్పుడు :**

డిమాండ్ రేఖ సరళ రేఖ అయినప్పుడు క్రింది సూత్రాన్ని వాడటం ద్వారా వ్యాకోచత్వాన్ని పొందవచ్చు. ఉదాహరణకు క్రింది పటంలో రేఖ సరళరేఖ అయినపుడు, E బిందువు వద్ద వ్యాకోచత్వాన్ని కొలవాలంటే సూత్రం

$$E_p = \frac{\text{డిమాండ్ రేఖ దిగువ భాగం}}{\text{డిమాండ్ రేఖ ఎగువ భాగం}}$$

$$= \frac{EB}{EA}$$

(iv) **ఆర్క్ వ్యాకోచ పద్ధతి :-**

ఒక డిమాండ్ రేఖ పై గల రెండు బిందువుల మధ్య దూరాన్ని ఆర్క్‌గా వ్యవహరిస్తారు. క్రింది పటంలో బిందువుల మధ్య దూరాన్ని ఆర్క్‌గా చెప్పవచ్చు. రెండు బిందువుల సగటులను పరిశీలించడం ద్వారా వ్యాకోచత్వాన్ని కొలుస్తారు.

కాబట్టి, ఆర్క్ పద్ధతి ద్వారా వ్యాకోచత్వాన్ని కొలవడానికి క్రింది సూత్రాన్ని వాడతారు.

$$Ep = \frac{\text{కొత్త డిమాండ్} - \text{పాత డిమాండ్}}{\text{కొత్త డిమాండ్} + \text{పాత డిమాండ్}} \div \frac{\text{కొత్త ధర} - \text{పాత ధర}}{\text{కొత్త ధర} + \text{పాత ధర}}$$

$$= \frac{OQ_1 - OQ}{OQ_1 + OQ} \div \frac{OP_1 - OP}{OP_1 + OP}$$

$$= \frac{\Delta Q}{OQ_1 + OQ} \div \frac{\Delta P}{OP_1 + OP}$$

$$Ep = \frac{\Delta Q}{\Delta P} \times \frac{OP_1 + OP}{OQ_1 + OQ}$$

డిమాండ్ రేఖ పై గల రెండు బిందువుల మధ్య దూరం తక్కువగా ఉన్నప్పుడు ఈ పద్ధతి ఉపయోగకారి. ధరలోని మార్పు ఎక్కువగా లేనప్పుడు మాత్రమే పై సూత్రాన్ని ఉపయోగించాలి.

# 22

# సప్లయ్ - దానిని ప్రభావితం చేసే అంశాలు

# (What Affects Supply)

## 22.1 పరిచయం

గతంలో డిమాండ్, దానిని నిర్ణయించే అంశాలు, డిమాండ్ సూత్రం గురించి తెలుసుకున్నారు. వస్తువులు మార్కెట్‌లో లభ్యం కాకపోతే వాటిని మనం కొనలేము. కనుక వస్తు సరఫరా లేదా సప్లయ్ కూడా ముఖ్యమే. ఈ పాఠంలో మీరు సప్లయ్ – దాని అర్థం, దానిని ప్రభావితం చేసే అంశాలు, సప్లయ్ సూత్రం గురించి తెలుసుకుంటారు.

## 22.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశములోని ప్రశ్నలను అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- సప్లయ్ నిర్వచనం
- ఒక వస్తువు సప్లయ్‌ని నిర్ణయించే అంశాలు.
- ధరలో వచ్చే మార్పులు సప్లయ్‌ని ఎలా ప్రభావితం చేస్తాయి?
- ఇతర కారకాలు సప్లైని ఎలా ప్రభావితం చేయును.
- వ్యక్తిగత సప్లయ్ – దాని అర్థం
- వ్యక్తిగత సప్లయ్ రేఖను గీయటం
- మార్కెట్ సప్లయ్ – దాని అర్థం
- సప్లయ్ సూత్రంను వివరించటం

## 22.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. సప్లయ్***

**జ:** నిర్ణీత కాలంలో నిర్ణీత ధర వద్ద ఒక ఉత్పత్తిదారుడు అమ్మటానికి సిద్ధంగా ఉన్న వస్తు పరిమాణాన్ని సప్లయ్ అంటారు.

***2. సప్లయ్ సూత్రం***

**జ:** ఇతర పరిస్థితులు స్థిరంగా ఉన్నంత వరకు వస్తువు ధర పెరిగితే సప్లయ్ పెరుగుతుంది. ధర తగ్గితే సప్లయ్ తగ్గుతుంది.

***3. వ్యక్తిగత సప్లయ్ పట్టిక***

**జ:** వివిధ ధరల వద్ద ఒక అమ్మకందారుడు లేదా సంస్థ అమ్మటానికి సిద్ధంగా ఉన్న సప్లయ్ పరిమాణాన్ని చూపేదే వ్యక్తిగత సప్లయ్ పట్టిక.

***4. మార్కెట్ సప్లయ్ పట్టిక***

**జ:** నిర్ణీత కాలంలో వివిధ ధరల వద్ద అమ్మకం దారులందరి లేదా పరిశ్రమ సప్లయ్‌లను కలపగా వచ్చేదే మార్కెట్ సప్లయ్ పట్టిక.

***5. సప్లయ్ రేఖ***

**జ:** సప్లయ్ రేఖ ఎడమ నుండి కుడికి పైకి వాలుతుంది.

***6. సప్లయ్ పరిమాణంలో మార్పు***

**జ:** కేవలం ధర పెరిగినందువల్ల సప్లయ్ పెరగటాన్ని సప్లయ్ పరిమాణంలో మార్పు అంటాము.

***7. సప్లయ్‌లో పెరుగుదల***

**జ:** ధర స్థిరంగా ఉండగా సప్లయ్ పెరిగితే దానిని సప్లయ్‌లో పెరుగుదల అంటాము.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. సప్లయ్ – వివరింపుము.***

జ. ఒక నిర్ణీత కాలంలో, నిర్ణీత ధర వద్ద ఉత్పత్తిదారుడు లేదా సంస్థ అమ్మటానికి సిద్ధంగా ఉన్న వస్తు పరిమాణాన్ని సప్లయ్ అందురు. సప్లయ్ నిర్వచనంలో ఇమిడి ఉన్న అంశాలు. (i) సంస్థ లేదా అమ్మకందారుడు, అమ్మటానికి సిద్ధంగా ఉన్న సప్లయ్ పరిమాణం, (ii) అమ్మటానికి ఇష్టపడే ధర (iii) నిర్ణీత కాలవ్యవధి.

***2. సప్లయ్ సూత్రంను వివరింపుము.***

జ. ఇతర అంశాలలో మార్పు లేనంత వరకు ఒక వస్తువు ధర పెరిగితే దాని సప్లయ్ పెరుగును ధర తగ్గితే సప్లయ్ తగ్గును అని సప్లయ్ సూత్రం తెలియజేస్తుంది. అంటే ధరకు, సప్లయ్‌కు మధ్య అనులోమానుపాత సంబంధం ఉంటుంది. సప్లయ్ సూత్రానికి మార్కెట్ సప్లయ్‌రేఖ పట రూప వివరణ ఇస్తుంది. సప్లయ్ సూత్రం ప్రకారం, సప్లయ్‌ని ప్రభావితం చేసేది దాని ధర అని చెప్పవచ్చు. సప్లై సిద్ధాంతము ధరకు, సప్లైకి మధ్య సంబంధమును వివరించును. వస్తువు ధరకు మార్కెట్ సప్లయికు మధ్య ప్రత్యక్ష సంబంధం ఉంటుందనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. అంటే వస్తువు ధర సప్లయిని ప్రభావితం చేస్తుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. సప్లయ్ అనే పదానికి అర్థమేమిటి? మార్కెట్ సప్లయ్ వివరింపుము.***

**జ:** ఒక నిర్ణీత కాలంలో, నిర్ణీత ధర వద్ద ఉత్పత్తిదారుడు లేదా సంస్థ అమ్మటానికి సిద్ధంగా ఉన్న వస్తు పరిమాణాన్ని సప్లయ్ అందురు. సప్లయ్ నిర్వచనంలో ఇమిడి ఉన్న అంశాలు. (i) సంస్థ లేదా అమ్మకందారుడు, అమ్మటానికి సిద్ధంగా ఉన్న సప్లయ్ పరిమాణం, (ii) అమ్మటానికి ఇష్టపడే ధర (iii) నిర్ణీత కాలవ్యవధి. ఒక వస్తువు సప్లయి అంశంలో క్రింది

విషయాలపై దృష్టి పెట్టండి.

i) ఒక సంస్థ రూ. 5 వద్ద 500 పెన్నులు సప్లై చేయును.

ii) ఒక సంస్థ రోజుకు 500 పెన్నులు సరఫరా చేయును.

iii) రూ॥ 5 వద్ద సంస్థ ఒక రోజులో 500 పెన్నులు సప్లయి చేస్తుంది.

పై మూడింటిలో మొదటి, రెండవ ప్రకటనలు అసంపూర్ణము. మొదటి దానిలో కాలవ్యవధిని పరిగణలోకి తీసుకోలేదు. రెండవ దానిలో పెన్నుల ధర విస్మరించారు. మూడవ దానిలో (i) సంస్థ సప్లయి చేయడానికి సిద్ధంగా ఉన్న పరిమాణం (ii) ధర మరియు (iii) కాల వ్యవధి, మూడు పరిగణింపబడ్డాయి.

**మార్కెట్ సప్లయ్**

సాధారణంగా అనేక సంస్థలు వస్తువులను అమ్ముతుంటాయి. నిర్ణీత కాలంలో, నిర్ణీత ధర వద్ద, అన్ని సంస్థలు కలసి అమ్మటానికి సిద్ధంగా ఉన్న వస్తు పరిమాణాన్ని మార్కెట్ సప్లయ్ అంటారు. సంస్థల సప్లయ్‌ని కలపగా వచ్చేదే మార్కెట్ సప్లయ్.

***2. ఒక వస్తు సప్లయ్‌ని ప్రభావితం చేసే వివిధ ఇతర అంశాలను గూర్చి క్లుప్తంగా వివరించండి?***

**జ:** సాధారణంగా సప్లయ్ పరిమాణం స్థిరంగా ఉండదు. ఇది మారుతూ ఉంటుంది. ఒక వస్తువు సప్లయ్‌ని నిర్ణయించే అంశాలు : అ) వస్తువు ధర ఆ) ఇతర కారకాలు. అవి

1) ఇతర వస్తువుల ధరలు 2) ఉత్పత్తికారకాల ధరలు 3) ఉత్పత్తి దారుని లక్ష్యాలు

4) ఉత్పత్తిలో ఉపయోగించే సాంకేతిక పరిజ్ఞానం

ఒక వస్తువు సప్లయిని నిర్ణయించే అంశాలను ప్రధానంగా రెండు గ్రూపులుగా వర్గీకరింపవచ్చు. మొదటి గ్రూపులో కేవలం ఒకే ఒక కారకం అనగా ఆ వస్తువుల ధర ఉంటుంది. రెండవ గ్రూపులో, నాలుగు కారకాలు ఇమిడి ఉంటాయి. వీటిని ఇతర కారకాలుగా పేర్కొన్నాము. ఈ విధంగా గ్రూపులుగా చేయడానికి కారణం, ఈ గ్రూపులలో ఒక్కొక్క కారకానికి ఇతర కారకాల స్వభావాలలో తేడాలుంటాయి. ఒక వస్తువు ధరలో వచ్చే మార్పులు సప్లయిపై చూపే ప్రభావాన్ని చదివేటప్పుడు, వస్తువు సప్లయి ఇతర కారకం వలన ప్రభావితం కాదని ప్రమేయం చేయబడును. ఈ ప్రమేయాన్ని 'ఇతర అంశాలన్నీ స్థిరంగా ఉంటాయి.' అని అంటారు. అదే విధంగా ఇతర కారకాలలోని మార్పులు పరిగణించేటప్పుడు, మనం ధర స్థిరంగా ఉంటుందని భావిద్దాం. ఈ ప్రమేయాన్ని 'ధర స్థిరంగా ఉంటుందని' ఊహిస్తాం.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. వస్తుధర దాని సప్లయ్‌ని ఎట్లు ప్రభావితం చేయునో వివరింపుము?***

**జ:** ఒక వస్తువు సప్లయ్ పై దాని ధరలోని మార్పుల ప్రభావాన్ని పరిశీలించేటప్పుడు ఇతర అంశాలు స్థిరంగా ఉంటాయి అనే ప్రమేయం చేస్తాము. ఇతర అంశాలు స్థిరంగా ఉండగా, ధరలో సంభవించే పెరుగుదల, అధిక లాభాలకు అవకాశం కల్పిస్తూ, ఎక్కువ సప్లయ్ చేయుటకు ఉత్పత్తిదారుని ప్రోత్సహిస్తుంది. ధర తగ్గితే లాభాలు తగ్గుతాయి కనుక

సప్లయ్ కూడా తగ్గుతుంది. కాబట్టి ధర పెరిగితే సప్లయ్ పెరుగుతుంది, ధర తగ్గితే సప్లయ్ తగ్గుతుంది. అంటే ధరకు, సప్లయ్‌కు మధ్య ప్రత్యక్ష సంబంధం ఉంటుంది.

**సంస్థ సప్లయ్ పట్టిక**

ధరకు, సప్లయ్ పరిమాణానికి గల ప్రత్యక్ష సంబంధం ఆధారంగా సంస్థ సప్లయ్ పట్టిక రూపొందుతుంది. దీనినే సంస్థ సప్లయ్ పట్టిక అంటారు. పట్టిక లో సంస్థ యొక్క సప్లై పట్టిక ఇవ్వబడినది.

**సంస్థ సప్లయ్ పట్టిక**

| ధర (పెన్ను ఒక్కింటికి) రూ॥లలో | పెన్నుల సప్లయ్ పరిమాణం (నెలకు) |
|---|---|
| 2 | 100 |
| 3 | 150 |
| 4 | 200 |
| 5 | 250 |
| 6 | 300 |

రూ. 2 వద్ద సంస్థ నెలకు 100 పెన్నులు సప్లయ్ చేస్తుంది. ధర రూ. 3 కు పెరిగినపుడు, సప్లయ్ పరిమాణం 150 కు పెరుగుతుంది. అదే విధంగా, పెన్నుల ధర పెరిగే కొలది సప్లయ్ పరిమాణంలో కూడా పెరుగుతుంది. ఇప్పుడు ఇవ్వబడిన పట్టికలో, అనగా రూ. 6 వద్ద 300 వస్తువులు సప్లయ్‌చేయబడ్డాయి. ఎప్పుడైతే పెన్ను ధర రూ. 5కు తగ్గినప్పుడు, సప్లయ్ పరిమాణం కూడా 300 నుండి 250 కు తగ్గిపోయింది. కాబట్టి వస్తువు ధరకు సప్లయ్ పరిమాణానికి మధ్య ప్రత్యక్ష సంబంధం ఉంటుంది.

**సంస్థ సప్లయ్ రేఖ**

పట్టిక ఆధారంగా సప్లయ్ రేఖను గీస్తే దాని వాలు పటంలో వలె ఎడమ నుండి కుడికి పైకి వెళుతుంది.




**వ్యక్తిగత సప్లయ్ రేఖ**

పై పటంలో ox అక్షంపై సప్లయ్ పరిమాణం, oy అక్షంపై ధర(రూ॥లలో) చూపబడ్డాయి. ధరకు, సప్లయ్‌కు గల ప్రత్యక్ష

సంబంధం కారణంగా అమ్మకం దారుడు సప్లయి చేసే వస్తు పరిమాణాన్ని సూచించే సప్లయ్ రేఖ ఎడమ నుండి కుడికి పైకి వాలుతున్నది. పటంలో బిందువు A వద్ద ధర రూ. 2 గా ఉంది. అమ్మకం దారుడు నెలకు 100 పెన్నులు సప్లయి చేస్తాడు. బిందువు B, రూ. 3 ధర వద్ద 150 పెన్నులు సూచిస్తుంది. అదే విధంగా C,D మరియు E బిందువులు 200, 250 మరియు 300 పెన్నుల సప్లయిని వరుసగా సూచిస్తాయి. ఈ బిందువులన్నీ కలుపగా 'ss' సప్లయి రేఖను మనం పొందవచ్చు.

## మార్కెట్ సప్లై పట్టిక

వివిధ ధరల వద్ద అమ్మకం దారులందరి సప్లయ్ పరిమాణాలను కలపగా వచ్చేది మార్కెట్ సప్లయ్ పట్టిక. దీనిని పట్టికలో చూపబడింది. బిందువు A వద్ద ధర 2 రూ గాను సప్లై 100గాను, B వద్ద ధర 3 రూ, గానూ సప్లై ఏకంగాను అందు B వద్ద 6రూ. 300 మార్కెట్ సప్లై పట్టిక అనగా వివిధ ధరల వద్ద మార్కెట్ సప్లై చేయబడిన పరిమాణము. ఈ రెండు సంస్థల సప్లయి పట్టిక మార్కెట్ సప్లయి పట్టికలు ఇవ్వబడ్డాయి

| పెన్ను ధర (రూ॥లలో) | సంస్థలచే సప్లయ్ చేయబడిన పెన్నుల పరిమాణం (నెలకు) | | మార్కెట్ సప్లయ్ |
|---|---|---|---|
| | A | B | |
| 1 | 100 | 0 | 100 |
| 2 | 150 | 50 | 200 |
| 3 | 200 | 100 | 300 |
| 4 | 250 | 150 | 400 |
| 5 | 300 | 200 | 500 |

ఈ రెండు సంస్థలు వ్యక్తిగత ధరల వద్ద చేసిన సప్లయి పరిమాణాన్ని కలుపగా, మనకు మార్కెట్ సప్లయి రేఖ లభిస్తుంది. పట్టిక నందలి కాలమ్ 4 నందు ఇది చూపబడింది. పెన్ను ధర ఒక రూపాయి వద్ద A మరియు B సంస్థలు చేసిన సప్లయి వరుసగా 100, సున్నా పెన్నులు మార్కెట్‌లో ఇద్దరే పెన్నుల అమ్మకందారులు ఉండటం వలన మొత్తం మార్కెట్ సప్లయి (100+0) అదే విధంగా ఇతర ధరల వద్ద కూడా A మరియు B సంస్థల సప్లయి పరిమాణాలు చూడవచ్చు.

## మార్కెట్ సప్లయ్ రేఖ

పై పట్టికలోను సమాచారం గుర్తించడం ద్వారా వచ్చేదే మార్కెట్ సప్లయ్‌రేఖ. ఇది సంస్థ సప్లయ్‌రేఖ వాలును పోలి ఉంటుంది. దీనిని క్రింది సప్లయ్‌రేఖ ద్వారా చూపవచ్చు.




మార్కెట్ సప్లయ్ రేఖ

దీనికి కారణం వివిధ వ్యక్తిగత సప్లయిలను కలపడం ద్వారామార్కెట్ సప్లయి రేఖ పొందబడుతుంది. సంస్థ సప్లయి రేఖ పొందిన విధంగానే ఈ మార్కెట్ సప్లయి రేఖ కూడా రాబట్టబడుతుంది. దీనిని బట్టి ధర పెరిగే కొలది మార్కెట్ సప్లయి కూడా పెరుగుతుంది.

***2. సప్లయ్ సూత్రమును వివరించి, దానికి గల ప్రధాన ప్రమేయాలను పేర్కొనుము?***

**జ:** ఇతర అంశాలలో మార్పు లేనంత వరకు ఒక వస్తువు ధర పెరిగితే దాని సప్లయ్ పెరుగును ధర తగ్గితే సప్లయ్ తగ్గును అని సప్లయ్ సూత్రం తెలియజేస్తుంది. అంటే ధరకు, సప్లయ్‌కు మధ్య అనులోమానుపాత సంబంధం ఉంటుంది. వస్తువు ధరకు మార్కెట్ సప్లయికు మధ్య ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. అంటే వస్తువు ధర సప్లయిని ప్రభావితం చేస్తుంది.

**వస్తు సప్లయ్‌ని ప్రభావితం చేసే ఇతర అంశాలు**

ధరలోని మార్పులు సప్లయి పై ప్రభావాన్ని పరిశీలించేటప్పుడు ఇతర అంశాలన్నీ స్థిరంగా ఉన్నాయని ఊహించాలి. ఈ భాగంలో, ధర స్థిరంగా ఉండగా, ఇతర అంశాలు సప్లయ్‌ని ఎలా ప్రభావితం చేస్తాయో తెలుసుకుంటారు. ఇప్పుడు వస్తుధర మారదు అనుకుందాం. క్రింద పేర్కొన్న అంశాలు సప్లయ్‌ని ప్రభావితం చేస్తాయి.

**i)** ఇతర వస్తువుల ధరలు  **ii)** ఉత్పత్తి కారకాల ధరలు

**iii)** ఉత్పత్తిదారుని లక్ష్యాలు  **iv)** ఉత్పత్తిలో ఉపయోగించే సాంకేతిక పరిజ్ఞానం

### i) ఇతర వస్తువుల ధరలు

ఒక వస్తువు సప్లయ్, ఆ వస్తువు ధర పైనే కాక ఇతర వస్తువుల ధరల పైన కూడా ఆధారపడుతుంది. ఇతర వస్తువుల ధరలు పెరిగితే, వాటిని ఉత్పత్తి చేయటమే లాభదాయకంగా ఉంటుంది. కనుక ధర స్థిరంగా ఉన్న వస్తువుల నుండి ధర పెరిగిన వాటివైపు ఉత్పత్తి దారుడు మొగ్గు చూపుతాడు. కనుక ఒక వస్తువు ధర నిలకడగా ఉన్నప్పటికీ ఇతర వస్తువుల ధరలు మారటం వల్ల దాని సప్లయ్‌లో మార్పులు వస్తాయి.

### ii) ఉత్పత్తి కారకాల ధరలు

ఉత్పత్తి కారకాల వ్యయాలను బట్టి కూడా ఒక వస్తువు సప్లయ్ మారుతుంది. ఉత్పత్తి కారకాల ధరలు పెరిగితే, వాటి సహాయంతో ఉత్పత్తి చేసే వస్తువుల వ్యయాలు పెరుగుతాయి, కనుక ఉత్పత్తి తగ్గి, సప్లయ్ తగ్గుతుంది. అలానే ఉత్పత్తి కారకాల ధరలు తగ్గితే వస్తుసప్లయ్ పెరుగుతుంది.

### iii) ఉత్పత్తిదారుని లక్ష్యాలు

సాధారణంగా లాభర్జనే ఉత్పత్తి దారుని లక్ష్యం, కనుక గరిష్ట లాభాలను ఆర్జించగల స్థాయిలోనే ఉత్పత్తి చేస్తాడు. లాభాల కన్నా అమ్మకాలను పెంచుకోవటం అతని లక్ష్యం. అయితే సప్లయ్‌ని పెంచవచ్చు. కనుక ఉత్పత్తి దారుని లక్ష్యాలు సప్లయ్‌ని ప్రభావితం చేస్తాయి.

### iv) ఉత్పత్తిలో ఉపయోగించే సాంకేతిక పరిజ్ఞానం

సాంకేతిక స్థితి అభివృద్ధి చెందుతూ ఉంటే, కొత్త యంత్రాల సృష్టి వలన ఉత్పత్తి పద్ధతుల్లో మార్పులు వస్తాయి. ఫలితంగా ఉత్పత్తి వ్యయం తగ్గి, సప్లయ్ పెరుగుతుంది. కనుక ధర స్థిరంగా ఉన్నప్పటికి, సాంకేతికాభివృద్ధి వల్ల సప్లయ్ పెరుగుతుంది. పైన వివరించిన కారకాలు అన్ని సప్లయ్‌ని ప్రభావితం చేయును. వస్తువు ధర స్థిరంగా ఉన్నా వస్తు సప్లయ్ ఈ కారకాల ప్రభావం వలన తగ్గవచ్చు లేదా పెరగవచ్చు.

పైన పేర్కొన్న అంశాలన్నీ వస్తు సప్లయిని ప్రభావితం చేసే ప్రభావితాలు. ధరలో మార్పు లేనప్పటికీ, ఇతర కారకాల వల్ల, సప్లయి పెరగవచ్చు లేదా తగ్గవచ్చు.

***3. సప్లయ్ పరిమాణంలో మార్పు, సప్లయ్‌లో పెరుగుదల వివరించండి?***

**జ: అ) సప్లయ్ పరిమాణంలో పెరుగుదల**

సప్లయ్‌లో పెరుగుదల అనగా, ఇతర పరిస్థితులు స్థిరంగా ఉండగా ధర పెరిగిన కారణంగా సప్లయ్ పెరగటం. ఉదా॥కు పెన్ను ధర పెరిగితే పెన్నుల సప్లయ్ పెరుగుతుంది. ఎడమ నుండి కుడికి పైకి వాలుతున్న సప్లయ్ రేఖ ద్వారా సప్లయ్‌లో పెరుగుదల క్రింది పటంలో చూపబడింది. సప్లయ్‌లో మార్పులు ధరలో మార్పువల్ల జరిగితే అవి ఒకే సప్లయ్ రేఖ వెంట జరుగుతాయి. అంటే సప్లయ్ రేఖపై ఒక బిందువు నుండి వేరొక బిందువుకు కదలికలు ఉంటాయి.




పెన్నుల సప్లయ్

**సప్లయ్‌లో వచ్చే మార్పు**

### ఆ) సప్లయ్‌లో పెరుగుదల

ధర మారకుండా ఇతర అంశాలలో మార్పువల్ల సప్లయ్ పెరిగితే దానిని సప్లయ్‌లో పెరుగుదల అంటారు. ఇతర అంశాలు లేదా కారణాలు అంటే ఉత్పత్తి కారకాల ధరలు, సాంకేతిక పరిజ్ఞానం, వాతావరణం మొదలగున వాటిలో వచ్చే మార్పులు ప్రభావితం చేయును. దీనిని బట్టి ధరమారకుండా సప్లయ్ పెరగటంను సప్లయ్‌లో పెరుగుదల అనవచ్చు. దీనిని క్రింది పట్టిక ద్వారా చూపవచ్చు.

| పెన్నుధర (రూ॥లలో) (1) | వాస్తవ సప్లయ్ (2) | తగ్గిన సప్లయ్ (3) |
|---|---|---|
| 2 | 20 | 30 |
| 3 | 30 | 40 |
| 4 | 40 | 50 |
| 5 | 50 | 60 |
| 6 | 60 | 70 |

పై పట్టికలోని మొదటికాలమ్‌లో ధరలు పెరిగేకొద్దీ సప్లయ్ కూడా పెరుగుతున్నట్లు గమనించవచ్చు. దీనిని పేపర్‌పై గీచినచో ఈ క్రింది పటంను పొందగలము.




పెన్నుల సప్లయ్ (నెలఒక్కింటికి)

**సప్లయ్‌లో పెరుగుదల**

పై పటంలో SS పూర్వపు సప్లయ్‌రేఖ. సప్లయ్‌లో వచ్చిన పెరుగుదలను $S_1S_1$ రేఖ చూపుతుంది. అనగా సప్లయ్‌లో వచ్చిన మార్పును చూపే రేఖ కుడివైపుకి జరుగుతుంది. రూ. 4 ధర వద్ద సప్లయ్ పరిమాణం 40 కాగా, దానిని SS రేఖపై బిందువు 'A' తెలియజేస్తుంది. అదే ధర వద్ద సప్లయ్ 50 గా (అంటే సప్లయ్ 10 పెరిగినట్లు) $S_1S_1$ రేఖ చూపుతున్నది. సప్లయ్‌లో పెరుగుదలను చూపేరేఖ కుడివైపుకు జరుగుతుంది.

ధరలో పెరుగుదల కారణంగా సప్లయి పరిమాణంలో వచ్చే మార్పులను సప్లయి విస్తరణ అంటారు. అదే ధర వద్ద, ఇతర అంశాలలో మార్పు వల్ల సప్లయి మారినట్లయితే దానిని సప్లయి పెరుగుదల అంటారు. పటం వివరణలో చెప్పాలంటే, అదే సప్లయి రేఖపై ఊర్ధ్వ ముఖంలో మార్పు విస్తరణకు; కొత్త సప్లయిరేఖ ఎగువ వైపు ఏర్పడితే పెరుగుదలకు దారితీస్తుంది.

# 23

# ఉత్పత్తి సిద్ధాంతం

# [Production Theory]

## 23.1 పరిచయం

ఉత్పత్తి అనేది అర్థశాస్త్రంలో ఒక ముఖ్య కార్యక్రమం. ఉత్పత్తి చేయడానికి కొన్ని ఉత్పాదకాలు అవసరం. ఉత్పత్తి దారుడు ఈ ఉత్పాదకాల ను ఉపయోగించి మానవ అవసరాలు సంతృప్తిపరిచే విధంగా వస్తువులను ఉత్పత్తి చేస్తాడు. ఒక ఉత్పాదకం ఉత్పత్తి కి సహాయ పడితేనే అది ఉత్పత్తి కారకం అవుతుంది. ఉత్పత్తికి దోహదం చేసే ఉత్పత్తి కారకాలను భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపన అని నాలుగు విధాలుగా వర్గీకరించవచ్చు.

ఈ పాఠ్యాంశంలో మీరు ఉత్పత్తి అర్థాన్ని, దాని నిర్వచనాన్ని, ఉత్పత్తి ఫలం వంటి అంశాలతో పాటు, స్వల్ప కాలంలోను, మరియు దీర్ఘకాలంలోను ఉత్పత్తి కారకాలను మార్చడం ద్వారా ఉత్పత్తిని ఎట్లా చేయవచ్చునో అధ్యయనం చేస్తారు.

## 23.2 లక్ష్యాలు

- ఉత్పత్తి అర్థాన్ని, దాని నిర్వచనాన్ని వివరించగలరు.
- ఉత్పత్తి ఫలాన్ని వివరించగలరు.
- క్రమ క్షీణ ప్రతిఫల సిద్ధాంతాన్ని, దానితో సంబంధం ఉన్న ఇతర అంశాలను వివరించగలరు.
- ఉత్పత్తి కారకాల లక్షణాలను అర్థం చేసుకోగలరు.
- ఉత్పత్తి తరహాలో వచ్చే ప్రతి ఫలాలైన 1 పెరిగే ప్రతి ఫలాలు, 1. స్థిర ప్రతి ఫలాలు 3. క్షీణ ప్రతిఫలాలు అనే మూడు దశలుగా వర్గీకరించగలరు.
- ఉత్పత్తి సంస్థ మరియు పరిశ్రమ అభివృద్ధి చెందడం వల్ల వచ్చే అంతర్గత, బహిర్గత ఆదాలను వివరించగలరు.

## 23.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1.* ఉత్పత్తి**

**జ:** ఉత్పత్తి అంటే మానవ ప్రయోజనాల సృష్టి. వీటికి మారక విలువ ఉంటుంది.

***2.* ఉత్పత్తి ఫలం**

**జ:** ఒకానొక సమయంలో, అమలులో ఉన్న సాంకేతిక పరిజ్ఞానం దృష్ట్యా భౌతిక ఉత్పత్తికి, ఉత్పాదకాలకు మధ్య ఉన్న ఫలితాత్మక సంబంధాన్ని ఉత్పత్తి ఫలంగా నిర్వచించవచ్చు. ఉత్పత్తి ఫలాన్ని ఇట్లా పేర్కొనవచ్చు

ఉత్పత్తి O = f(a, b, c, d). ఉత్పత్తి కి దోహదం చేసే వివిధ ఉత్పత్తి కారకాలు a, b, c, d.

***3. ఉద్యమదారుడు అనగా ఎవరు?***

**జ:** ఉత్పత్తి కారకాలన్నింటిని సరైన నిష్పత్తిలో సమ్మేళన పరచి ఉత్పత్తి కొనసాగించే వ్యక్తిని ఉద్యమదారుడని అంటారు.

***4. చరానుపాతముల సూత్రం ఏమిటి?***

**జ:** స్వల్ప కాలంలో ఇతర ఉత్పత్తి కారకాలను స్థిరంగా ఉంచి, ఒక కారకాన్ని మాత్రమే మార్చి, ఉత్పత్తిని పెంచవచ్చు. దీనినే క్షీణ ప్రతిఫల సిద్ధాంతం లేదా చరానుపాత సూత్రం తెలియజేస్తుంది.

***5. తరహానసుసరించి ప్రతిఫలాల సూత్రంను పేర్కొనండి.***

**జ:** దీర్ఘకాలంలో అన్నీ ఉత్పత్తి కారకాలను మార్చి ఉత్పత్తిని పెంచవచ్చు. దీనిని తరహా ననుసరించి ప్రతి ఫలాల సిద్ధాంతం తెలియజేస్తుంది.

***6. మొత్తం ఉత్పత్తి అనగానేమి?***

**జ:** ఉత్పత్తి కారకాలను వివిధ యూనిట్లలో ఉపయోగించినందుకు జరిగిన ఉత్పత్తిని మొత్తం ఉత్పత్తి అంటారు. లేదా ఏ దశ వద్దనున్న అప్పటి వరకు నియమించబడిన ఉత్పత్తి కారకాలవలన ఏర్పడిన ఉత్పత్తి మొత్తం.

***7. సగటు ఉత్పత్తి అనగానేమి?***

**జ:** ఒక చరకారకం యొక్క యూనిట్ ఉత్పత్తి ని సగటు ఉత్పత్తి అంటారు. మొత్తం ఉత్పత్తిని, చర ఉత్పత్తి కారకం యూనిట్ల సంఖ్యచే భాగిస్తే సగటు ఉత్పత్తి లభిస్తుంది.

***8. ఉపాంత ఉత్పత్తి అనగానేమి?***

**జ:** ఉత్పత్తి కారకం అదనపు యూనిట్ నియామకం వల్ల మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదలను ఉపాంత ఉత్పత్తి అంటారు.

***9. ఉత్పత్తి అనగానేమి?***

**జ:** ఉత్పత్తి అంటే వివిధ రకాల ప్రయోజనాలను సృష్టించడం. అవి రూపప్రయోజనం, స్థాన ప్రయోజనం, కాల ప్రయోజనం మరియు సేవా ప్రయోజనం.

***10. అంతర్గత ఆదాలను పేర్కొనండి.***

**జ:** సంస్థ ఉత్పత్తి పరిమాణాన్ని పెంచితే వచ్చే ఆదాలను అంతర్గత ఆదాలని అంటారు. అవి సాంకేతిక, నిర్వహణ మార్కెటింగ్, ద్రవ్య సంబంధమైన, నష్టాన్ని భరించే ఆదాలు, శ్రామికసంబంధమైన ఆదాలు. మొ॥ వి.

***11. బహిర్గత ఆదాయాలను పేర్కొనండి.***

**జ:** పరిశ్రమ అభివృద్ధి చెందితే వచ్చే ఆదాలను బహిర్గత ఆదాలంటారు. పరిశ్రమలోని అన్నీ సంస్థలకూ వస్తాయి.

## రెండు మార్కు ల ప్రశ్నలు

***1. ఉత్పత్తి ఫలం పేర్కొనండి.***

జ: "ఒకానొక సమయంలో, అమలులో ఉన్న సాంకేతిక పరిజ్ఞానం దృష్ట్యా భౌతిక ఉత్పాదకాలకు, ఉత్పత్తికి మధ్య ఉన్న ఫలితాత్మక సంబంధాన్ని ఉత్పత్తి ఫలం" గా నిర్వచించవచ్చు. ఈ సంబంధాన్ని సమీకరణ రూపంలో క్రింది విధంగా పేర్కొనవచ్చు.

$Q = f\ (a,b,c,d)$ లేదా $Q = f\ (x_1, x_2)$

***2. భూమి అనగానేమి?***

జ: సాధారణ పరిభాషలో భూమి అంటే నేల లేదా ఉపరితలం అని అర్థం. కాని అర్థశాస్త్రంలో భూమి దాని మీద ఉన్న నీరు, వాతావరణం, ఖనిజాలు, ఇంధనం వంటి ఉత్పత్తికి దోహదం చేసే సహజ వనరులన్నింటిని భూమి గానే పరిగణిస్తారు.

***3. శ్రమ అనగానేమి?***

జ: సాధారణంగా భౌతిక రూపంలో అందించే శ్రమను మాత్రమే శ్రమగా భావిస్తారు. కాని అర్థశాస్త్రంలో ప్రతి ఫలాన్ని ఆశించి శారీరకంగా, మానసికంగా, ఉత్పత్తి ప్రక్రియ లో అందించే సేవలను శ్రమగా పేర్కొంటారు.

***4. మూలధనంగా అనగానేమి?***

జ: సాధారణంగా "మూలధనం" అంటే ద్రవ్యంగా భావిస్తారు. కాని అర్థశాస్త్రంలో "ఉత్పత్తి కి తోడ్పడే మానవ నిర్మితమైన యంత్రాలు, యంత్ర పరికరాలు, భవనాలు వంటి వాటన్నింటిని "మూలధనం" అంటారు.

***5. వ్యవస్థాపన అనగానేమి?***

జ: ఉత్పత్తి ప్రక్రియలో నిర్వహణ బాధ్యతను చూసే వ్యక్తిని వ్యవస్థాపకుడు లేదా ఉద్యమ దారుడని సాధారణంగా అంటారు. కాని అర్థశాస్త్రంలో "ఎవరైతే ఉత్పత్తి కారకాలన్నింటిని సమ్మేళన పరిచి, ఉత్పత్తి చేస్తూ, వ్యాపారంలో గల నష్ట భయాన్ని అనిశ్చితత్వాన్ని భరిస్తాడో, అతడే ఉద్యమదారుడని అంటారు.

***6. అంతర్గత నష్టదాయకాలు ఏవి?***

జ: పెద్ద తరహా ఆదాలు నిరంతరంగా రావు. ఒక పరిమితి తర్వాత సంస్థ లేదా పరిశ్రమ పరిమాణం పెరిగితే అంతర్గత, బహిర్గత ఆదాయంకు బదులు, అంతర్గత నష్ట దాయకాలు, బహిర్గత ఆదాలకు బదులు బహిర్గత నష్ట దాయకాలు వస్తాయి. కాబట్టి సంస్థ తరహా పెంచడానికి ఒక పరిమితి అంటూ ఉంది. బహిర్గత, అంతర్గత నష్టాల వల్ల సగటు వ్యయం పెరుగుతుంది.

*7. బహిర్గత నష్టాలు ఏవి?*

జ: పరిశ్రమ అభిలషణీయ స్థాయి దాటి విస్తరిస్తే, బహిర్గత ఆదాలకు బదులు, బహిర్గత నష్టాలు వస్తాయి. పరిశ్రమ ఎక్కువగా ఒక ప్రాంతంలో కేంద్రీకరించబడడం వల్ల యీ నష్టాలు వస్తాయి.

సంస్థలు ఒక ప్రాంతంలో కేంద్రీకరించబడితే సంస్థలకు ఉత్పత్తి కారకాల కొరత ఏర్పడుతుంది. సంస్థల మధ్య పోటీ వల్ల శ్రామిక వేతనాలు, ముడి పదార్థాల ధరలు వంటివి పెరుగుతాయి. తత్ఫలితంగా లాభాలు తగ్గుతాయి.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

*1. అంతర్గత ఆదాలను గూర్చి తెలియజేయండి.*

జ: ఒక సంస్థ తన ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినప్పుడు ఆ సంస్థకు వచ్చే ఆదాలను అంతర్గత ఆదాలు అంటారు. ఇవి ఆ సంస్థకు మాత్రమే వస్తాయి. వీటిని సాంకేతిక, నిర్వహణ, మార్కెటింగ్, ద్రవ్య పరమైన, పరిశోధన, శ్రామిక సంబంధమైన ఆదాలుగా వర్గీకరిస్తారు. వీటిని వివరంగా పరిశీలిద్దాం.

**1. సాంకేతిక ఆదాలు (Technical Economies) :**

పెద్ద సంస్థలు ఎక్కువ సామర్థ్యం కలిగిన పెద్ద యంత్రాలను, అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించగలవు. అంతే గాకుండా గతంలో ఏర్పాటు చేసిన అవిభాజ్య యంత్రాల అనుపయుక్త సామర్థ్యాన్ని పూర్తిగా ఉపయోగిస్తాయి. ఈ విధమైన యాంత్రిక పరమైన ప్రయోజనాలు ఉత్పత్తి వ్యయాన్ని తగ్గిస్తాయి.

**2. నిర్వహణ ఆదాలు (Marginal Economies) :**

సంస్థ ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినప్పుడు నిర్వహణ ఆదాలు వస్తాయి. ప్రత్యేక నైపుణ్యం గల నిర్వాహకులను పెద్ద సంస్థలు మాత్రమే నియమించగలవు. వీరు ఉత్పత్తిలో మంచి నిర్ణయాలను తీసుకోగలరు. వీరికి అధికవేతనాలను చెల్లించడం వల్ల ఉత్పత్తి ప్రక్రియను అత్యంత సమర్థవంతంగా పర్యవేక్షించగలరు. తత్ఫలితంగా శ్రామిక ఉత్పాదకత పెరుగుతుంది.

**3. మార్కెటింగ్ ఆదాలు Marketing Economies) :**

వస్తువులను అధిక మొత్తంలో కొనుగోలు, అమ్మకాలు జరపడం వల్ల పెద్ద సంస్థలకు మార్కెట్టు పరమైన ఆదాలు వస్తాయి. పెద్ద సంస్థలు అధిక మొత్తంలో ముడి పదార్థాలను తక్కువ ఖర్చుతో కొనగలవు. పైగా సంస్థలు సమర్థత గల మార్కెటింగ్ నిపుణులను నియమించుకోవడం వల్ల కావలసిన సమయంలో అవసరమైన ముడి పదార్థాలను సరసమైన ధరలకు కొనుగోలు చేస్తారు. అధిక ఉత్పత్తి కారణంగా వస్తువుల అమ్మకంలో రవాణా ఖర్చులు కలిసి వస్తాయి. ప్రచారాలు, ప్రకటనల వ్యయం కూడా తగ్గుతుంది. ఈ విధమైన మార్కెటింగ్ ఆదాలు సంస్థ ఉత్పత్తి వ్యయాన్ని తగ్గిస్తాయి.

**4. విత్త సంబంధమైన ఆదాలు (Financial Economies) :**

చిన్న సంస్థలు కంటె పెద్ద సంస్థలకు ద్రవ్య పరమైన ఆదాలు ఎక్కువ, పెద్ద సంస్థలకు ద్రవ్య మార్కెట్‌లో ఉన్న మంచి పేరు, ప్రతిష్టలు వల్ల తక్కువ వడ్డీ రేట్లకు ఎక్కువ మొత్తంలో రుణాలను పొందగలవు. అంతేగాక యీ సంస్థలపై

ప్రజలకున్న నమ్మకం వల్ల షేర్లు, డిబెంచర్ల ను జారీ చేయడం ద్వారా పెద్ద మొత్తంలో మూల ధనాన్ని సమకూర్చుకోగలవు.

**5. నష్టాన్ని భరించే ఆదాలు (Risk bearing Economies) :**

పెద్ద సంస్థలు విస్తృత పరిధిలో అనేక రకాల వస్తువులను ఉత్పత్తి చేయడం వల్ల వ్యాపార నష్టాన్ని కనిష్ట స్థాయికి తగ్గించగలవు. ఒక వస్తువులో నష్టం వాటిల్లినప్పటికి, దానిని ఇతర వస్తువుల లాభంతో భర్తీ చేయగలవు. అదేవిధంగా పెద్ద సంస్థలు దేశంలోని వివిధ మార్కెట్‌లో తమ వస్తువులను విక్రయిస్తుంటాయి. ఒక మార్కెట్‌లో నష్టం వాటిల్లినా మరో మార్కెట్‌లో వచ్చే ఆదాయంలో ఆ నష్టాన్ని సరిచేసికోగలవు.

**6. శ్రామిక సంబంధమైన ఆదాలు (Labour Economies) :**

పెద్ద సంస్థలు నిపుణులైన శ్రామికులను ఎక్కువ సంఖ్యలో నియమించుకోవడమే గాక, ఉత్పత్తి లో శ్రమ విభజన, ప్రత్యేకీకరణ ప్రవేశపెడుతుంది. తత్ఫలితంగా శ్రామిక ఉత్పాదకత పెరిగి, సగటు వ్యయం తగ్గుతుంది.

**7. పరిశోధన, అభివృద్ధి సంబంధమైన ఆదాలు (Research and Development) :**

పెద్ద సంస్థలు మాత్రమే పరిశోధన, అభివృద్ధి వంటి వాటిపై కోట్లది రూపాయలను వ్యయం చేయగలవు. తత్ఫలితంగా సాంకేతిక పరిజ్ఞానం వృద్ధి చెంది, వస్తువుల నాణ్యత పెరుగుతుంది. ఇది కూడా సగటు వ్యయాన్ని తగ్గిస్తుంది.

ఈ విధంగా పెద్ద సంస్థలు, చిన్న సంస్థల కంటె ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినందువల్ల కొన్ని ప్రయోజనాలను పొందుతాయి. అయితే యీ ప్రయోజనాలు కూడా ఒకే స్థాయి వరకే వస్తాయి. ఉత్పత్తి ఒక స్థాయికి మించినప్పుడు కొన్ని నష్టాలు ఏర్పడుతాయి. దీని వల్ల సగటు వ్యయం పెరిగి ఆదాలు క్షీణిస్తాయి.

***2. బహిర్గత ఆదాలను గూర్చి తెలియజేయండి.***

జ: పరిశ్రమ అభివృద్ధి చెందినప్పుడు, ఆ పరిశ్రమలోని సంస్థలన్నింటికి వచ్చేఆదాలను బహిర్గత ఆదాలని అందురు. అంటే ఒకే రకమైన వస్తువును ఉత్పత్తి చేసే సంస్థలన్నీ ఒకే ప్రాంతంలో స్థాపించినపుడు లభించే ఆదాలే బహిర్గత ఆదాలు. బహిర్గత ఆదాలను క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

### 1. కేంద్రీకరణ ఆదాలు (Economies of localisation) :

అనేక సంస్థలు ఒకే చోట కేంద్రీకృతం కావడం వల్ల సంస్థలన్నింటికి కొన్ని ప్రయోజనాలు లభిస్తాయి. అవి.

(ఎ) శిక్షణ పొందిన నైపుణ్యంగల శ్రామికులు లభిస్తారు.

(బి) రవాణా సౌకర్యాలు ఆ ప్రాంతంలో అభివృద్ధి చెందును.

(సి) బ్యాంకులు వంటి ఇతర ద్రవ్య సంస్థలు తమ శాఖలను అక్కడ నెలకొల్పి, తక్కువ వడ్డీకి మూలధనం సమకూరుస్తాయి.

(డి) విద్యుచ్ఛక్తి సదుపాయాలను, విద్యుత్ బోర్డులు కల్పించగలదు.

(ఇ) ముడి పదార్థాలను, యంత్ర పరికరాలను, అనుబంధ వస్తువులను సప్లయ్ చేయగల కొన్ని సంస్థలు ఏర్పడతాయి.

(యఫ్) కొరియర్ సంస్థలు, రవాణా చేసే సంస్థలు వంటి ప్రత్యేక సేవలు అందించే సంస్థలు ఏర్పడతాయి.

## 2. సమాచార సంబంధమైన ఆదాలు (Economies of Information) :

పరిశ్రమ అభివృద్ధి చెందినప్పుడు, ఆ పరిశ్రమలోని సంస్థలన్నీ వ్యాపారానికి సంబంధించిన ప్రచురణలకయ్యే వ్యయాన్ని సమిష్టిగా భరించగలవు. మార్కెట్‌కు సంబంధించిన సమాచారాన్ని దేశ, విదేశాలనుంచి అతి తక్కువ వ్యయంలో సంస్థలన్నీ పొందగలవు. ఈ సమాచారం ఆధారంగా జాతీయ, అంతర్జాతీయ వ్యాపార విధానాలలో వస్తున్న మార్పులను బట్టి, ఆయా సంస్థలు అనుసరించవలసిన వ్యూహాలను తయారు చేసుకోగలవు. యీ ఆదాలన్నీ సంస్థల ఉత్పత్తి వ్యయాన్ని తగ్గిస్తాయి.

## 3. విభజన సంబంధమైన ఆదాలు (Economies of disintegration) :

వివిధ ఉత్పత్తి ప్రక్రియలను ఆధార పూర్వకంగా పంపిణీ చేసుకున్నట్లయితే దీనిని ఆధార బంధమైన విభజన అంటారు. ఉదాహరణకు వస్త్రాల ఉత్పత్తి విషయంలో కొన్ని సంస్థలు ప్రత్తి నుండి దారం వడికేవిగాను, కొన్ని సంస్థలు వస్త్రాలు తయారు చేసే విధంగాను, ఇంకొన్ని సంస్థలు వస్త్రాలపై డిజైన్ ప్రిటింగ్ చేసే విధంగా ఉంటాయి. ఈ సంస్థలన్నీ పరస్పర ఆధారంగా పనిచేస్తాయి. ఈ విధంగా సంస్థలు ఒక్కొ రకమైన ఉత్పత్తి ప్రక్రియలో ప్రత్యేకీకరణ సాధించడం వల్ల సగటు వ్యయం తగ్గుతుంది. సంస్థలు అన్ని వివిధ రకాల వస్తువులను ఉత్పత్తి చేయకుండా, ప్రతి సంస్థ ఏదో ఒక రకమైన వస్తోత్పత్తిని చేపడుతుంది. దీనినే సమాంతర విభజన అంటారు. దీనిలో ప్రత్యేకీకరణ సాధించడం ద్వారా సంస్థ సగటు వ్యయాన్ని తగ్గించుకుంటాయి. ఉదా॥ కొన్ని సంస్థలు షర్టింగ్ వస్త్రాన్ని, కొన్ని సంస్థలు చీరలను, ఇంకొన్ని సంస్థలు దుప్పట్లను తయారు చేయడంలో ప్రత్యేకీకరణ సాధిస్తాయి.

## 4. ఉప పదార్థాలకు సంబంధించిన ఆదాలు (Economies of by product) :

పెద్ద పరిశ్రమలోని సంస్థలు ఉప పదార్థాలను సద్వినియోగం చేసుకోగలవు. ఉప పదార్థాలను, ముడి పదార్థాలుగా ఉపయోగించుకొని కొన్ని సంస్థలు అభివృద్ధి చెందుతాయి. ఉదా॥ పంచదారను ఉత్పత్తి చేసే సంస్థలన్నీ ఒకే చోట కేంద్రీకరించబడితే, దాని ఉపపదార్థాలను ఉపయోగించుకొని స్పిరిట్, మొలాసిన్, సారాయి వంటి వాటిని తయారు చేసే సంస్థలు దాని సమీపంలోనే ఏర్పడగలవు.

## 5. పరిశోధనా ఆదాలు (Economies of research and Development) :

పరిశ్రమలోని అన్నీ సంస్థలు కలిసి పరిశోధన పై వ్యయం చేసి, కొత్త వస్తువులను, నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని కనుక్కోవడం వల్ల సంస్థలకయ్యే వ్యయాలు తగ్గుతాయి. వ్యక్తిగతంగా వ్యయం చేయలేని సంస్థలు, సమిష్టిగా కలిసి వ్యయం చేయడం వల్ల అత్యంత ఖరీదైన పరిశోధనా ఫలాలను తక్కువ ఖర్చులో పొందగలవు.

## 6. సంక్షేమ పరమైన ఆదాలు (Economics) of Welfare) :

పరిశ్రమ అభివృద్ధి చెందడంవల్ల, అన్ని సంస్థలు కలిసి తక్కువ వ్యయంతో సంక్షేమ కార్యక్రమాలను చేపట్టగలవు.

ఉదాహరణకు శ్రామికులకు గృహవసతి, విద్యా సదుపాయాలు, వైద్యశాలలు మరియు ఆహ్లాదకరంగా గడపడానికి ఆటస్థలాలు, అమ్యూజిమెంటు మొదలగు వాటిని ఏర్పాటు చేయగలవు. ఇవన్నీ శ్రామిక సామర్థ్యాన్ని ప్రభావితం చేసి ఉత్పత్తి పెరగడానికి దోహదం చేస్తాయి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. చరానుపాత్రముల సూత్రాన్ని పటం సహాయంతో వివరింపుము.***

జ: ఈ సిద్ధాంతాన్ని వాస్తవంగా బ్రిటీషు ఆర్థిక వేత్తలైన టి.ఆర్ మాల్థస్, డేవిడ్ రికార్డో, మరియు జె.యస్ మిల్ వంటి వారు ప్రతిపాదించారు. కాని నవ్య సాంప్రదాయ ఆర్థిక వేత్తగా పిలువడే ఆల్‌ఫ్రెడ్ మార్షల్ చేతిలో విశ్లేషించబడి, పూర్తి స్వరూపాన్ని సంతరించుకున్నది. ఆ తర్వాత బెన్‌హమ్, స్టిగ్లర్ వంటి ఆర్థిక వేత్తలు దీనిలో కొన్ని మార్పులను ప్రవేశ పెట్టారు. "క్షీణ ప్రతి ఫల సిద్ధాంతం" యొక్క నూతన రూపమే "చరానుపాత సూత్రం". ఉత్పత్తి దారుడు ఉత్పత్తి కారకాలను మార్చడం ద్వారా, ఉత్పత్తి పరిమాణాన్ని మార్పు చేయగలడు. అయితే స్వల్ప కాలంలో యంత్రాలు, యంత్ర పరికరాలు, భవనాలు వంటి వాటిని మార్చడంసాధ్యం కాదు. చరకారకాలను మాత్రమే మార్పు చేయడం ద్వారా ఉత్పత్తి పెంచగలం.

మార్షల్ క్షీణ ప్రతిఫల సూత్రం వ్యవసాయరంగానికి మాత్రమే వర్తిస్తుందని భావించాడు. కాని ఆధునిక ఆర్థిక వేత్తలు యీ సూత్రం వ్యవసాయరంగానికేగాక. పరిశ్రమల వంటి ఇతర రంగాలన్నింటికి వర్తిస్తుందని పేర్కొన్నారు.

మార్షల్ అభిప్రాయంలో "వ్యవసాయ పద్ధతులలో మార్పు లేకుండా ఒక నిర్ణీత భూమిపై శ్రమను, మూలధనాన్ని పెంచుతున్నట్లయితే సాధారణంగా పంట తక్కువ అనుపాతం లో పెరుగుతుంది." ఇదే క్షీణ ప్రతిఫల సిద్ధాంతం. ఈ సిద్ధాంతం యొక్క అంతర్గత భావం ఏమిటంటే భూమిని స్థిరంగా ఉంచి, మూలధనాన్ని, శ్రామికులను పెంచుతున్నట్లయితే ఒక దశ తర్వాత ఉత్పత్తి క్షీణిస్తుంది.

### ప్రమేయాలు (Assumptions) :

1. చర ఉత్పత్తి కారకం యొక్క యూనిట్లు సజాతీయాలు.
2. సాంకేతిక పద్ధతులలో ఎటువంటి మార్పు లేదు.
3. ఉత్పత్తి కారకాలను స్థిరంగా ఉంచి ఒక కారకాన్ని మాత్రమే మార్చవలెను.
4. ఉత్పత్తి కారకాల సమ్మేళనాన్ని మార్పు చేయవచ్చు.
5. ఈ సిద్ధాంతం స్వల్పకాలానికి మాత్రమే వర్తిస్తుంది.
6. ఈ క్షీణ ప్రతి ఫలాలు ఒక దశ దాటిన తర్వాత మాత్రమే వస్తాయి.

ఈ సిద్ధాంతాన్ని ఈక్రింది పట్టిక, పటం ద్వారా వివరించడమైనది.

## పట్టిక : చరానుపాత సూత్రం

| శ్రామికులసంఖ్య | మొత్తంఉత్పత్తి (TP) | ఉపాంతఉత్పత్తి (MP) | సగటుఉత్పత్తి (AP) | దశలు |
|---|---|---|---|---|
| 0 | 0 | 0 | 0 | I వ దశ |
| 1 | 5 | 5 | 5 | |
| 2 | 12 | 7 | 6 | |
| 3 | 18 | 6 | 6 | II వ దశ |
| 4 | 20 | 2 | 5 | |
| 5 | 20 | 0 | 4 | |
| 6 | 18 | –2 | 3 | III వ దశ |
| 7 | 14 | –4 | 2 | |

ఇక్కడ మనం ఇతర ఉత్పత్తి కారకాలు స్థిరంగా ఉన్నాయని, శ్రమ ను మాత్రమే చరకారకంగా ప్రమేయం చేశాం. పట్టిక లోని మొదటి వరుస శ్రామికులను పెంచుతున్నట్లు తెలియజేస్తున్నది. మిగిలిన మూడు వరసలు మూడు రకాల ఉత్పత్తులను అంటే మొత్తం ఉత్పత్తి (TP) సగటు ఉత్పత్తి (AP) ఉపాంత ఉత్పత్తు(MP)లను తెలియజేస్తున్నాయి. శ్రామికులను వివిధ యూనిట్లలో నియమించడం వల్ల సాధించిన ఉత్పత్తిని మొత్తం ఉత్పత్తి (TP) తెలియజేస్తున్నది.

పట్టిక లో చూపినట్లు శ్రామికులను పెంచుకుంటూ పోతే, మొత్తం ఉత్పత్తి, ఉపాంత ఉత్పత్తి, సగటు ఉత్పత్తులు మొదట్లో పెరుగుతున్నాయి. ఈ దశనే పెరిగే ప్రతి ఫలాల దశ అంటారు. విజ్ఞత గల ఉద్యమదారుడు ఈ దశలో ఉత్పత్తిని ఆపడు. ఒక దశ తర్వాత మొత్తం ఉత్పత్తి గరిష్టమై, ఆ తర్వాత క్షీణిస్తుంది. ఈ ప్రక్రియలో మొదట ఉపాంత ఉత్పత్తి, తర్వాత సగటు ఉత్పత్తి, చివరకు మొత్తం ఉత్పత్తి కూడా తగ్గడాన్ని గమనించవచ్చు. ఉపాంత ఉత్పత్తి 2వ శ్రామికుని వరకు పెరిగి ఆ తర్వాత క్షీణిస్తూ 5వ శ్రామికుని వద్ద శూన్యమై, ఆ పిమ్మట రుణాత్మకమైనది. దీనిని వివరంగా పటం సహాయమున విశదీకరించడమైంది.




పటంలో OX – అక్షంపై చర ఉత్పత్తి కారకం శ్రామికులను, OY అక్షంపై ఉత్పత్తిని చూపించాం.పటంలో ఉత్పత్తి మూడు దశలో మారడాన్ని చూడవచ్చు. రేఖ మొత్తం ఉత్పత్తి ని తెలియజేస్తున్నది. మొదటి దశలో ఈ రేఖ ఎక్కువ రేటులో పెరుగుతున్నది. దీనితో పాటు సగటు, (APC) మరియు (MPC) ఉపాంత ఉత్పత్తులు కూడా పెరగడాన్ని చూడవచ్చు. 3 వ శ్రామికుని వద్ద సగటు, ఉపాంత ఉత్పత్తులు రెండూ సమానమైనందున, MPC రేఖ APC రేఖను ఖండించుచున్నది. ఇంతవరకు ఇది మొదటి దశ.

రెండవ దశలో మొత్తం ఉత్పత్తి తగ్గుతున్న రేటు లో పెరుగుతుండగా, దానితో పాటు సగటు, ఉపాంత ఉత్పత్తులు క్రమంగా క్షీణిస్తున్నాయి. నవ శ్రామికుని వద్ద మొత్తం ఉత్పత్తి గరిష్టం కాగా, ఉపాంత ఉత్పత్తి శూన్యంగాను, సగటు ఉత్పత్తి తగ్గ నారంభించడాన్ని చూడవచ్చు. హేతుబద్ధుడైన ఉత్పత్తిదారుడు ఈ దశ తర్వాత ఉత్పత్తి చేయడు.

మూడవ దశలో అదనంగా శ్రామికులను నియమించే కొలది మొత్తం ఉత్పత్తి క్షీణిస్తుంది. ఉపాంత ఉత్పత్తి రుణాత్మకం అవుతుంది. ఏ ఉత్పత్తి దారుడు కూడా ఈ దశలో ఉత్పత్తి చేయడు. దీనిని పటంలో 6 వ శ్రామికుని తర్వాత నుంచి గమనించవచ్చు. దీనినే క్షీణ ప్రతిఫలాల దశ అంటారు. కాబట్టి హేతుబద్ధుడైన ఉద్యమదారుడు రెండవ దశ వరకు ఉత్పత్తిని కొనసాగిస్తాడు.

# 24
# పంపిణీ సిద్ధాంతం
# (Theory of Distribution)

## 24.1 పరిచయం

ఉత్పత్తి కారకాలైన భూమి, శ్రమ, మూలధనం, వ్యవస్థాపనల సమిష్టి కృషి ఫలితమే ఉత్పత్తి. సంపదను ఉత్పత్తి చేయడానికి యీ నాలుగు ఉత్పత్తి కారకాలు సమిష్టి గా పని చేస్తాయి. అందుచేత యీ కారకాలు ఉత్పత్తి కొరకు తమ సేవలనందించినందుకు గాను వాటికి ప్రతిఫలాలను చెల్లించాల్సిన అవసరం ఉంది. ఈ కారణంగా పంపిణీ సమస్య ఎదురవుతుంది. పంపిణి అంటే ఉత్పత్తి కి సహకరించిన వివిధ ఉత్పత్తి కారకాలు అవి ఉత్పత్తి చేసిన సంపదలో భాగస్వాములు కావడం వలన వాటికి ప్రతిఫలంను చెల్లించవలెను. ఈ కారకాలు పొందిన మొత్తమే జాతీయాదాయ మవుతుంది. దీనిని బట్టి దేశంలో భూస్వాములు, శ్రామికులు, పెట్టుబడి దారులు, వ్యవస్థాపకులనే వివిధ వర్గాల మధ్య జాతీయాదాయం ఏ విధంగా పంపిణీ అవుతుందో కూడా తెలుసుకోవచ్చు.

## 24.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నల అధ్యయనం ద్వారా మీరు

- వైయుక్తిక పంపిణి, విధులననుసరించి పంపిణి మధ్యగల తేడాను అర్థం చేసుకోగలరు.
- ఉపాంత ఉత్పాదక పంపిణీ సిద్ధాంతాన్ని వివరించగలరు.
- భాటకానికి సంబంధించిన వివిధ భావనలను అర్థం చేసుకోగలరు.
- వేతనానికి సంబంధించిన వివిధ భావనలను అర్థం చేసుకోగలరు.
- వివిధ వడ్డీ సిద్ధాంతాలను వివరించగలరు.
- వివిధ లాభ సిద్ధాంతాలను వివరించగలరు.

## 24.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. పంపిణీ అనగానేమి?***

జ: పంపిణి అంటే ఉత్పత్తి కి సహకరించిన వివిధ ఉత్పత్తి కారకాలు అవి ఉత్పత్తి చేసిన సంపదలో భాగస్వాములు కావడం వలన వాటికి ప్రతిఫలంను చెల్లించడం. ఉత్పత్తికి దోహదం చేసిన ఉత్పత్తి కారకాలు, ఉత్పత్తి చేసిన సంపదలో భాగస్వాములు కావడమే పంపిణి.

***2. జాతీయాదాయం అనగానేమి?***

జ: ఒక సంవత్సర కాలంలో ఉత్పత్తి కారకాలు పొందిన ఆదాయాల మొత్తమే జాతీయాదాయం.

***3. విధులననుసరించి పంపిణీ?***

జ: ఉత్పత్తి ప్రక్రియలో, ఉత్పత్తి కారకాలు సేవలనందించినందుకు గాను అవి ఏ విధంగా ప్రతిఫలాలను పొందినాయో విధుల ననుసరించి జరిగే పంపిణి తెలియజేస్తుంది.

***4. వైయక్తిక పంపిణీ అనగానేమి?***

జ: వ్యక్తులు ఎంత ఆదాయాన్ని పొందినారో వైయక్తిక పంపిణి తెలియజేస్తుంది.

***5. ఉపాంత ఉత్పత్తి అనగానేమి?***

జ: అదనంగా ఒక ఉత్పత్తి కారకాన్ని పెంచినందువల్ల అదనంగా సమకూరే ఉత్పత్తిని ఉపాంత ఉత్పత్తి అంటారు.

***6. ఆర్థిక భాటకం అనగానేమి?***

జ: ఉత్పత్తి కారకంగా భూమి అందించిన సేవకు చెల్లించే ధర ఆర్థిక భాటకం.

***7. ఉపాంత భూమి అనగానేమి?***

జ: భాటకం లేని భూమిని ఉపాంత భూమి అంటారు.

***8. కృత్రిమ భాటకం అనగానేమి?***

జ: స్వల్పకాలంలో మానవ నిర్మితమైన భవనాలు, యంత్రాలు వంటి ఉత్పత్తి కారకాలు ఆర్జించే మిగులు ఆదాయాలను కృత్రిమ భాటకం అంటారు.

***9. వాస్తవిక వేతనం అనగానేమి?***

జ: ద్రవ్య వేతనం యొక్క కొనుగోలు శక్తిని వాస్తవిక వేతనం అంటారు.

***10. స్థూల వడ్డీ అనగానేమి?***

జ: రుణగ్రహీత, రుణదాతకు చెల్లించే మొత్తం వడ్డీని స్థూలవడ్డీ అంటారు.

***11. లాభం అనగానేమి?***

జ: నిర్వాహకుడుగా ఉద్యమదారుడు చేసే సేవకు ప్రతి ఫలంగా పొందేది లాభం.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. విధులననుసరించి ఆదాయ పంపిణి అనగానేమి?***

జ: అర్థశాస్త్రంలో "పంపిణి" అనే పదాన్ని విధుల ననుసరించి జరిగే పంపిణీ అనే అర్థంలోనే వాడుతారు. ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొన్న ఉత్పత్తి కారకాలకు సేవలనందించినందుకు గాను, ప్రతి ఫలాలను ఎట్లా పొందడం జరిగిందో విధులననుసరించిన పంపిణి సిద్ధాంతం తెలియజేస్తుంది. మరొక విధంగా చెప్పాలంటే ప్రజలు లేదా ఉత్పత్తి

కారకాల యజమానులు ఒకానొక కాల వ్యవధిలో తమ సేవల ద్వారా ఉత్పత్తి ప్రక్రియలో ప్రత్యేకమైన విధులు నిర్వహించినందుకు ప్రతి ఫలంగా జాతీయాదాయంలో పొందిన వాటాలను విధులననుసరించి పంపిణి తెలియజేస్తుంది.

***2. వైయుక్తిక పంపిణీని వివరించండి.***

జ: ఇది సూక్ష్మ ఆర్థిక భావన, వ్యక్తుల మధ్య జరిగే జాతీయాదాయ పంపిణీనే వైయుక్తిక పంపిణి అంటారు. సంఘంలోని వ్యక్తుల ఆర్థిక కృషి ద్వారా పొందిన ఆదాయాలను, సంపదను వైయుక్తిక పంపిణి తెలియజేస్తుంది. సాధారణంగా వ్యక్తులు అనేక విధాలుగా ఆదాయాలను సంపాదిస్తారు. అందుచేత ఇక్కడ మనం వ్యక్తులు ఏ విధంగా ఆదాయాలను సంపాదించారు. ఏ రూపాలలో సంపాదించారనే విషయంపైనే ప్రధానంగా దృష్టిని కేంద్రీకరించి, చర్చించడం జరుగుతోంది. అంతే కాకుండా ఆదాయ సంపాదనలో వ్యక్తుల మధ్యగల తేడాలను, ఆర్థిక అసమానతలకుదారి తీసే కారణాలను వైయుక్తిక పంపిణి సిద్ధాంతం తెలియజేస్తుంది.

***3. కాంట్రాక్ట్ భాటకం ( ఒప్పంద భాటకం)ను పేర్కొనండి.***

జ: ఏదేని వస్తువును ఒక నిర్ణీత కాలానికి ఉపయోగించుకున్నందుకు చెల్లించే వాణిజ్య సంబంధమైన అద్దెను కాంట్రాక్టు భాటకం అందురు. అంటె మన్నిక నిచ్చే వస్తువులైన భూమి, ఇల్లు, యంత్రాలు, కార్లు, ఫర్నీచర్ మొదలగు వాటి సేవలను ఒక నిర్ణీత కాలానికి ( నెల లేదా సంవత్సరం) ఉపయోగించుకున్నందుకు ముందు నిర్ణయించుకున్న ఒప్పందం మేరకు చెల్లించే ధరను ఒప్పంద భాటకం లేదా కాంట్రాక్టు భాటకం అందురు. అందుచేత ఇంటి అద్దె, కారు అద్దె, భూమికి చెల్లించే అద్దె, వి.సి.ఆర్ వంటి ఎలక్ట్రానిక్ వస్తువులకు చెల్లించే అద్దె వంటి వన్నీ కాంట్రాక్టు భాటకంగా పరిగణిస్తారు.

***4. ఆర్థిక భాటకం అనగానేమి?***

జ: అర్థశాస్త్రంలో భాటకం అంటే "ఆర్థిక భాటకం". ఇది వైవిధ్య మిగులు. రికార్డో అభిప్రాయం ప్రకారం ఉపాంత లేక తక్కువ సారవంతమైన భూముల కంటే ఎక్కువ సారవంతమైన భూములపై వచ్చే మిగులే ఆర్థిక భాటకం.

సంప్రదాయ ఆర్థిక వేత్తల అభిప్రాయంలో ఆర్థిక భాటకం అనేది భూమికి మాత్రమే వర్తిస్థుంది. కాని ఆధునిక ఆర్థిక వేత్తల అభిప్రాయంలో భాటకం అనేది అవ్యాకోచ సప్లయ్ గల ఏ ఉత్పత్తి కారకమైన ఆర్జించే ఆదాయం.

***5. కొరత భాటకం అనగానేమి?***

జ: ఆధునిక ఆర్థిక వేత్తలు కొరత భాటక సిద్ధాంతాన్ని మరింత నూతనంగా, వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా తెలియజేశారు. వీరి అభిప్రాయంలో భాటకం నిర్ణయించడానికి ఒక ప్రత్యేక సిద్ధాంతం అవసరం లేదు. ఇతర ఉత్పత్తి కారకాలకు మూల్యం ( ధర ) నిర్ణయించే విధంగానే భాటక నిర్ణయాన్ని కూడా డిమాండ్, సప్లయ్ సిద్ధాంతం ప్రాతిపదికగా నిర్ణయించవచ్చునని పేర్కొన్నారు. అందుచేతనే ఆధునిక భాటక సిద్ధాంతాన్ని డిమాండ్ సప్లయ్ సిద్ధాంతంగా పరిగణించవచ్చు.

***6. కృత్రిమ భాటకం అనగానేమి?***

జ: కృత్రిమ భాటకం అనే భావనను మొదట అర్థశాస్త్రంలో ప్రవేశ పెట్టింది ఆచార్య ఆల్‌ఫ్రెడ్ మార్షల్. వీరి అభిప్రాయంలో మానవుడు ఉత్పత్తి చేసిన ఉత్పత్తి కారకాలైన యంత్రాలు, యంత్ర పరికరాలు, భవనాలు, ఓడలు, చివరికి మానవశక్తి సామర్థ్యాలు వంటి వాటి సప్లయ్ స్వల్ప కాలంలో సిర్థంగా (అవ్యాకోచం) ఉన్నందున, అవి స్వల్ప కాలంలో ఆర్జించే మిగులే కృత్రిమ భాటకం. కాని దీర్ఘ కాలంలో వాటి సప్లయ్ వ్యాకోచంగా ఉంటుంది.

***7. బదిలీ సంపాదనను వివరించండి.***

జ: శ్రీమతి జోన్ రాబిన్‌సన్ "బదిలీ ఆర్జన" లేదా రాబడి సంపాదన అనే భావనను ప్రవేశ పెట్టింది. ఆర్థిక భాటకాన్ని అవకాశ వ్యయాల దృష్ట్యా వివరించడం జరిగింది.

రాబిన్‌సన్ అభిప్రాయంలో "ఒక ఉత్పత్తి కారకం ఒక పరిశ్రమలో ఉండేటట్లు చేయడానికి ఇవ్వవలసిన అవసరమైన కనీస ధర బదిలీ సంపాదన". సాధారణంగా ఉత్పత్తి కారకానికి అనేక ఉపయోగాలుంటాయి. ఒకానొక ఉపయోగంలో దాని ఉండేటట్లు చేయవలెనంటే దానికి అవకాశమున్న మరొక ఉపయోగంలో సంపాదించే దానికి సమానంగా మూల్యం చెల్లించాలి. దీనిని ఆ కారకం యొక్క అవకాశ వ్యయం లేదా బదిలీ సంపాదనగా పేర్కొనవచ్చు.

***8. వాస్తవిక వేతనం అనగానేమి?***

జ: ద్రవ్య రూపంలో కార్మికుడు పొందే ద్రవ్య వేతనం యొక్క కొనుగోలు శక్తిని వాస్తవిక వేతనం అంటారు. ఇది ప్రధానంగా ధరల స్థాయి పై ఆధారపడి ఉంటుంది. అందుచేత శ్రామికుని ఆస్తి విలువ కు నిజమైన కొలమానంగా వాస్తవిక వేతనాన్ని పేర్కొనవచ్చు.

***9. జీవనాధారవేతన సిద్ధాంతంను వివరించండి.***

జ: ఈ సిద్ధాంతాన్ని ఫ్రాన్స్ దేశానికి చెందిన భౌతిక వాదులు తెలియజేశారు. ఆ తర్వాత అర్థశాస్త్ర పితామహుడైన ఆడమ్‌స్మిత్ అభివృద్ధి పరచాడు. ఈ సిద్ధాంతం ప్రకారం దీర్ఘకాలంలో శ్రామిక వేతనాలు వారి జీవనాధార స్థాయికి స్థిరపడి, తమ కుటుంబాలను పోషించుకోవడానికి మాత్రమే సరిపడే విధంగా ఉంటాయి. అందుచేతనే ఈ సిద్ధాంతాన్ని 'వేతన కాఠిన్య' సిద్ధాంతమని, 'ఆయుఃకఠిన' సిద్ధాంతమని అంటారు.

***10. వేతన నిధి సిద్ధాంతంను వివరించండి.***

జ: ఆడమ్‌స్మిత్ ఆలోచనా విధానాలపై ఆధారపడి జె.యస్ మిల్ అనే ఆర్థిక వేత్త వేతన నిధి సిద్ధాంతాన్ని అభివృద్ధి పరచాడు. వీరి అభిప్రాయంలో వేతనాలు శ్రామికులను నియమించడానికి కేటాయించ బడిన వేతననిధిపై ఆధారపడి ఉంటాయి. శ్రామిక వేతనాలకు, వేతన నిధికి విలోమ సంబంధం ఉంటుంది. శ్రామికుల సంఖ్య తక్కువగా ఉంటేనే వేతనాలు ఎక్కువగా ఉంటాయి.

$$\text{వేతనం} = \frac{\text{వేతన నిధి}}{\text{శ్రామికుల సంఖ్య}}$$

***11. నిరీక్షణ వడ్డీ సిద్ధాంతంను వివరించండి.***

జ: నాసూ సీనియర్ అనే ఆర్థిక వేత్త నిరీక్షణ వడ్డీ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. వీరి అభిప్రాయం ప్రకారం ప్రస్తుత వినియోగాన్ని త్యజించి చేసిన పొదుపు నుండి మూలధనం ఏర్పడుతుంది. దీనిలో త్యాగం ఇమిడి ఉంటుంది. కాబట్టి "ప్రస్తుత వినియోగాన్ని త్యాగం చేసినందుకు చెల్లించే ప్రతిఫలమే వడ్డీ" అని సీనియర్ అంటాడు.

***12. ద్రవ్యత్వాభిరుచి వడ్డీ సిద్ధాంతంను పేర్కొనండి.***

జ: ఈ సిద్ధాంతాన్ని జె.యమ్. కీన్స్ ప్రతిపాదించాడు. కీన్స్ ఉద్దేశ్యంలో వడ్డీ అనేది ద్రవ్య సంబంధమైన విషయం. ద్రవ్యాన్ని దగ్గర ఉంచుకోవాలనే కోర్కెను ద్రవ్యత్వాభిరుచి అంటారు. అటువంటి "ద్రవ్యత్వాభిరుచిని విడనాడినందుకు చెల్లించే ప్రతిఫలమే వడ్డీ" అని నిర్వచించాడు.

***13. ఋణాత్మక నిధుల వడ్డీ సిద్ధాంతంను వివరించండి.***

జ: నట్ విక్సిల్, రాబర్టు సన్ వంటి ఆర్థిక వేత్తలు రుణాత్మక నిధుల వడ్డీ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. దీనినే నవ్య సాంప్రదాయ వాదుల వడ్డీ సిద్ధాంతం అని కూడా అంటారు. వీరి అభిప్రాయంలో "ఋణాత్మక నిధులను ఉపయోగించుకున్నందుకు చెల్లించే ధరే వడ్డీ". రుణాత్మక నిధులంటే పొదుపు, గుప్తంగా దాచి ఉంచిన ధనం, మూలధన క్షయం, బ్యాంకు రుణాలు మొ॥ వి. ఋణాత్మక నిధుల సప్లయ్ మరియు డిమాండ్ కలిసి వడ్డీ రేటును నిర్ణయిస్తాయి.

***14. స్థూల వడ్డీ అనగానేమి?***

జ: రుణ గ్రహీత, రుణదాతకు చెల్లించే మొత్తం వడ్డీని స్థూలవడ్డీ అంటారు. స్థూల వడ్డీలో క్రింది పేర్కొన్న అంశాలు చేరి ఉంటాయి.

***15. నికరవడ్డీ అనగానేమి?***

జ: కేవలం మూలధనమే సేవలకు ఇచ్చే ప్రతిఫలాన్ని నికరవడ్డీ అంటారు. దీనిలో క్రింది అంశాలు ఇమిడి ఉంటాయి.

ఎ. నష్టభయానికి చెల్లించే మూల్యం

బి. అసౌకర్యానికి చెల్లింపు

సి. రుణదాత యొక్క సేవలకు గాను మూల్యం

డి. ద్రవ్య విలువలో వచ్చే మార్పులకు చెల్లించే పరిహారం.

స్థూల వడ్డీ = నికరవడ్డీ + నష్ట భయానికి చెల్లించే మూల్యం + ఋణదాత యొక్క సేవలకు ప్రతిఫలం + ద్రవ్య విలువలో వచ్చే మార్పులకు చెల్లించే పరిహారం

***16. స్థూల లాభం అనగానేమి? వివరించండి.***

జ: సాధారణ పరిభాషలో 'లాభం' అంటే స్థూల లాభమే. ఉత్పత్తి సంస్థ మొత్తం రాబడికి, మొత్తం వ్యయానికి మధ్యగల తేడాయే స్థూలలాభం. "బహుముఖమైన వ్యాపార వ్యవహారం. నిర్వహించనందుకు గాను, వ్యవస్థాపకుడు పొందే ధరే "లాభం." స్థూల లాభంలో క్రింది అంశాలు కలిసి ఉంటాయి.

(a) వ్యాపార నిర్వహణకు ఇవ్వవలసిన వేతనం మరియు తరుగుదల చార్జీలు వంటి అంతర్గత వ్యయాలు.

(b) వ్యవస్థాపకుని స్వంత ఉత్పత్తి కారకాలకు ఇవ్వవలసిన ప్రతి ఫలాలు.

(c) గాలి పాటు ఆదాలు, గుత్యాధిపత్య లాభాలు వంటి వ్యవస్థాపకేతర లాభాలు

(d) నికరలాభం

(e) సాధారణ లాభాలు

***17. నికరలాభం అనగానేమి? వివరించండి.***

జ: వ్యవస్థాపనకు ఉత్పత్తి పరమైన సేవలకు మాత్రమే వచ్చే ప్రతి ఫలాన్ని నికర లాభం అంటారు. నికరలాభంలో క్రింది అంశాలు చేరి ఉంటాయి.

(a) నిర్వహణ విధులు

(b) మార్కెటింగ్ సేవలు

(c) నవకల్పనలకు ప్రతిఫలం

(d) సంవిధానం

***18. సామాన్య లాభాలను పేర్కొనండి.***

జ: వ్యవస్థాపకుడు పరిశ్రమలో కొనసాగుతూ, యాజమాన్య విధులు నిర్వహించడానికి పొందవలసిన కనీస లాభాన్ని సామాన్య లాభం అంటారు.

***19. అధిక లాభాలను పేర్కొనండి.***

జ: ఉత్పత్తి సంస్థకు అయ్యే వ్యయం కన్నా రాబడి అధికంగా వస్తే వచ్చే లాభాలను అధికలాభాలు లేదా గరిష్ట లాభాలని అంటారు. ఇది శేషించిన మిగులు, వ్యవస్థాపకునికి వచ్చే ఆర్థిక భాటకమని ఆర్థిక వేత్తలు పేర్కొన్నారు.

***20. నవకల్ప నల సిద్ధాంతంను వివరించండి.***

జ: అమెరికా దేశానికి చెందిన జోసఫ్ ఘుంపీటరు అనే ఆర్థిక వేత్త యీ సిద్ధాంతాన్ని ప్రతి పాదించాడు. వీరి అభిప్రాయం ప్రకారం ఉద్యమదారుని ప్రధాన విధి ఉత్పత్తి ప్రక్రియలో నవకల్పనలను ప్రవేశ పెట్టడం, నవకల్పనలు విజయవంతమైనట్లయితే ఉత్పత్తి వ్యయానికి, వస్తువు ధరలకు మధ్య తేడా వచ్చి వ్యవస్థాపకుడు లాభాల నార్జిస్తాడు.

క్రొత్త వస్తువులను ఉత్పత్తి చేయడం, క్రొత్త ఉత్పత్తి పద్దతులను లాభసాటిగా ఉపయోగించడం, క్రొత్త మార్కెట్‌ను కనుగొనడం, క్రొత్త ముడి పదార్థాలను కనుగొని, వాటిని ఉత్పత్తిలో ఉపయోగించడం, యాజమాన్య పద్ధతులలో మార్పులు ప్రవేశ పెట్టడం వీటినన్నింటిని నవకల్పనలని అంటారు. ఘుంపీటరు అభిప్రాయంలో "ఉద్యమదారుడు సంస్థలో నవకల్పనలనే ప్రత్యేక విధిని నిర్వహిస్తున్నందుకు ఇచ్చే ప్రతి ఫలమే లాభం".

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. వాస్తవిక వేతనాన్ని నిర్ణయించే అంశాలేవి?***

జ: ద్రవ్య రూపంలో కార్మికుడు పొందే ద్రవ్య వేతనం యొక్క కొనుగోలు శక్తిని వాస్తవిక వేతనం అంటారు. ఇది ప్రధానంగా ధరల స్థాయి పై ఆధారపడి ఉంటుంది. అందుచేత శ్రామికుని ఆస్తి విలువ కు నిజమైన కొలమానంగా వాస్తవిక వేతనాన్ని పేర్కొనవచ్చు.

**వాస్తవిక వేతనాన్ని నిర్ణయించే అంశాలు :**

ఈ క్రింది పేర్కొన్న అనేక అంశాలు వాస్తవిక వేతనాన్ని ప్రభావితం చేస్తాయి.

1. **ద్రవ్య కొనుగోలు శక్తి :**

   ద్రవ్య కొనుగోలు శక్తికి, ధరల స్థాయికి మధ్య విలోమ సంబంధం ఉంటుంది. ధరల స్థాయి పెరిగితే ద్రవ్య కొనుగోలు శక్తి తక్కువగా ఉంటుంది. అదేవిధంగా ధరల స్థాయి తక్కువగా ఉంటే ద్రవ్య కొనుగోలు శక్తి అదనంగా ఉంటుంది.

2. **అదనపు సదుపాయాలు :**

   ద్రవ్య వేతనంతో పాటు, శ్రామికుడు అదనపు సదుపాయాలు పొందుతున్నట్లయితే అతని వాస్తవిక వేతనం ఎక్కువగా ఉండును. ఉదాహరణకు మంచి గృహ వసతి, సబ్సిడీతో కూడిన భోజనం, విద్య, వైద్య సౌకర్యాలు మొ॥ వి.

3. **ఉద్యోగ స్థిరత్వం :**

   ద్రవ్య వేతనం తక్కువగా ఉన్నా శ్రామికుని ఉద్యోగం పర్మినెంటు అయ్యే అవకాశం ఉన్నట్లయితే వాస్తవిక వేతనం ఎక్కువ. అదే విధంగా ఉద్యోగం తాత్కాలికమైనదైతే, ద్రవ్యవేతనాన్ని అధికంగా పొందుతున్నప్పటికి వాస్తవిక వేతనం తక్కువగా భావించాలి.

4. **పని స్వభావం :**

   శ్రామికుడు చేసే పని ప్రమాదకరమైనదిగాను, ఎక్కువ రిస్కులో కూడుకున్నట్లయితే వాస్తవిక వేతనం తక్కువగా భావించాలి. ఉదా॥ శ్రామికుడు చేసే పని ఎక్కువ రిస్కుతో కూడుకున్నది. అందుచేత శ్రామికుని వాస్తవిక వేతనం తక్కువ.

5. **భవిష్యత్తు అవకాశాలు :**

   శ్రామికుడు చేసే ఉద్యోగంను భవిష్యత్తులో ఉన్నతస్థాయికి చేరగల ప్రమోషన్ అవకాశాలు ఉన్నట్లయితే అతని వాస్తవిక వేతనం అధికమని చెప్పవచ్చు.

6. **పని పరిస్థితులు :**

   పని పరిస్థితులంటే పనిగంటలు, తీరిక మరియు ఆహ్లాదకరంగా గడిపేసమయం మొ॥వి. శ్రామికుడు పని చేసే ప్రదేశం గాలి, వెలుతురు, ఉండి అక్కడ వాతావరణం ఆహ్లాదకరంగా ఉన్నట్లయితే అతని వాస్తవిక వేతనం అధికమని భావించాలి.

7. **సకాలంలో వేతనాలు :**

శ్రామికుడు పొందే వేతనం క్రమం తప్పకుండా నిర్ణీతమైన రోజు పొందుతుంటే అతని వాస్తవిక వేతనం ఎక్కువగా భావించవచ్చు.

8. **సాంఘిక ప్రతిష్ఠ :**

కొన్ని ఉద్యోగాలు సంఘంలో గౌరవ ప్రతిష్టలనుగలుగజేస్తాయి. ఆ కారణంగా ద్రవ్య వేతనం తక్కువగా ఉన్నా, వాస్తవిక వేతనం ఎక్కువ. ఉదా॥ ఒక యస్ఐ వేతనం, ఆఫీసులో పని చేసే సీయర్ అసిస్టెంట్ వేతనానికి సమానం. అయితే యస్ఐ యొక్క వాస్తవిక వేతనం ఎక్కువగా భావించవచ్చు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఉపాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతాన్ని వివరించండి.***

జ: ఉపాంత ఉత్పాదక పంపిణీ సిద్ధాంతం సాధారణ పంపిణీ సిద్ధాంతం. మొదట్లో శ్రమకు ప్రతిఫలంగా వేతనం నిర్ణయించడానికి యీ సిద్ధాంతాన్ని రూపొందించారు. ఆ తర్వాత అన్నీ ఉత్పత్తి కారకాలకు ధరను (ప్రతిఫలాలను) నిర్ణయించేందుకు సాధారణ సిద్ధాంతంగా ఉపయోగిస్తున్నారు.

ఈ సిద్ధాంతం ప్రకారం ప్రతి ఉత్పత్తి కారకం యొక్క ధర లేదా ప్రతిఫలం దాని ఉపాంత ఉత్పాదకతను బట్టి నిర్ణయించబడుతుంది. సాధారణంగా ప్రతి ఉత్పత్తిదారుని ముఖ్య లక్ష్యం గరిష్ట లాభాల ఆర్జించడం. అందుచేత ఉత్పత్తి కారకాలను నియమించి వస్తు సేవలను ఉత్పత్తి చేస్తాడు. ఉత్పత్తి కారకాలను నియమించే కొద్ది కారకాల ఉత్పాదకత పెరుగుతూ ఉంటుంది. కాని ఉపాంత ఉత్పాదకత క్షీణిస్తుంది. ఉపాంత ఉత్పాదకత అంటే అదనంగా ఒక ఉత్పత్తి కారకాన్ని ఉపయోగించడం వల్ల అదనంగా వచ్చే ఉత్పత్తి. మరొక విధంగా చెప్పవలెనంటే అదనంగా ఒక ఉత్పత్తి కారకాన్ని ఉపయోగించడం వల్ల మొత్తం ఉత్పత్తిలో వచ్చే పెరుగుదలే ఉపాంత ఉత్పత్తి అవుతుంది. ఉత్పత్తి కారకాలు సజాతీయమని, ఒక కారకానికి బదులు మరొక కారకాన్ని ప్రతిస్థాపన చేయ వీలుంటుందని యీ సిద్ధాంతం ప్రమేయం చేస్తుంది. అందుచేత ఉత్పత్తి దారుడు అన్నీ ఉత్పత్తి కారకాల ఉపాంత ఉత్పాదకతకు సమానమయ్యే వరకు ఒక దానికి బదులు మరొక ఉత్పత్తి కారకాన్ని ప్రతిస్థాపన చేస్తూ ఉంటాడు.

ఉదాహరణకు వస్త్రాన్ని తయారు చేసే ఒక సంస్థ లో ముగ్గురు శ్రామికులు కలిసి 30 మీటర్ల వస్త్రాన్ని తయారు చేశారనుకుందాం. నాల్గవ శ్రామికుని నియమించినందున మొత్తం ఉత్పత్తి 40 మీటర్లకు పెరిగింది. మొత్తం వస్త్ర ఉత్పత్తిలో వచ్చిన అదనపు పెరుగుదల = 40 – 30 = 10 మీటర్లు. దీనినే ఉపాంత ఉత్పత్తి అంటారు. ఒక మీటరు వస్త్రాన్ని మార్కెట్‌లో రూ॥ 10 చొప్పున విక్రయించినప్పుడు ఉపాంత శ్రామికుని ఉత్పత్తి విలువ = 10×10 = రూ. 100. అందుచేత సంస్థ యజమాని ఉపాంత శ్రామికునకు 100 రూపాయిలకు మించకుండా వేతనం చెల్లించాలి.

ఇక్కడ ఉత్పత్తి కారకం యొక్క ఉపాంత ఉత్పాదకతను ఇట్లా లెక్కిస్తారు.

$MP_{n^{th}} = TP_n - TP_{n-1}$

$TP_n$ = కారకాల మొత్తం ఉత్పత్తి

$TP_{n-1}$ = (n – 1) యూనిట్ల కారకాల మొత్తం ఉత్పత్తి

∴ MP (ఉపాంత ఉత్పత్తి) = 40 – 30 = 10 మీటర్లు.

ఈ సిద్ధాంతాన్ని రేఖా పటం సహాయంతో వివరించడమైంది.




శ్రామికుల సంఖ్య

పై పటంలో శ్రామికుల సంఖ్యను OX అక్షం మీద, శ్రామికుల ఉపాంత ఉత్పాదకతను OY అక్షం మీద చూపించాము. శ్రామికులను నియమించే కొద్దీ ఉపాంత ఉత్పాదకత క్షీణిస్తుంది. అందుచేత MP రేఖ ఎడమ నుంచి కుడికి క్రిందికి వాలుతోంది. పటంలో OW వేతనం వద్ద సంస్థ యజమాని ON యూనిట్ల పరిమాణంలో శ్రామికులను నియమించాడు. ఇక్కడ శ్రామికుల ఉపాంత ఉత్పాదకతకు సమానంగా వారికి చెల్లించే మూల్యం (వేతనం) ఉంది.

పరిపూర్ణ పోటీ ఉన్న శ్రామిక మార్కెట్టులో శ్రామిక వేతనాలు వారి ఉపాంత ఉత్పాదకతకు సమానంగా ఉండటమే కాక, అది తిరిగి శ్రామిక సప్లయ్ డిమాండ్‌లను నిర్ణయిస్తుంది.

### ప్రమేయాలు

ఉపాంత ఉత్పాదక పంపిణీ సిద్ధాంతం క్రింది పేర్కొన్న ప్రమేయాలపై ఆధార పడి ఉంది.

1. వస్తు మరియు కారకాల మార్కెట్‌లో పరిపూర్ణ పోటీ ఉంటుంది.
2. అన్నీ ఉత్పత్తి కారకాలు సజాతీయాలు.
3. అన్నీ ఉత్పత్తి కారకాలు ఒక దానికి బదులు మరొకటి పూర్తి ప్రత్యామ్నాయాలు.
4. సాంకేతిక పరిజ్ఞానంలో ఎటువంటి మార్పు ఉండదు.
5. సంస్థ యొక్క ముఖ్య లక్ష్యం గరిష్ట లాభాలను ఆర్జించడం.
6. ఉత్పత్తి కారకాలకు పూర్తి గమనశీలత ఉంటుంది.
7. ఉత్పత్తి కారకాలకు, ధరను నిర్ణయించడంలో ప్రభుత్వ జోక్యం ఉండదు.
8. సంపూర్ణ ఉద్యోగిత ఉంటుందనే ప్రమేయం.
9. క్షీణ ప్రతిఫలాల సూత్రం వర్తిస్తుంది.

## *2. భాటకం అనగానేమి? రికార్డో భాటక సిద్ధాంతాన్ని వివరింపుము.*

జ: అర్థశాస్త్రంలో భాటకం అంటే "ఆర్థిక భాటకం". ఇది వైవిధ్య మిగులు. రికార్డో అభిప్రాయం ప్రకారం ఉపాంత లేక తక్కువ సారవంతమైన భూముల కంటే ఎక్కువ సారవంతమైన భూములపై వచ్చే మిగులే ఆర్థిక భాటకం. సంప్రదాయ ఆర్థిక వేత్తల అభిప్రాయంలో ఆర్థిక భాటకం అనేది భూమికి మాత్రమే వర్తిస్తుంది. కాని ఆధునిక ఆర్థిక వేత్తల అభిప్రాయంలో భాటకం అనేది అవ్యాకోచ సప్లయ్ గల ఏ ఉత్పత్తి కారకమైన ఆర్జించే ఆదాయం.

### రికార్డో భాటక సిద్ధాంతం

సాంప్రదాయ ఆర్థిక వేత్తలలో పేరెన్నికగన్న డేవిడ్ రికార్డో తన ప్రఖ్యాత గ్రంథమైన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి అండ్ టాక్సేషన్" లో భాటక సిద్ధాంతాన్ని తెలియ జేశాడు. రికార్డో భాటకం ఎట్లా నిర్ణయ మవుతుందో తెలియజేయలేదు. కాని భూసారాలలో ఉన్న తేడా వల్ల భాటకం ఎట్లా ఉత్పన్న మవుతుందో వివరించాడు.

"భూమి యొక్క అనశ్వరమైన సహజ శక్తులను ఉపయోగించుకున్నందుకు భూస్వామికి చెల్లించే ఫలసాయంలోని భాగమే భాటకం" రికార్డో నిర్వచించాడు. ఈ నిర్వచనాన్ని బట్టి రికార్డో సిద్ధాంతంలోని ముఖ్యాంశాలను క్రింది విధంగా పేర్కొనవచ్చు.

1. భూమినుపయోగించు కున్నందుకు చెల్లించే ప్రతి ఫలమే భాటకం.
2. ప్రకృతి కుండే లోభిత్వగుణాన్ని భాటకం వివరిస్తుంది
3. భాటకం మిగులు చెల్లింపు
4. భాటకం వైవిధ్య మిగులు
5. క్షీణ ప్రతిఫలాలు
6. భాటకం స్వచ్ఛమైన ఆర్థిక మిగులు
7. భాటకం ఉత్పత్తి వ్యయంలో భాగం కాదు

### భాటక నిర్ణయం

భూసారాలలో ఉండే తేడాల వల్ల భాటకం ఎలా ఉత్పన్నమవుతుందో రికార్డో ఒక ఉదాహరణ సహాయంతో వివరించాడు. ఒక కొత్త దేశానికి నివాసం కోసం కొంత మంది ప్రజలు వివిధ జట్లుగా వలస పోతున్నారనే ఉదాహరణ తో రికార్డో తన సిద్ధాంతాన్ని ప్రారంభించాడు.

దేశంలోని భూమి యొక్క సారాన్ని బట్టి ఎ,బి మరియు సి అనేకరకాలుగా విభజించడమైనది. మొదట ఒక దేశానికి వెళ్ళిన కాందీశీకులు మొదట అధిక సారవంతమైన ఎ గ్రేడు భూమిని సాగు చేస్తారు. శ్రమ మరియు మూలధనం రూపంలో రూ. 500 పెట్టుబడిగా పెట్టి 30 బస్తాల ధాన్యాన్ని ఉత్పత్తి చేశారని భావిద్దాం. మొట్ట మొదట్లో పంటను అమ్మగా వచ్చే రాబడి ఉత్పత్తి వ్యయానికి సమానంగా ఉన్నందున ఖర్చులు పోను మిగులు అంటూ ఉండదు. అందుచేత 'ఎ' 'గ్రేడు భూమిలో భాటకం లేదు.

కొంతకాలానికి జనాభా పెరగడం, మరింతమంది కాందీశీకులు నూతన దేశానికి వలసరావడంతో ఆహార ధాన్యాలకు డిమాండ్ పెరుగుతుంది. వ్యవసాయ ఆహార ధాన్యాలకు డిమాండ్ పెరుగుతుంది. వ్యవసాయ రంగంలో క్షీణ ప్రతిఫలాల కారణంగా, 'బి' గ్రేడు భూమిని సాగు చేస్తారు. ఇక్కడ 500 పెట్టుబడి పెట్టి తక్కువ సారవంతమైన బి గ్రేడు భూమిలో 25 బస్తాల ధాన్యం మాత్రమే పండించారనుకుందాం. A గ్రేడు భూమితో పోల్చితే బి గ్రేడు భూమిలో ఉత్పత్తి వ్యయం ఎక్కువ కారణంగా ఎ గ్రేడు భూమిలో ఉత్పత్తి పరంగా వచ్చే మిగులు = 30 – 25 = 5 బస్తాలు. ఇదే 'ఎ' గ్రేడు భూమిలో

ఉత్పన్నమయిన ఆర్థిక భాటకం.

కాలం మరింత గడిచే కొద్దీ, జనాభా పెరగడం మూడవ జట్టు కాందీశీకులు వలసరావడంతో భూమికి డిమాండ్ మరింత పెరిగి, తక్కువ సారవంతమైన 'సి' గ్రేడ్ భూమిని సాగు చేయవలసి వస్తుంది. ఇక్కడ రూ. 500 పెట్టుబడిగా పెట్టినందున 15 బస్తాలు మాత్రమే పండించడం జరిగింది. రికార్డో అభిప్రాయంలో మార్కెట్టు లో పంట ధర "సి" గ్రేడు భూమి ఉత్పత్తి వ్యయానికి సమానంగా ఉంటుంది. అందుచేత 'సి' గ్రేడు భూమిలో ఖర్చులు పోను మిగులు లేనందున భాటకం ఉత్పన్నం కాదు. ఈ భూమినే ఉపాంత భూమి అంటారు. అయితే 'ఎ' గ్రేడు భూమిలో పెరిగిన మిగులు = 30 – 15 = 15 బస్తాలు గాను, బి గ్రేడు భూమిలో ఉత్పన్నమైన మిగులు 25 – 15 = 10 బస్తాలుగా పేర్కొనవచ్చు.

ఈ విధంగా భూసారంలో ఉండే తేడాల వలన భాటక ఉత్పన్నమవుతుంది. దీనిని ఒక ఉదాహరణ సహాయంతో భాటక మరియు పటంలో చూపడం జరిగింది.

పట్టిక

| భూమి గ్రేడులు | ఉత్పత్తి వ్యయం రూ॥ | ఉత్పత్తి (బస్తాలలో) | భాటక (భౌతిక రూపంలో) |
|---|---|---|---|
| ఎ | 500 | 30 | 15 |
| బి | 500 | 25 | 10 |
| సి | 500 | 15 | – |




భూముల గ్రేడులు

పటంలో OX అక్షంపైన వివిధ గ్రేడుల భూములను, OY అక్షం మీద వాటి ఉత్పత్తులను చూపించాము. పటంలోని దీర్ఘ చతురస్రాలు, వివిధ గ్రేడుల భూములలో పంట దిగుబడులను తెలియజేస్తాయి. సి గ్రేడు భూమి ఉపాంత భూమి, కాబట్టి యీ భూమిలో భాటకం లేదు. మిగిలిన అన్నీ భూములలో దీర్ఘ చతురస్రాలలో చూపిన షేడెడ్ ఏరియా ప్రకారం ఉత్పత్తి ఖర్చులు పోను మిగులు ( భాటకం) వస్తుంది.

# 25

# ధర నిర్ణయం

# (Price Determination)

## 25.1 పరిచయం

ఒక ఆసక్తికరమైన అంశం, వస్తువుయొక్క డిమాండ్ మరియు సప్లయ్‌లు ఒక వస్తువు ధరను నిర్ణయించును. డిమాండ్, సప్లయ్‌లు ఏ విధంగా ధరను నిర్ణయించునో ఈ పాఠ్యాంశము వివరించును. అంతే కాకుండా సప్లయ్, డిమాండ్‌లలో వచ్చే మార్పుల వలన ధర ఏ విధంగా మారుతుందో కూడా దీనిలో తెలుసుకోవచ్చు.

## 25.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ◆ వస్తు సప్లయ్, డిమాండ్‌లు దాని ధరను ఎలా నిర్ణయిస్తాయి?
- ◆ సమతౌల్య ధర – అర్థం
- ◆ అధిక డిమాండ్, అధిక సప్లయ్ భావనలు
- ◆ వస్తుధరపై అధిక డిమాండ్, సప్లయ్‌ల ప్రభావం
- ◆ వస్తుధరపై డిమాండ్, సప్లయ్‌లలోని మార్పుల ప్రభావం

## 25.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. సమతౌల్య ధర***

జ: డిమాండ్, సప్లయ్‌లు సమానం అయిన చోట సమతౌల్య ధర నిర్ణయించబడుతుంది.

***2. అధిక డిమాండ్ అనగానేమి?***

జ: నిర్ణీత ధర వద్ద సప్లయ్ కన్నా డిమాండ్ ఎక్కువగా ఉండటాన్ని అధిక డిమాండ్ అంటారు.

***3. అధిక సప్లయ్ అనగానేమి?***

జ: నిర్ణీత ధర వద్ద డిమాండ్ కన్నా సప్లయ్ ఎక్కువ ఉండటాన్ని అధిక సప్లయ్ అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. సమతౌల్యధర అనగానేమి?***

జ: కొనుగోలుదారులు తక్కువ ధర వద్ద ఎక్కువ పరిమాణంలో వస్తువును డిమాండ్ చేస్తారు, పెరిగిన ధర వద్ద తక్కువ డిమాండ్ చేస్తారు, దీనికి భిన్నంగా ఉత్పత్తి దారులు పెరిగిన ధర వద్ద ఎక్కువ సప్లయ్, ధర తగ్గినప్పుడు తక్కువ సప్లయ్ చేస్తుంటారు. అమ్మకందార్ల, కొనుగోలుదార్ల ఈ ప్రవర్తన డిమాండ్ మరియు సప్లయ్ సూత్రాల ద్వారా వివరించబడినది. ఒకానొక ధరల వద్ద అమ్మకం మరియు కొనుగోలు పరిమాణాలు సమానం అవుతాయి. ఆ ధరనే సమతౌల్యధర అంటారు.

***2. ధరపై డిమాండ్‌లో పెరుగుదల ప్రభావం***

జ: ఒకే ధర వద్ద వస్తువుకు అధిక డిమాండ్ ఉన్నట్లయితే దానిని డిమాండ్‌లో పెరుగుదల అంటారు. సప్లయ్ పట్టిక స్థిరంగా ఉన్నప్పుడు డిమాండ్‌లో వచ్చే పెరుగుదల సమతౌల్య ధరను పెంచుతుంది.

***3. ధరపై సప్లయ్‌లో తగ్గుదల ప్రభావం***

జ: సప్లయ్ తగ్గినందువల్ల సప్లయ్ రేఖ ఎడమ వైపుకు జరుగుతుంది. డిమాండ్ స్థిరంగా ఉండగా సప్లయ్ తగ్గితే ధర పెరుగుతుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. అధిక డిమాండ్ అనగానేమి? ధరపై అధిక డిమాండ్ ప్రభావాన్ని సోదాహరణముగా వివరింపుము.***

*జ:* ఏదైనా ధర వద్ద సప్లయ్ పరిమాణం కన్నా డిమాండ్ మించి ఉంటే ఆ పరిస్థితిని అధిక డిమాండ్ అంటారు. ఉదాహరణకు రూ2 ధర వద్ద బంగాళదుంపల సప్లయ్ 10 కిలోలు కాగా, డిమాండ్ 30 కిలోలు ఉన్నది. అంటే రూ 2 ల ధర వద్ద అధిక డిమాండ్ కలదు.

**ధర, డిమాండ్, సప్లయ్‌లపై అధిక డిమాండ్ ప్రభావం దిగువ పేర్కొన మార్పులకు దారితీస్తుంది.**

i) కొనుగోలు దార్ల మధ్య పోటీ వల్ల వస్తువు ధర పెరుగును.

ii) ధర పెరగనారంభిస్తే, కొనుగోలు దార్ల డిమాండ్ తగ్గుతుంది.

iii) ధర పెరగటం వల్ల, అమ్మకందార్లు అమ్మకాలను పెంచుతారు.

vi) వస్తు ధరలో పెరుగుదల, డిమాండ్‌లో తగ్గుదలకు, సప్లయ్‌లో విస్తరణకు దారితీసి, చివరకు డిమాండ్, సప్లయ్‌లు సమానమయ్యే ధర ఏర్పడుతుంది.

v) ఈ సమతౌల్య ధర, సమతౌల్య ఉత్పత్తిని కూడా నిర్ణయిస్తుంది. ఈ విధంగా చివరికి అధిక డిమాండ్ తొలగిపోతుంది. పటం ద్వారా అధిక డిమాండ్ భావన మరియు, అది ఎలా తొలగిపోతుందో తెలుసుకోవచ్చు. బంగాళదుంపల డిమాండ్, సప్లయ్ పరిమాణం




పటంలో 2 రూ॥ల ధర వద్ద డిమాండ్ 30 కిలోలు కాగా సప్లయ్ 10 కిలోలలు. అనగా 20 కిలోల అధికడిమాండ్ కలదు. కొనుగోలు దార్లు ఈ దశలో ఎక్కువ కొనడానికి పోటీ పడుతారు. దీని ద్వారా ధరలు పెరుగుతాయి. ధర 3 రూపాయలకు పెరిగినప్పుడు సప్లయ్ 15 కిలోలు (TE) మరియు డిమాండ్ 25 కిలోలు (TF), ధర పెరుగుతున్నప్పుడు డిమాండ్, సప్లయ్ రేఖల గమనాన్నే గమనించండి. సప్లయ్‌లో పెరుగుదలను రేఖపై చూపవచ్చు. B నుంచి E వరకు అదే సమయంలో డిమాండ్ C నుండి F కు పెరిగింది. అయినా డిమాండ్ 10 కిలోలు అధికంగా ఉంది. (EF) దీనివల్ల ధర మరింత పెరిగి 4 రూపాయలకు చేరుకుంది. ఈ దశలో డిమాండ్, మరియు సప్లయ్‌లు A బిందువు వద్ద 20 కిలోలలకు సమానంగా (QA) ఉన్నాయి. 4 రూపాయల ధర వద్ద డిమాండ్ మరియు సప్లయ్‌లు సమానం. కిలో 4 రూ. కావున ఇది సమతౌల్యధర. 20 కిలోలు అనేది సమతౌల్య పరిమాణం.

***2. అధిక సప్లయ్ అనగానేమి? ధరపై అధిక సప్లయ్ ప్రభావాన్ని పటం సహాయంతో వివరింపుము.***

**జ:** నిర్ణీత ధర వద్ద డిమాండ్ కన్నా అమ్మకాల పరిమాణం అధికంగా ఉంటే ఆ పరిస్థితిని అధిక సప్లయ్ అంటారు.

**ధర, డిమాండ్ సప్లయ్‌లపై అధిక సప్లయ్ ప్రభావం**

వస్తువు సప్లయ్ అధికంగా ఉంటే దిగువ పేర్కొన్న మార్పులు చోటు చేసుకుంటాయి.

i) ఏదైనా ధర వద్ద అధిక సప్లయ్ ఏర్పడితే అమ్మకందార్లు తమ ఉత్పత్తిని అమ్ముకోలేరు. ఫలితంగా వారి మధ్య పోటీ ఏర్పడి దానివల్ల ధర తగ్గుతుంది.

ii) ధర పడిపోతున్నప్పుడు డిమాండ్‌లో పెరుగుదల, సప్లయ్‌లో సంకోచం కలుగుతాయి. ఫలితంగా అధిక సప్లయ్ తగ్గుతుంది.

iii) డిమాండ్, సప్లయ్‌లు సమానం అయ్యే స్థాయికి చేరే వరకు ధర పడిపోవటం, డిమాండ్ పెరగటం, సప్లయ్ సంకోచిచటం అనే మార్పులు కొనసాగుతూనే ఉంటాయి.

iv) సమతౌల్య ధర , ఉత్పత్తి నిర్ణయమయ్యాక, అధిక సప్లయ్ తొలగిపోతుంది. అధిక సప్లయ్ పరిస్థితిని పటం ద్వారా చూపవచ్చు.




పటంలో రూ 6 ధర వద్ద, సప్లయ్ 30 కిలోలు లేదా (TF) అయితే డిమాండ్ 10 కిలోలు. ఇక్కడ 20 కిలోలు అధిక సప్లయ్ ఉంది కనుక అమ్మకందార్ల మధ్య పోటీ ఏర్పడి ధర 5 రూ. తగ్గుతుంది. ధర 6 రూపాయల నుంచి 5 రూ. తగ్గినప్పుడు డిమాండ్ (E నుండి B) కి పెరగడం, సప్లయ్ (F నుంచి C) తగ్గిన విషయాన్ని పటంలో గమనించవచ్చు. కిలో 5 రూపాయల ధర వద్ద కూడా సప్లయ్ ఇంకా 10 కిలోలు అధనంగా ఉంది (BC). దీని వల్ల ధర మరింత తగ్గుతుంది. డిమాండ్ మరియు సప్లయ్‌లు A బిందువు వద్ద ఖండించుకున్నాయి. 'A' బిందువు వద్ద ఏర్పడేదే సమతౌల్య ధర. ఈ ధర వద్ద సమతౌల్య పరిమాణము (20 కిలో)ను సూచిస్తుంది.

***3. మామిడి పండ్లకు గల మార్కెట్ డిమాండ్ మరియు మార్కెట్ సప్లయ్ దిగువ పట్టిక ద్వారా చూపబడ్డాయి.***

| ధర (కిలో ఒక్కంటికి) | డిమాండ్ పరిమాణం (రోజుకు, కిలోలలో) | సప్లయ్ పరిమాణం (రోజుకు, కిలోలలో) |
|---|---|---|
| 9 | 4 | 14 |
| 7 | 6 | 11 |
| 5 | 8 | 8 |
| 3 | 10 | 5 |
| 1 | 12 | 3 |

పై పట్టిక ఆధారంగా క్రింది ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము.

i) మామిడి పండ్ల సమతౌల్యధర ఏది? : **5**

ii) సమతౌల్యధర వద్ద డిమాండ్, సప్లయ్ పరిమాణాలు ఎంత? **8**

iii) వాస్తవధర సమతౌల్య ధర కన్నా అధికంగా ఉంటే ఏం జరుగుతుంది?

**మార్కెట్ డిమాండ్ మరియు మార్కెట్ సప్లయ్ సమతౌల్యం**

iv) వాస్తవధర సమతౌల్యధర కన్నా తక్కువగా ఉంటే ఏఏ మార్పులు సంభవిస్తాయి?

**సప్లయ్ పరిమాణం అధికం**

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. డిమాండ్ రేఖ, సప్లయ్‌రేఖల ద్వారా సమతౌల్యధర ఎట్లు నిర్ణయింపబడునో పటం సహాయంతో వివరించుము.***

**జ:** అమ్మకందార్లు, కొనుగోలుదార్లకు ఒకరి ఉద్దేశ్యాలు మరొకరికి తెలియవు. మరోవిధంగా చెబితే అమ్మకందార్లకు తమ వస్తువుకు గల మార్కెట్ డిమాండ్ పట్టిక తెలియదు. అలాగే కొనుగోలు దార్లకు మార్కెట్ సప్లయ్ పట్టిక తెలియదు. అమ్మకందార్ల, కొనుగోలుదార్ల స్వతంత్ర నిర్ణయాలపై డిమాండ్ సప్లయ్ పరిమాణాలు ఆధారపడి ఉండును. మార్కెట్‌లో ఒక అమ్మకందారుడు నిర్ణయించిన ధర వద్ద అమ్మకాలు జరిగితే అలా నిర్ణయించబడినది సమతౌల్యధర. కాని ఇలా జరగటం కేవలం యాదృచ్ఛికం.

ఉదాహరణకు మార్కెట్‌లో అమ్మకందారు నిర్ణయించిన ధర ఎక్కువని భావించి కొనుగోలు దారులు తక్కువ వస్తువులను డిమాండ్ చేశారనుకుందాం. అట్టి సందర్భంలో అమ్మకందార్లు ధరను తగ్గిస్తారు. అందువల్ల డిమాండ్ పెరుగుతుంది. ధర తగ్గటం వల్ల డిమాండ్ పెరగటం, సప్లయ్ తగ్గటం అనే ప్రక్రియ డిమాండ్, సప్లయ్‌లు సమానం అయ్యే వరకు కొనసాగుతాయి. అప్పుడు సమతౌల్య ధర ఏర్పడుతుంది. దీనిని పట్టికలో వివరించటం జరిగింది.

| **ధర కిలో ఒక్కంటికి రూ॥లలో** | **మార్కెట్ డిమాండ్ (రోజుకు) (కిలోలలో)** | **మార్కెట్ సప్లయ్ (రోజుకు) (కిలోలలో)** |
|---|---|---|
| (1) | (2) | (3) |
| 6 | 10 | 30 |
| 5 | 15 | 25 |
| 4 | 20 | 20 |
| 3 | 25 | 15 |
| 2 | 30 | 10 |

పై పట్టికలో 1వ కాలమ్‌లో బంగాళదుంపల ధర, 2వ కాలమ్‌లో మార్కెట్ డిమాండ్, 3వ కాలమ్‌లో మార్కెట్ సప్లయ్ చూపబడ్డాయి. పైన ఇచ్చిన పట్టికను జాగ్రత్తగా గమనిస్తే బంగళా దుంపల ధర కిలో 6 రూ. ఉన్నప్పుడు దాని సప్లయ్ 30 కిలోలు. కాని డిమాండ్ 10 కిలోలు. ధర కిలోకి 6 రూపాయల నుంచి 2 రూపాయలకు పడిపోయినప్పుడు డిమాండ్ పెరిగి సప్లయ్ పడిపోతుందని గమనించవచ్చు. ఒకవేళ అమ్మకం దార్లు కిలో ధర 6 రూపాయలుగా నిర్ణయించినప్పుడు, సప్లయ్ 30 కిలోలు. డిమాండ్ 10 కిలోలు. అంటే 10 కిలోల బంగాళా దుంపలు మాత్రమే అమ్మడానికి అవకాశం ఉంది. డిమాండ్ తక్కువ, సప్లయ్ ఎక్కువ ఉన్న కారణంగా బంగళాదుంపల ధరలు తగ్గే అవకాశం ఉంది. బంగాళ దుంప ధర కిలో 5 రూపాయలకు పడిపోయినప్పుడు డిమాండ్ 10 కిలోల నుండి 15 కిలోలలకు పెరిగి సప్లయ్ 30 కిలోల నుంచి 25 కిలోలకు తగ్గుతుంది. అయినప్పటికి డిమాండ్ కంటే సప్లయ్ ఎక్కువగా ఉంది. కాబట్టి

ధరలు ఇంకా తగ్గి కిలో 4 రూపాయలకు చేరుకున్న దశలో డిమాండ్ సప్లయ్ రెండునూ సమానమని గమనించవచ్చు. ఈ ధరవద్ద అమ్మకందార్లు 4 రూపాయలకు 20 కిలోలు కిలో అమ్మడానికి కొనుగోలుదారులు 20 కిలోలు కొనడానికి సిద్ధమైనారు. ఇదే సమతౌల్యధర.

డిమాండ్ రేఖ, సప్లయ్ రేఖల ద్వారా సమతౌల్యధర నిర్ణయాన్నే పటంలో వివరించబడింది.




బంగాళాదుంపల సప్లయ్, డిమాండ్ పరిమాణాలు

పటం చూపిన విధంగా DD డిమాండ్ రేఖ, SS సప్లయ్‌రేఖ, డిమాండ్ రేఖ ఎడమ వైపు నుంచి కుడి వైపుకు వాలినది. బంగాళాదుంపల ధర, డిమాండ్‌ల మధ్య ఇది విలోమ సంబంధాన్ని సూచిస్తుంది. సప్లయ్‌రేఖ ఎడమ నుంచి కుడికి పైకి వాలి అనులోమ సంబంధాన్ని సూచిస్తుంది. బంగాళాదుంపల ధర, సప్లయ్‌ల మధ్య ఈ రేఖ ప్రత్యక్ష సంబంధాన్ని సూచిస్తుంది. 'A' వద్ద ఈ డిమాండ్, సప్లయ్ రేఖలు ఖండించుకున్నాయి. బిందువు 'A' వద్ద, ధర కిలో 4 రూపాయల వద్ద, డిమాండ్ 20 కిలోలు, సప్లయ్ 20 కిలోలు. ఇప్పుడు డిమాండ్ మరియు సప్లయ్ సమానం. డిమాండ్‌కు సమానమైనటువంటి సప్లయ్ ఏర్పడినట్లయితే ఆ ధరను సమతౌల్యధర అంటారు. (కాబట్టి డిమాండ్ పరిమాణం, మరియు సప్లయ్ పరిమాణం సమానంగా ఉన్న ధర వద్ద గల పరిమాణాన్ని సమతౌల్యపరిమాణం అంటారు.)

పటంలో DD డిమాండ్ రేఖ, SS సప్లయ్ రేఖ ఈ రెండు రేఖలు వ్యతిరేక దిశలో పయనిస్తూ బిందువు 'A' వద్ద పరస్పరం ఖండించుకున్నాయి. బిందువు 'A' వద్ద ధర రూ.4 కాగా డిమాండ్, సప్లయ్‌లు రెండూ 20 కేజీలు. సప్లయ్, డిమాండ్‌ల సమానత్వం వల్ల ధర నిర్ణయించబడినది.

# 26
# వ్యయం (Cost)

## 26.1 పరిచయం

సూక్ష్మ అర్థశాస్త్రంలో ఉపయోగించే 'వ్యయం' లేదా ఉత్పత్తి వ్యయానికి సంబంధించిన వివిధ అంశాలను ప్రశ్న సమాధాన రూపంలో ఈ పాఠం నందు తెలుసుకుంటారు.

## 26.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలను అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- సూక్ష్మ అర్థశాస్త్రంలోను, వ్యాపారంలోను 'వ్యయం' వాడబడుతుంది. వీటి మధ్య తేడాలు వివరించటం.
- సూక్ష్మ అర్థశాస్త్రంలో వాడబడే వివిధ వ్యయ భావనలు
- స్థిర, చర వ్యయాలు – వీటి మధ్య గల తేడాలు
- ఉపాంత వ్యయం, సగటు వ్యయాల ద్వారా మొత్తం వ్యయాన్ని రాబట్టడం ఎలా?
- మొత్తం స్థిరవ్యయం, మొత్తం చరవ్యయం, సగటు స్థిర వ్యయం, సగటు చర వ్యయం, సగటు వ్యయం ఉపాంత వ్యయాలను తెలుసుకోవటం.

## 26.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. మొత్తం వ్యయం అనగానేమి?***

జ: మొత్తం స్థిరవ్యయాన్ని, మొత్తం చర వ్యయాన్ని కలపగా వచ్చేదే మొత్తం వ్యయం.

***2. సగటు వ్యయం అనగానేమి?***

జ: మొత్తం వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే సగటు వ్యయం వర్ణన వచ్చును.

***3. సగటు స్థిర వ్యయం అనగానేమి?***

జ: మొత్తం స్థిర వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే సగటు స్థిరవ్యయం వచ్చును.

***4. సగటు చర వ్యయం అనగానేమి?***

జ: మొత్తం చరవ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే చరవ్యయం వచ్చును.

***5. ఉపాంత వ్యయం***

జ: అదనపు యూనిట్‌ను ఉత్పత్తి చేయుటకు అయ్యే వ్యయమే అదనపు వ్యయం ఉపాంత వ్యయం.

*6.* *ద్రవ్య వ్యయం*

జ: సంస్థ అద్దెకు తెచ్చిన లేదా కొనుగోలు చేసిన ఉత్పత్తి కారకాలకు చెల్లించిన మొత్తం.

*7.* ***అస్పష్ట వ్యయం***

జ: ఉత్పత్తి దారుని సొంత సాధనాలకు రావలసిన మొత్తాలు. ఇవి ప్రత్యక్షంగా కన్పించవు.

*8.* *సాధారణ లాభం*

జ: వస్తు ఉత్పత్తి చేసినందుకు సంస్థ ఆశించే కనీస లాభం.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1.* *ద్రవ్యవ్యయాలు*

జ: వివిధ ఉత్పత్తి కారకాలకు ద్రవ్య రూపంలో చెల్లించిన మొత్తంను ద్రవ్యవ్యయాలు అందురు. ఇందులో భూమికి చెల్లించిన భాటకం, శ్రామికులకు వేతనాలు, మూలధనానికి వడ్డీ, వ్యవస్థాపనకు లాభాలు ఉండును. అదే విధంగా ముడిపదార్థాల ఖర్చు, విద్యుచ్ఛక్తి బిల్లులు మొ॥వి కూడా ఉంటాయి. ఇవన్నీ ఉత్పత్తి దారునికి అయ్యే ద్రవ్య చెల్లింపులు లేదా ప్రకటిత వ్యయాలు అందురు. సాధారణంగా వ్యాపారంలో ఈ ద్రవ్య వ్యయాలను మాత్రమే 'వ్యయం'గా భావిస్తారు.

*2.* ***అస్పష్ట వ్యయాలు / అప్రకటిత వ్యయాలు***

జ: ఇతరుల వద్ద నుండి పొందిన కారకాలకు చెల్లించిన ధరలను అప్రకటిత వ్యయాలు అంటారు. ఉదా॥కు ఉత్పత్తిదారుడు తన స్వంత డబ్బును పెట్టుబడిగా పెట్టవచ్చు. అతని కుటుంబ సభ్యులు శ్రామికులుగా పనిచేయవచ్చు. ఈ విధమైన స్వంత సాధనాలకు ఏమీ చెల్లించడు. కానీ ఈ సాధనాలకు చెల్లించవలసిన మొత్తాలు, వ్యయాలు క్రిందకే వస్తాయి. వీటినే అప్రకటిత లేదా అస్పష్టవ్యయాలు అంటారు. సూక్ష్మ అర్థశాస్త్రంలో, స్పష్టమైన వ్యయాలతో పాటు ఈ అప్రకటిత వ్యయాలను కూడా ఉత్పత్తి వ్యయంతో భాగంగా భావిస్తారు. అమలులో ఉన్న మార్కెట్ ధరల ఆధారంగా ఈ వ్యయాలను అంచనా వేయాలి. ఈ వ్యయాలను "అప్రకటితవ్యయాలు" అందురు. (ద్రవ్యవ్యయాలకు భిన్నమైనవి) ఈ వ్యయాలకు ఒక ఉదా : స్వంత భవనాన్ని వ్యాపార నిమిత్తం వాడితే వచ్చే అప్రకటిత అద్దె. ఇది వాస్తవంగా చెల్లించబడిన అద్దెకు సమానం. అదే విధంగా అస్పష్టలేదా అప్రకటిత వడ్డీ మరియు జీతాలను కనుగొనవచ్చు.

*3.* ***స్థిర వ్యయాలు అనగానేమి?***

జ: ఉత్పత్తి పరిమాణంతో పాటు మార్పు చెందని వ్యయాలను స్థిరవ్యయాలు అంటారు. భవనానికి చెల్లించే అద్దె, ఋణాలపై వడ్డీ, సిబ్బందికి వేతనాలు, జీతాలు, ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు మొ॥నవి స్థిరవ్యయాలు. స్వల్పకాలంలో ఉత్పత్తిని తగ్గించినా, నిలిపినా సంస్థ ఈ వ్యయాలను భరించాల్సిందే. వీటినే వ్యవస్థాపనా వ్యయాలు అని కూడా అంటారు.

### *4. చరవ్యయము అనగానేమి?*

జ: ఉత్పత్తి పరిమాణంతో పాటు మారే వ్యయాలను చర వ్యయాలు అంటారు. ముడి సరుకులు కోసం చేసిన ఖర్చు, తాత్కాలిక శ్రామికుల వేతనాలు, రవాణా ఖర్చులు, ఇంధన ఖర్చులు దీనికి ఉదాహరణ. ఉత్పత్తి జరిగితేనే ఇవి ఉంటాయి. ఉత్పత్తి నిలిపివేస్తే ఈ వ్యయాలు ఉండవు. వీటిని ప్రాథమిక వ్యయాలు అనికూడా అందురు. సంస్థ ఉత్పత్తిని తగ్గిస్తే ఖర్చు తగ్గుతుంది. ఉత్పత్తిని ఆపేస్తే ఖర్చు పెట్టనక్కర్లేదు.

### *5. మొత్తం వ్యయం (Total Cost) అనగానేమి?*

జ: ఒక సంస్థకు అయిన ద్రవ్య వ్యయాలు, అస్పష్ట వ్యయాలు, సాధారణ లాభాలను కలపగా వచ్చేదే మొత్తం వ్యయం. అనగా మొత్తం చర వ్యయం (TVC) + మొత్తం స్థిర వ్యయం (TFC) = మొత్తం వ్యయం TC. నెలకొల్పబడిన ఒక సంస్థలో ఇంకా ఉత్పత్తి జరగకపోతే ఆ సంస్థ మొత్తం వ్యయం, దాని మొత్తం స్థిర వ్యయానికి సమానం. ఉత్పత్తి ప్రారంభం కాగానే చర వ్యయం కూడా చోటు చేసుకోవటంతో మొత్తం వ్యయం మారుతుంది. ఉత్పత్తి పెరిగేకొద్దీ మొత్తం వ్యయం పెరుగుతుంది.

### *6. సగటు స్థిర వ్యయం (AFC) అనగానేమి?*

జ: మొత్తం స్థిర వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగించగా సగటు స్థిర వ్యయం వస్తుంది.

$$\text{AFC} = \frac{\text{మొత్తం స్థిర వ్యయం (TFC)}}{\text{ఉత్పత్తి}}$$

నిర్వచనం ప్రకారం ఉత్పత్తి పరిమాణం ఎంత ఉన్నప్పటికీ స్థిర వ్యయం మారదు. అంటే ఉత్పత్తి పెరిగేకొద్దీ మొత్తం స్థిర వ్యయం ఎక్కువ వస్తువులపై విభజింపబడుతుంది కనుక సగటు స్థిర వ్యయం తగ్గుతుంది.

### *7. సగటు చరవ్యయం (AVC) అనగానేమి?*

జ: మొత్తం చర వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే సగటు చర వ్యయం వస్తుంది.

$$\text{AVC} = \frac{\text{మొత్తం చర వ్యయం (TVC)}}{\text{ఉత్పత్తి}}$$

ఉదాహరణకు 1 యూనిట్ పెన్నుల ఉత్పత్తి వద్ద TVC = రూ. 60, అయితే AVC రూ. 60 (60÷1) 2 యూనిట్ల ఉత్పత్తి వద్ద TVC రూ. 100 అయితే AVC రూ. 50 (రూ. 100÷2) (c) సగటు మొత్తం వ్యయం ATC మొత్తం వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే ATC వస్తుంది.

### *8. సగటు వ్యయం ?*

**జ:** మొత్తం వ్యయాన్ని మొత్తం ఉత్పత్తితో భాగిస్తే సగటు వ్యయం లభిస్తుంది లేదా సగటు స్థిర వ్యయాన్ని సగటు చర వ్యయాన్ని కలిపితే సగటు వ్యయం లభిస్తుంది.

$$AC = TC/Q = \frac{\text{మొత్తం వ్యయం}}{\text{ఉత్పత్తి పరిమాణం}}$$

$$AC = AFC + AVC$$

సగటు వ్యయం = సగటు స్థిరవ్యయం + సగటు చరవ్యయం

**9. ఉపాంత వ్యయం అనగానేమి?**

జ. అర్థశాస్త్రంలో ఉపాంత వ్యయం అనే భావనకు చాలా ప్రాముఖ్యత కలదు. ఉపాంత అనగా అదనపు అని అర్థం. అదనపు యూనిట్‌ను ఉత్పత్తి చేయడానికి అయ్యే అదనపు వ్యయమే ఉపాంత వ్యయం లేదా ఒక అదనపు యూనిట్ ఉత్పత్తి చేయడం వల్ల మొత్తం వ్యయంలో వచ్చే పెరుగుదలనే ఉపాంత వ్యయం అంటారు.

$$MC = \frac{\Delta TC}{\Delta Q}$$

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. అస్పష్ట వ్యయాలు అనగానేమి? ద్రవ్య వ్యయాలలో అవి ఏ విధంగా భిన్నమైనవి?***

**జ:** ఇతరుల వద్ద నుండి పొందిన కారకాలకు చెల్లించిన ధరలను అప్రకటిత వ్యయాలు అంటారు. ఉదా॥కు ఉత్పత్తిదారుడు తన స్వంత డబ్బును పెట్టుబడిగా పెట్టవచ్చు. అతని కుటుంబ సభ్యులు శ్రామికులుగా పనిచేయవచ్చు. ఈ విధమైన స్వంత సాధనాలకు ఏమీ చెల్లించడు. కానీ ఈ సాధనాలకు చెల్లించవలసిన మొత్తాలు, వ్యయాలు క్రిందకే వస్తాయి. వీటినే అప్రకటిత లేదా అస్పష్టవ్యయాలు అంటారు. సూక్ష్మ అర్థశాస్త్రంలో, స్పష్టమైన వ్యయాలతో పాటు ఈ అప్రకటిత వ్యయాలను కూడా ఉత్పత్తి వ్యయంతో భాగంగా భావిస్తారు.

అదే విధంగా వేరొక వ్యాపారానికి తన డబ్బును పెట్టుబడిగా పెట్టినట్లయితే, కొంతవడ్డీ లేదా డివిడెండ్‌ను పొందేవాడు. అలానే తాను వేరొక ఫ్యాక్టరీకి మేనేజర్‌గా వ్యవహరిస్తే జీతం సంపాదించేవాడు. తన స్వంత వ్యాపారానికి వీటిని వాడుతున్నాడు కనుక (భవనానికి అద్దె, తన డబ్బుకు వడ్డీ, తన సేవలకు జీతాలను) ఈ ప్రతిఫలాలను పొందలేడు. స్వంత సాధనాలను వాడినందుకు అతనికి నష్టపరిహారం లభించాలి. మరో విధంగా చెబితే, స్వీయ సాధనాలను స్వంత వ్యాపారంలో నియమించినందున, వీటిని వేరొక ఉపయోగంలో వాడి ఆదాయాన్ని పొందే అవకాశాన్ని కోల్పోతున్నాడు. కనుక ఇది ఉత్పత్తి దారునికి వ్యయంగానే భావించాలి. అమలులో ఉన్న మార్కెట్ ధరల ఆధారంగా ఈ వ్యయాలను అంచనా వేయాలి. ఈ వ్యయాలను "అప్రకటితవ్యయాలు" అందురు. (ద్రవ్యవ్యయాలకు భిన్నమైనవి) ఈ వ్యయాలలో ముఖ్యమైనవి. స్వంత భవనాన్ని వ్యాపార నిమిత్తం వాడితే వచ్చే అప్రకటిత అద్దె. ఇది వాస్తవంగా చెల్లించబడిన అద్దెకు సమానం. అదే విధంగా అస్పష్టలేదా అపక్రటిత వడ్డీ మరియు జీతాలను కనుగొనవచ్చు.

***2. ఉత్పత్తికి, మొత్తం వ్యయానికి గల సంబంధాన్ని వివరింపుము.***

**జ:** ఒక సంస్థకు అయిన ద్రవ్య వ్యయాలు, అస్పష్ట వ్యయాలు, సాధారణ లాభాలను కలపగా వచ్చేదే మొత్తం వ్యయం. అనగా మొత్తం చర వ్యయం (TVC) + మొత్తం స్థిర వ్యయం (TFC) = మొత్తం వ్యయం (TC)

నెలకొల్పబడిన ఒక సంస్థలో ఇంకా ఉత్పత్తి జరగకపోతే ఆ సంస్థ మొత్తం వ్యయం, దాని మొత్తం స్థిర వ్యయానికి

సమానం. ఉత్పత్తి ప్రారంభం కాగానే చర వ్యయం కూడా చోటు చేసుకోవటంతో మొత్తం వ్యయం మారుతుంది. ఉత్పత్తి పెరిగేకొద్దీ మొత్తం వ్యయం పెరుగుతుంది. మొత్తం వ్యయంలో వచ్చే మార్పు మొత్తం చర వ్యయంలో వచ్చే మార్పుకు సమానం. అన్ని ఉత్పత్తి స్థాయిల వద్ద స్థిర వ్యయం స్థిరంగా ఉండటమే దీనికి కారణం. చరవ్యయంలో వచ్చిన మార్పుల వల్లనే మొత్తం వ్యయంలో మార్పులు వస్తాయి. చర వ్యయంలోని మార్పుల వల్లనే స్థిరవ్యయం మారుతుంది.

**పెన్నుల ఉత్పత్తిదారుని వ్యయపట్టిక**

| పెన్నుల ఉత్పత్తి యూనిట్లలో (1 యూనిట్=100పెన్నులు) | మొత్తం వ్యయం TFC (రూ॥లలో) | మొత్తం చర వ్యయం TVC (రూ॥లలో) | మొత్తం వ్యయం TC (TFC + TVC) (రూ॥లలో) |
|---|---|---|---|
| 0 | 60 | 0 | 60 |
| 1 | 60 | 60 | 120 |
| 2 | 60 | 100 | 160 |
| 3 | 60 | 150 | 210 |
| 4 | 60 | 260 | 320 |
| 5 | 60 | 390 | 450 |

పట్టిక ప్రకారం వివిధ ఉత్పత్తి స్థాయిల వద్ద స్థిరవ్యయం రూ.60 ఇది అన్ని ఉత్పత్తి స్థాయిలలో స్థిరంగా ఉండును. ఉత్పత్తి పెరిగే కొద్దీ మొత్తం చరవ్యయం మొత్తం స్థిర వ్యయంకలపగా వచ్చేదే మొత్తం వ్యయం. మొత్తం వ్యయం ఉత్పత్తి పరిమాణంతో పాటు మారింది.

***3. దిగువ ఇవ్వబడిన వ్యయాలను, ద్రవ్య వ్యయం, అస్పష్ట వ్యయాలుగా విభజించుము.***

జ: i) రైతు తాను పండించిన ధాన్యాన్ని వ్యవసాయ నిమిత్తం వాడటం : **అస్పష్ట**

ii) రైతు వాడిన రసాయనిక ఎరువులు : **ద్రవ్య**

iii) స్వంత ట్రాక్టరును ఉపయోగించుట : **అస్పష్ట**

iv) స్వంత భూమిని సేద్యం నిమిత్తం వాడటం : **అస్పష్ట**

v) వ్యవసాయ నిమిత్తం కుటుంబసభ్యుల సేవలకు గాను ఏమీ చెల్లించకపోవటం : **అస్పష్ట**

vi) రవాణా వ్యయాలు : **ద్రవ్య**

vii) అప్పులపై / ఋణాలపై వడ్డీ : **ద్రవ్య**

viii) చెల్లించబడ్డ వేతనాలు : **ద్రవ్య**

ix) ఉత్పత్తి కోసం స్వంత భవనాల వాడకం : **అస్పష్ట**

x) ఎక్సైజ్ సుంకాలు : **ద్రవ్య**

*4. క్రింది వ్యయాలను స్థిర, చర వ్యయాలుగా వర్గీకరింపుము.*

| | | |
|---|---|---|
| జ: | i) ఫ్యాక్టరీ భవనం అద్దె | : **స్థిర** |
| | ii) వాచ్‌మన్‌కు జీతం | : **స్థిర** |
| | iii) ఫ్యాక్టరీ ప్రాంగణానికి చెల్లించే సంవత్సరిక లైసెన్సు ఫీజు | : **స్థిర** |
| | iv) ముడి పదార్థాలు | : **చర** |
| | v) సేద్యపు భూమికి చెల్లించాల్సిన భాటకం | : **చర** |
| | vi) విత్తనాలు | : **చర** |
| | vii) ఎరువులు | : **చర** |
| | vii) ఋణాలపై వడ్డీ | : **చర** |
| | ix) ఎక్సైజ్ సుంకాలు | : **స్థిర** |
| | x) రవాణా ఖర్చులు | : **చర** |

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. సూక్ష్మ అర్థశాస్త్రంలో వివిధ వ్యయాలను వివరించండి.***

**జ:** సూక్ష్మఅర్థశాస్త్ర ప్రకారం ఉత్పత్తి వ్యయంలో మూడు భాగాలుంటాయి.

అ) ప్రత్యక్ష వ్యయం / స్పష్టమైన వ్యయం

ఆ) అప్రత్యక్ష వ్యయం / అస్పష్టమైన వ్యయం

ఇ) సాధారణ లాభం

- వ్యాపారంలో ద్రవ్యవ్యయాలను మాత్రమే వ్యయంగా పరిగణిస్తారు.

ఒక రైతుకు అయ్యే మొత్తం వ్యయానికి ఒక ఉదా ॥ పరిశీలిద్దాం. ధాన్యాన్ని ఉత్పత్తి చేయుటకు రైతుకు భూమి, వ్యవసాయ శ్రామికులు, పనిముట్లు, నీరు, విత్తనాలు, ట్రాక్టరు, ఇంధనం మొ॥నవి కావలెను. ఇందులో కొన్ని స్వంత సాధనాలు కావచ్చు, మరికొన్ని సమకూర్చుకుని ఉండవచ్చు.

**రైతు యొక్క వ్యయ భాగాల జాబితా**

**మొత్తం ఉత్పత్తి వ్యయం (ధాన్యం) =**

| ద్రవ్యవ్యయం | + | అస్పష్టవ్యయం | + | సాధారణలాభం |
|---|---|---|---|---|
| 1) ఎరువులు | | 1) స్వంతభూమి | | పంట పండించినందుకు |
| 2) పురుగు మందులు | | 2) సేద్యానికి స్వంత బావి | | రైతుకు రావలసిన కనీస |
| 3) వ్యవసాయ కూలీలకు | | 3) స్వంత విత్తనాలు | | ప్రతిఫలం |

| | |
|---|---|
| చెల్లింపులు | 4) తను, తనకుటుంబ |
| 4) కోత మార్పిడి | సభ్యుల శ్రమ |
| యంత్రాలకు అద్దె | |
| 5) పంటకు భీమా | |
| ఇన్సూరెన్స్ చెల్లింపు | |
| 6) ప్రభుత్వానికి | |
| చెల్లించాల్సిన పన్నులు | |
| 7) రూపురేఖల పంపుసెట్లకు | |
| అయ్యే విద్యుత్ ఖర్చులు | |

***2.. కింది సమాచారం ఆధారంగా మొత్తం వ్యయం, మొత్తం సగటు వ్యయం, సగటు స్థిరవ్యయం, సగటు చరవ్యయం మరియు ఉపాంత వ్యయాలను కనుగొనుము.***

జ:

| ఉత్పత్తి (యూనిట్లలో) | TFC మొత్తం స్థిర వ్యయం | TVC మొత్తం చర వ్యయం |
|---|---|---|
| 0 | 60 | 0 |
| 1 | 60 | 50 |
| 2 | 60 | 90 |
| 3 | 60 | 180 |
| 4 | 60 | 300 |

| మొత్తం వ్యయం (రూ॥లలో) మొత్తం స్థిరవ్యయం+మొత్తం చరవ్యయం = TFC +TVC | సగటు స్థిరవ్యయం AFC | సగటుచర వ్యయం AVC | మొత్తం సగటు వ్యయం ATC | ఉపాంతర వ్యయం MC |
|---|---|---|---|---|
| 60 | – | – | – | – |
| 110 | 60 | 50 | 110 | 50 |
| 150 | 30 | 45 | 75 | 40 |
| 240 | 20 | 60 | 80 | 90 |
| 360 | 15 | 75 | 90 | 120 |

*3.* *మొత్తం స్థిరవ్యయం రూ॥ 120 అయితే కింది పట్టిక ఆధారంగా*

**i) మొత్తం వ్యయం మరియు మొత్తం చరవ్యయం ii) ఉపాంత వ్యయాలను కనుగొనుము**

జ:

| ఉత్పత్తి (యూనిట్లలో) | సగటు మొత్తం వ్యయం (రూ॥లలో) |
|---|---|
| 1 | 240 |
| 2 | 160 |
| 3 | 140 |
| 4 | 160 |
| 5 | 180 |

| ఉత్పత్తి (యూనిట్లలో) | ATC | TC | TFC | TVC | MC |
|---|---|---|---|---|---|
| 1 | 240 | 240 | 120 | 120 | 120 |
| 2 | 160 | 320 | 120 | 200 | 80 |
| 3 | 140 | 420 | 120 | 300 | 100 |
| 4 | 160 | 640 | 120 | 520 | 220 |
| 5 | 180 | 900 | 120 | 780 | 260 |

*4.* *దిగువ పట్టికను పూరింపుము*

జ:

| **ఉత్పత్తి (యూనిట్లలో)** | **మొత్తం స్థిర వ్యయం** | **మొత్తం వ్యయం** | **సగటు మొత్తం వ్యయం** | **ఉపాంత వ్యయం** | **సగటు స్థిర వ్యయం** |
|---|---|---|---|---|---|
| **0** | **8** | | | **–** | **8** |
| **1** | | | | **12** | |
| **2** | | | | **10** | |
| **3** | | | | **8** | |
| **4** | | | | **6** | |
| **5** | | | | **5** | |

| ఉత్పత్తి (యూనిట్లలో) | మొత్తం స్థిర వ్యయం | మొత్తం వ్యయం | ఉపాంతర వ్యయం | మొత్తం సగటు వ్యయం | సగటు స్థిర వ్యయం |
|---|---|---|---|---|---|
| 0 | 8 | 8 | – | – | – |
| 1 | 8 | 20 | 12 | 20 | 8 |
| 2 | 8 | 30 | 10 | 15 | 4 |
| 3 | 8 | 38 | 8 | 12.66 | 2.66 |
| 4 | 8 | 44 | 6 | 11.00 | 2.00 |
| 5 | 8 | 49 | 5 | 9.80 | 1.60 |

# 27

# రాబడి (Revenue)

## 27.1 పరిచయం

ఈ అధ్యాయంలో మనం రాబడి యొక్క వివిధ భావనలను నేర్చుకొందాం. సూక్ష్మ అర్థశాస్త్ర భావనలలో రాబడి, మరియు వ్యయాన్ని ఆధారంచేసుకుని లాభాన్ని గణిస్తాము అని మరోకసారి గుర్తుచేసుకుందాం. ఉత్పత్తిదారుని యొక్క ముఖ్యోద్దేశ్యం గరిష్ట లాభార్జన. ఈ పాఠ్యాంశంలో లాభ గణనలో ప్రత్యేక పాత్ర వహించే రాబడులను పరిశీలిద్దాం.

## 27.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలోని ప్రశ్నలు, జవాబులు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- రాబడి అనగానేమిటో తెలుసుకుంటాం.
- మొత్తం రాబడి, సగటు రాబడి, ఉపాంత రాబడి భావనలను అర్థంచేసుకోగలుగుతాం.
- లాభానికి, రాబడికి ఉన్న తేడాను కూడా తెలుసుకుంటాం.

## 27.3 ప్రశ్నలు - సమాధానాలు

$TR_2 - TR_1$

### ఒక్క మార్కు ప్రశ్నలు

*1. మొత్తం రాబడి సూత్రం ?*

జ: మొత్తం రాబడి = మొత్తం ఉత్పత్తి × ఆ వస్తువు యొక్క ధర or TR = Q × P

*2. సగటు రాబడి సూత్రం?*

జ: సగటు రాబడి = మొత్తం రాబడి ÷ మొత్తం ఉత్పత్తి or AR = TR ÷ Q

*3. ఉపాంత రాబడి సూత్రం?*

జ: అదనంగా ఒక యూనిట్ ఉత్పత్తి చేయుట వలన మొత్తం ఉత్పత్తిలో వచ్చిన మార్పు. MR =

### రెండు మార్కుల ప్రశ్నలు

***1. మొత్తం రాబడి (TR) ని వివరింపుము.***

జ: ఒక సంస్థ యొక్క మొత్తం రాబడి ఏమనగా, ఆ సంస్థ ఉత్పత్తి చేసి, అమ్మిన వస్తుసేవలనుంచి వచ్చిన ప్రతిఫలం. ఉత్పత్తి చేసి అమ్మిన వస్తుసేవల సంఖ్యను వాటి సంబంధిత ధరతో హెచ్చవేయగా వచ్చునది మొత్తం రాబడి.

TR = (Q × P)

TR = మొత్తం రాబడి (Total Revenue)

Q = ఉత్పత్తి చేసి అమ్మిన వస్తువుల సంఖ్య

P = ధర

***2. సగటు రాబడి (AR) ను వివరింపుము.***

జ: ఒక సంస్థయొక్క సగటు రాబడి ఏమనగా, ఆ సంస్థ ఉత్పత్తి చేసి అమ్మిన వస్తుసేవల నుంచి వచ్చిన సగటు ప్రతిఫలం. మొత్తం రాబడి (TR)ని మొత్తం ఉత్పత్తి (Q)చే భాగించగా వచ్చునది సగటు రాబడి.

AR = TR/Q

***3. ఉపాంత రాబడి (MR)***

జ: ఉపాంత వ్యయ భావన మనకు సుపరిచితమే. ఉపాంత రాబడి కూడా అదేవిధంగా నిర్వచింపబడుతుంది. అదనంగా ఉత్పత్తి చేసిన / అమ్మిన ఒక యూనిట్ వలన మొత్తం రాబడిలోని మార్పు ఉపాంత రాబడి అగును.

$$MR = \frac{\Delta TR}{\Delta Q}$$

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. ఈ క్రింది పట్టికలోని దత్తాంశమును ఆధారంగా చేసుకొని ఉపాంత రాబడిని గణన చేయండి.***

జ:

| ఉత్పత్తి యూనిట్లు | సగటు రాబడి AR (Rs) | మొత్తం రాబడి TR (Rs) | ఉపాంత రాబడి MR (Rs) |
|---|---|---|---|
| 1 | 25 | | |
| 2 | 23 | | |
| 3 | 21 | | |
| 4 | 19 | | |
| 5 | 18 | | |
| 6 | 15 | | |

| ఉత్పత్తి యూనిట్లు | సగటు రాబడి AR (Rs) | మొత్తం రాబడి TR (Rs) | ఉపాంత రాబడి MR (Rs) |
|---|---|---|---|
| 1 | 25 | 25 | 25 |
| 2 | 23 | 46 | 21 |
| 3 | 21 | 63 | 17 |
| 4 | 19 | 76 | 13 |
| 5 | 18 | 90 | 14 |
| 6 | 15 | 90 | 0 |

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. వివిధ ఉత్పత్తి స్థాయిల వద్ద, ధర స్థిరముగా ఉన్నది అనుకొని, మొత్తం రాబడి, సగటు రాబడి, అదనపు రాబడిని తెలిపే ఊహా పట్టికను తయారు చేయండి?***

**జ:** మొత్తం రాబడి నుంచి సగటు రాబడి లేదా ధరను గణించుట : మొత్తం రాబడిని ఉత్పత్తిచే భాగించిన ధర లేదా సగటు రాబడి వచ్చును. ఈ పద్ధతిని, క్రింది పట్టిక ఆధారంగా తెలుసుకుందాం

| ఉత్పత్తి యూనిట్లు | మొత్తం రాబడి (TR) Rs. | సగటు రాబడి లేదా ధర = మొత్తం రాబడి/ఉత్పత్తి TR/Q |
|---|---|---|
| 1 | 11 | 11 |
| 2 | 16 | 8 |
| 3 | 21 | 7 |
| 4 | 24 | 6 |

ఉపాంత రాబడి నుంచి మొత్తం రాబడి గణన చేయుటకు తదుపరి యూనిట్ల యొక్క ఉపాంత రాబడిని కలపాలి

| ఉత్పత్తి యూనిట్లు | ఉపాంత రాబడి MR | మొత్తం రాబడి TR |
|---|---|---|
| 1 | 7 | 7 |
| 2 | 5 | 12 (7+5) |
| 3 | 3 | 15 (7+5+3) |
| 4 | 2 | 17 (7+5+3+2) |
| 5 | 1 | 18 (7+5+3+2+1) |
| 6 | –1 | 17 (7+5+3+2+1–1) |

***2.*** ***ఈ క్రింది పట్టికను పూరించండి.***

**జ:**

| ఉత్పత్తి యూనిట్లు | ధర Rs | మొత్తం రాబడి | సగటు రాబడి | ఉపాంత రాబడి |
|---|---|---|---|---|
| 1 | 5 | | | |
| 2 | 4 | | | |
| 3 | 3 | | | |
| 4 | 2 | | | |

| ఉత్పత్తి యూనిట్లు | ధర Rs | మొత్తం రాబడి TR (Rs) | సగటు రాబడి AR (Rs) | ఉపాంత రాబడి MR (Rs) |
|---|---|---|---|---|
| 1 | 5 | 5 | 5 | 5 |
| 2 | 4 | 8 | 4 | 3 |
| 3 | 3 | 9 | 3 | 1 |
| 4 | 2 | 8 | 2 | –1 |

***3.*** ***పెరుగుతున్న ఉత్పత్తి, తగ్గేధరలతో, మొత్తం రాబడి, సగటు రాబడి, అదనపు రాబడిని తెలిపే ఊహా పట్టికను తయారు చేయండి.***

**జ:** రాబడికి సంబంధించిన వివిధ భావన / అంశములను ఈ క్రింది రేఖా పటముల ద్వారా తెలుసుకుందాం. ధర స్థిరంగా ఉన్న, తగ్గుతూ ఉన్న మార్కెట్‌లలో రాబడి భావనలలోని తేడాలను రేఖా పటముల ద్వారా సులభంగా అర్థంచేసుకుందాం.

**ఎ) పెరిగే ఉత్పత్తి / అమ్మకాలు – స్థిరమైన ధర**

| ఉత్పత్తి యూనిట్ల | ధర Rs | మొత్తం రాబడి TR (Rs) | సగటు రాబడి AR (Rs) | ఉపాంత రాబడి MR (Rs) |
|---|---|---|---|---|
| 1 | 200 | 200 | 200 | 200 |
| 2 | 200 | 400 | 200 | 200 |
| 3 | 200 | 600 | 200 | 200 |
| 4 | 200 | 800 | 200 | 200 |
| 5 | 200 | 1000 | 200 | 200 |

పైన ఇచ్చిన దత్తాంశమును ఆధారంగా మొత్తం రాబడి (TR) సగటు రాబడి (AR), ఉపాంత రాబడి (MR), రేఖలను పరిశీలిద్దాం. ఉత్పత్తిని 'X' అక్షంపై, రాబడిని 'Y' అక్షంపై తీసుకుందాం.




TR, AR and MR రేఖలు

పై రేఖా పటము ద్వారా మనము తెలుసుకొను నదేమనగా

(i) మొత్తం రాబడి (TR) ఎడమ నుంచి కుడికి పైకి పోతూ ఉంటుంది. అనగా ఇది నిరంతరంగా పెరుగుతూ ఉంటుంది.

(ii) సగటు రాబడి (AR) అక్షమునకు సమాంతరంగా, అన్ని ఉత్పత్తి స్థాయిల వద్ద ధర స్థిరంగా ఉండుటవలన స్థిరంగా ఉంది.

(iii) ఉపాంత రాబడి రేఖ (MR) కూడా 'X' అక్షమునకు సమాంతరముగా, అన్ని ఉత్పత్తి స్థాయిల వద్ద ధర స్థిరంగా ఉండుట వలన స్థిరంగా ఉంది.

(iv) ఉపాంత రాబడి రేఖ (MR), సగటు రాబడి రేఖ (AR) అన్ని ఉత్పిత్తి స్థాయిల వద్ద సమానం.

సగటు రాబడి, ఉపాంత రాబడి, మొత్తం రాబడి తీరు, పైన విశ్లేషించబడిన విధముగా ఉండుటకు కారణము స్థిరమైన ధర ఉండుటకు వెసులుబాటు ఉంటే మార్కెట్ నిర్మాణం. మార్కెట్ నిర్మాణం వేరొక రకముగా ఉండుట వలన, ఎక్కువ ఉత్పత్తి లేదా అమ్మకం తక్కువ ధర వద్ద మాత్రమే సాధ్యం అయిన యెడల మొత్తం రాబడి, సగటు రాబడి, ఉపాంత రాబడి రేఖలు పై విధముగా కాకుండా వేరొక రకముగా ఉండును.

**బి) తగ్గుతున్న ధర పెరుగుతున్న ఉత్పత్తి**

| ఉత్పత్తి యూనిట్లు | ధర Rs | మొత్తం రాబడి TR (Rs) | సగటు రాబడి AR (Rs) | ఉపాంత రాబడి MR (Rs) |
|---|---|---|---|---|
| 1 | 100 | 100 | 100 | 100 |
| 2 | 90 | 180 | 90 | 80 |
| 3 | 80 | 240 | 80 | 60 |
| 4 | 70 | 280 | 70 | 40 |
| 5 | 60 | 300 | 60 | 20 |
| 6 | 50 | 300 | 50 | 0 |
| 7 | 40 | 280 | 40 | −20 |

పైన ఇచ్చిన దత్తాంశము ఆధారంగా తగ్గుతున్న ధర, పెరుగుతున్న ఉత్పత్తితో మొత్తం రాబడి TR సగటు రాబడి AR మరియు ఉపాంత రాబడి MR రేఖ ఎలా ఉంటాయో పరిశీలిద్దాం.




TR, AR, MR

పై రేఖా పటము ద్వారా మనము తెలుసుకొనునదేమనగా

(i) మొత్తం రాబడి 5 యూనిట్లు వరకు తగ్గుతున్న రేటులో పెరుగుతూ ఉంది. 5–6 యూనిట్ల మధ్య స్థిరంగా ఉంది, ఆతరువాత తగ్గుతూ ఉంది.

(ii) సగటు రాబడి రేఖ నిరంతరంగా తగ్గుతుంది.

(iii) ఉపాంత రాబడి రేఖ నిరంతరంగా తగ్గి, 6 యూనిట్ల వద్ద '0' అయింది. ఆ తరువాత 'X' అక్షంకన్నా క్రిందకు వచ్చి ఋణాత్మకం అయింది.

# 28

# లాభాల గరిష్ఠీకరణ (Profit Maximisation)

## 28.1 పరిచయం

ఉత్పత్తి దారుల ప్రధాన ధ్యేయం గరిష్ఠలాభార్జన. అందువలన ఉత్పత్తిదారుని గరిష్ఠ లాభాలస్థితిని పరిశీలించాలి. కనుక ఈ ఆదాయ, వ్యయభావనల ఆధారంతో ఉత్పత్తిదారుని లాభాల గరిష్ఠీకరణ పరిశీలించవచ్చును.

## 28.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- వ్యాపారవ్యవహారాలలో లాభం అనే భావన ఉపయోగిత తెలుసుకుంటారు.
- సామాన్యలాభం అనేది వ్యయంలో అంతర్భాగం అనే అంశం తెలుసుకుంటారు.
- గరిష్ఠ లాభం అనే భావనకు అర్థం తెలుసుకుంటారు.
- గరిష్ఠ లాభాలు నిర్ణయించ డానికి మొత్తం రాబడి, మొత్తం వ్యయం, (TR, TC) ఎంత అవసరమో ఉపాంత రాబడి, ఉపాంత వ్యయం (MR, MC) కూడా అంతే అవసరమని తెలుసుకుంటారు.

## 28.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. లాభాలు అనగానేమి?***

**జ:** మొత్తం వ్యయానికి మించిన రాబడిని లాభాలు అంటారు. (ద్రవ్య వ్యయాలు + అప్రకటిత వ్యయాలు + సామాన్య లాభాలు)

***2. గరిష్ట లాభాలు అనగానేమి?***

**జ:** మొత్తం రాబడి మొత్తం వ్యయం కన్నా అధికముగా ఉంటే సంస్థ గరిష్ట లాభాలను లేదా అసాధారణ లాభాలను పొందుతుంది.

***3. సామాన్య లాభం అనగానేమి?***

**జ:** ఒక ఉత్పత్తి దారుడు ఉత్పత్తిని కొనసాగించడానికి అవసరమైన కనీస ఆదాయం. దీనిని వ్యవస్థాపన ధర అని కూడా అంటారు. దీనిని పొందడానికి TR = TC అయి ఉండవలెను.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. సామాన్య లాభం అనగానేమి?***

జ: మొత్తం వ్యయానికి మించిన రాబడియే లాభం అంటారు. ఒక వేళ మొత్తం రాబడి మొత్తం వ్యయానికి సమానమైతే లాభం శూన్యమవుతుంది. దీనినే సామాన్య లాభస్థితి అని కూడా చెప్పవచ్చును.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. లాభాలు అనగా నేమి ? సామాన్య లాభానికి గరిష్ఠ లాభానికి మధ్య బేధం వివరించండి?***

జ: **(i) సామాన్య లాభం**

మొత్తం వ్యయానికి మించిన రాబడియే లాభం అంటారు. ఒక వేళ మొత్తం రాబడి మొత్తం వ్యయానికి సమానమైతే లాభం శూన్యమవుతుంది. దీనినే సామాన్య లాభస్థితి అని కూడా చెప్పవచ్చును. ఎందుకంటే సామాన్యలాభం అనేది మొత్తం వ్యయంలో ఒక భాగం. అందువల్ల ఎప్పుడైతే ఉత్పత్తిదారుడు TR = TC స్థితిలో ఉంటాడో అప్పుడు ఉత్పత్తిదారుడు తాను ఉత్పత్తి చేసిన మొత్తం వ్యయాన్ని తిరిగిపొందడంతో పాటు తాను ఆశించిన కనీస ఆదాయాన్ని అంటే సామాన్య లాభాన్ని కూడా పొందుతున్నాడు. ఈ విధంగా సూక్ష్మ అర్ధశాస్త్రంలో సామాన్య లాభం లేదా శూన్య లాభం ఒకే విధంగా ఉంటాయి.

**(ii) అసాధారణ లాభాలు**

మొత్తం వ్యయం కన్నా మొత్తం రాబడి అధికంగా ఉంటే (i.e., TR > TC) వ్యవస్థాపకుడు అసాధారణ లాభాలు లేదా గరిష్మ లాభాలు పొందుతాడు. ఈ సందర్భంలో లాభాలస్థాయి శూన్యం కన్నా ఎక్కువ అని చెప్పవచ్చును. అంటే ఉత్పత్తిదారుని యొక్క అసాధారణ లాభాలను తెలియజేస్తుంది.

***2. ఒక ఉత్పత్తి దారుడు MR, MC ల ఆధారంతో గరిష్ఠ లాభాలు ఏ విధంగా పొందుతాడో వివరించండి?***

జ: ఉపాంత రాబడి, ఉపాంత వ్యయ దత్తాంశాల ఆధారంగా కూడా లాభాల గరిష్ఠీకరణ నిర్ణయించ వచ్చును. ఉపాంత రాబడి అనగా అదనంగా ఒక యూనిట్ వస్తురాశిని విక్రయించడం ద్వారా వచ్చిన అదనపు రాబడి లేదా మొత్తం రాబడిలో పెరుగుదల అని అర్థం. ఉపాంత వ్యయం అనగా అదనంగా ఒక యూనిట్ వస్తువును ఉత్పత్తి చేయడానికి అయిన అదనపు వ్యయం లేదా మొత్తం వ్యయంలో పెరుగుదల అని చెప్పవచ్చును.

**అదనపు యూనిట్ ఉత్పత్తి అవసరమా, కాదా, నిర్ణయించటం**

ఒక ఉత్పత్తి దారుడు అదనంగా ఒక యూనిట్ వస్తువును తయారుచేసి విక్రయించేటప్పుడు ఆ యూనిట్ నుంచి పొందే లాభాన్ని కూడా బేరీజు వేసుకుంటాడు. ఈ సందర్భములో ఉపాంత రాబడి, ఉపాంత వ్యయాలను పోల్చి చూసుకుంటాడు. ఈ పరిస్థితులలో ఉత్పత్తి దారుడు మూడు రకాల నిర్ణయాలకు కట్టుబడి ఉంటాడు.

**i) ఉపాంత రాబడి ఎక్కువ, ఉపాంత వ్యయం తక్కువ (MR > MC) అయినప్పుడు**

ఉపాంత రాబడి ఉపాంత వ్యయం కన్నా ఎక్కువగా ఉంటే ఉత్పత్తి దారుడు అదనపు యూనిట్ నుండి లాభాన్ని పొందుతాడు. కనుక అదనపు వస్తూత్పత్తిని కొనసాగిస్తాడు. అందుచేత MR > MC గా ఉన్నంత కాలం వస్తూత్పత్తిని పెంచుకుంటూ పోతాడు. వస్తువుధర తగ్గించి, వస్తూత్పత్తిని విక్రయించడం వలన క్రమేపీ ఉపాంత రాబడి కూడా

తగ్గుతుంది. అందువలన వస్తూత్పత్తి రాశి పెరుగుతున్న కొద్దీ, మొత్తం రాబడిలో పెరుగుదల రేటు క్రమంగా తగ్గుతుంది. వస్తూత్పత్తి రాశి ఒక దశ దాటిన తరువాత ఉపాంత వ్యయాలు కూడా గణనీయంగా పెరుగుతాయి.

**ii) ఉపాంత రాబడి ఉపాంత వ్యయానికి సమానమైనపుడు (MR = MC)**

పైన చెప్పినట్లు ఉపాంత వ్యయానికి కన్నా ఉపాంత రాబడి ఎక్కువగా ఉన్నప్పుడు ఉత్పత్తిదారుడు అసాధారణ లాభాలు అనుభవిస్తూ ఉత్సాహంగా ఉత్పత్తిని కొనసాగిస్తాడు. ఒక దశలో ఉపాంత రాబడి క్షీణించి, ఉపాంత వ్యయం పెరగడం మొదలవుతుంది. ఫలితంగా MR, MC ల మధ్య వ్యత్యాసం తగ్గుతుంది. MR క్రమంగా తగ్గడం MC క్రమంగా పెరగడం ద్వారా ఒక దశలో MR = MCగా మారుతుంది. ఈ విషయం పటం 20.3 లో చూడవచ్చును.

**iii) ఉపాంత రాబడి తక్కువ, ఉపాంత వ్యయం ఎక్కువ (MR < MC) అయినప్పుడు**

ఉత్పత్తిదారుడు MR = MC స్థితిలో కూడా ఉత్పత్తిని పెంచుకుంటూ పోతే ఉపాంతర వ్యయం క్రమంగా పెరిగి ఉపాంత రాబడి క్రమంగా తగ్గి నష్టాల పాలవుతాడు. ఏ ఉత్పత్తిదారుడు నష్టాలు కోరుకొనడు. కాబట్టి వస్తూత్పత్తిని MR = MC వద్ద స్థిరంగా ఉంచాలని భావిస్తాడు.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ఒక ఉత్పత్తి దారుడు TR, TC ల ఆధారంతో గరిష్ఠ లాభాలు ఏవిధంగా పొందుతాడో వివరించండి?***

**జ:** ఒక ఉత్పత్తిదారుడు ఉత్పత్తి చేసి విక్రయించడానికి ఒక వస్తువును ఎన్నుకొన్నాడనుకుందాం. ఇప్పుడు ఆ వస్తువు ఎంత పరిమాణం ఉత్పత్తి చేసి విక్రయిస్తే గరిష్ట లాభాలు పొందుతాడో పరిశీలిద్దాం. దీనికి సంబంధించి వివిధ ఉత్పత్తి స్థాయిల వద్ద మొత్తం వ్యయం, మొత్తం రాబడులను గమనించవలసి ఉంటుంది. మొదట ఉత్పత్తిదారుడు ఒకే ధర వద్ద ఎంత వస్తురాశినైనా విక్రయించడానికి సిద్ధంగా ఉన్నాడని, రెండవది తక్కువ ధర వద్ద మాత్రమే ఎక్కువ వస్తురాశిని ఉత్పత్తిదారుడు అమ్మగల్గుతున్నాడని చూసాం. గరిష్ఠ లాభ నిర్ణయానికి ఈ రెండు పరిస్థితులలో ఏదైనా తీసుకొనవచ్చును.

**TR, TC మరియు లాభాల పట్టిక**

| ఉత్పత్తి యూనిట్లలో | ధర రూపాయలలో | TR రూపాయలలో | TC రూపాయలలో | లాభము (TR,TC) రూపాయలలో |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1 | 50 | 50 | 40 | 10 |
| 2 | 45 | 90 | 70 | 20 |
| 3 | 40 | 120 | 90 | 30 |
| 4 | 35 | 140 | 120 | 20 |
| 5 | 30 | 150 | 160 | −10 |

గరిష్ఠలాభ నిర్ణయం మాత్రం ఒకే విధంగా ఉంటుంది. ఇక్కడ వస్తూత్పత్తి రాశి పెరుగుతూ ఉంటే, మొత్తం రాబడి TR పెరుగుతూ ఉంటుంది. ఈ పెరుగుదలలో ఒక క్రమబద్ధమైన తగ్గుదల కనిపిస్తుంది. ఎందువలనంటే, వస్తురాశి అధనపు యూనిట్లను తక్కువ ధరకు విక్రయించడం వలన ఈ పరిస్థితి ఏర్పడుతుంది. వస్తూత్పత్తి రాశి యూనిట్లు అదనంగా పెరుగుతున్న కొద్దీ, సగటు వ్యయం ప్రారంభంలో క్రమంగా క్షీణించి ఒక దశ దాటిన తరువాత

క్రమంగా పెరుగుతూఉంటుంది. ఈ విధంగా వస్తూత్పత్తి రాశి పెరుగుతూ ఉన్నప్పుడు మొట్టమొదట క్షీణించేది, తరువాత పెరిగేదీ సగటు వ్యయం మాత్రమే.




మొత్తం రాబడి మరియు మొత్తం వ్యయం

పై పటంలో చుక్కలు లేని దీర్ఘచతురస్రాలు ఆదాయ స్థాయిని, చుక్కలు ఉన్న దీర్ఘ చతురస్రాలు వ్యయ స్థాయిని సూచిస్తున్నాయి. ఈ రెండు దీర్ఘ చతురస్రాలు వివిధ ఉత్పత్తి స్థాయిల వద్ద ఉన్న పరిస్థితిని వివరిస్తున్నాయి. పై పటంలో ఉత్పత్తి రాశి 4 యూనిట్ల వరకూ చుక్కలు లేని దీర్ఘచతురస్రాలు పెద్దవిగాను, చుక్కలు ఉన్న దీర్ఘ చతురస్రాలు చిన్నవిగాను ఉన్నవి. కానీ, 5 యూనిట్ల వద్ద మాత్రం చుక్కలు ఉన్న దీర్ఘచతురస్రం పెద్దదిగానూ (TC) చుక్కలు లేని దీర్ఘ చతురస్రం (TR) తక్కువగానూ ఉన్నది.




లాభాలు

పై పటంలో ప్రతీ దీర్ఘచతురస్రం సామాన్య లాభాల స్థితిని తెలియచేస్తున్నది. కానీ 5వ చతురస్రం × అక్షానికి దిగువ భాగంలో ఉండి నష్టాలను సూచిస్తున్నది. ఉత్పత్తి దారుని అంతిమ ధ్యేయం గరిష్ట లాభార్జన అందువలన అతను ఏ దీర్ఘచతురస్రం గరిష్ఠ లాభాలు సూచిస్తూ × అక్షానికి పై భాగంలో ఉంటుందో దానిని మాత్రం ఎంపిక చేసుకుంటాడు. దీని ప్రకారం పటములో 3 యూనిట్ల ఉత్పత్తి వద్ద గరిష్ఠ లాభం రూ. 30/- పొందుతున్నాడు. ఇదికాకుండా ఏ ఇతర ఉత్పత్తి స్థాయి ఎంపిక చేసుకున్నా అతను పొందే లాభాలు రూ. 30/- కన్నా తక్కువగానే ఉంటుంది.

***2. MR = MC అయినప్పుడు గరిష్ఠ లాభాలు పొందవచ్చునని ఊహించవచ్చునా ? రెండు కారణాలు చెప్పండి?***

**జ:** సంఖ్యా పరమైన ఊహాజనిత పట్టిక ద్వారా గరిష్ఠ లాభాల స్థితిని పరిశీలిద్దాము.

| ఉత్పత్తి (యూనిట్లు) | అదనపు రాబడి (రూ॥లలో) | అదనపు వ్యయం (రూ॥లలో) | గరిష్ఠ లాభాలు (రూ॥లలో) | MR,MC ల తులనాత్మక పరిశీలన | ఉత్పత్తిదారుని ప్రతిస్పందన |
|---|---|---|---|---|---|
| 1. | 50 | 45 | 5 | M R > MC | |
| 2. | 49 | 40 | 9 | MR > MC | |
| 3. | 47 | 42 | 5 | MR > MC | (సమతౌల్యం) |
| 4. | 45 | 45 | 0 | MR = MC | |
| 5. | 40 | 50 | −10 | MR < MC | అధికోత్పత్తికి విముఖత |

i) MC = MR **అవసరమైన నిబంధన**

అదనంగా ఉత్పత్తి చేయబడిన ప్రతీ వస్తువు మొత్తం రాబడిలో తక్కువ పెరుగుదలను సూచిస్తుంది. దీనిని పట్టికలో 2వ వరుసలో చూడవచ్చును. 2వ యూనిట్ ఉత్పత్తి చేసినప్పుడు ఉపాంత రాబడి రూ. 50/- నుంచి రూ. 49/- లకు పడిపోయింది. 3వ యూనిట్ ఉత్పత్తి చేసినప్పుడు ఇది రూ. 47/-లకు తగ్గిపోయింది. ఈ విధంగా ఉత్పత్తి పెరుగుతున్న కొద్దీ, మొదట MC తగ్గి తరువాత క్రమంగా పెరుగుచున్నది.

ఒకవేళ ఉత్పత్తిదారుడు ఒక్క యూనిట్‌ను మాత్రం ఉత్పత్తి చేస్తే ఉపాంత రాబడి రూ. 50/- ఉపాంత వ్యయం రూ. 45/- లు అనగా MR > MC కనుక ఉత్పత్తి దారుడు పొందుతున్న లాభం రూ. 5/-లు. ఈ లాభానికి ప్రేరణగా అధికోత్పత్తి చేపడతాడు. ఇక 2వ యూనిట్ ఉత్పత్తి చేసినప్పుడు రూ. 9/- లాభాన్ని ఆర్జిస్తున్నాడు. అనగా తిరిగి అధికోత్పత్తికి ప్రేరణ పొందుతాడు. 3వ యూనిట్ ఉత్పత్తి కూడా MR > MC గా ఉన్నది. కనుక ఉత్పత్తి ని కొనసాగిస్తాడు. 4వ యూనిట్ ఉత్పత్తి చేసినప్పుడు MR = MC అవుతుంది. ఇక్కడ ఉత్పత్తి దారుడు పొందిన లాభం శూన్యం. అందుచే 4వ యూనిట్ వద్ద ఉత్పత్తి గరిష్ఠంగా చేపట్టి సమతౌల్యస్థితిలో ఉంటాడు. ఒకవేళ 5వ యూనిట్ ఉత్పత్తి చేస్తే MC > MR అయ్యి నష్టాల పాలౌతాడు. అందుచే ఉత్పత్తిదారుడు 4 యూనిట్ల ఉత్పత్తిని కోరుకుంటాడు.

4 యూనిట్ల కన్నా తక్కువ ఉత్పత్తి చేస్తే లాభాలు వదులుకోవలసి వస్తుంది. 4 యూనిట్లు దాటి ఉత్పత్తి చేస్తే నష్టాలు చవిచూడవలసి వస్తుంది. కాబట్టి, లాభాలు తగ్గని, నష్టాలు రాని స్థితి 4 యూనిట్ల ఉత్పత్తిగా నిర్ణయించ వచ్చును. ఈ విధంగా ఎక్కడైతే MR = MC అవుతుందో అక్కడ గరిష్ఠ లాభాలు, గరిష్ఠ ఉత్పత్తి సాధ్యపడతాయి. కనుకనే ఇది ఒక అవసరమైన నిబంధనగా పేర్కొనబడింది.

స్థూలంగా చెప్పాలంటే ఉత్పత్తిదారుడు గరిష్ఠ ఉత్పత్తి, గరిష్ఠ లాభాలు పొందడానికి ఈ క్రింద తెలిపిన రెండు నియమాలు అవసరం.

1. ఉపాంత రాబడి ఉపాంత వ్యయానికి సమానంగా ఉండాలి (MR = MC)
2. ఏ ఉత్పత్తి స్థాయి వద్ద MR = MC అవుతుందో ఆస్థాయి కన్నా ఎక్కువ స్థాయి వద్ద ఉత్పత్తి ఉంటే MR కన్నా MC ఎక్కువగా ఉంటుంది. ఏ ఉత్పత్తి స్థాయి వద్ద MR = MC అవుతుందో ఆ స్థాయి కన్నా తక్కువ స్థాయి వద్ద ఉత్పత్తి ఉంటే MC కన్నా MR ఎక్కువగా ఉంటుంది.

# 29

# ప్రభుత్వ బడ్జెట్ రూపకల్పన

# (The Government Budgeting)

## 29.1 పరిచయం

ప్రతి సంవత్సరం ఫిబ్రవరి నెలలో ప్రభుత్వం బడ్జెటును పార్లమెంటు నందు ప్రవేశపెట్టుట గురించి మీకు తెలుసు. బడ్జెట్ అంటేనే పన్నులను పెంచుట లేదా తగ్గించుట అనే ప్రక్రియగా ప్రభావించబడుతున్నది. వాస్తవానికి, బడ్జెట్ మనం అనుకునే దాని కన్నా విస్తృతమైనది. పన్నురేట్లలో మార్పులతో పాటు బడ్జెట్ ప్రభుత్వం చేయవలసిన వ్యయానికి తగిన వనరుల కేటాయింపు, వనరుల సేకరణకు తగిన ప్రణాళికలను రూపొందించేది. ఈ పాఠంలో ప్రభుత్వ బడ్జెట్ నిర్మాణం, దాని రూపకల్పనలో వున్న వివిధ దశలు, లక్ష్యాలను గురించి వివరించబడినది.

## 29.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ప్రభుత్వ బడ్జెట్ – అర్థ వివరణ
- బడ్జెట్‌లో ఇమిడివున్న పలు అంశాలు
- రెవెన్యూ రాబడులు మరియు మూలధన రాబడుల వివరణ
- మూలధన వ్యయం మరియు మూలధన రాబడుల మధ్యగల బేధాల గుర్తింపు
- ప్రణాళికా వ్యయం మరియు ప్రణాళికేతర వ్యయాల మధ్య తేడాల గుర్తింపు
- బడ్జెటరీ లోటు మరియు కోశలోటుల మధ్యతేడాల వివరణ
- కోశలోటు భర్తీ మార్గాలు
- బడ్జెట్ విధానం యొక్క అర్థం మరియు లక్ష్యాల వివరణ

## 29.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. ప్రభుత్వ బడ్జెట్***

**జ:** ఒక సంవత్సర కాలంలో ప్రభుత్వం చేయవలసిన వివిధ వ్యయాలు, దానికి కావలసిన ద్రవ్య వనరుల పట్టిక ప్రభుత్వ బడ్జెట్.

***2. రెవిన్యూ రాబడి***

జ: రెవెన్యూ రాబడులలో పన్ను రాబడి, పన్నేతర రాబడులు కలవు. వడ్డీలు, డివిడెండ్లు, ప్రభుత్వ సంస్థలు ఆర్జించే లాభాలు, విదేశీ గ్రాంట్లు పన్నేతర రాబడికి ఉదాహరణ

***3. మూలధన రాబడి***

జ: మూలధన రాబడులలో అప్పులు,ఋణ వసూళ్ళు, షేర్లు అమ్మకాలు (ప్రభుత్వ రంగ సంస్థల వాటాలు)

***4. మూలధన వ్యయం***

జ: ప్రభుత్వం ఆస్తుల ఏర్పాటు నిమిత్తం అయ్యేదే మూలధన వ్యయం.

***5. రెవిన్యూ వ్యయం***

జ: రెవెన్యూ వ్యయం వల్ల ఎలాంటి సంపద సృష్టించబడదు. ఇవి జీతాలు చెల్లింపుల నిమిత్తం అయ్యే ఖర్చు.

***6. ప్రణాళికా వ్యయం***

జ: పంచవర్ష ప్రణాళికలలో జరిగిన కేటాయింపులకు చెల్లించవలసి వున్న వ్యయాన్ని ప్రణాళికా వ్యయంగా పరిగణిస్తాము.

***7. ప్రణాళికేతర వ్యయం***

జ: సంవత్సరంలో ప్రభుత్వ పాలనా వ్యవహారాల నిమిత్తం అతి సాధారణ వ్యయాన్ని "ప్రణాళికేతర వ్యయం"గా వ్యవహరిస్తాము.

***8. బడ్జెట్ లోటు***

జ: మొత్తం బడ్జెట్ వ్యయం మొత్తం బడ్జెట్ రాబడి కన్నా ఎక్కువ అయినప్పుడు 'బడ్జెట్ లోటు' ఏర్పడును.

***9. కోశ లోటు***

జ: అప్పులు మినహాయించగా వున్న మొత్తం బడ్జెట్ రాబడి కన్నా బడ్జెట్ వ్యయం ఎక్కువ అయినపుడు 'కోశలోటు' ఏర్పడును. ఇది ప్రభుత్వం యొక్క మొత్తం రుణ ఆవ్యకతను తెల్పును.

***10. బడ్జెట్ విధానం***

జ: ప్రభుత్వ విధానాలు, కార్యక్రమాలకు తగిన విధంగా ఏఏ అంశాలపై వ్యయం ఎంత మొత్తం చేయాలి మరియు దానికి కావలసిన రాబడులను ఎలా సమకూర్చుకోవాలనే నిర్ణయాలను 'బడ్జెట్ విధానం' గా వ్యవహారిస్తారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ప్రభుత్వ బడ్జెట్ అనగానేమి?***

జ: ఒక ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వానికి రాబోవు ఆదాయం మరియు ప్రభుత్వం చేయబోయే వ్యయాలను చూపే పట్టికను ప్రభుత్వ బడ్జెట్‌గా వ్యవహరిస్తారు. ఈ ప్రక్రియను ఆర్థిక సంవత్సరం ప్రారంభం కాక పూర్వమే చేపడుతారు. ప్రభుత్వ బడ్జెట్ నందు ప్రభుత్వం చేయవలసిన అన్ని రకాల వ్యయం మరియు దానికి కావలసిన రాబడి మార్గాలు పొందుపరచబడును.

***2. రెవెన్యూ రాబడులు అనగానేమి?***

జ: ప్రభుత్వానికి అతి ప్రాచీనకాలం నుండి వస్తున్న రాబడి వనరే పన్నులు. ప్రస్తుత కాలంలో ప్రభుత్వానికి ఇతర అదాయ మార్గాలు ఏర్పడినాయి. ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొనుటం ద్వారా, ప్రభుత్వ రంగ సంస్థల స్థాపన వల్ల ఆదాయాలు పొందుతున్నాయి. రైల్వేలు, జాతీయం చేసిన బ్యాంకులు, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్, ఏయిర్ ఇండియా, ఇండియన్ ఏయిర్ లైన్స్, మొ॥ ప్రభుత్వ రంగ సంస్థలు ఉదాహరణలు. ప్రభుత్వ రంగ సంస్థలు ఆర్జించే లాభాలు ప్రభుత్వానికి వచ్చే మరో ఆర్థిక వనరు. పై రెండు కాక ఇతర దేశాల నుండి ప్రభుత్వాలు గ్రాంటు రూపంలో వనరులను పొందును. వీటన్నింటిని మనం రెవెన్యూ రాబడులుగా వ్యవహరిస్తాము.

***3. పన్నేతర రాబడి వనరులు***

జ: పన్నులు కాకుండా ఇతర మార్గాల ద్వారా ప్రభుత్వంనకు వచ్చు రాబడిని పన్నేతర రాబడులు అందురు. భారతదేశంలో కేంద్రప్రభుత్వంనకు వచ్చు పన్నేతర రాబడులు.

i) వడ్డీల రూపేణ రాబడులు

ii) డివిడెండ్లు మరియు లాభాలు

**iii)** విదేశీ గ్రాంట్లు

***4. మూలధన రాబడులు అనగానేమి?***

జ: కేంద్ర ప్రభుత్వానికి మూడు ప్రధానమైన మూలధన రాబడి మార్గాలు కలవు. అవి :

a) ఋణాలు

b) అప్పులను వెనుకకు తీసుకొనుట

c) ప్రభుత్వ రంగ సంస్థల షేర్లను అమ్మటం

***5. ప్రణాళిక మరియు ప్రణాళికేతర వ్యయాలను వివరింపుము.***

జ: భారతదేశంలో ఆర్థికాభివృద్ధి కొరకు ప్రణాళికా విధానం చేపట్టి, పంచవర్ష ప్రణాళికలను అమలు చేయటం జరుగుతుంది. ప్రణాళికలలో ఇవ్వబడిన లక్ష్యాల సాధనకు అవసరమైన కేటాయింపులకు కావలసిన వ్యయాన్ని "ప్రణాళికా వ్యయం"గా వ్యవహరిస్తాము. బడ్జెట్‌లో ఇలాంటి కేటాయింపులను ప్రణాళికావ్యయం అంటారు.

దీనికి తోడు, దేశ పరిపాలనకు కావలసిన ఖర్చులకు కేటాయించు వ్యయాన్ని ప్రణాళికేతర వ్యయంగా పేర్కొనవచ్చును. ఎలాంటి ప్రణాళిక లేకుండా తప్పనిసరిగా చేయవలసిన వ్యయం అంతా ప్రణాళికేతర వ్యయంగా పరిగణించ వచ్చును.

***6. లోటు బడ్జెట్‌ను వివరింపుము.***

జ: ఈ భావన మొత్తం రాబడులు మరియు మొత్తం వ్యయంనకు చెందినది. 'లోటుబడ్జెట్' అంటే బడ్జెట్ వ్యయం బడ్జెట్ రాబడుల కన్నా ఎక్కువగా వుండుట

లేదా

బడ్జెట్ లోటు = మొత్తం బడ్జెట్ వ్యయం – మొత్తం బడ్జెట్ రాబడులు

***7. కోశలోటును వివరింపుము.***

జ: కోశలోటు భావన అన్ని రకాల రాబడులను పరిగణనలోనికి తీసుకొనదు. అప్పులను మినహాయించిన తరువాత రాబడులను లెక్కించును. కోశ లోటు అనగా అన్ని రకాల వ్యయాల మొత్తం రాబడులలో అప్పులను మినహాయించగా వున్న రాబడులను మించి వుంటే కలుగు లోటును లెక్కించును.

లేదా

కోశలోటు = మొత్తం బడ్జెట్ వ్యయం – రుణాలు తీసివేయగా వచ్చు మొత్తం బడ్జెట్ రాబడులు

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. రెవెన్యూ రాబడులు ఏవి?***

**జ:** ప్రభుత్వానికి అతి ప్రాచీనకాలం నుండి వస్తున్న రాబడి వనరే పన్నులు. ప్రస్తుత కాలంలో ప్రభుత్వానికి ఇతర అదాయ మార్గాలు ఏర్పడినాయి. ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొనుటం ద్వారా, ప్రభుత్వ రంగ సంస్థల స్థాపన వల్ల ఆదాయాలు పొందుతున్నాయి. రైల్వేలు, జాతీయం చేసిన బ్యాంకులు, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్, ఏయిర్ ఇండియా, ఇండియన్ ఏయిర్ లైన్స్, మొ॥ ప్రభుత్వ రంగ సంస్థలకు ఉదాహరణలు.

ప్రభుత్వ రంగ సంస్థలు ఆర్జించే లాభాలు ప్రభుత్వానికి వచ్చే మరో ఆర్థిక వనరు. పై రెండు కాక ఇతర దేశాల నుండి ప్రభుత్వాలు గ్రాంటు రూపంలో వనరులను పొందును. వీటన్నింటిని మనం రెవెన్యూ రాబడులుగా వ్యవహరిస్తాము.

రెవెన్యూ రాబడులను ఈ క్రింది విధంగా వర్గీకరింపవచ్చును.

అ) పన్ను రాబడులు

ఆ) పన్నేతర రాబడులు

**అ) పన్ను రాబడులు**

ప్రభుత్వం చేత విధించబడు న్యాయ సమ్మతమైన నిర్బంధమైన చెల్లింపును 'పన్ను'గా పేర్కొనవచ్చును. ఆదాయపు పన్ను, అమ్మకపు పన్ను, ఎక్సైస్ సుంకం మొ॥నవి. వస్తువుల క్రయ విక్రయాలపై అమ్మకపు పన్ను విధించబడును. వస్తువుల తయారీపై ఎక్సైజ్ సుంకం విధించబడును. ఇవి కాక సంపదపన్ను, బహుమతులపై పన్ను, దిగుమతి సుంకాలు కలవు.

**ఆ) పన్నేతర రాబడి వనరులు**

పన్నులు కాకుండా ఇతర మార్గాల ద్వారా ప్రభుత్వంనకు వచ్చు రాబడిని పన్నేతర రాబడులు అందురు. భారతదేశంలో కేంద్రప్రభుత్వంనకు వచ్చు పన్నేతర రాబడులు.

**i) వడ్డీల రూపేణ రాబడులు**

కేంద్రప్రభుత్వం అనేక శాఖలకు రుణాలు మంజూరుచేస్తుంది. అవి తిరిగి ప్రజలకు ఋణాలుగా ఇవ్వబడతాయి. కేంద్రప్రభుత్వం ఇచ్చు రుణాలపై వచ్చు రాబడిని "వడ్డీరూపరాబడులు"గా పేర్కొనవచ్చును.

**ii) డివిడెంట్లు మరియు లాభాలు**

కేంద్ర ప్రభుత్వం నేరుగా ఉత్పత్తి నిర్వహణ ప్రక్రియలో పాల్గొంటుంది. వాటినే 'ప్రభుత్వరంగ సంస్థలు' అంటారు. ఇవి ప్రైవేటు సంస్థలవలె వస్తువులను మరియు సేవలను అందించును. ఉదా ॥ రైల్వేలు, ఏయిర్ ఇండియా, మహానగర్ టెలిఫోన్ నిగమ్, జాతీయం చేయబడిన బ్యాంకులు మొ॥వి. కేంద్ర ప్రభుత్వం పై కార్యకలాపాల కొరకు పెట్టిన పెట్టుబడులపై డివిడెండ్ల రూపంలోనూ, లాభాల రూపంలోను ఆదాయం పొందుతుంది.

**iv) విదేశీ గ్రాంట్లు**

కేంద్ర ప్రభుత్వంనకు ఆర్థిక సహాయం విదేశీయ ప్రభుత్వాల నుండి డొనేషన్లు, బహుమతులు మొదలైన రూపాలలో వచ్చును.

***2. ప్రత్యక్షపన్ను Vs పరోక్షపన్ను అనే భావనను వివరింపుము.***

**జ:** పన్ను భారం విషయంలో ఆదాయపు పన్ను మరియు అమ్మకపు పన్నుల మధ్య తేడా గలదు.

ప్రత్యక్ష పన్ను అయిన ఆదాయపు పన్నులో పన్ను చెల్లింపు దారులు, పన్ను భారాన్ని మోస్తారు. పన్ను భారాన్ని ఇతరులకు బదలాయింపు చేయజాలరు. అటువంటి పన్నులను 'ప్రత్యక్షపన్నులు' అంటారు.

అయితే, అమ్మకపు పన్ను విషయంలో పన్ను భారాన్ని కొనుగోలుదారులు అనుభవిస్తున్నారు. అంటే పన్ను భారం కొనుగోలుదారులకు బదలాయింపు జరుగుతుంది. ఇటువంటి పన్ను "పరోక్ష పన్ను" అంటారు. వస్తు ఉత్పత్తి పై విధించబడు అన్ని రకాల పన్నులు పరోక్షపన్నులే. ఎందుకంటే ఉత్పత్తిదారులు పన్ను మొత్తాన్ని కొనుగోలుదారులు నుండి తిరిగి పొందుతారు.

పన్నులు రెండు రకాలుగా వర్గీకరించబడ్డాయి. (అ) ప్రత్యక్ష పన్నులు (ఆ) పరోక్ష పన్నులు. ఉదా॥

**ప్రత్యక్ష పన్నులు**

| | | | |
|---|---|---|---|
| 1. | కార్పొరేషన్ పన్నులు | : | కంపెనీలకు వచ్చు లాభాలపై విధించు పన్ను. |
| 2. | ఆదాయపు పన్ను | : | వ్యక్తుల ఆదాయాలపై పన్ను |
| 3. | వడ్డీలపై పన్ను | : | వడ్డీ రూపంలో వచ్చే ఆదాయం పై విధించు పన్ను |
| 4. | వ్యయ పన్ను | : | వస్తువులపై ఖర్చు చేయునపుడు విధించు పన్ను |
| 5. | సంపద పన్ను | : | వ్యక్తుల ఆస్తులపై / సంపదలపై విధించే పన్ను |
| 6. | బహుమతి పన్ను | : | బహుమతులు ఇచ్చునపుడు విధించే పన్ను |

**పరోక్ష పన్నులు**

| | | | |
|---|---|---|---|
| 1. | కస్టమ్స్ సుంకాలు | : | ఎగుమతులు / దిగుమతులపై విధించే సుంకాలు |
| 2. | యూనియన్ ఎక్సైజ్ సుంకాలు | : | కేంద్ర ప్రభుత్వం వస్తువుల తయారీపై విధించు సుంకాలు. |
| 3. | సేవాపన్ను | : | సేవలను అందించుటపై విధించే పన్నులు |
| 4. | అమ్మకం పన్ను | : | అమ్మకంపై విధించే పన్ను |

***3. మూలధన రాబడులుఏవి ?***

**జ:** కేంద్ర ప్రభుత్వానికి మూడు ప్రధానమైన మూలధన రాబడి మార్గాలు కలవు. అవి :

a) ఋణాలు

b) అప్పులను వెనుకకు తీసుకొనుట

c) ప్రభుత్వ రంగ సంస్థల షేర్లను అమ్ముటం

**a) ఋణాలు**

కేంద్ర ప్రభుత్వం రెండు పద్ధతుల ద్వారా ఋణాలను పొందును.

**అ) దేశీయ ఋణాలు**

దేశం లోపల నుండి ఋణాలను పొందుటకు దేశీయ ఋణాలు. కేంద్ర ప్రభుత్వం సెక్యూరిటీలు మరియు ట్రెజరీ బిల్లులను జారీ చేయును. వివిధ డిపాజిట్ పథకాలైన పబ్లిక్ ప్రావిడెంట్ ఫండ్, చిన్న మొత్తాల పొదపు పథకాలు, ఇందిరా వికాస్ పత్రాలు, కిసాన్ వికాస్ పత్రాలు, నేషనల్ సేవింగ్ స్కీంల రూపంలో ప్రజల నుండి ప్రభుత్వం రుణాలు స్వీకరిస్తుంది.

ఈ పథకాలలో 'జమ' అయిన మొత్తం ప్రభుత్వానికి ఋణమే.

**ఆ) విదేశీ సహాయం**

ఇవి విదేశాల నుండి పొందే రుణాలు.

**b) అప్పుల రికవరీ**

రాష్ట్రాలకు, స్థానిక సంస్థలకు మంజూరు చేసిన రుణాలను తిరిగి వెనుకకు తీసుకొనుట ద్వారా కేంద్రప్రభుత్వం మూలధన రాబడులను పొందును. ఈ రుణాలను రికవరీ చేయుటనే బడ్జెట్‌లో మూలధన రాబడులుగా వ్యవహరిస్తారు.

**c) ప్రభుత్వ రంగ సంస్థల షేర్లు తిరిగి అమ్ముట**

ఆధునిక కాలంలో ప్రభుత్వానికి రాబడి ప్రభుత్వ రంగ సంస్థల వాటాలను తిరిగి అమ్మటం ద్వారా వస్తుంది. ఇప్పటివరకు కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థలలో 100 శాతం మూలధనం ప్రభుత్వం కల్గి వుంది. అయితే 1991లో కేంద్ర ప్రభుత్వం ప్రైవేటీకరణను ప్రవేశ పెట్టుట ద్వారా ప్రభుత్వ రంగ సంస్థలలోని తమ మూలధన వాటాలను ప్రైవేటు వ్యక్తులకు, ఆర్థిక సంస్థలకు, ప్రజలకు నేరుగా అమ్ముట ద్వారా రాబడులను పొందుతుంది. దీనినే 'పెట్టుబడుల ఉపసంహరణ' అందురు.

***4. ప్రణాళికా వ్యయం మరియు ప్రణాళికేతర వ్యయాల ముఖ్య తేడా ఏవి?***

**జ:** భారతదేశంలో ఆర్థికాభివృద్ధి కొరకు ప్రణాళికా విధానం చేపట్టి, పంచవర్ష ప్రణాళికలను అమలు చేయుటం

జరుగుతుంది. ప్రణాళికలలో ఇవ్వబడిన లక్ష్యాల సాధనకు అవసరమైన కేటాయింపులకు కావలసిన వ్యయాన్ని "ప్రణాళికా వ్యయం"గా వ్యవహరిస్తాము. బడ్జెట్‌లో ఇలాంటి కేటాయింపులను ప్రణాళికావ్యయం అంటారు.

దీనికి తోడు, దేశ పరిపాలనకు కావలసిన ఖర్చులకు కేటాయించు వ్యయాన్ని ప్రణాళికేతర వ్యయంగా పేర్కొనవచ్చును. ఎలాంటి ప్రణాళిక లేకుండా తప్పనిసరిగా చేయవలసిన వ్యయం అంటే ప్రణాళికేతర వ్యయంగా పరిగణించ వచ్చును.

ప్రభుత్వాలు పరిపాలన నిమిత్తం వ్యయాలు అనేక విధాలుగా చేయవలసి వస్తుంది. ప్రణాళిక లేదా ప్రణాళికేతర వ్యయాలు ప్రతి ప్రభుత్వానికి తప్పనిసరి. ప్రజలు వారి ఆస్థి పాస్తుల సంరక్షణ ప్రభుత్వాల కనీస కర్తవ్యం. శాంతి భద్రతలను కాపాడుటకు పోలీసు వ్యవస్థ, న్యాయ స్థానాల నిర్వహణకు వ్యయం చేయవలసి వుంది. విదేశీదాడుల నుండి దేశరక్షణకు కావలసిన సైన్యం, యుద్ధ సామగ్రికై ప్రభుత్వ వ్యయం చేయకతప్పదు. వివిధ ప్రభుత్వ శాఖలైన శాసన నిర్మాణం, ప్రజోపయోగ కార్యక్రమాలు, మంచినీటి సరఫరా, పారిశుద్ధ్యం మొ॥ వాటికై వ్యయం చేయవలెను. పై కార్యక్రమాల నిర్వహణకు వెచ్చించు ఖర్చులను మనం 'ప్రణాళికేతర వ్యయం'గా పిలుస్తాము.

***5. బడ్జెట్‌లోటు, కోశలోటులను వివరింపుము?***

**జ:** బడ్జెట్‌లో మొత్తం వ్యయం కన్నా రాబడులు తక్కువగా వుంటే 'లోటు' గా పరిగణిస్తాము. బడ్జెట్ నందు వివిధ రకాల 'లోటు' లు కలవు.

1. బడ్జెట్ లోటు
2. కోశలోటు

**లోటు బడ్జెట్**

ఈ భావన మొత్తం రాబడులు మరియు మొత్తం వ్యయంనకు చెందినది. 'లోటుబడ్జెట్' అంటే బడ్జెట్ వ్యయం బడ్జెట్ రాబడుల కన్నా ఎక్కువగా వుండుట

లేదా

బడ్జెట్ లోటు = మొత్తం బడ్జెట్ వ్యయం – మొత్తం బడ్జెట్ రాబడులు

పై కొలమానంలో మొత్తం రెవెన్యూ మరియు మూలధన రాబడులు, రెవెన్యూ వ్యయం మరియు మూలధన వ్యయాలను తీసుకొనుట జరిగింది.

## కోశలోటు

కోశలోటు భావన అన్ని రకాల రాబడులను పరిగణనలోనికి తీసుకొనదు. అప్పులను మినహాయించిన తరువాత రాబడులను లెక్కించును. కోశ లోటు అనగా అన్ని రకాల వ్యయాల మొత్తం రాబడులలో అప్పులను మినహాయించగా వున్న రాబడులను మించి వుంటే కలుగు లోటును లెక్కించును.

## కోశలోటు కొలమానం ఎలా మెరుగైనది?

బడ్జెట్ లోటుతో పోల్చగా కోశలోటు కొలమానం ప్రయోజనకరమైనదిగా పేర్కొనవచ్చును. దీనికి రెండు కారణాలు:

1. తన వ్యయ అవసరాలకు ఎంత రుణాన్ని సేకరించాలో ఇది సూచిస్తుంది.
2. కోశలోటు వల్ల భవిష్యత్‌లో మనం తిరిగి చెల్లించవలసిన వడ్డీలు మరియు రుణాల మొత్తం ఎంతో తెలుస్తుంది.

***6. కోశలోటు భర్తీ చేయుటకు మార్గాలను వివరింపుము?***

**జ:** కోశలోటును భర్తీచేయుటకు ప్రభుత్వానికి మూడు మార్గాలు కలవు. అవి :

i) ప్రజల నుండి రుణాలను తీసుకొనుట మరియు విదేశాల నుండి రుణాలు పొందుట.

ii) రిజర్వుబ్యాంకు వద్ద వుంచబడిన ప్రభుత్వ నగదు నిల్వలను తీసుకొనుట

iii) రిజర్వుబ్యాంకు వద్ద రుణం తీసుకొనుట

పై వాటిలో ప్రభుత్వం ప్రాధాన్యతను దేనికి ఇస్తుంది? రిజర్వుబ్యాంకు వద్దనున్న ప్రభుత్వ నగదు నిల్వలలను తిరిగి పొందిన లేదా రిజర్వుబ్యాంకు వద్ద రుణం తీసుకొన్న అది ద్రవ్య సప్లయిని ప్రభావితం చేస్తుంది. ప్రజల నుండి రుణాలు తీసుకొన్న ఎలాంటి ప్రభావం ద్రవ్య సప్లయిపై కలుగదు. ప్రభుత్వ రుణ సేకరణ వల్ల ప్రజల వద్ద నున్న నగదు నిల్వలు ప్రభుత్వంనకు బదిలీ అగును. దానివల్ల దేశంలోని ద్రవ్య సప్లయి పై ఎలాంటి ప్రభావం కలుగదు.

అయితే, ప్రజల నుండి అప్పులు సేకరించుట వల్ల ఎలాంటి ప్రభావం కలుగదని అర్థం జేసుకోరాదు. ప్రభుత్వం పొందు రుణాలు తిరిగి భవిష్యత్‌లో తప్పక చెల్లించవలసి వుంటుంది. రెండవది, రుణాలపై వడ్డీని తిరిగి అసలుతో పాటుగా చెల్లించాలి. అయితే, సాధారణంగా ప్రభుత్వాలు ప్రజల నుండి గ్రహించే రుణాలతో ఆర్జించే ఆర్థిక వనరులు నుండి అసలు మరియు వడ్డీలను చెల్లించుతుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. ప్రభుత్వ బడ్జెట్ అనగా నేమి? ప్రభుత్వ బడ్జెట్ నమూనాను రూపొందించుము?***

ఒక ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వానికి రాబోవు ఆదాయం మరియు ప్రభుత్వం చేయబోయే వ్యయాలను చూపే పట్టికను ప్రభుత్వ బడ్జెట్‌గా వ్యవహరిస్తారు. ఈ ప్రక్రియను ఆర్థిక సంవత్సరం ప్రారంభం కాక పూర్వమే చేపడుతారు. ప్రభుత్వ బడ్జెట్ నందు ప్రభుత్వం చేయవలసిన అన్ని రకాల వ్యయం మరియు దానికి కావలసిన రాబడి మార్గాలు పొందుపరచబడును.

కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వ స్థాయిలలో బడ్జెట్ నిర్మాణం జరుగును. ప్రజల తరుపున ప్రభుత్వం నిర్ణయాలను తీసుకొంటుంది. అందువల్ల, ప్రజలకు అది బాధ్యత వహిస్తుంది. పార్లమెంటు, శాసన సభలకు పౌరసంస్థలకు ప్రభుత్వం జవాబుదారీగా వుంటుంది. ప్రజాసంక్షేమమే ప్రధానధ్యేయంగా ప్రభుత్వం బడ్జెట్‌ను రూపొందిస్తుంది. ప్రజలకు కావలసిన కనీస సౌకర్యాల కల్పన, ఉత్పత్తిని పెంపొందించుట, నిరుద్యోగితను తగ్గించుటకు, ధరల పెరుగుదలను అరికట్టుట, సంపద మరియు ఆదాయాలలో అసమానతలను తగ్గించుట మొదలగునవి ప్రభుత్వ బడ్జెట్ యొక్క ప్రధానలక్ష్యాలు. ప్రభుత్వం బడ్జెట్‌ను రూపొందించుటలో పై లక్ష్యాలను దృష్టిలో వుంచుకొనును. ప్రభుత్వ బడ్జెట్‌ను అమలు చేయుటకు అనుసరించే విధానమును కోశ విధానం లేదా బడ్జెటు విధానం అంటారు.

ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రభుత్వ బడ్జెట్ లోని ముఖ్యాంశాలు.

1. 'రాబోవు ఆదాయం మరియు చేయబోయే వ్యయ వివరాలు చూపు పట్టికే' బడ్జెట్.
2. ఇది ఒక ఆర్థిక సంవత్సరానికి సంబంధించినది.
3. నిర్దేశించబడిన ప్రభుత్వ లక్ష్యాలకు అనుగుణంగా రాబడి మార్గాలు, వ్యయము వుంటాయి.

## ప్రభుత్వ బడ్జెట్‌లోని అంశాలు

### బడ్జెట్ నిర్మాణం

అన్ని స్థాయిలలో రూపొందే ప్రభుత్వ బడ్జెట్ సారూప్యతను కల్గి వుంటుంది. అయితే, చేయవలసిన వ్యయం పద్దులు, ప్రాధాన్యత ఇవ్వబడిన అంశాలు, వనరులు సమకూర్చుకొనే విధానంలో వ్యత్యాసాలు కలవు. ఈ విభాగంలో కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ రూపకల్పన గూర్చిన వివరణ ఇవ్వబడినది. ఇది 1995–96 సంవత్సరం నాటి బడ్జెట్.

| | |
|---|---|
| 1. రెవెన్యూ రాబడులు | |
| i) పన్నులు (నికరం) | 74 |
| ii) పన్నేతర రాబడులు | 27 |
| మొత్తం (i+ii) | 101 |
| 2. మూలధన రాబడులు | |
| i) అప్పుల వసూళ్ళు | 7 |
| ii) ఇతర రాబడులు | 7 |
| iii) అప్పులు మరియు ఇతరములు | 52 |
| మొత్తం i + ii + iii | 66 |
| 3. మొత్తం రాబడులు (1+2) | 167 |
| వ్యయం (Expenditure) | |
| 4. రెవెన్యూ వ్యయం | |
| i) ప్రణాళికేతర | 107 |
| ii) ప్రణాళికా | 29 |
| మొత్తం i + ii | 136 |
| 5. మూలధన వ్యయం | |
| i) ప్రణాళికేతర | 17 |
| ii) ప్రణాళికా | 19 |
| మొత్తం i + ii | 36 |
| 6. మొత్తం వ్యయం (4+5) | 172 |
| 7. బడ్జెట్ లోటు (= 6–3) | 5 |

బడ్జెట్ నందు రెండు విభాగాలు కలవు. అవి :

ప్రభుత్వానికి రాబడి రెండు రకాలుగా వస్తుంది. 1) రెవెన్యూ రాబడులు 2) మూలధన రాబడులు.

రెవెన్యూ రాబడులు అనగా ప్రస్తుత కాలంలో వచ్చు ఆదాయము. దీనిలో పన్నులు, ప్రభుత్వ రంగ సంస్థలు ఆర్జించే లాభాలు, గ్రాంటులు మొ॥నవి కలవు. రెవిన్యూ రాబడులకి మూలధన రాబడులకి మధ్య ముఖ్యమైన తేడా కలదు. రెవిన్యూ రాబడి ద్వారా సమకూర్చుకున్న మొత్తాన్ని ప్రభుత్వం భవిష్యత్‌లో తిరిగి చెల్లించాలనే నియమం లేదు. మూలధన రాబడులు అప్పులు కనుక, తిరిగి భవిష్యత్ నందు వాటిని వడ్డీతో సహ తప్పక చెల్లించవలసి వస్తుంది. అన్ని

మూలధన రాబడులు రుణాలు కనుక ప్రభుత్వ ఆస్తులను తగ్గిస్తాయి.

వ్యక్తుల వలె ప్రభుత్వం కూడా వ్యయాన్ని తన ఆదాయంతో సరిపోల్చుకొని ఖర్చు చేయవలసి ఉంటుంది. వ్యక్తి ఖర్చులు ప్రస్తుతం ఆదాయం నకు లోబడి వుండాలి. ఒకవేళ తన ఆదాయంనకు మించి వ్యయ అవసరాలు వుంటే తప్పక అప్పు చేయవలసి వస్తుంది. కనుక, వ్యక్తులకైనా ఖర్చు చేయుటకు గల ఆదాయమార్గాలు రెండు. ఒకటి ప్రస్తుత ఆదాయం, రెండు అప్పులు. అదే విధంగా ప్రభుత్వం కూడ తన వ్యయాన్ని రెండు పద్ధతుల ద్వారా పూడ్చుకొంటుంది. అయితే, వ్యక్తి ముందుగా తన ఆదాయం అంచనా వేసుకొని దానికి అనుగుణంగా వ్యయాన్ని చేస్తాడు. కానీ, ప్రభుత్వం ముందుగా తన వ్యయాన్ని అంచనా వేసుకొని దానికి కావలసిన ఆర్థిక వనరుల కొరకు ప్రణాళికలను రూపొందించుకొనును.

***2. 'బడ్జెట్ విధానం' యొక్క ముఖ్య లక్ష్యాలను వివరింపుము?***

**జ:** ఒక ఆర్థిక సంవత్సరంనకు సంబంధించిన ప్రభుత్వ రాబడి మరియు వ్యయంల నివేదికను 'బడ్జెట్' గా వ్యవహరిస్తారు. కేంద్ర, ఆర్థిక మంత్రి బడ్జెట్ రూపొందించుటలో రెండు ప్రధానమైన అంశాలను దృష్టి యందు వుంచుకోవలసి వుంది. ఏఏ పద్దులపై ప్రభుత్వం వ్యయం జేయవలసి వుంది? ఆ వ్యయాన్ని చేయుటకు కావలసిన ఆర్థిక వనరులను ఎలా పొందాలి? ప్రభుత్వం తన లక్ష్యాలకు అనుగుణంగా ఏఏ అంశాలకు ప్రాధాన్యతను ఇవ్వాలనే అంశం ఆధారపడి నిర్ణయించబడును. వివిధ అంశాలలో కొన్నింటిని ఎంపికజేసుకొని దానికి నిధులను కేటాయించటం, వ్యయానికి తగిన ఆర్థిక వనరులను సేకరించుట మొదలగు అన్ని అంశాలు, ప్రభుత్వ విధానాలు, కార్యక్రమాలు మొదలగు అన్ని అంశాల సమాహారమే "ప్రభుత్వ బడ్జెట్ విధానం".

## బడ్జెట్ యొక్క ప్రధాన లక్ష్యాలు

### 1. సమర్థవంతమైన పరిపాలనను అందించుట

పరిపాలనకు కావలసిన పోలీస్, సైన్యం, శాసనసభలు, కోర్టులు, ప్రభుత్వ కార్యాలయాలు మొదలగు అనేక శాఖల నిర్వహణకు కావలసిన వనరులను బడ్జెట్‌లో కేటాయించి సమర్థవంతమైన పాలన ప్రజలకు అందించుట సాధ్యం అవుతుంది. కనుక, బడ్జెట్ యొక్క ప్రధాన లక్ష్యం సమర్థవంతమైన పరిపాలన.

### 2. అవస్థాపనా సౌకర్యాల కల్పన

విద్యాసంస్థల ఏర్పాటు, నిర్వహణ, ఆరోగ్యం, పారిశుద్ధ్యం, మంచినీరు, విద్యుచ్ఛక్తి సరఫరా, రవాణా సౌకర్యాలు, తంతి తపాలా కార్యాలయాలు, కమ్యూనికేషన్ సేవల కల్పన, రోడ్లు, పార్కులు, వంతెనల నిర్మాణం మొదలగు అవస్థాపనా సౌకర్యాల కల్పన పై ప్రభుత్వం బడ్జెట్‌లో కేటాయింపులు జేయవలెను.

### 3. ఉపాధి అవకాశాల కల్పన

ప్రజలకు ఉపాధి కల్పన జేయుటకు ప్రభుత్వం అనేక కార్యక్రమాలను నిర్వహించవలసి వుంది. ప్రభుత్వ రంగ సంస్థలను నెలకొల్పుట, ప్రైవేటు సంస్థలకు సబ్సిడీలను ఇవ్వటం, చిన్నతరహా పరిశ్రమలను, లఘు కుటీర పరిశ్రమలను ప్రోత్సహించుటకు వాటికి పన్ను మినహాయింపులను ఇవ్వటం. వాటికి కావలసిన రుణాల మంజూరుచేయుటం. ప్రభుత్వం ప్రజాపనులను చేపట్టడం, రోడ్ల నిర్మాణం, వంతెనల ఏర్పాటు, ప్రభుత్వ భవన నిర్మాణ కార్యక్రమాలు మొదలగువాటి వల్ల ఉపాధి కల్పన జరుగును.

## 4. ధరల స్థిరీకరణం

నిత్యావసర వస్తువులు ధరలు పెరగకుండా స్థిరీకరణ కొరకు ప్రభుత్వం కృషి చేయవలసి వుంది. చౌక ధరలకు కొన్ని ప్రధానమైన నిత్యావసర వస్తువులను రైతుల వద్ద నేరుగా కొనుగోలు చేసి, నిలువ వుంచి, ప్రజలకు ప్రభుత్వమే నేరుగా సరఫరా చేయవలెను. ఇందుకు చౌక ధరల దుకాణాలు ఏర్పాటు జేయటం, వాటి ద్వారా ప్రజలకు కావలసిన నిత్యావసర వస్తువులను పంపిణీ చేయవలసి వుంది.

## 5. ఆదాయ అసమానతల తగ్గింపు

ప్రభుత్వం ధనికులపై ఎక్కువ పన్ను విధించి, పేద ప్రజల సౌకర్యాల కల్పనకు ఎక్కువ మొత్తంలో వ్యయం చేయుట ద్వారా ప్రజల మధ్యవున్న ఆదాయ అసమానతలను తగ్గించే దిశగా బడ్జెట్‌ను రూపొందించాలి.

## 6. ఆర్థికవృద్ధిని ప్రోత్సహించుట

ఆర్థికవృద్ధిని పెంపొందించుటకు ప్రభుత్వం కీలక లేదా మౌలిక పరిశ్రమలైన స్టీలు, కెమికల్స్, ఎరువులు, యంత్ర నిర్మాణం మొదలగు వాటిపై ఎక్కువగా పెట్టుబడులను పెట్టవలసి వుంది. అందువల్ల ప్రభుత్వం వీటి స్థాపనకు పెట్టుబడులను సమకూర్చి, వాటిని నిర్వహించాలి.

## 7. విదేశీ వాణిజ్యలోటును భర్తీ చేయుట

విదేశాల రాబడుల కన్నా చెల్లింపులు ఎక్కువగా వున్నట్లయితే విదేశీ వాణిజ్యలోటు ఏర్పడుతుంది. దీనికి గల కారణం ఎగుమతుల కన్నా దిగుమతులు అధికం కారణం.విదేశీ వాణిజ్యంలో వున్న లోటును తగ్గించుటకు దిగుమతులను నిరుత్సాహపర్చుటకు వాటిపై ఎక్కువ మొత్తంలో ప్రభుత్వం అధిక పన్నులు విధించవచ్చు. ఎగుమతులను ప్రోత్సహించుటకు సబ్సిడీలు ఇవ్వటం, పన్ను లేదా ప్రోత్సాహకాలు కల్పించవచ్చు.

# 30

# ద్రవ్య సరఫరా నియంత్రణ

# (Money Supply and It's Regulation)

## 30.1 పరిచయం

ద్రవ్యం ఎల్లప్పుడు ఎక్కువగా కోరుకునే వస్తువు. మనకు ద్రవ్యం అనేది అవసరం. ఎందుకంటే దీనితో వస్తుసేవలను కొనగలం. మనలో ప్రతి ఒక్కరు కొంత ద్రవ్యాన్ని అందుబాటులో వుంచుకుంటారు. పై రకంగా అందుబాటులో ఉంచుకున్న ద్రవ్యాన్ని కలపడం ద్వారా ఒకదేశములోని మొత్తం ద్రవ్యనిల్వలపై మనకు ఒక ఆలోచన వస్తుంది. ఒక దేశంలోని కొన్ని ఎంపిక చేసిన ద్రవ్య సరఫరా సంస్థల నుండి ద్రవ్య సరఫరా అనే భావనవస్తుంది. ఈ పాఠం ఈ భావనను వివరించడమే గాకుండా ద్రవ్య సరఫరాను ఎలాపెంచవచ్చో లేక తగ్గించవచ్చో వివరిస్తుంది.

## 30.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశములోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ద్రవ్య అవసరం మరియు దాని వివిధ రూపాలను వివరిస్తారు.
- ద్రవ్య చెల్లింపులను మనం ఎలా చేస్తామో వివరిస్తారు.
- ఒక దేశంలో కరెన్సీ నోట్లను మరియు నాణేలను ఎవరు జారీ చేస్తారో చెప్పగలం.
- వాణిజ్య బ్యాంకుల రుణ వితరణను కార్యకలాపములను వివరించుట.
- దేశం యొక్క ద్రవ్య నిల్వ మరియు ద్రవ్యసరఫరా అంశాలను వివరించటం.
- ద్రవ్య సరఫరాపై పర్యవేక్షణ ఆవశ్యకతను వివరించటం.

## 30.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. జాతీయ ద్రవ్య నిల్వ***

**జ:** జాతీయ ద్రవ్య నిల్వలో 1) ప్రజల వద్ద వున్న కాగితపు ద్రవ్యం మరియు నాణెములు 2) బ్యాంకుల వద్ద వున్న కరెన్సీ నోట్లు మరియు నాణెములు 3) కేంద్ర బ్యాంకు వద్ద వున్న వాణిజ్య బ్యాంకుల డిపాజిట్లు 4) వాణిజ్య బ్యాంకులలో నున్న డిమాండు డిపాజిట్లు కలిసి ఉంటాయి.

***2. జాతీయ ద్రవ్య సప్లయ్***

**జ:** జాతీయ ద్రవ్య సప్లయ్ 1) ప్రజల వద్ద వున్న కరెన్సీ నోట్లు మరియు నాణెములు 2) వాణిజ్య బ్యాంకుల వద్ద నున్న డిమాండు డిపాజిట్లను కలిగి ఉంటుంది.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. జాతీయ ద్రవ్య నిల్వ అననేమి?***

జ: ఒకదేశ ఆర్థిక వ్యవస్థలోని మొత్తము ద్రవ్య నిల్వ నాలుగు భాగములుగ ఉంటుంది.

1) ప్రజల వద్ద వున్న కరెన్సీ నోట్లు మరియు నాణెములు (బ్యాంకులలో వున్నవి కావు)

2) వాణిజ్య బ్యాంకులలోని కరెన్సీ నోట్లు మరియు నాణెములు

3) కేంద్ర బ్యాంకులో వున్న వాణిజ్య బ్యాంకుల డిపాజిట్లు

4) వాణిజ్య బ్యాంకుల డిమాండు డిపాజిట్లు

***2. జాతీయ ద్రవ్య సప్లయ్ అంటే ఏమిటి?***

జ: ద్రవ్య సప్లయ్ అను భావనకు ఒకే ఒక నిర్వచనం లేదు. ద్రవ్య సప్లయ్ యొక్క సాధారణ నిర్వచనమేమనగా లావాదేవీలకు వస్తువు కొనుగోలు మరియు అమ్మకమునకు మరియు ఇతర చెల్లింపులు చేయుటకు వాస్తవముగా ఉపయోగపడు అంశములను ఇది కలిగి యుండుట. ఇందులో పైన ఇవ్వబడిన నాలుగు భాగములలో రెండు ఉన్నవి.

1) ప్రజల వద్ద వున్న కరెన్సీ నోట్లు మరియు నాణెములు (బ్యాంకులలో వున్నవి కాక)

2) వాణిజ్య బ్యాంకులలోని డిమాండు డిపాజిట్లు

***3. చట్టబద్ధ నిల్వల నిష్పత్తిని వివరింపుము..***

జ: చట్టబద్ధ నిల్వల నిష్పత్తి ఎక్కువైన కొలది ఋణ పరపతి సామర్థ్యం తగ్గుతుంది. చట్టబద్ధ నిల్వల నిష్పత్తి అనునది కేంద్ర బ్యాంకు చేతిలో వున్న ఒక ప్రత్యక్ష సాధనం. కేంద్రబ్యాంకు దేశంలో ద్రవ్యసప్లయ్‌ని తగ్గించాలని కోరుతున్న యెడల అది చట్టబద్ధ నిల్వల నిష్పత్తిని పెంచుతుంది. ఇది ఋణ సామర్థ్యంను నియంత్రణ చేస్తుంది. దీని ఫలితంగా బ్యాంకుల డిపాజిట్ల సృష్టి సామర్థ్యము తగ్గుతుంది.

***4. బహిరంగ మార్కెట్ వ్యాపార లావాదేవీలు (చర్యలు)అనగానేమి?***

జ: బ్యాంకుల ఋణవితరణ సామర్థ్యము లేదా డిపాజిట్ సృష్టి సామర్థ్యము డిపాజిట్ దార్ల మార్గములో కూడ అదుపు చేయవచ్చు. డిపాజిట్ దార్లు తమంతట తామే బ్యాంకులలో తక్కువ నగదును జమ చేయుటకు ఆసక్తి చూపకపోవచ్చును. కానీ కేంద్రబ్యాంకు వాణిజ్య బ్యాంకులలో డిపాజిట్లను తగ్గించడానికి డిపాజిట్ దార్లను ప్రేరేపించే నిబంధనలను సృష్టించవచ్చు. కేంద్రబ్యాంకు సెక్యూరిటీలను అమ్ముతుంది. ఈ సెక్యూరిటీలను కొనడానికి ప్రజలు వారి డిపాజిట్ల నుండి నగదును వెనుకకు తీసుకోవడం గాని, కేంద్రబ్యాంకు పేరు మీద చెక్కులను జారీ చేయడం చేస్తారు. ఈ

మార్గంలో మొత్తం డిపాజిట్లు తగ్గించబడి నగదు కేంద్ర బ్యాంకుకు ప్రవహించి పంపిణీ కాకుండా ఉంటుంది. కేంద్రబ్యాంకు ద్వారా ద్రవ్య సరఫరాను నియంత్రించే నైపుణ్యమును యాంత్రికభాషలో 'బహిరంగ మార్కెట్ లావాదేవీలు' అంటారు. ఇక్కడ బహిరంగ మార్కెట్ అనునది బహిరంగ మార్కెట్‌లో కేంద్రబాంకు సెక్యూరిటీల అమ్మకం మరియు కొనుగోలు అనే కార్యకలాపలను సూచిస్తుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

### *1. ద్రవ్య అవసరం ఏమిటి?*

**జ:** ద్రవ్యం కొరకు ద్రవ్యాన్ని కోరుకుంటారా? లేదు అనేది దీనికి సమాధానం. ద్రవ్యంనకు ప్రత్యక్ష ఉపయోగం ఉండదు. ఇది వినియోగానికి పనికిరాదు. ఉత్పాదనలో ద్రవ్యం వలన ప్రత్యామ్నాయ ఉపయోగం కూడా లేదు. నిజమైన ఉత్పత్తి ప్రక్రియలో ద్రవ్యము ఒక వస్తువుగా గాని, లేదా యంత్రంగా గాని ఉపయోగించలేం. కానీ ద్రవ్యాన్ని మనం వినియోగం కొరకు గాని లేదా ఉత్పాదనలో ఉపయోగించుట కొరకు గాని అవసరమైన వస్తుసేవలను కొనుగోలు చేయుటకు ఉపయోగిస్తాము. జీవిత సత్యమేమనగా ద్రవ్యం కోసమే ద్రవ్యాన్ని కోరుకోం.

ద్రవ్యం వస్తుసేవలను పొందడానికి కావలసిన శక్తిని ఇస్తుంది. అధిక ద్రవ్యం కలిగిన వ్యక్తి అధిక వస్తుసేవలను పొందే శక్తి గలిగివుంటాడు. అందుచేత మనలో అనేకులు ద్రవ్యం వెంట పరుగెడతారు.

మనం ద్రవ్యాన్ని ప్రత్యక్షంగా వినియోగించలేనపుడు లేదా ప్రత్యక్షంగా వస్తుసేవలను ఉత్పత్తి చేయలేనపుడు మొత్తం సమాజానికి ద్రవ్య ఉపయోగమేమిటి? సమాజంలో అధిక కరెన్సీనోట్లు లేదా నాణేలు ఉన్నంత మాత్రాన అది ధనిక సమాజం కాలేదు. సమాజం ఎక్కువ వస్తుసేవలను కలిగియున్నపుడు మాత్రమే అది ధనిక సమాజమవుతుంది. నిజానికి కొనుగోళ్ళు, అమ్మకం అరువుతెచ్చుకోవడం మరియు ఇవ్వడమనే కార్యకలాపాల సౌలభ్యము కొరకు మొదట్లో ద్రవ్యం కనుగొనబడింది.

ద్రవ్యం యొక్క ఈ విధిని వినిమయ మాధ్యమం అని పిలుస్తారు. ప్రాచీన సమాజంలో ఒక వస్తువు యొక్క ధరను ఇతర వస్తువుల పరిమాణంలో తెలియపరచేవారు. ఒక వస్తువునకు మరొక వస్తువును వినిమయం చేసే పద్ధతి చాలా అసౌకర్యమైనది. ద్రవ్య ప్రవేశంతో ప్రతి వస్తువు లేదా సేవల ధరను ద్రవ్యయూనిట్లలో చెప్పగలం. కాబట్టి సమాజానికి వ్యాపార కార్యకలాపముల సౌలభ్యానికి ద్రవ్యం అవసరం.

### *2. మనము ద్రవ్య చెల్లింపులను చేసే మార్గములను వివరింపుము?*

**జ:** పుస్తకము వెల అమ్మకందారుడు ద్రవ్యరూపంలో చెప్తారు. ఒక పుస్తకం ధర రు.100 లు అనుకుందాము. రు.100 ల విలువగల కాగితపు కరెన్సీ తీసుకొని అమ్మకం దారునకు చెల్లిస్తారు. ఇది ఒక రకమైన చెల్లింపు విధానం. పుస్తకాల అమ్మకం దారుడు ఈ కరెన్సీ నోట్లును అంగీకరించుటకు కారణము ఏమనగా ఈ కరెన్సీ నోట్లను ఆ పుస్తక ప్రచురణ కర్తకు చెల్లించినట్లయితే అతడు సంతోషముగా అంగీకరిస్తాడనే నమ్మకం ఉండుటయే. ఈ నమ్మకం పుస్తక విక్రయదారుడికి ఈ రకమైన నమ్మకం కలుగడానికి ఆ దేశము యొక్క చట్టమే కారణము. చట్ట ప్రకారము ఏ ఒక్కరు వస్తుసేవల కోసం కరెన్సీనోట్లు రూపములోని చెల్లింపులను తిరస్కరించరాదు. చట్ట సమ్మతమైన ఏ ద్రవ్యం నైనను లీగల్

టెండరు ద్రవ్యం అవుతుంది. ఈ ద్రవ్యం ఆదేశ చట్టపరిధికి లోబడి ఉంటుంది. ఉదాహరణకు భారతదేశంలో రూపాయి కరెన్సీ నోట్లు లీగల్ టెండరు ద్రవ్యం. ఇతర దేశపు కరెన్సీలో ఏ వ్యక్తికైనా చెల్లింపులు చేయబోతే తన చట్టబద్ధమైన హక్కు ద్వారా ఆ చెల్లింపును తిరస్కరించవచ్చు. భారతదేశములో బ్రిటిషు పౌండ్లు, అమెరికా డాలర్లు, పాకిస్థాన్ రూపాయలు మొదలైనవి లీగల్ టెండర్ ద్రవ్యం కావు. బ్రిటిషు పౌండు ఆదేశమునకు లీగల్ టెండరు ద్రవ్యమవుతుంది. పాకిస్థాన్ రూపాయి ఆదేశమునకు లీగల్ టెండర్ ద్రవ్యమవుతుంది. ఈ విధంగా ఏ దేశ ద్రవ్యము ఆ దేశానికి లీగల్ టెండరు ద్రవ్యమవుతుంది.

నగదు చెల్లింపులకంటే డిమాండు డిపాజిట్ల ద్వారా చెల్లింపులనేవి చాలా అనుకూలమైన చెల్లింపు విధానము. సాధారణముగా చిన్న మొత్తాల చెల్లింపులను ద్రవ్యరూపంలో చెల్లించుటకు ప్రాధాన్యతనిస్తారు. అనగా కరెన్సీనోట్లు లేదా నాణెముల ద్వారా చెల్లిస్తారు. పెద్ద పెద్ద మొత్తాలలో నగదు చెల్లింపులు సాధారణంగా చెక్కుల రూపములో జరుగును.

### *3. దేశంలో కరెన్సీ నోట్లను మరియు నాణెములను ఎవరు జారీ చేస్తారో తెల్పుము?*

**జ:** బ్యాంకింగ్ పరిభాషలో RBI అనునది మన దేశము యొక్క కేంద్రబ్యాంకు. ఇది అత్యున్నత (Apex) బ్యాంకు. దీనిని సెంట్రల్ బ్యాంకు అని పిలవటానికి కారణము ఇది బ్యాంకింగ్ వ్యవస్థకు ప్రధాన మైనది. రు.100 ల నోటుపైన రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా అని ముద్రించి యుంటుంది. నోటు క్రింద భాగములో రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా గవర్నరు సంతకము చేసి వుంటుంది. పైన చెప్పిన 100 రూపాయల కరెన్సీ నోటును రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు జారీ చేశారు. రు.2, 5, 10, 20, 50, 100, రు.500 మరియు రూ.1000 ల విలువగల అన్ని కరెన్సీనోటులను రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియావారు జారీ చేస్తారు.

ఒక రూపాయి కరెన్సీ నోటుపై భారత ప్రభుత్వం అని ముద్రించబడి వుంటుంది. కరెన్సీ నోటు క్రింద భాగములో భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖ కార్యదర్శి చేత సంతకము చేయబడి వుంటుంది. ఒక రూపాయి కరెన్సీ నోటును భారత ప్రభుత్వం జారీ చేస్తోంది. అన్ని రకముల విలువగల నాణెములను కూడ భారత ప్రభుత్వం జారీ చేస్తుంది.

### *4. కేంద్ర బ్యాంకు ఋణ నియంత్రణ ఎందుకు చేయాలి?*

**జ:** వాణిజ్య బ్యాంకుల నియంత్రణ లేని ఋణ పరపతి రెండు రకాల నష్టమును కలుగ చేయవచ్చును. మొదటిది ఈ విధానము ఖాతాదార్ల ప్రయోజనమునకు హాని కలిగిస్తుంది. రెండవది, ఇది దేశములోని మొత్తము డిపాజిట్లను ఎక్కువగా పెంచవచ్చు. డిమాండు డిపాజిట్లు దేశము యొక్క ద్రవ్య నిల్వలో ఒక భాగము. ఈ విధముగా అదుపులేని ఋణ పరపతి దేశము యొక్క ద్రవ్య నిలువ యొక్క అదుపు లేని పెరుగుదలకు దారి తీయవచ్చు. ఇది ధరల పెరుగుదలకు కారణమవుతుంది.

బ్యాంకులు ఇలాంటి క్రొత్త డిపాజిట్లను స్వీకరించినపుడు వారు అందులో కొంత భాగంను చట్ట బద్ధ నిల్వగా వుంచుకొని మిగిలిన ద్రవ్యాన్ని ఋణంగా ఇవ్వగలుగుతుంది. వారు ఋణంగా ఇచ్చినట్లయితే డిపాజిట్లు ఇంకా పెరుగుటయే కాకుండా దేశం యొక్క ద్రవ్య నిల్వ కూడా పెరుగుతుంది. అందువలననే ఒక్కొక్కసారి వాణిజ్య బ్యాంకులను నగదు తయారీదార్లుగా వర్ణిస్తారు. దీనివలన ధరలు పెరుగును.

క్రొత్తగా చేసిన డిపాజిట్లు నుంచి బ్యాంకులు కనీసము ఒక రూపాయి కూడా ఋణంగా ఇవ్వకపోతే క్రొత్త డిపాజిట్లు ఎంత మాత్రము ఉండవు. బ్యాంకులు డిపాజిట్‌లో కొంత మొత్తమును ఋణంగా ఇచ్చినట్లయితే ఈ ఋణ మొత్తానికి సరిపడునంత క్రొత్త డిపాజిట్లు సృష్టించబడి ఋణముగా ఇచ్చినంత ద్రవ్యం బ్యాంకుకు తిరిగి వస్తుంది. దీనివలన ధరలు తగ్గును.

వాణిజ్య బ్యాంకుల ఋణ పరపతి సామర్థ్యము లేక డిపాజిట్ల సృష్టి లేక ద్రవ్యసృష్టి శక్తి చట్టబద్ధ నిల్వ ఆవశ్యకతపై ఆధారపడి ఉంటుంది. చట్టబద్ధ నిల్వ నిష్పత్తి పెరిగే కొద్దీ బ్యాంకుల ఋణ పరపతి సామర్థ్యం లేక ద్రవ్యసృష్టిశక్తి తగ్గుతుంది. చట్ట బద్ధ నిల్వ నిష్పత్తి కేంద్ర బ్యాంకు (RBI) ద్వారా నిర్ణయించబడుతుంది. రిజర్వుబ్యాంకు దీనిని పెంచినట్లయితే బ్యాంకుల ఋణపరపతి శక్తి తగ్గుతుంది. రిజర్వుబ్యాంకు ఈ నిష్పత్తిని తగ్గించినట్లయితే ఋణపరపతి సామర్థ్యం పెరుగుతుంది. ఈ విధంగా చట్టబద్ధ నిల్వనిష్పత్తి రిజర్వు బ్యాంకు చేతిలో ఒక సాధనముగ వుండి దేశములోని ద్రవ్య నిల్వ నియంత్రణకు తోడ్పడుతుంది.

### *5. జాతీయ ద్రవ్య నిల్వ అననేమి?*

**జ:** ఒకదేశ ఆర్థిక వ్యవస్థలోని మొత్తము ద్రవ్య నిల్వ నాలుగు భాగములుగ ఉంటుంది.

1) ప్రజల వద్ద వున్న కరెన్సీ నోట్లు మరియు నాణెములు (బ్యాంకులలో వున్నవి కావు)

2) వాణిజ్య బ్యాంకులలోని కరెన్సీ నోట్లు మరియు నాణెములు

3) కేంద్ర బ్యాంకులో వున్న వాణిజ్య బ్యాంకుల డిపాజిట్లు

4) వాణిజ్య బ్యాంకుల డిమాండు డిపాజిట్లు

పై వాటిలో మొదటి మూడింటి మొత్తం దేశంలోని మొత్తము ద్రవ్యనిల్వ అవుతుంది. దీనిని కాగితపు ద్రవ్యం అని కూడ చెబుతారు. పై వాటిలోని రెండవ మరియు మూడవ భాగములు మొత్తం వాణిజ్య బ్యాంకులలోని మొత్తం ద్రవ్యమవుతుంది. ఈ మొత్తం కేంద్ర బ్యాంకు వాణిజ్య బ్యాంకులపై విధించిన చట్టబద్ధ నిల్వ అవసరానికి తక్కువ గాకుండ ఉండాలి. మొదటి భాగం సామాన్యముగా ప్రజల వద్ద వున్న ద్రవ్యం. నాల్గవ అంశంలోని ద్రవ్యం చెక్కుల చెల్లింపు కొరకు డిమాండు డిపాజిట్లు రూపములో ఉన్న ద్రవ్యం. దీనిని బ్యాంకు ద్రవ్యం అని కూడ చెబుతారు.

### *6. ద్రవ్య సప్లయ్‌పై నిఘా ఉంచవలసిన అవసరంను వివరింపుము?*

**జ:** బ్యాంకుల బయట కరెన్సీ నోట్లు మరియు బ్యాంకులలోని డిమాండు డిపాజిట్లు ద్రవ్య సప్లయ్‌లో కలిసి ఉంటాయి. కరెన్సీ నోట్లు, నాణెములు మరియు డిమాండు డిపాజిట్లు ప్రతిక్షణం ప్రత్యేకమైన వ్యక్తులు, వ్యాపార సంస్థలు మొదలైన వాటి ఆధీనంలో తప్పనిసరిగా ఉంటాయి. వస్తు మరియు సేవల మీద ద్రవ్యమునకు నియంత్రణ ఉంటుంది. ఎక్కువ ద్రవ్యమున్న యెడల ఎక్కువ నియంత్రణ ఉంటుంది. ద్రవ్యమును ఉంచుకొని దానిని ఖర్చు పెట్టుకోకుండా వుండే వ్యక్తి వస్తు సేవలపై వ్యయము చేయడం వలన అతను పొందగలిగే సంతృప్తిని తనకు తానే కాదనుకున్నట్లవుతుంది. ఆ రకముగా వ్యక్తి లేక వ్యాపార సంస్థ పొందిన మొత్తం ద్రవ్యంను అంటిపెట్టుకొనుటకు ఇష్టపడరు. సామాన్యంగా ప్రతివ్యక్తి ఒక సమయంలో కొంత ద్రవ్యంను ఉంచుకొనుటకు ఇష్టపడతాడు. ఎంత మొత్తం ద్రవ్యంను అంటిపెట్టు కొనవలెనను అనేది వారి పొందే ఆదాయం మరియు రోజువారీ లావాదేవీలపై ఆధారపడి వ్యక్తికి వ్యక్తికి మధ్య భేదం ఉంటుంది. అధిక

ఆదాయం గలవారు లేదా రోజువారీ కొనుగోలు అమ్మకం దార్లు ఎక్కువ జరిపేవారు అధిక ద్రవ్యంను అందుబాటులో ఉంచుకుంటారు. ఈ కారణముగ మనలోని ప్రతి ఒక్కరు కొంత ద్రవ్యంను లేదా డిమాండు డిపాజిట్లను ఉంచుకునే అలవాటును చేసుకొంటారు.

ఒక వ్యక్తి తన దగ్గర ఉన్న ద్రవ్యం తను వుంచుకొనుటకు ఇష్టపడిన దానికంటె ఎక్కువైనపుడు అతను ఎక్కువగా ఉన్న ద్రవ్యాన్ని వస్తు మరియు సేవలపై ఖర్చు చేయాలనుకోవచ్చు. అతడు ద్రవ్యంను వినియోగంపై ఖర్చు చేయడం కాని లేదా దానిని పెట్టుబడిపై ఖర్చు పెట్టడం గాని చేస్తాడు. కనుక దేశంలో ద్రవ్య సప్లయ్ పెరిగినపుడు మరియు ప్రజల వద్ద మిగులు ఎక్కువగా ఉన్నప్పుడు వారు వినియోగము లేదా పెట్టుబడిపై వ్యయము చేయుటకు ఇష్టపడతారు. ఇది వస్తు సేవల డిమాండును పెంచి ఆర్థిక వ్యవస్థ సాధారణ ధరల స్థాయిని పెంచును.

ద్రవ్య సప్లయ్ తగ్గడం ద్వారా ప్రజలదగ్గర నున్న ద్రవ్యం తగ్గినట్లయితే ప్రజలు వారి ద్రవ్య విలువను సాధారణ ధరల స్థాయికి పెంచుకొనుటకు వారు పొందిన ద్రవ్యంను వ్యయం చేయకుండా ఆగుతారు. ఇది వస్తు సేవల గిరాకీని తగ్గించి తద్వారా ధరలు పడిపోవడానికి దారి తీస్తుంది. కనుక ద్రవ్య సరఫరాను తగ్గించడం ధరల పతనానికి దారి తీస్తుంది. అధిక స్థాయిలో ధరల హెచ్చు, తగ్గులు నిరంతర పెరుగుదల లేదా నిరంతర పతనము ఒక ఆర్థిక వ్యవస్థకు మంచి పరిణామం కాదు. ద్రవ్య సప్లయ్‌లో మార్పులు ధరలను ప్రభావితం చేస్తాయి. కనుక RBI ద్రవ్య సప్లయ్‌పై నిఘా ఉంచడం ద్వారా అధిక స్థాయిలో ధరలలో ఏర్పడే హెచ్చు తగ్గులను ఆపగలుగుతుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. కేంద్రబ్యాంకు అనుసరించే పరపతి నియంత్రణలను వివరింపుము?***

**జ:** బ్యాంకులు వాస్తవానికి ఎంత మొత్తం ఋణంగా ఇస్తాయనేది రెండు కారణములపై ఆధారపడి ఉంటుంది. అందులో ఒకటి అవి స్వీకరించే డిపాజిట్లు. తక్కువ ద్రవ్యం జమ అయితే మొదటగా తక్కువ ఋణ పరపతి సాధ్యమవుతుంది. రెండవది కేంద్ర బాంకు విధించే చట్టబద్ధ నిల్వల అవసరం.

**ఎ) చట్టబద్ధ నిల్వల నిష్పత్తి**

చట్టబద్ధ నిల్వల నిష్పత్తి ఎక్కువైన కొలది ఋణ పరపతి సామర్థ్యం తగ్గుతుంది. చట్టబద్ధ నిల్వల నిష్పత్తి అనునది కేంద్ర బ్యాంకు చేతిలో వున్న ఒక ప్రత్యక్ష సాధనం. కేంద్రబ్యాంకు దేశంలో ద్రవ్యసప్లయ్‌ని తగ్గించాలని కోరుతున్న యెడల అది చట్టబద్ధ నిల్వల నిష్పత్తిని పెంచుతుంది. ఇది ఋణ సామర్థ్యంను నియంత్రణ చేస్తుంది. దీని ఫలితంగా బ్యాంకుల డిపాజిట్ల సృష్టి సామర్థ్యము తగ్గుతుంది.

**బి) బహిరంగ మార్కెట్ వ్యాపార లావాదేవీలు (చర్యలు)**

బ్యాంకుల ఋణవితరణ సామర్థ్యము లేదా డిపాజిట్ సృష్టి సామర్థ్యము డిపాజిట్ దార్ల మార్గములో కూడ అదుపు చేయవచ్చు. డిపాజిట్ దార్లు తమంతట తామే బాంకులలో తక్కువ నగదును జమ చేయుటకు ఆసక్తి చూపకపోవచ్చును. కానీ కేంద్రబ్యాంకు వాణిజ్య బ్యాంకులలో డిపాజిట్లను తగ్గించడానికి డిపాజిట్ దార్లను ప్రేరేపించే నిబంధనలను సృష్టించవచ్చు. కేంద్రబ్యాంకు సెక్యూరిటీలను అమ్ముతుంది. ఈ సెక్యూరిటీలను కొనడానికి ప్రజలు వారి డిపాజిట్ల నుండి నగదును వెనుకకు తీసుకోవడం గాని, కేంద్రబ్యాంకు పేరు మీద చెక్కులను జారీ చేయడం చేస్తారు. ఈ మార్గంలో మొత్తం డిపాజిట్లు

తగ్గించబడి నగదు కేంద్ర బ్యాంకుకు ప్రవహించి పంపిణీ కాకుండా ఉంటుంది. డిపాజిట్ల తరుగుదల ఋణ సామర్థ్యాన్ని తగ్గిస్తుంది. అదే విధంగా కేంద్రబ్యాంకు ద్రవ్య సరఫరాను పెంచవలెననుకొన్నచో అది ప్రజల నుండి సెక్యూరిటీలను కొని కొనుగోలు దార్ల తరపున చెక్కుల వ్రాయడం ద్వారా చెల్లింపులు చేసేటట్లు చేస్తుంది. ప్రజలు ఈ ద్రవ్యంను బ్యాంకులలో జమ చేస్తారు. బ్యాంకులలో డిపాజిట్‌లు పెరిగి తద్వారా బ్యాంకుల ఋణ సామర్థ్యం మరియు డిపాజిట్ల సృష్టి సామర్థ్యం అనేకరెట్లు పెరుగుతుంది. కేంద్రబ్యాంకు ద్వారా ద్రవ్య సరఫరాను నియంత్రించే నైపుణ్యమును యాంత్రికభాషలో 'బహిరంగ మార్కెట్ లావాదేవీలు' అంటారు. ఇక్కడ బహిరంగ మార్కెట్ అనునది బహిరంగ మార్కెట్‌లో కేంద్రబాంకు సెక్యూరిటీల అమ్మకం మరియు కొనుగోలు అనే కార్యకలాపలను సూచిస్తుంది.

**సి) బ్యాంకు రేటు**

వ్యాపార సంస్థలకు ద్రవ్యం అవసరమైనపుడు వాణిజ్య బ్యాంకుల నుండి అవి ఋణాలను తెచ్చుకుంటాయి. వాణిజ్య బ్యాంకులకు ద్రవ్యం అవసరమైనపుడు అవి కేంద్రబ్యాంకు నుండి ఋణం తెచ్చుకొంటాయి. కేంద్రబ్యాంకు వీటిపై వడ్డీని వసూలు చేస్తుంది. ఈ విధంగా వసూలు చేసిన వడ్డీ రేటును బ్యాంకు పరిభాషలో బ్యాంకు రేటు అని పిలుస్తారు. కనుక బ్యాంకు రేటు అనునది ఆవశ్యకంగా వాణిజ్యబ్యాంకులకిచ్చే ఋణాలపై కేంద్రబాంకు పొందే వడ్డీరేటు అవుతుంది. ఇప్పుడు వాణిజ్యబ్యాంకులకు కేంద్రబ్యాంకు ఋణాలనిచ్చే మరియు వాణిజ్య బ్యాంకులు ప్రజలకు ఋణాలనిచ్చినట్లయితే అవి వాణిజ్య బ్యాంకులు వసూలు చేసే వడ్డీరేటు.

కేంద్రబ్యాంకు వారు వాణిజ్య బ్యాంకులు తక్కువ ఋణాలివ్వాలనుకున్నట్లయితే అది వాణిజ్యబ్యాంకుల నుండి వసూలు చేసే వడ్డీ రేటును అనగా బ్యాంకు రేటును పెంచుతుంది. (కేంద్రబ్యాంకు ప్రజలకు ఋణాలివ్వరని గుర్తుంచుకోండి). ఇది వాణిజ్య బ్యాంకులు వారి ఋణ వడ్డీరేటును పెంచుకొనేటట్లు ఒత్తిడిని కలుగ జేస్తుంది. ఋణం తీసుకునే వారికి ఇప్పుడు ఎక్కువ వడ్డీని చెల్లించవలసి ఉంటుంది. ఇది వారి ఋణంపై ఖర్చును పెంచడం ద్వారా వారు తక్కువ దూరం తీసుకొనేటట్లు చేస్తుంది. ఇది వాణిజ్య బ్యాంకుల ఋణాలను తగ్గిస్తుంది. పర్యవసానంగా ఇది ద్రవ్య సప్లయ్ తగ్గిస్తుంది. ఇదే మాదిరి, కేంద్రబ్యాంకు బ్యాంకు రేటును తగ్గించినట్లయితే వాణిజ్య బ్యాంకులు కూడ వడ్డీ రేటును తగ్గిస్తాయి. అపుడు ఋణాలు పెరిగి ద్రవ్య సప్లయ్ కూడా పెరుగుతుంది.

# 31

# ప్రణాళికల అవశ్యకత

# (Need for Planning in India)

## 31.1 పరిచయం

మీరు ఇంతవరకు అర్ధశాస్త్రంలో ఉపయోగించే వివిధ భావనలు, ఆర్థిక విశ్లేషణా పద్ధతులు, సాధనాలు వాటి ఆచరణ మొదలైన అంశాలు ఏ వ్యవస్థ గురించి ప్రస్తావించకుండా అధ్యయనం చేసినారు. ఈ అధ్యాయంలో భారత ఆర్థిక వ్యవస్థ గురించి, ఆర్థికవృద్ధి ఆవశ్యకత గురించి, ఆర్థికాభివృద్ధి, వేగంగా సాధించడానికి అనుసరిస్తున్న విధానాల గురించి తెలుసుకుంటారు.

## 31.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశములోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు

- స్వాతంత్ర్యోధ్యమ సమయంలో భారత ఆర్థిక వ్యవస్థ యదార్ధస్థితి.
- ఆర్థికాభివృద్ధి ఆవశ్యకత
- ఆర్థికాభివృద్ధి కొలమానాలు
- ఆర్థిక ప్రణాళికల అర్ధవివరణ
- భారతదేశంలోని ప్రణాళికా ప్రక్రియ

## 31.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

*1.* ***ఆర్థిక వృద్ధి***

జ: దీర్ఘకాలంపాటు నిజతలసరి ఆదాయంలో పెరుగుదలను ఆర్థికవృద్ధి అంటారు.

*2.* ***ఆర్థికాభివృద్ధి***

జ: ఆర్థికాభివృద్ధి, ఆర్థికవృద్ధి కన్నా విస్తృతమైంది. ఇది వస్తుసేవల పెరుగుదలతో పాటు, ఆదాయ అసమానతల తగ్గుదల, పేదరిక నిర్మూలన కూడా సూచిస్తుంది.

*3.* ***భారత ప్రణాళికల ధ్యేయాలు***

జ: భారత ప్రణాళికల ప్రధాన ధ్యేయాలు ఆర్థికవృద్ధి, ఆదాయ అసమానతల నిర్మూలన, స్వావలంబన, ఆధునీకరణ, నిరుద్యోగ నిర్మూలన, సమాన ప్రాంతీయాభివృద్ధి.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. ఆర్థిక వృద్ధికి ఆర్థికాభివృద్ధికి తేడాను వివరించండి.***

**జ:** స్వాతంత్ర్యోద్యమ సమయంలో పరిస్థితులు అవగాహన చేసుకున్న పిమ్మట మనదేశానికి ఏది అవసరమో పునరాలోచన చెయ్యాలి. దేశంలో ప్రజల ఆదాయ స్థాయిని జీవన ప్రమాణ స్థాయిని పేదరిక నిర్మూలనను చేపట్ట వలసిన ఆవశ్యకత ఉంది. ఆర్థికాభివృద్ధి చేపట్టడం ద్వారా వీటిని సాధించవచ్చును. దీర్ఘకాలంపాటు నిజతలసరి ఆదాయంలో పెరుగుదలను ఆర్థికవృద్ధి అంటారు. నిజ ఆదాయం అనగా వస్తుసేవల రూపంలో ఉండే ఆదాయం అని అర్థము. మొత్తం ఆదాయాన్ని మొత్తం జనాభాతో భాగించగా వస్తుంది, తలసరి ఆదాయం కాబట్టి దీర్ఘకాలంపాటు వస్తుసేవల రూపంలో గోచరించే తలసరి ఆదాయంలో పెరుగుదలను ఆర్థిక వృద్ధి అంటారు.

ఆర్థికాభివృద్ధి, ఆర్థికవృద్ధి కన్నా విస్తృతమైంది. ఇది వస్తుసేవల పెరుగుదలతో పాటు, ఆదాయ అసమానతల తగ్గుదల, పేదరిక నిర్మూలన కూడా సూచిస్తుంది. భారత రాజ్య నిర్మాతలు దేశం ఆర్థికాభివృద్ధి చెందాలని ఆశించారు. దీనిని సాధించడానికి దేశజాతీయోత్పత్తి నిరంతరంగా పెరగడంతో పాటు ప్రజల నుండి అనుకూల స్పందన రావాలి. ఆర్థిక వ్యవస్థలో వస్తురాశి పెరగాలంటే, ఉత్పత్తి పెరగాలి. దేశంలోని వనరుల వినియోగం పెరిగితే ఉత్పత్తి పెరుగుతుంది. యంత్రాలు, యంత్ర పరికరాలు, సామాగ్రి తయారు చేయడానికి శ్రామిక శక్తి అవసరం. యంత్రాలను, పరికరాలను మూలధన పెట్టుబడి అంటారు. ఇటువంటి పెట్టుబడి ఆర్థిక వ్యవస్థకు అవసరం.

దేశంలో వస్తూత్పత్తి పెరుగుదల దేశ జనాభా పెరుగుదల రేటు కన్నా అధికంగా ఉన్నప్పుడే తలసరి ఆదాయ స్థాయి పెరుగుతుంది. ప్రజల జీవన ప్రమాణ స్థాయి పెరుగుతుంది. ధనిక, పేద వర్గాల మధ్య వ్యత్యాసం కూడా తగ్గుతుంది. అసమానతలు సమసిపోతాయి. ఒకసారి ఆర్థికాభివృద్ధి మొదలయితే ఇతర అభిలషణీయ మార్పులు వాటంతటవే చోటు చేసుకుంటాయి. సాంకేతికాభివృద్ధి జరుగుతుంది. ఉత్పాదకత పెరుగుతుంది. పారిశ్రామికంగా కీలక పాత్ర వహిస్తుంది. ఒకవేళ ఉత్పాదకతలో మార్పులు, సాంకేతిక ప్రగతి పట్టణాలకు మాత్రమే పరిమిత మయితే దానిని ఆర్థికాభివృద్ధి అనలేము.

ఈ విధంగా ఆర్థికాభివృద్ధి తలసరి ఆదాయాల పెరుగుదలను ఆదాయ అసమానతల తగ్గుదలను మెరుగైన జీవన పరిస్థితులను సూచిస్తుంది. దేశంలో లభించే వివిధ వస్తుసేవల లభ్యత, నాణ్యతలను బట్టి జీవన ప్రమాణం ప్రభావితమవుతుంది. ఈ విధంగా త్రాగునీటి సౌకర్యాలు, అక్షరాస్యతలో పెరుగుదల, తపాలా సౌకర్యాలు, రోడ్ల సదుపాయాలు మొదలయినవి అన్నీ ఆర్థికాభివృద్ధి ద్వారా ప్రభావితమై ప్రజలకు మెరుగైన జీవన విధానాన్ని కల్పిస్తాయి.

***2. ప్రణాళికల ఆవశ్యకతను వివరింపుము.***

**జ:** స్వాతంత్రోద్యమ సమయంలో భారతదేశంలో ఆర్థికాభివృద్ధి చాలా అవసరం అని గుర్తించాము. దేశంలో ఆర్థికాభివృద్ధితో పాటు ఆదాయ అసమానతల తగ్గింపు, జీవన ప్రమాణాల పెరుగుదల కూడా అవసరమే. వ్యాపార విధానాలు మార్కెట్ శక్తులు డిమాండ్, సప్లయ్‌లు నిర్ణయిస్తాయి. వర్తమానంలో మంచిడిమాండు గల వస్తువులుమాత్రం ఉత్పత్తి చేయబడతాయి. దేశంలో ధనిక వర్గాలు మాత్రం కొనగల వస్తురాశి ఉత్పత్తి చేయబడుతుంది. కానీ, అవస్థాపనా సౌకర్యాల కల్పన మాత్రం జరుగదు. వీటి అభివృద్ధికి భారీ పెట్టుబడి అవసరం. వీటిపై ప్రతిఫలాలు వెంటనే రావు.

దీర్ఘకాలం పడుతుంది. ప్రతిఫలంకూడా తక్కువగా ఉంటుంది. కాబట్టి మొత్తం ఆర్థిక కార్యకలాపాలు స్వేచ్ఛా మార్కెట్‌కు వదిలివేస్తే మొత్తం ఉత్పత్తి పెరిగి ఆర్థిక వృద్ధి జరుగుతుంది. కానీ, ఆర్థికాభివృద్ధి మాత్రం జరగదు.

ఆర్థికాభివృద్ధి ప్రక్రియ సజావుగా ప్రారంభం కావడానికి మొదట ప్రభుత్వ జోక్యం ప్రోత్సాహం చాలా అవసరం. ప్రభుత్వం తన నిబంధనల ద్వారా దేశంలోని వనరులను మధ్య తరగతి, బడుగు వర్గాల ప్రజల అవసరాలకు తగిన వస్తు సేవల ఉత్పత్తికి తరలించవచ్చును. అవస్థాపనా సౌకర్యాలపై కూడా ప్రభుత్వం పెట్టుబడులు పెట్టవచ్చును. అసమానతలు నిర్మూలించవచ్చును. కాబట్టి అన్ని పనులు స్వేచ్ఛ మార్కెట్ శక్తులకు వదిలివేయడం సముచితం కాదు. పై కారణాల వలన ప్రభుత్వం ఆర్థికాభివృద్ధి సాధించడానికి ఆర్థిక ప్రణాళిక సాధనంగా ఎన్నుకోవడం జరిగింది. ప్రణాళిక బద్ధమైన కృషి ద్వారా దేశములో వనరుల గమనశీలత, కేటాయింపులు, వినియోగం అభిలషణీయంగానూ, అత్యధిక శాతం ప్రజలకు ఆమోదయోగ్యంగానూ, శ్రేయోదాయకంగానూ ఉంటుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

*1. స్వాతంత్ర్య సమయంలో భారత ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులు వివరించండి.*

**1) సామూహిక పేదరికం**

**జ:** భారత స్వాతంత్రోద్యమ సమయంలో (1950-51) భారతీయుని తలసరి ఆదాయం, అప్పటి ధరల ప్రకారం సంవత్సరానికి రూ. 238. అనగా రోజుకి తలసరి ఆదాయం 65 పైసలు మాత్రమే. (రూ. 238/365) ఇంతకన్నా ఎక్కువ ఆదాయం, తక్కువ ఆదాయం పొందుతున్న వారు కూడా ఉన్నారు. కానీ, తక్కువ ఆదాయం పొందుతున్న వారి శాతం ఎక్కువగా ఉండి, సామూహిక పేదరికంతో జీవించేవారు.

**2) ఆరోగ్య సదుపాయాల కొరత**

దేశంలో క్షామ పరిస్థితులు ఎక్కువగా ఉండేవి. శిశు మరణాల రేటు అధికంగా ఉండేది. అంటువ్యాధులు ప్రబలంగా ఉండేవి.

**3) జనాభా పెరుగుదల రేటు**

జననాల రేటు అధికంగా ఉండి, జనాభా పెరుగుదల వేగంగా ఉండేది.

**4) తక్కువ అక్షరాస్యత**

దేశంలో అక్షరాస్యత తక్కువ. నిరక్షరాస్యత ఎక్కువ. 1951 లో దేశంలో అక్షరాస్యులు 16.7 శాతం మాత్రమే.

**5) అల్ప పారిశ్రామికాభివృద్ధి**

దేశములో 50 శాతం పైగా వస్తూత్పత్తి వ్యవసాయ రంగమే సమకూరుస్తూ ఉండేది. దేశంలో 70 శాతం ప్రజలు వ్యవసాయరంగంలోనే పని పాటలు కలిగి ఉండేవారు. పారిశ్రామికాభివృద్ధి మాత్రం అల్పంగానూ, నామమాత్రంగానూ ఉండేది.

**6) పురాతన ఉత్పత్తి పద్ధతులు**

దేశంలో అన్ని రంగాలలో ఉత్పత్తి పద్దతులు చాలా వెనుకబడి సంప్రదాయబద్దంగా ఉండేవి. అందుచేత ఉత్పాదకత అల్పంగా ఉండేది.

**7) ప్రాచీన ఆచార సంప్రదాయాలు**

దేశంలో ప్రజలు ప్రాచీన ఆచార సంప్రదాయాలతో కట్టుదిట్టంగా, నూతనత్వం పట్ల విముఖతతో ఉండేవారు. కుల ప్రాతిపదికపై సమాజం విభజింపబడి, వృత్తుల వారీ గమనశీలతకు ఆటంకంగా ఉండేది. ప్రజల ఆహారపు అలవాట్లు సంప్రదాయ సిద్ధంగా ఉండేవి. నూతన మార్పులను ఏవగించుకునే మనస్థత్వంతో ఉండేవారు. ఈ కారణాలన్నీ సమాజంలో పేదరికానికి దోహదకారిగానూ, అభివృద్ధికి ఆటంకాలుగాను ఉండేవి.

**8) దేశ విభజన, సాంఘిక, ఆర్థిక సమస్యలు**

దేశ విభజన ఫలితంగా అనేక సాంఘిక, ఆర్థిక సమస్యలు తలెత్తాయి. ఆహారం పుష్కలంగా పండే ప్రాంతాలు కొన్ని పాకిస్థాన్‌లో చేరడం వలన భారత్‌లో ఆహార సమస్య ఏర్పడింది. ఇదేవిధంగా జనుము పండే ప్రాంతాలు (బంగ్లాదేశ్) పాకిస్థాన్ లోకి, జనపనార పరిశ్రమలు భారత్‌లోనికి వచ్చినాయి. దేశ విభజన ఫలితంగా రైల్వేమార్గాలు కూడా ఛిన్నాభిన్నామయినాయి. శరణార్థుల సమస్యలు, పునరావాస కేంద్రాల ఏర్పాటు సమస్యలు తలఎత్తాయి. ఈ విధంగా దేశ విభజన అనేక జటిల సమస్యలకు దారితీసింది.

**9) తక్కువ తలసరి ఆదాయం**

ఇతర దేశాలతో పోల్చి చూసినప్పుడు, భారతదేశ ఆర్థికపరిస్థితులు నిరాశాజనకంగా ఉండేవి. అమెరికా తలసరి ఆదాయంతో పోల్చి చూసినప్పుడు భారత్ తలసరి ఆదాయం 1/30 వంతుకన్నా తక్కువ. భారత ప్రజల తలసరి ఆదాయం, జీవనప్రమాణం, ఇతరదేశాలైన జపాన్, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ కన్నా చాలా తక్కువ.

**10) స్వాతంత్ర్యానంతర పరిస్థితి**

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత ప్రజలలో ఆశాభావాలు పెరిగాయి. బ్రిటీషు బానిస ఆర్థిక వ్యవస్థ పద్దతి రద్దవడంతో భారత ప్రజల దయనీయ స్థితి మారి, పేదరికం తగ్గి, జీవన ప్రమాణాలు పెరగ గలవని ఊహించడం జరిగింది. దీనికోసం దేశ జాతీయోత్పత్తి దేశ జనాభా పెరుగుదలకన్నా అధికంగా ఉండవలసిన అవసరమేర్పడింది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. భారత ఆర్థిక ప్రణాళికా ధ్యేయాలను వివరించండి.***

**జ:** ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలు చేపట్టడం సత్వర ఆర్థికాభివృద్ధి సాధించడానికి, స్వేచ్ఛావ్యాపారంలోని బలహీనతలు అధిగమించడానికి, అవసరమైన నియంత్రణలను చేపట్టడానికి అని తెలుసుకున్నాం. స్వాతంత్ర్యోద్యమ కాలంలో మనదేశం ఎదుర్కొన్న సమస్యలు అధిగమించడానికి కూడా ప్రణాళికలు చేపట్టబడినాయి. కొన్ని దీర్ఘకాల ధ్యేయాలు సాధించడానికి కూడా ప్రణాళికలు రూపొందించబడినాయి.

**భారత ప్రణాళిక లక్ష్యాలను ఈ క్రింది విధముగా పేర్కొనవచ్చును.**

**ఎ) సత్వర ఆర్థికవృద్ధి సాధించటం**

భారతదేశ తలసరి ఆదాయం తక్కువ. అందువలన దేశంలో ఉత్పత్తి పెరుగుదల, జనాభా పెరుగుదల రేటు

కన్నా అధికంగా ఉండాలి. రాబోయే 20 సం॥రాలలో నిజ తలసరి ఆదాయం రెండింతలు ఉండేటట్లు వృద్ధి రేటు ఉండాలని భావించినారు.

**బి) ఆర్థిక అసమానతలు తగ్గించుట**

భారత ఆర్థిక వ్యవస్థలో ప్రజల ఆదాయాలు తక్కువ. ఆదాయ పంపిణీలో అసమానతలు ఎక్కువ. రోజు రోజుకీ ధనవంతులు మరీ ధనవంతులుగా మారుతూ ఉంటే, పేదవారు కనీస అవసరాలు కూడా తీర్చుకోలేని దీనస్థితిలో నిరుపేదలుగా మారుతున్నారు. అందువలన మన పంచవర్ష ప్రణాళికలు పేదల ఆదాయ అభివృద్ధికి తీవ్రంగా కృషి చేస్తున్నాయి. కనుక నేడు మన ప్రణాళికల ప్రధాన ధ్యేయం “సమానతతో కూడిన వృద్ధి” అని చెప్పవచ్చును.

**సి) స్వావలంబన**

మన పంచవర్ష ప్రణాళికల మరో ముఖ్య ధ్యేయం స్వావలంబన. మన దేశంలోని ఖనిజాలు, వనరులు, ముడిసరుకులు విదేశాలకు ఎగుమతి చేయకుండా వాటిని దేశంలోనే సద్వినియోగ పరచి కావలసిన వస్తుసముదాయాలను మనమే స్వయంగా తయారు చేసుకోవడాన్ని స్వావలంబన అంటారు. దీని వలన మనదేశంలో పారిశ్రామికాభివృద్ధి సులభసాధ్యమవుతుంది. విదేశీ దిగుమతులు తగ్గుతాయి. విదేశీ మారకద్రవ్యం ఆదా అవుతుంది.

**డి) సమాన ప్రాంతీయ అభివృద్ధి**

మన ప్రణాళిక లక్ష్యాలలో మరొకటి సమాన ప్రాంతీయ అభివృద్ధి సాధించటం. దేశంలో కొన్ని ప్రాంతాలు పారిశ్రామికంగా అభివృద్ధి చెంది ఉంటే మరికొన్ని ప్రాంతాలు వెనుకబడి ఉన్నాయి. ఉదాహరణకు మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు అభివృద్ధి చెంది ఉండగా, ప్రక్కనే ఉన్న మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు వెనుకబడి ఉన్నాయి. వెనుకబడిన ప్రాంతాలలో పారిశ్రామికాభివృద్ధికి కావలసిన అవస్థాపనా సౌకర్యాలు అభివృద్ధి చేయడం చాలా అవసరం. దీనికోసం ప్రణాళికా బద్ధమైన కృషి చేపట్టాలి.

**ఇ) ఆధునీకరణ**

సనాతన సంప్రదాయ ఆర్థిక వ్యవస్థను ఆధునీకరణ చేయడం మన ప్రణాళిక లక్ష్యాలలో ఒకటి. నూతన పరిశ్రమల నిర్మాణం, నూతన ఉత్పత్తి పద్ధతులు ప్రవేశ పెట్టడం ఆర్థిక వృద్ధికి అవసరమైన సంస్థల నిర్వహణ మొదలయిన కార్యక్రమాలు ప్రభుత్వం చేపట్టవలసి ఉంది. విదేశీ పరిశ్రమల పోటీకి తట్టుకొనే విధంగా దేశంలోని పరిశ్రమలను ఆధునీకరణ చేయవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది. ఈ ఆధునీకరణ ప్రజల ఆహారపు అలవాట్లలోనూ, ఆలోచనా విధానలలోను కూడా మార్పులు తీసుకువచ్చి సత్వర ఆర్థికాభివృద్ధికి అనుకూల పరిస్థితులు కల్పిస్తుంది.

**ఎఫ్) నిరుద్యోగ నిర్మూలన**

ఆర్థిక వృద్ధి ఉద్యోగ కల్పనకు దోహదపడుతుందని ప్రణాళిక నిర్మాతలు భావించినారు. ఆర్థిక వృద్ధి ఆదాయ పెరుగుదలతో పాటు నిరుద్యోగ యువతకు ఉద్యోగ అవకాశాలు పెంచుతుందని, తద్వారా నిరుద్యోగ నిర్మూలన సాధ్యపడుతుందని ఊహించినారు.

# 32

# పంచవర్ష ప్రణాళికలు - సాధించిన అభివృద్ధి

# (Achievements of Planning in India)

## 32.1 పరిచయం

భారతదేశంలో పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రణాళికా లక్ష్యాలు సాధించబడుతున్నాయి. ఈ అధ్యాయంలో మీరు మన ప్రణాళికలు సాధించిన విజయాలు తెలుసుకుంటారు. దీనితో పాటు తలసరి ఆదాయం పెరుగుదల, వ్యవసాయాభివృద్ధి మొదలయిన కొత్త విషయాలు కూడా నేర్చుకుంటారు. మన ప్రణాళికలు ఏ ఏ విషయాలలో అపజయాలు ఎదుర్కొనవలసి వచ్చిందో దాని వెనుక ఉన్న కారణాలు ఏమిటో తెలుసుకుంటారు.

## 32.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- ప్రజల తలసరి ఆదాయం ప్రస్తుత ధరలతో మరియు నిలకడగా ఉన్న ధరలతో పోల్చి చూడడం.
- భారత ఆర్థిక వ్యవస్థ సాధించిన ఆర్థికవృద్ధి అంచనా వేయటం.
- వ్యవసాయ రంగంలోను, పారిశ్రామిక రంగంలోను, సాంకేతిక ప్రగతిలోను, మన ప్రణాళికలు సాధించిన అభివృద్ధి గుర్తించడం.
- ఆర్థికవృద్ధి మందకొడిగా ఉండటానికి కారణాలు.
- మన ప్రణాళికలు స్థూలంగా సాధించిన విజయాలపై సమీక్ష.

## 32.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. పంచవర్ష ప్రణాళికల కాలము?***

జ: భారత ఆర్థిక ప్రణాళికా కాలం ఐదు సంవత్సరాలుగా రూపొందించారు.

***2. ప్రణాళికా విరామం ఉన్న సంవత్సరాలు?***

జ: 1966 – 69 సంవత్సరాల మధ్య వార్షిక ప్రణాళికలను అమలు జరిపారు. వార్షిక ప్రణాళిక కాలాన్ని ప్రణాళిక విరామం అంటారు.

***3. మొదటి ప్రణాళిక లక్ష్యం?***

జ: ఆహార ధాన్యాల ఉత్పత్తి పెంచడం, రెండవ ప్రపంచ యుద్ధం వల్ల ఎదురైన అసమతౌల్య పరిస్థితులను సమతౌల్య స్థితికి తీసుకురావడం.

***4. రెండవ ప్రణాళిక లక్ష్యం?***

జ: మౌలిక మరియు భారీ పరిశ్రమలకు ప్రాధాన్యత నిస్తూ, పారిశ్రామికీకరణను వేగవంతం చేయడం.

***5. మూడవ ప్రణాళిక లక్ష్యం?***

జ: ఆహార పదార్థాల విషయంలో స్వావలంబన, స్వయం సమృద్ధి సాధించడం, ఉద్యోగ అవకాశాలను గణనీయంగా పెంచడం.

***6. నాలుగవ ప్రణాళిక లక్ష్యం?***

జ: ఆర్థిక, స్థిరత్వం, ఆహార పదార్థాల విషయంలో స్వావలంబన, వెనుక బడిన వర్గాల వారికి ఉపాధి కల్పించడం ద్వారా సాంఘిక, ఆర్థిక న్యాయాన్ని కల్పించడం మరియు ప్రాంతీయ సమానత్వాన్ని సాధించడం.

***7. ఐదవ ప్రణాళిక లక్ష్యం?***

జ: పేదరికాన్ని తొలగించడం, ఉద్యోగావకాశాలను విస్తృత పరచడం, ఆర్థిక సామాజిక అసమానతలను తగ్గించడం, ఎగుమతుల విస్తరణ, దిగుమతుల ప్రత్యామ్నాయ వస్తువుల ఉత్పత్తిని ప్రోత్సహించడం.

***8. ఆరవ ప్రణాళిక లక్ష్యం?***

జ: నిరుద్యోగితను తొలగించడం, ఉద్యోగితను పెంచడం, పేదవారి జీవన ప్రమాణాలను పెంచడం, మౌలిక అవసరాలను కల్పించడం. ఆదాయానికి సంపదలకు మధ్య వ్యత్యాసం తగ్గించడం, ఆర్థిక, సాంకేతిక రంగాలలో స్వావలంబన సాధించడం.

***9. ఏడవ ప్రణాళిక లక్ష్యం?***

జ: సామర్థ్యాన్ని, ఉత్పత్తిని పెంచడం, పేదరికాన్ని, నిరుద్యోగితను, ప్రాంతీయ అసమానతలను తగ్గించడం.

***10. ఎనిమిదవ ప్రణాళిక లక్ష్యం?***

జ: సంపూర్ణ ఉద్యోగిత సాధించడానికి అవసరమైన ఉద్యోగ అవకాశాలను కల్పించడం, మానవ వనరుల అభివృద్ధికి కృషి చేయడం.

***11. తొమ్మిదవ ప్రణాళిక లక్ష్యం?***

జ: సామాజిక న్యాయం, సమానత్వం సాధించడానికి ఆర్థిక వృద్ధి.

*12. పదవ వర్ష ప్రణాళిక లక్ష్యం?*

జ: సమానత్వం, సాంఘిక న్యాయం, మానవ వనరుల నైపుణ్యం పెంపుదల.

*13. పదకొండవ ప్రణాళిక లక్ష్యం?*

జ: సమీకృత ఆర్థికాభివృద్ధి.

- స్వాతంత్ర్యానికి పూర్వమే ప్రణాళికలకు సంబంధించిన ప్రయత్నాలు జరిగాయి.
- ప్రతి ప్రణాళికా దాదాపు ఒకటి లేదా అంత కంటే ఎక్కువ లక్ష్యాలకు ప్రాధాన్యతనిస్తూ అందుకు సరిపడే వ్యూహాన్ని ఏర్పాటు చేసుకుంది.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1. ఆర్థిక ప్రణాళిక అనగానేమి?*

జ: ముందుగా ప్రభుత్వం నిర్ణయించిన ఆర్థిక లక్ష్యాలను ఒక ప్రాధాన్యతా క్రమంలో, ఒక వ్యూహం ప్రకారం ఒక నిర్ణీత కాల వ్యవధి లో సాధించడానికి రూపకల్పన చేసిన పథకమే ఆర్థిక ప్రణాళిక. ఇటువంటి ప్రణాళికల ద్వారా ఆర్థికాభివృద్ధికి కృషి చేసే ఆర్థిక వ్యవస్థను ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థ అంటారు. ఈనాడు దాదాపుగా అన్నీ దేశాలు ఏదో ఒక రూపంలో ప్రణాళికా విధానాన్ని అమలు చేస్తున్నాయి.

*2. ప్రణాళికా సంఘం*

జ: భారత ప్రభుత్వం 1950 మార్చిలో ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చేసింది. ప్రణాళికా సంఘానికి ప్రధానమంత్రి అధ్యక్షులు గా ఉంటారు. ఈ సంఘం స్వతంత్రంగా పనిచేస్తూ కేంద్ర ప్రభుత్వానికి సలహాదారుగా వ్యవహరిస్తుంది. దానికి ముఖ్య కార్య నిర్వహణాధికారిగా ఉపాధ్యక్షుడుంటాడు. ప్రస్తుత ప్రణాళికా సంఘ ఉపాధ్యాక్షుడుగా మాంటెక్ సింగ్ అహ్లూవాలియా వ్యవహరిస్తున్నారు. ప్రాధాన్యతలను బట్టి రాష్ట్ర ప్రభుత్వాలు తమ ప్రణాళికలను రూపొందిస్తాయి. వీటిని ప్రాతిపదికగా చేసుకొని జాతీయ ప్రాధాన్యతలు, వనరుల లభ్యతను బట్టి ప్రణాళికా సంఘం దేశం మొత్తానికి సంబంధించిన పంచవర్ష ప్రణాళికను రూపొందింస్తుంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

*1. భారత ప్రణాళికల సాధారణ లక్ష్యాలేవి?*

జ: భారతదేశంలో పంచవర్ష ప్రణాళికల ద్వారా క్రింది లక్ష్యాలను సాధించాలని నిర్ణయించారు. వీటిలో కొన్ని సాధారణ లక్ష్యాలు, దీర్ఘకాల లక్ష్యాలు ఉన్నాయి.

1. ఉత్పత్తి పెంచడం ద్వారా అధిక వృద్ధి రేటు సాధించడం
2. ఆదాయ సంపదల మధ్య అసమానతల్ని తగ్గించడం.
3. పేదరికాన్ని తొలగించడం
4. సంపూర్ణ ఉద్యోగితను సాధించడం.

5. ప్రాంతీయ సమానత్వాన్ని సాధించడం.

6. స్వయం సమృద్ధి, స్వయం పోషకత్వం సాధించడం.

***2. 11వ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను వివరింపుము.***

జ: జాతీయాభివృద్ధి మండలి పరిశీలించి తయారు చేసిన ప్రణాళికా ప్రతిని ప్రణాళికా సంఘం జనవరి 2006 లో ప్రవేశ పెట్టింది. ప్రణాళికా సంఘం "వేగవంతమైన సమ్మిళిత వృద్ధి" ప్రధాన లక్ష్యంగా 11 వ ప్రణాళికా అంతిమ ప్రతిని తయారు చేసింది. 2006 లో జరిగిన ప్రణాళికా సంఘం సమావేశంలో ఈ ప్రతిని జాతీయాభివృద్ధి మండలి ఆమోదం కోసం పంపాలని ఏకగ్రీవంగా నిర్ణయించినది.

జాతీయాభివృద్ధి మండలి 9 డిసెంబర్ 2006 లో జరిగిన తన సమావేశంలో అంతిమంగా 11వ ప్రణాళికను ఆమోదించింది.

**ప్రణాళికా లక్ష్యాలు (Targets of the 11th plan)**

(i) సమాజంలోని అన్ని వర్గాల వారికి ప్రయోజనాలు విస్తరించడం కోసం సమ్మిళిత వృద్ధిని సాధించాలనే లక్ష్యాన్ని ముందుగా ఎంచుకున్నారు.

(ii) స్థూల దేశీయ ఉత్పత్తి లో 9 శాతం వృద్ధి వుండాలి.

(iii) వ్యవసాయ రంగంలో 4 శాతం వృద్ధి సాధించాలని నిర్ణయించారు.

(iv) విద్యావంతుల నిరుద్యోగితను 5 శాతం లోపు వుండాలని నిర్ణయించారు.

(v) భౌతిక అవస్థాపన సౌకర్యాలు అందుబాటులోకి రావాలని, అదే విధంగా విద్యా ఆరోగ్య సేవలు అందరికి అందుబాటులోకి రావాలి.

(vi) 2009 నాటికి అందరికి విద్యుత్ శక్తి అందుబాటులోకి తీసుకు రావాలని నిర్ణయించారు.

(vii) 2009 నాటికి అందరికి స్వచ్ఛమైన మంచినీరు అందించాలని నిర్ణయించారు.

(viii) 70 మిలియన్ల నూతన ఉద్యోగ అవకాశాలను కల్పించాలి.

(ix) ఈ ప్రణాళిక అంతానికి పేదరికాన్ని 15 శాతం కంటే తక్కువగా ఉండేటట్లుగా చూడటం.

(x) పారిశ్రామిక వృద్ధి రేటు సంవత్సరానికి 10 శాతం ఉండేటట్లు చూడటం

(xi) శిశు మరణాల రేటు ప్రతి 1000 జననాలకు 28 స్థాయికి తగ్గించాలి. అదే విధంగా ప్రసూతి మరణాల రేటు ఒక శాతానికి మించకుండా చూడాలి.

(xii) మొత్తం సంతాన సాఫల్య రేటు 2.1 శాతం ఉండేటట్లుగా చూడాలి.

(xiii) 2007 నాటికి దేశంలో అన్నీ గ్రామాలకు టెలిఫోన్ సేవలను ఏర్పాటు చేయాలి.

(xiv) స్త్రీ, పురుష నిష్పత్తి సాధ్యమైనంత త్వరగా మెరుగు పరచాలి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

*1. ప్రణాళికలు సాధించిన విజయాలను వివరించండి.*

**జ: 1. ఆర్థిక వృద్ధి**

ఆర్థికవృద్ధి అనగా నిజ తలసరి ఆదాయాల పెరుగుదల అని అర్థం. మన ప్రణాళికా ధ్యేయాలలో ఒక ముఖ్యధ్యేయం ఆర్థిక వృద్ధి. ఈ ఆర్థిక వృద్ధి దేశ ప్రజల ఆదాయ స్థాయి పెంచడంతో పాటు ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాల వరుసలో మన దేశాన్ని నిలబెట్టడానికి దోహదపడుతుంది.

**2. ఆదాయ అసమానతలు తగ్గించుట**

ఆదాయ అసమానతలు తగ్గించటంలో పంచవర్ష ప్రణాళికల కృషి సంతృప్తికరంగా లేదు. ఆదాయ పంపిణీకి సంబంధించిన సమాచారం పరిమితంగా లభించినప్పటికీ, ప్రణాళికా ఫలితాలు పేదవర్గాల ప్రజలకు సంపూర్ణంగా అందడం లేదు. జీవన ప్రమాణ విషయంలో ధనిక, పేద వర్గాల మధ్య వ్యత్యాసం నానాటికి పెరిగిపోతుంది. ధనికులు విలాస వస్తువులు కోసం ఎగబ్రాకుతుంటే, పేదలు అన్న వస్త్రాల కోసం అలమటిస్తున్నారు. ఈ ఆదాయ అసమానతలు కొలవడానికి మూడు కొలమానాలు ఉన్నాయి.

**3. వ్యవసాయ ఉత్పత్తి పెరుగుదల**

పూర్వం భారతదేశం విదేశాల నుండి ఆహార వస్తువులు దిగుమతి చేసుకుంటూ ఉండేది. కానీ ప్రణాళికలు చేపట్టినప్పటి నుండి భారతదేశమే "నికర ఆహార ధాన్యాల ఎగుమతి దారు"గా ఉన్నది.

**4. పారిశ్రామిక ఉత్పత్తుల పెరుగుదల**

ప్రణాళికా ఫలితంగా దేశంలో పారిశ్రామిక ఉత్పత్తులు పెరిగినాయి. గతంలో భారతదేశం విదేశాల నుండి సైకిళ్ళు, కార్లు, ట్రక్కులు, రైలు ఇంజన్లు, సూదులు వంటివి దిగుమతి చేసుకొంటూ ఉండేది. ప్రస్తుతం మనకు కావలసిన పారిశ్రామిక వస్తువులు మనమే ఉత్పత్తి చేసుకోగలుగుచున్నాము. కొన్ని పారిశ్రామిక వస్తువులు మనమే విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. 1950 – 51 మరియు 1995 – 96 సంవత్సరాల మధ్య ఉక్కు ఉత్పత్తి 21 రెట్లు విద్యుత్‌చ్ఛక్తి ఉత్పత్తి 76 రెట్లు, అల్యూమినియం ఉత్పత్తి 125 రెట్లు, సైకిళ్ళ ఉత్పత్తి 100 రెట్లు, కార్ల ఉత్పత్తి 40 రెట్లు పెరిగినాయి. ఈ విధంగా ప్రణాళికా కాలంలో మన పారిశ్రామిక రంగం గణనీయంగా పెరిగింది.

**5. అధునాతన సాంకేతిక ప్రగతి**

సాంకేతిక రంగంలో కూడా మనదేశం పెద్దపెద్ద అడుగులు వేస్తూ ముందుకు వెళ్ళింది. ఉపగ్రహాలు నిర్మించ గల బహు కొద్ది దేశాలలో భారత్ ఒకటి. అణుశక్తి ఉత్పత్తి చేయగల శక్తి సామర్థ్యాలు మన దేశానికి ఉన్నాయి. దేశరక్షణ సామాగ్రి, కంప్యూటర్లు, ఇతర అధునాతన సాంకేతిక పరికరాలు తయారుచేయడంలో మనదేశం ఒక మేటి దేశంగా పేరుపొందినది. పంచవర్ష ప్రణాళికల ద్వారా సాధించిన వ్యవసాయ అభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి, విద్యాభివృద్ధి ఈ ప్రతిభకు ఆధారం.

### 6. అధునాతన ఆర్థిక వ్యవస్థ

మన ప్రణాళికల ద్వారా సాంకేతిక రంగమే కాకుండా ఆర్థిక వ్యవస్థ కూడా అధునాతనం సంతరించుకుంది. గ్రామ గ్రామాలకు బ్యాంకులు విస్తరించినాయి. ప్రజల ఆలోచనలు, దృక్పథాలు, సాంకేతిక పరిజ్ఞానం మారినాయి. సాంఘిక కట్టుబాట్లు క్రమక్రమంగా సరళీకృతమవుచున్నాయి. స్త్రీ విద్యా వ్యాప్తి పెరుగుతోంది. కులగోత్రాల పట్టింపులు కూడా క్రమక్రమంగా సడలుతున్నాయి. ఈ మార్పులన్నింటికీ మన ప్రణాళికా బద్ధమైన అభివృద్ధే ఆధారము.

### 7. ఆర్థిక వ్యవస్థ సర్వతోముఖాభివృద్ధి

మన పంచవర్ష ప్రణాళికలు సాధించిన అభివృద్ధి బహుముఖమైనది. దేశం పారిశ్రామికంగాను, సాంకేతికంగాను, సంస్థాపరంగాను అభివృద్ధి చెందినది. వ్యవసాయ రంగంలో క్షామ పరిస్థితులు నివారించ గలిగింది. 1950 –51లో దేశంలో బ్యాంకులు, భీమా సంస్థల వాటా జాతీయ ఆదాయంలో 1 శాతం ఉండగా ప్రణాళికలు చేపట్టినప్పటి నుండి వీటి వాటా 7 శాతానికి పెరిగింది. ఈ విధంగా భారత్ బహుముఖాభివృద్ధికి ప్రణాళికలే ప్రభావం చూపాయని చెప్పవచ్చు.

***2. ప్రణాళికలు – అపజయాలు వివరించండి.***

జ: భారత ఆర్థిక వ్యవస్థ ప్రణాళికల ద్వారా ఎంతవరకు అభివృద్ధి చెందిందో గత పాఠంలో తెలుసుకున్నాము. కానీ ఈ అభివృద్ధి సరిపోదు. నిర్ణయించిన ధ్యేయాలను బట్టి చూస్తే, మన ప్రణాళికలు విఫలమయ్యాయని చెప్పవచ్చు. ప్రణాళికలు చవిచూసిన కొన్ని అపజయాలను పరిశీలిద్దాము.

### 1. సత్వర ఆర్థికాభివృద్ధి ధ్యేయం నెరవేరలేదు.

మన ప్రణాళికలు సత్వర ఆర్థికాభివృద్ధి సాధించాలని నిర్ణయించాయి. ప్రజల జీవన ప్రమాణాలు పెంచాలని నిర్ణయించాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన కొన్ని దేశాలతో సమానస్థాయిలో అభివృద్ధి పొందాలనే లక్ష్యాన్ని నిర్ణయించుకున్నాయి. దేశ జాతీయాదాయం పెరుగుదల రేటు 8 లేక 10 శాతం నిర్ణయించారు. కాని సాధించింది 4 శాతం మాత్రమే. దేశంలో జనాభా సాలీనా 2 శాతం చొప్పున పెరగడం వలన తలసరి ఆదాయం పెరుగుదల కూడా ఆశించినంతగా లేదు.

### 2. ఆర్థిక అసమానతల లక్ష్యం నెరవేరలేదు

దేశంలో గత 45 సంవత్సరముల నుండి ప్రణాళికాబద్ధంగా కృషి జరుగుతున్నప్పటికీ పేదరికం, ఆదాయ అసమానతలు ఒక సవాలుగా మిగిలినాయి. 1993 – 94 లెక్కల ప్రకారం నేటికి 36 శాతం ప్రజలు పేదరికపు గీత అడుగుభాగంలో నివశిస్తున్నారు. మానవ అభివృద్ధి సూచిక ప్రకారం 1994 లో ప్రపంచంలో 175 దేశాలలో భారత్ స్థానం 138. దీనిని బట్టి మన ప్రణాళికలు ఆశించినంత అభివృద్ధిని సాధించలేక పోయాయని చెప్పవచ్చును.

### 3. స్వావలంబన లక్ష్యం నెరవేరలేదు

మనదేశం పంచవర్ష ప్రణాళికల ద్వారా స్వావలంబన చేరుకోవాలి అనే లక్ష్యం నెరవేరలేదు. ప్రస్తుతం మనం

మనకి కావలసిన ఆహార వస్తువులు మాత్రం పండించుకోగల్గుచున్నాము. మనదేశ పారిశ్రామికాభివృద్ధి ఇంకా విదేశీ ఋణసహాయం పైనే ఆధారపడి ఉన్నది. వడ్డీతో పాటు విదేశీ ఋణం భారం చాలా ఎక్కువగా ఉంటుంది. కాబట్టి మనదేశం దిగుమతికి అవసరమైన విదేశీ మూలధనం పెంచుకుంటూ, విదేశీ ఋణాలను తీరుస్తూ స్వావలంబన స్థితికి చేరుకోవడం సమీప భవిష్యత్తులో సాధ్యపడే విషయం కాదు.

**4. అల్ప ఉద్యోగిత**

మన పంచవర్ష ప్రణాళికలు నిరుద్యోగ యువతకు ఉద్యోగవకాశములు కల్పించ లేకపోయినాయి. 1992 నాటికి దేశంలో 2 కోట్ల మంది నిరుద్యోగులున్నారు. చాలామంది ప్రజలు చాలీచాలని ఆదాయంతో నామమాత్రపు ఉద్యోగాలు చేస్తున్నారు. వీరు ప్రతీసారీ ఉన్నత ఉద్యోగం కోసం ఎదురుచూస్తూ అవకాశాల కోసం ఆరాటపడుతున్నారు. దేశంలో నిరాఘాటంగా పెరుగుతున్న జనాభావృద్ధి, అగ్నికి ఆజ్యం పోసినట్లు, నిరుద్యోగితను మరింత ఉధృత పర్చుచున్నది. జనాభా పెరిగినంతగా ఉద్యోగావకాశాలు సృష్టింపబడటం లేదు. ఫలితంగా, నిరుద్యోగిత, అల్ప ఆదాయాలు రాహుకేతువుల వలె మన ఆర్థిక వ్యవస్థను పట్టిపీడిస్తున్నాయి.

**5. సమాన ప్రాంతీయాభివృద్ధి సాధించబడలేదు**

మన ప్రణాళికలు దేశంలో వివిధ రాష్ట్రాల మధ్య, వివిధ ప్రాంతాల మధ్య సమానతలు సాధించలేక పోయినాయి. ప్రణాళికా ఫలితాలు ఎక్కువగా పట్టణ ప్రాంత ప్రజలు అనుభవిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలు నిరాదరణకు గురిఅయినాయి. గ్రామాలలో లభిస్తున్న వైద్యం, ఆరోగ్యం, సమాచారం, విద్య, బ్యాంకులు మొదలైన సదుపాయాలు, పట్టణాలతో పోల్చి చూసినప్పుడు చాలా తక్కువ అని చెప్పవచ్చును.

దీనిని బట్టి మన ప్రణాళికలు సాధించ గలిగినంత అభివృద్ధిని సాధించలేక పోయినాయని చెప్పవచ్చును. ఆర్థిక వృద్ధి వేగాన్ని పుంజుకోలేదు. ఆదాయ అసమానతలు, పేదరికం తగ్గలేదు. ప్రజలకు మెరుగైన జీవన విధానం లభించుట లేదు. విదేశీ ఋణ సహాయం కోసం నేటికీ ఎదురుచూస్తున్నాము. నిరుద్యోగిత నిర్మూలించబడలేదు. ప్రాంతీయ అసమానతలు సమసిపోలేదు. దీనిని బట్టి మన పంచవర్ష ప్రణాళికలలో విజయాల కన్నా, అపజయాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

# 33

# నూతన ఆర్థిక సంస్కరణలు - ప్రణాళికల పాత్ర

# (New Economic Reforms and the Role of Planning)

## 33.1 పరిచయం

భారత ఆర్థిక వ్యవస్థ చరిత్రలో 1991 సంవత్సరం మరుపురాని ఘట్టం. ఆ సంవత్సరం ఆర్థిక వ్యవస్థ గతంలో ఎన్నడూ లేని విధంగా ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయింది. ఈ సంక్షోభం వలన మన పంచవర్ష ప్రణాళికల ఉనికి ప్రశ్నార్థకమైంది. ఇంతవరకు ప్రభుత్వం అనుసరించిన విధానాలలో మార్పులు తీసుకురావలసిన అవసరం ఏర్పడింది. ఫలితంగా భారత ఆర్థిక వ్యవస్థ విధి విధానాలలో నూతన ధోరణులు చోటు చేసుకున్నాయి. ఈ నూతన ధోరణులే నూతన సంస్కరణల రూపంలో వెలుగులోకి వచ్చినాయి. ఈ అధ్యాయంలో మనం వాటిని పరిశీలిద్దాము.

## 33.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశములోని ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తరువాత మీరు తెలుసుకొను ముఖ్యాంశాలు.

- 1991 ఆర్థిక సంక్షోభానికి ముఖ్య కారణాల పరిశీలన
- ఆర్థిక విధానాలలో వచ్చిన భారీ మార్పులు
- 1991 సంస్కరణల స్వరూప స్వభావాలు
- నూతన ఆర్థిక సంస్కరణల నేపథ్యంలో భవిష్యత్‌లో ప్రణాళికల పాత్ర.

## 33.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. 1991 ఆర్థిక సంక్షోభం***

**జ:** 1991 సంక్షోభానికి మూలకారణం ఎగుమతుల కన్నా దిగుమతులు ఎక్కువగా ఉండుట, గల్ఫ్ యుద్ధం, రాజకీయ అస్థిరత్వం, రష్యాలోనూ ఇతర ఐరోపా దేశాలలోను ఆర్థిక విధానాలలో మార్పులు.

***2. విదేశీ మారక ద్రవ్య సంక్షోభం***

**జ:** విదేశీ మారకద్రవ్య సంక్షోభానికి కారణం దేశంలోని ద్రవ్యోల్బణ పరిస్థితులు, పారిశ్రామిక ఉత్పత్తులు పెంచడానికి, పారిశ్రామికీకరణ వేగవంతం చేయడానికి ప్రభుత్వం నియంత్రణలను తొలగించింది. ప్రభుత్వం తన పాత్రను తగ్గించుకొన్నది. విదేశీ మారక ద్రవ్య ఆంక్షలు ఎత్తివేసింది. కోశ విధానం ప్రకటించింది.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. 1991 ఆర్థిక సంక్షోభంను వివరింపుము..***

జ: ఇండియా 1991 ప్రారంభంలో తీవ్రమైన విదేశీ మారక ద్రవ్య కొరత ఎదుర్కొంది. విదేశీ మారకద్రవ్యానికి డిమాండ్ పెరిగి కొరత ఏర్పడింది. కువైట్ మరియు ఇరాక్ దేశాల మధ్య 1991లో జరిగిన యుద్ధం ఫలితంగా పెట్రోల్ ఉత్పత్తులకు కొరత ఏర్పడింది. పెట్రోల్ ధరలు పెరిగినాయి. ఈ మార్గం ద్వారా వచ్చే విదేశీ మారక ద్రవ్యానికి అడ్డంకులు ఏర్పడినాయి. ఈ రెండు దేశాలలో పనిచేసే భారతీయులు తమ ఆదాయాన్ని భారతీయ ద్రవ్యంలో మార్చుకోవడానికి అనుమతి ఇవ్వబడలేదు. అంతేకాకుండా అనేక మంది ప్రవాస భారతీయులు యుద్ధం కారణంగా స్వదేశానికి తిరిగి వచ్చారు.

భారతదేశంలో రాజకీయ సుస్థిరత లేదు. కేంద్రంలో మైనారిటీ ప్రభుత్వం నడుస్తోంది. విదేశీ పెట్టుబడి దారులు తమ పెట్టుబడులను ఉపసంహరించుకోవడం మొదలు పెట్టారు. ఫలితంగా విదేశీ మారకద్రవ్యం కొరత మరింత తీవ్ర సమస్యగా మారింది.

**2. పారిశ్రామిక విధానంలో సంస్కరణలు.**

జ: i) పరిశ్రమల లైసెన్స్ విధానం రద్దు

ii) విదేశీ సాంకేతిక పరిజ్ఞానం దిగుమతి

iii) విదేశీ పెట్టుబడులు

iv) పెద్ద పరిశ్రమలపై నియంత్రణ సడలింపు

v) ప్రభుత్వ పరిశ్రమలు ప్రైవేటు రంగానికి అప్పగించుట

**3. విదేశీ మారకద్రవ్య విధానంలో సంస్కరణలను వివరింపుము..**

జ: **i) దిగుమతి సుంకాల మినహాయింపు**

**ii) దిగుమతి లైసెన్స్‌ల సరళీకరణ**

**iii) విదేశీ మారకద్రవ్యం పై ఆంక్షలు ఎత్తివేత**

**4. కోశ విధానంలో సంస్కరణలను వివరింపుము.**

జ: కోశవిధానంలో కూడా ప్రభుత్వం అనేక మార్పులు తీసుకువచ్చింది.

**i) ఎక్స్‌యిజ్ సుంకాలు తగ్గించుట**

**ii) ప్రత్యక్ష పన్నుల రేటులు తగ్గించుట**

**iii) ప్రభుత్వ వ్యయం తగ్గించుట**

**iv) ప్రభుత్వ మూలధన ఆస్తుల విక్రయం**

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. 1991 సంస్కరణలు సమర్థనీయమా? చర్చించండి?***

**జ:** ఇండియా 1991 ప్రారంభంలో తీవ్రమైన విదేశీ మారక ద్రవ్య కొరత ఎదుర్కొంది. అధికారికంగా నిర్ణయించిన విదేశీ మారక రేట్లకు, వాస్తవంగా మార్కెట్లో కొనసాగుతున్న మారకపు రేట్లకు మధ్య చాలా వ్యత్యాసం ఏర్పడింది. మార్కెట్లో నిర్ణయింపబడిన మారకపు రేటు అధికంగా ఉండటమే కాకుండా క్రమంగా పెరుగుదల కూడా గోచరించింది. ఫలితంగా విదేశీ మారకద్రవ్యానికి డిమాండ్ పెరిగి కొరత ఏర్పడింది.

కువైట్ మరియు ఇరాక్ దేశాల మధ్య 1991లో జరిగిన యుద్ధం ఫలితంగా పెట్రోల్ ఉత్పత్తులకు కొరత ఏర్పడింది. పెట్రోల్ ధరలు పెరిగినాయి. ఈ మార్గం ద్వారా వచ్చే విదేశీ మారక ద్రవ్యానికి అడ్డంకులు ఏర్పడినాయి. ఈ రెండు దేశాలలో పనిచేసే భారతీయులు తమ ఆదాయాన్ని భారతీయ ద్రవ్యంలో మార్చుకోవడానికి అనుమతి ఇవ్వబడలేదు. అంతేకాకుండా అనేక మంది ప్రవాస భారతీయులు యుద్ధం కారణంగా స్వదేశానికి తిరిగి వచ్చారు.

భారతదేశంలో రాజకీయ సుస్థిరత లేదు. కేంద్రంలో మైనారిటీ ప్రభుత్వం నడుస్తోంది. విదేశీ పెట్టుబడి దారులు తమ పెట్టుబడులను ఉపసంహరించుకోవడం మొదలు పెట్టారు. ఫలితంగా విదేశీ మారకద్రవ్యం కొరత మరింత తీవ్ర సమస్యగా మారింది.

ఇటువంటి క్లిష్టపరిస్థితులలో ప్రభుత్వం వీరోచితమైన నిర్ణయం తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. దేశ అవసరాల కోసం రిజర్వ్‌బ్యాంక్ తన వద్దనున్న బంగారు నిల్వలు విదేశీ మారక ద్రవ్యం కోసం తనఖా పెట్టింది. భారత ప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్యనిధి నుండి ఋణాలు స్వీకరించింది. దేశంలో కూడా పరిస్థితులు మార్పును కోరుకుంటున్నాయి. దేశీయ పరిశ్రమలు విదేశీ పోటీని తట్టుకొనే విధంగా శక్తి సామర్థ్యాలు పునరుద్ధరించుకోవలసిన అవసరం వచ్చింది. విదేశీ ఎగుమతులకు ఇచ్చే సబ్సిడీలు ప్రభుత్వానికి పెనుభారముగా మారాయి.

పై కారణాల వలన ప్రభుత్వము ఆర్థిక విధానాలలో విప్లవాత్మక మార్పులకు శ్రీకారం చుట్టింది. పారిశ్రామిక విధానాలలో నవీనత చోటు చేసుకుంది. విదేశీమారక ద్రవ్య నియంత్రణలలో భారీ మార్పులు వచ్చినాయి. ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వపాత్ర పరిమితమైంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. 1991 ఆర్థిక సంక్షోభానికి కారణాలు వ్రాయండి?***

**జ:** ప్రణాళికల ద్వారా ఆర్థికవృద్ధిలో కొంత పెరుగుదల రేటు సాధించినప్పటికీ, ఈ పెరుగుదల రేటు ఊహించిన దాని కన్నా తక్కువ. ఆర్థిక అసమానతలలో గత కాలంలో చెప్పుకోదగిన తగ్గుదల లేదు. పేదరికం నిరాటంకంగా కొనసాగుతూ మూడవ వంతు ప్రజలు పేదరిక రేఖ దిగువభాగంలో జీవిస్తున్నారు. ప్రజల జీవన విధానంలో మార్పు సంతృప్తికరంగా లేదు. పారిశ్రామికాభివృద్ధి, ఆధునీకరణ, సాంకేతిక అభివృద్ధి మాత్రం కొంతవరకు సంతృప్తికరంగా

ఉన్నాయి. ఈ రంగాలలో ఇంకా ఎక్కువ అభివృద్ధి సాధించే అవకాశాలు కలవు. దేశంలో సాంఘిక, ఆర్థిక అవస్థాపనా కల్పనలు మాత్రం సంతృప్తికరంగా ఉన్నాయి.

## సమస్యలు

19వ దశాబ్దం ప్రారంభంలో భారత్ ఎదుర్కొన్న కొన్ని ముఖ్య సమస్యలు ఈ క్రింది విధంగా చెప్పవచ్చును.

### 1. ద్రవ్యోల్బణ ఒత్తిడి

భారత ఆర్థిక వ్యవస్థ బలమైన ద్రవ్యోల్బణ పరిస్థితులు ఎదుర్కొనవలసి వచ్చింది. నిత్యావసర వస్తువుల ధరలు వేగంగా పెరిగాయి. ఫలితంగా మధ్య తరగతి ప్రజల జీవన వ్యయం పెరిగి, జీతాలు పెరిగి పరిశ్రమ ఉత్పత్తి వ్యయం పెరుగుదలకు దారితీసింది. వనరుల ధరలు పెరగడం వలన పారిశ్రామిక వస్తూత్పత్తి వ్యయాలు పెరిగినాయి. ధరలు విపరీతంగా పెరగడం వలన దేశ, విదేశీ వ్యాపారాల్లో స్తంభన ఏర్పడింది.

### 2. ద్రవ్య వనరుల కొరత

పారిశ్రామికీకరణకు ఆర్థికవ్యవస్థలో ద్రవ్యవనరుల కొరత ఏర్పడింది. రవాణా, సమాచార రంగాలలో కూడా వనరుల కొరత ఏర్పడింది. ఫలితంగా పారిశ్రామికాభివృద్ధి అణగత్రొక్కబడింది.

### 3. విదేశీ మారకద్రవ్య కొరత

అతి ముఖ్యమైన కొరతలలో విదేశీమారకద్రవ్యం ఒకటి. భారత్ విదేశాలకు వస్తువులు ఎగుమతి చేసేది కాని దిగుమతులు మాత్రం ఎక్కువగా ఉండేవి. అందువలన దిగుమతుల కోసం ఎక్కువ విదేశీ ద్రవ్యం అవసరమైనది. ఫలితంగా కొరత ఏర్పడింది.

### 4. నిరుద్యోగం

దేశంలో పారిశ్రామికాభివృద్ధి జరుగుచున్నప్పటికీ ఉద్యోగావకాశాలు మాత్రం ఊహించినంతగా పెరగలేదు.

### 5. ప్రపంచ వ్యాపారం క్షీణించుట

ప్రపంచ వ్యాపారంలో భారతదేశపు వాటా క్రమంగా క్షీణించడం జరిగింది. మన పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో విదేశీ వ్యాపారంలో భారత్ వాటా 2 శాతం ఉండేది. కాని 20 దశాబ్దం ప్రారంభం నాటికి ఈ వాటా 0.5 శాతానికి తగ్గింది.

### 6. ఇతర దేశాలలో గోచరించే వృద్ధి రేట్లు

ఇతర అభివృద్ధి చెందుతూ ఉన్న దేశాలైన దక్షిణ కొరియా, ఫిలిప్పీన్స్, హాంగ్‌కాంగ్, సింగపూర్, మలేషియా, ఇండోనేషియా, చైనా దేశాలలో ఆర్థిక వృద్ధి, పారిశ్రామికాభివృద్ధి గణనీయంగా జరిగింది.

## సమస్యకు మూలకారణాలైన విధానాలు

ప్రస్తుత భారత ఆర్థక సమస్యలకు మూలకారణాలు గతంలో అనుసరించిన విధానాలే అని చెప్పవచ్చును. వాటిని ఈ క్రింద క్లుప్తంగా వివరించడమైనది.

### 1. లైసెన్సు విధానాలు

లైసెన్సు విధానం ద్వారా ప్రభుత్వం వివిధ పరిశ్రమల అభివృద్ధిని, వ్యాప్తిని నిరోధించడం జరిగింది.

### 2. కొన్ని పరిశ్రమలు ప్రభుత్వ ఆధీనంలో ఉండుట

అనేక కీలక భారీ పరిశ్రమల స్థాపన, అభివృద్ధి, ప్రభుత్వం తన చేతులలో ఉంచుకుంది. ఉదాహరణకు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, రవాణా, సమాచారం, గనులు, భారీ యంత్రాల నిర్మాణం మొదలైనవి.

### 3. విదేశీ సాంకేతిక విజ్ఞానం పై ఆంక్షలు

విదేశీ సాంకేతిక విజ్ఞానం దిగుమతిపై ప్రభుత్వం అనేక ఆంక్షలు విధించింది. ప్రభుత్వ అనుమతి లేకుండా ఏ పరిశ్రమ విదేశీ పరిజ్ఞానం దిగుమతి చేసుకోరాదని నియమ నిబంధనలను విధించింది.

### 4. విదేశీ పెట్టుబడులపై ఆంక్షలు

భారతీయ పరిశ్రమలో విదేశీ పెట్టుబడి దారులపై అనేక ఆంక్షలు విధించడం జరిగింది. వారు మొత్తం మూలధనం భారతీయ పరిశ్రమలలో 25 శాతం మించి పెట్టుబడి పెట్టకూడదని ఆంక్షలు విధించింది. భారత రూపాయికి విదేశీ మారకద్రవ్యంతో మారకపు విలువలు నిర్ణయించింది. వీటిని అధికారిక వినిమయ రేట్లు అంటారు. విదేశీ మారకద్రవ్యం సప్లయ్ కన్నా వాటికున్న డిమాండ్ ఎక్కువ ఉంది. ఫలితంగా విదేశీ మారకద్రవ్యంలోనూ చీకటి బజారు వ్యాపారాలు ప్రారంభమైనాయి. అధికారిక మారకపు రేటుకు, బ్లాక్ మార్కెట్ మారకపు రేటుకు వ్యత్యాసం ఏర్పడింది. ఫలితంగా విదేశీమారక ద్రవ్య సంక్షోభం తలెత్తింది.

### 5. విదేశీ పోటి నుండి రక్షణ

విదేశీ వస్తువులపై అధికంగా దిగుమతి సుంకాలు విధించడం ద్వారా దేశీయ పరిశ్రమలకు ప్రభుత్వం రక్షణ కల్పించింది. ఫలితంగా, భారత పరిశ్రమలు తమ ఉత్పాదకా సామర్థ్యాన్ని కానీ, విదేశీ పోటీ తట్టుకునే శక్తిని కానీ, వృద్ధి చేసికొనలేదు. అందువలన దేశీయ పరిశ్రమలు తమ వస్తువులను ఎగుమతి చేసుకొనడానికి ప్రభుత్వం నుండి అనేక రూపాలలో సబ్సిడీలను అడుగుతున్నాయి.

***2. 1991 లో చేపట్టిన ముఖ్య మార్పులు తెలియజేయండి?***

**జ: ఎ. పారిశ్రామిక విధానంలో మార్పులు**

i) పరిశ్రమల లైసెన్స్ విధానం రద్దు

వాతావరణానికి ప్రమాదభరితమైన కొన్ని పరిశ్రమలు మినహా మిగిలిన అన్ని పరిశ్రమలకు లైసెన్స్ విధానం

రద్దుచేయబడినది. దీని వలన దేశంలో అంతర్గత పోటీ పెరిగింది ఫలితంగా పరిశ్రమల విస్తరణ, సామర్థ్యాలు పెరుగుతాయని భావించబడినది.

ii) విదేశీ సాంకేతిక పరిజ్ఞానం దిగుమతి

దేశంలోని పరిశ్రమలకు విదేశీసాంకేతిక పరిజ్ఞానం దిగుమతి చేసుకొనే స్వేచ్ఛ కల్పించబడింది. దీని వలన అత్యుత్తమ సాంకేతిక ప్రగతి విదేశాల నుండి లభిస్తుందని భావించబడినది.

iii) విదేశీ పెట్టుబడులు. మొత్తం పెట్టుబడిలో 51 శాతం వాటా విదేశీ పెట్టుబడి దార్లకు అనుమతించడం జరిగింది.

iv) పెద్ద పరిశ్రమలపై నియంత్రణ సడలింపు

v) ప్రభుత్వ పరిశ్రమలు ప్రైవేటు రంగానికి అప్పగించుట

**బి. విదేశీ వ్యాపారం – విదేశీ మారకద్రవ్య విధానంలో మార్పులు**

i) **దిగుమతి సుంకాల మినహాయింపు**

విదేశాల నుండి దిగుమతి చేసుకొనే అనేక రకముల వస్తువులపై సుంకాలు మినహాయించడం జరిగింది. దేశ, విదేశీ వస్తువుల మధ్య ఆరోగ్యకరమైన పోటీ ఏర్పడింది.

ii) **దిగుమతి లైసెన్స్‌ల సరళీకరణ**

అనేక రకాల విదేశీ వస్తువుల దిగుమతి లైసెన్సులను సరళీకృతం చేసినారు. ఎట్టి ఆంక్షలు లేకుండా నిబంధనలు సడలించినారు.

iii) **విదేశీ మారకద్రవ్యం పై ఆంక్షలు ఎత్తివేత**

మొదట అధికారకంగా విదేశీ మారకద్రవ్యం వినిమయ విలువను పెంచి నియంత్రణలను ఎత్తివేసినారు. ఫలితంగా బహిరంగ మార్కెట్‌లో విదేశీ మారకద్రవ్యం పొందడం సులభతరం అయినది. దీని వలన విదేశీ మారక ద్రవ్యం డిమాండ్, సప్లయ్‌ల మధ్య సమతౌల్యం ఏర్పడింది. దిగుమతులు తగ్గి, విదేశీ మారక ద్రవ్యం నిల్వలు బాగా పెరిగినాయి.

**సి. కోశ విధానంలో మార్పులు**

కోశవిధానంలో కూడా ప్రభుత్వం అనేక మార్పులు తీసుకువచ్చింది.

i) **ఎక్స్‌యిజ్ సుంకాలు తగ్గించుట**

అనేక రకాల వస్తువులపై ఉత్పత్తి సుంకాలు తగ్గించడం జరిగింది. ఫలితంగా పరిశ్రమలు తమ సామర్థ్యాన్ని పెంచుకోవడానికి విదేశీ వస్తువులతో పోటీ పడడానికి వీలు కలిగింది.

ii) **ప్రత్యక్ష పన్నుల రేటులు తగ్గించుట**

పన్నులు చెల్లింపు క్రమబద్ధం చేయడానికి ప్రత్యక్ష పన్ను రేట్లు తగ్గించడం జరిగినది. పన్నుల ఎగవేతను నిరోధించడానికి, పన్నుల వల్ల వచ్చే ఆదాయం పెంచుకోవడానికి ఇది ఒక మంచి మార్గంగా భావించినారు.

iii) ప్రభుత్వ వ్యయం తగ్గించుట

ప్రభుత్వం అనవసర వ్యయాన్ని తగ్గించుకొన్నది. దీని వలన ప్రభుత్వం పెట్టుబడి సామర్థ్యాన్ని పెంచుకున్నది.

iv) ప్రభుత్వ మూలధన ఆస్తుల విక్రయం

ప్రభుత్వ సంస్థలలోని మూలధన వాటాలను ప్రైవేటు సంస్థలు లేదా ప్రైవేటు వ్యక్తులకు విక్రయించాలని ప్రభుత్వం నిర్ణయించింది. దీని ద్వారా ప్రభుత్వం తన వ్యయ అవసరాలు తీర్చుకోవచ్చునని భావించింది.

ప్రపంచీకరణ ద్వారా ఆర్థికాభివృద్ధి సాధించడానికి ప్రభుత్వం నిర్ణయించుకొంది. విదేశీ దిగుమతుల ప్రోత్సహించుట, విదేశీ పెట్టుబడులు ఆహ్వానించుట విదేశీ మూలధనంతో దేశీయ పరిశ్రమలు నెలకొల్పుట భారతీయ ఉత్పత్తులలో అధికభాగం విదేశాలకు ఎగుమతి చేయుట మొదలైన కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది.

**4.ఆర్థిక సంస్కరణల నేపథ్యంలో పంచవర్ష ప్రణాళికల పాత్రను వివరించండి?**

త్వరిత గతిన పారిశ్రామికాభివృద్ధి సాధించుట, భారత పారిశ్రామికాభివృద్ధికి ఆటంకాలుగా నిలిచిన అన్ని విధానాలను తొలగించడమే ఈ సంస్కరణల ముఖ్య ఆశయం. ఫలితంగా ఒకే వేగంతో ఆర్థిక వృద్ధి, పారిశ్రామికాభివృద్ధి కొనసాగుతాయని భావించినారు. అందుచేతనే అప్పటి ఆర్థికమంత్రి ఈ విధానాన్ని మార్పుతో కూడిన నిరంతరం కొనసాగే నూతన విధానంగా పేర్కొన్నారు.

**ఎ. ప్రభుత్వ ప్రాధాన్యత తగ్గించుట**

ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ పాత్ర గణనీయంగా తగ్గించబడి ప్రణాళికా ధ్యేయాల నిర్ణయానికి మాత్రం పరిమితమైంది. ఆ ధ్యేయాలను సాధించవలసిన బాధ్యత ప్రైవేటు రంగానికి అప్పగించబడింది.

**బి. ప్రైవేటు రంగం చొరవ**

కొత్త ఆర్థిక విధానం దేశ ఆర్థిక వృద్ధిని ప్రైవేటు రంగానికి వదిలివేసింది. ప్రైవేటు రంగం లాభాపేక్షతో పనిచేస్తుంది. కాబట్టి, ఆ లాభాపేక్ష ఆర్థికవృద్ధికి కూడా దారి తీస్తుందని భావించినారు. కానీ ఈ విధానం భవిష్యత్తులో ఆదాయ అసమానతలను మరింత పెంచుతుంది. అప్పుడు ప్రభుత్వం ఆదాయ అసమానతలు నిర్మూలించడానికి గట్టి ప్రయత్నాలు చేపట్టవలసి ఉంది.

**సి. ప్రభుత్వం యొక్క నూతన పాత్ర**

పేదరిక నిర్మూలనకు మునుపెన్నడూ లేనంత ప్రాధాన్యత ఇవ్వబడింది. ప్రణాళికల ద్వారా పేదరిక నిర్మూలన చర్యలు తీసుకొనుట, ప్రజలకు మెరుగైన జీవన విధానం అందించుట ప్రభుత్వ బాధ్యతగా గుర్తించబడింది.

పై అంశాల పరిశీలన ద్వారా దేశ ఆర్థికాభివృద్ధి కార్యక్రమంలో ప్రణాళికా పాత్ర తగ్గించబడలేదని గ్రహించవచ్చును. ఇది ఒక మార్పు మాత్రమే. ప్రస్తుతం ప్రభుత్వం పారిశ్రామిక ఉత్పత్తులపై దృష్టి పెట్టనవసరం లేదు. కానీ ఈ పారిశ్రామికాభివృద్ధిని ఆదాయ అసమానతల నిర్మూలనకు పేదరిక నిర్మూలనకు, నిరుద్యోగిత నిర్మూలనకు, ప్రాంతీయ సమానాభివృద్ధికి దోహదపడేటట్లు చూడవలెను.

# 34

# ఆంధ్ర ప్రదేశ్ ఆర్థికాభివృద్ధి (సంక్షిప్త పునర్విమర్శ)

## 34.1 పరిచయం

ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి 1953 లో తెలుగు భాష మాట్లాడే ప్రాంతాలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంగా ఏర్పడింది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగు మాట్లాడే ప్రాంతాలు, అప్పటి ఆంధ్ర రాష్ట్రంతో కలిసి 1956 వ సంవత్సరం నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ గా అవతరించింది. జనాభా మరియు వైశాల్య పరంగా చూస్తే ఆంధ్రప్రదేశ్ మనదేశంలోని ఐదవ పెద్ద రాష్ట్రం. 2.75 లక్షల చ.కి.మీటర్ల విస్తీర్ణం కలిగిన ఈ రాష్ట్రం దేశ భూభాగంలో 8.4% వైశాల్యం కలిగి ఉంది. 2011 జనాభా లెక్కల ప్రకారం ఈ రాష్ట్ర జనాభా 8,46,65,533 కోట్లు. మొత్తం దేశ జనాభాలో దీని వాటా 8 శాతం.

## 34.2 లక్ష్యాలు

ఈ పాఠ్యభాగం పూర్తి అయ్యేసరికి మీరు తెలుసుకొనే విషయాలు.

- రాష్ట్రీయ స్థూల దేశీయోత్పత్తి ధోరణులు, రాష్ట్రీయ స్థూల దేశీయోత్పత్తి లో రంగాల వాటాలు, ఆంధ్రప్రదేశ్ తలసరి ఆదాయ ధోరణుల గురించిన వివరణ.
- ఆంధ్రప్రదేశ్ వ్యవసాయాభివృద్ధి ధోరణులు
- ఆంధ్రప్రదేశ్ వివిధ రంగాల సాంఘికాభివృద్ధి ధోరణులు
- ఇటీవలి కాలంలో ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి ధోరణులు
- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ప్రవేశ పెట్టబడిన సంక్షేమ పథకాలు

## 34.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

**1. *భౌతికాంశాలు అనగానేమి?***

జ: పాలనా నిమిత్తం ఈ రాష్ట్రం 23 జిల్లాలుగా విభజింపబడినది. ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ లో మూడు ప్రాంతాలు కలవు. అవి:

1. 9 జిల్లాలు గల కోస్తా ఆంధ్ర ప్రాంతం
2. 10 జిల్లాలు గల తెలంగాణా ప్రాంతం
3. 4 జిల్లాలు గల రాయలసీమ ప్రాంతం.

***2. రాష్ట్ర స్థూల దేశీయోత్పత్తిని వివరింపుము.***

జ: ఆంధ్రప్రదేశ్ ఎకనామిక్ మరియు స్టాటిస్టిక్స్ డైరెక్టరేట్ చేత యస్‌జిడిపి (SGDP) అంచనా వేయబడుతుంది. యస్‌జిడిపి ని అంచనా వేసేందుకు డైరెక్టరేటు ఉత్పత్తి పద్ధతి మరియు ఆదాయ పద్ధతులను అవలంబిస్తున్నది.

***3. సాగునీటి సౌకర్యాలను పేర్కొనండి.***

జ: మన రాష్ట్రంలో మెరుగైన నీటిపారుదల సౌకర్యాలకు ఎన్నో అవకాశాలు ఉన్నాయి. కృష్ణా, గోదావరి, పెన్నా, వంశధార నదులతో పాటు 36 చిన్న నదులు కూడా ఈ రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి. ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ డైరక్టరేట్, 2008. అందిస్తున్న గణాంక వివరాల ప్రకారం మన రాష్ట్రంలో తాగునీరు (60%), సాగునీరు (64252), పరిశ్రమలు (288), విద్యుదుత్పాదనం (28) మిలియన్ క్యూబిక్ మీటర్లుగా నమోదయినది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2004 సం॥ లో 'జలయజ్ఞం' పేరుతో ఒక చారిత్రాత్మక నిర్ణయం తీసుకుంది. దీని ఉద్దేశ్యం గోదావరి మరియు ఇతర నదుల నీటిని పూర్తిగా ఉపయోగించి, నిర్మాణంలో ఉన్న, కొత్త ప్రాజెక్టుల ద్వారా సాగునీటి కొరత ఉన్న ప్రాంతాలకు ప్రాధాన్యత నివ్వటం. ఈ బృహత్తర కార్యక్రమానికి సాధ్యమైన అన్నీ మార్గాల నుండి నిధులను మళ్ళించాలని భావించింది. జలయజ్ఞం క్రింద 86 ప్రాజెక్టులను మొత్తం మీద ప్రారంభించింది.

***4. ఐ. టి. పరిశ్రమ యొక్క ప్రాధాన్యత ఏమిటి?***

జ: రాష్ట్రంలో ఐ.టి. పరిశ్రమ పురోగమించినంత వేగంగా మరే ఇతర పరిశ్రమ వృద్ధి చెందలేదు. ఈ పురోగతి 1991 లో ఎలక్ట్రానిక్స్ డిపార్ట్‌మెంట్ ఆధ్వర్యంలో భారత ప్రభుత్వం హైదరాబాద్ లో సాఫ్ట్‌వేర్ టెక్నాలజీ పార్కును నెలకొల్పటంతో ప్రారంభమైనది.

***5. విద్యుచ్ఛక్తి / శక్తి యొక్క నిర్మాణం?***

జ: వేగవంతమైన అభివృద్ధి సాధనలో కీలకమైనది శక్తి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దీనిని గుర్తించి శక్తి రంగ అభివృద్ధికి తగిన కృషి చేస్తున్నది. ఈ రంగం యొక్క బలహీనతను అధిగమించుటకు ప్రభుత్వం ఎపియస్ఇబి ని ఎపిటిఎయన్‌యస్‌సిఒ మరియు ఎపిజిఇయన్‌సిఓ గా విభజించినది.

***6. రోడ్డు రవాణా వ్యవస్థను గురించి వివరించండి.***

జ: దేశంలోనే మన రాష్ట్ర రోడ్డు రవాణా వ్యవస్థ అతి పెద్దది. 80% వస్తువులు, వ్యక్తులు రోడ్ల ద్వారానే ఇతర ప్రాంతాలకు చేరవేయ బడుతున్నారు.

***7. వాయు మార్గం/ వాయు రవాణా అనగానేమి?***

జ: మన రాష్ట్రంలో ఆరు విమానాశ్రయాలు కలవు. అవి :-

1. శంషాబాద్, 2. విశాఖపట్నం, 3. రాజమండ్రి, 4. విజయవాడ, 5. తిరుపతి, 6. పుట్టపర్తి.

***8. నీటి రవాణా మార్గం***

జ: ఆం.ప్ర తూర్పున 972 కి.మీ పొడవు తీర రేఖ కలిగి ఉంది. ఈ రాష్ట్రంలో విశాఖపట్టణం సహజ ఓడరేవు కలిగి ఉన్నది. దీనిని కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో రెండు మధ్యరకం పోర్టులు, మరియు పది చిన్న ఓడరేవులు పనిచేస్తున్నాయి.

## రెండు మార్కుల ప్రశ్నలు

### *1. రాష్ట్ర స్థూల దేశీయోత్పత్తి*

జ: రాష్ట్ర స్థూల దేశీయ ఉత్పత్తినే రాష్ట్ర ఆదాయంగా చెప్పవచ్చు. ఒక రాష్ట్ర భౌగోళిక సరిహద్దులలో ఒక సంవత్సర కాలంలో ఉత్పత్తి కాబడిన అంతిమ వస్తుసేవల విలువనే రాష్ట్రీయ స్థూల దేశీయ ఉత్పత్తిగా చెప్పవచ్చు.

ఆంధ్రప్రదేశ్ ఎకనామిక్ మరియు స్టాటిస్టిక్ డైరెక్టరేట్ చేత యస్‌జిడిపి (SGDP) అంచనా వేయబడుతుంది. యస్‌జిడిపి ని అంచనా వేసేందుకు డైరెక్టరేటు ఉత్పత్తి పద్ధతి మరియు ఆదాయ పద్ధతులను అవలంభిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో మూడు రంగాలు కలవు. అవి

1. ప్రాథమిక రంగం : వ్యవసాయం, పశుపోషణ, అడవులు, గనులు మరియు క్వారీలు.
2. పారిశ్రామిక రంగం : పరిశ్రమలు, గ్యాస్, సాగునీరు, నిర్మాణం.
3. సేవల రంగం : వ్యాపారం, హోటళ్ళు, రవాణా, కమ్యూనికేషన్, రియల్ ఎస్టేట్ సాధారణ పాలన. సాంఘిక సేవలు.

### *2. తలసరి ఆదాయం*

జాతీయ ఆదాయంలోని పెరుగుదల ద్వారా ఆర్థిక వృద్ధిని కొలవవచ్చు. కాని ఈ కొలమానం జనాభావృద్ధిని పరిగణనలోకి తీసుకోదు. కనుక ఆర్థికవృద్ధిని కొలవటానికి తలసరి ఆదాయం ఒక ముఖ్యమైన కొలబద్దగా మారింది. ఎందువల్లనంటే ఇది జనాభా ను కూడా లెక్కలోకి తీసుకుంటుంది. రాష్ట్ర ఆదాయాన్ని రాష్ట్ర జనాభాతో భాగిస్తే రాష్ట్ర తలసరి ఆదాయం వస్తుంది.

### *3. ఆరోగ్యం*

జ: విద్య, రక్షిత మంచినీటి సప్లయ్, పరిశుభ్రమైన పరిసరాలు, కాలుష్య రహిత వాతావరణంల ద్వారా మంచి ఆరోగ్యం సాధ్యం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ దిశగా ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ, ఇంకా కొన్ని ఫ్లోరోసిస్ పీడిత గ్రామాలున్నాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ యొక్క 'అందరికీ ఆరోగ్యం' అన్న లక్ష్యాన్ని చేరుకునేందుకు ఆం.ప్ర ప్రభుత్వం ఈ దిగువ పథకాలను అమలు పరుస్తున్నది. అవి :

1) జాతీయ ప్రసూతి సహాయ పథకం (Natioanal maternity benefit Programme)
2) సమగ్ర బాలల అభివృద్ధి పథకం (I C D P)
3) మహిళల పౌష్ఠికాహార పథకం (Supplementary Nutrition Programme for women)
4) బాలికా సమృద్ధి ప్రణాళిక (Balika Samrudhi Yojana)
5) యుక్తవయస్సు బాలికల ప్రవర్తన అభివృద్ధి పథకం (Special development Programme for adolescent girls)
6) తల్లుల సంరక్షణ పథకం (Janani Surakhsha Yojana)

***4. జనాభా***

జ: 1961 – 2001 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ జనాభా రెట్టింపు అయినది. 2001 జనాభా లెక్కల ప్రకారం అది 7.62 కోట్లు, 2011 జనాభా లెక్కల ప్రకారం 8.46 కోట్లకు చేరింది. భారత దేశ జనాభాలో ఈ రాష్ట్రం వాటా 8%, మరియు ఆంధ్రప్రదేశ్ అధిక జనాభా గల రాష్ట్రాలలో ఐదవది. ఆం.ప్ర జనాభా లెక్కల వివరాలు దిగువ పొందు పరచబడ్డాయి.

***5. సంక్షేమ కార్యక్రమాలు***

జ: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనేక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టింది. ఇవి బలహీన వర్గాల అభ్యున్నతికి ఉద్దేశించబడినవి. పేద ప్రజల జీవన ప్రమాణ స్థాయిని మెరుగుపరచటం వీటి ముఖ్య ఉద్దేశ్యం. వ్యవసాయ పారిశ్రామిక రంగాలు ప్రజలకు ఉపాధిని కల్పిస్తున్నప్పటికీ మానవాభివృద్ధి దృష్ట్యా సాంఘిక రంగాలకు ప్రాధాన్యత ఇవ్వబడింది. ఏ దేశం ఆర్థికాభివృద్ధి తోనైనా మానవాభివృద్ధి ముఖ్య సూచికగా మారింది. సామాజిక రంగాలైన విద్య, ఆరోగ్యం, పోషకాహారం, రక్షిత మంచినీటి సప్లయ్, గృహ వసతి, సామాజిక భద్రత మొ॥నవి. మెరుగు పడినప్పుడే మానవాభివృద్ధి సాధ్యపడుతుందనేది నిర్వివాదాంశం. అందుకే ఆం.ప్ర. ప్రభుత్వం మానవ సంక్షేమాన్ని పెంపొందించే వివిధ కార్యక్రమాలను అమలు చేస్తున్నది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. ఆంధ్రప్రదేశ్‌లో ఎస్.జి.డి.పి. ధోరణులు వివరింపుము.***

***జ:*** 2000-01 నుండి 2007-08 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ యొక్క యస్‌జిడిపి ఒకటిన్నర రెట్లు పెరగగా, భారతదేశం మొత్తం మీదా అదే విధంగా పెరిగింది. కాగా దేశం మొత్తం మీద యస్‌జిడిపి లో వృద్ధిరేటు అదే కాలంలో రెట్టింపు అయినది.

అదేవిధంగా వివిధ రంగాల వాటా పరిశీలిస్తే క్రింది అంశాలు గమనింపవచ్చు.

1. 1960-61 లో ఆంధ్రప్రదేశ్‌లో యస్‌జిడిపి లో ప్రాథమిక రంగం వాటా 63%. కాగా అది 2002-03 నాటికి 28.5% కి తగ్గినది.
2. 1960-61 లో ఆంధ్రప్రదేశ్‌లో యస్‌జిడిపిలో సేవారంగ వాటా 25% కాగా అది 2002-03 నాటికి 50.2%కి పెరిగినది.
3. ఈ మార్పులు రాష్ట్రం యొక్క ఆర్థికాభివృద్ధి ని సూచిస్తున్నాయి.

2000-01 మరియు 2007-08 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ మరియు భారతదేశం యొక్క తలసరి ఆదాయంలో పెరుగుదల ఒకే విధంగా ఉన్నట్లు పై పట్టిక ద్వారా తెలుస్తోంది. కాగా భారతదేశం యొక్క వృద్ధిరేటు మాత్రం ఇదే కాలంలో ఏడురెట్లు పెరిగింది.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలు ప్రబలంగా ఉన్నాయి. ఈ అసమానతలు ప్రాంతాలు మరియు సాంఘికవర్గాల మధ్య ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ రంగాల అభివృద్ధి విషయంలో ప్రాంతీయ వ్యత్యాసాలు తీవ్రంగా ఉన్నాయి. ఇరిగేషన్, పెద్ద పరిశ్రమలు, సేవల రంగం విషయంలో ఈ వ్యత్యాసాలు స్పష్టంగా తెలుస్తాయి.

1999 – 2000 సం॥ లో స్థిర ధరలలో ఆం.ప్ర తలసరి ఆదాయం రూ॥ 19840. తలసరి ఆదాయం ఆధారంగా జిల్లాల వారీ గణాంక సమాచారం ప్రకారం విశాఖపట్నం ప్రథమ స్థానంలో, హైదరాబాద్ ద్వితీయ స్థానంలోను, పశ్చిమ గోదావరి తృతీయ స్థానంలోను కలవు.

ప్రాంతీయ వ్యత్యాసాలను పరిశీలిస్తే, కోస్తా ఆంధ్ర, మరియు తెలంగాణాలతో పోలిస్తే రాయలసీమ ప్రాంతం వెనుకబడి ఉన్నది.

***2. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక రంగంలో సామాజిక రంగం పాత్రను వివరింపుము.***

*జ:* సాంఘికాభివృద్ధికి, ఆర్థికాభివృద్ధికి అవినాభావ సంబంధం కలదు. విద్య, ఆరోగ్యం, ఆరోగ్యకరమైన తాగునీరు గృహ వసతులను కలిపి సాంఘిక రంగంగా వ్యవహరిస్తారు. ఈ సూచీలన్నీ ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని మానవాభివృద్ధి ని ప్రతిబింబిస్తాయి. కావున సాంఘిక రంగ అభివృద్ధి అనగా మానవజాతి అభివృద్ధే. మానవాభివృద్ధికి కావలసిన భౌతిక వనరులు ఆర్థికాభివృద్ధి చే కల్పించబడతాయి. ఆర్థికాభివృద్ధి ఫలాలు పేదలకు అందకపోవటం అనేది ఆదాయ పంపిణీలో అసమానతలను సూచిస్తుంది. సాంఘిక మానవాభివృద్ధి సాధించాలంటే, ఆర్థిక, సాంఘిక రంగాలలో ఏకకాలంలో అభివృద్ధి తప్పని సరి.

1960–61 మరియు 2007–08 మధ్య యస్‌జిడిపి లో సాంఘిక రంగం వాటా 25.2% నుండి 51.3% కి పెరిగింది. 2008–09 లో ఈ రంగంలో వార్షిక వృద్ధిరేటు 10.06% గా నమోదయినది. ఇటీవలి కాలంలో ఐ.టి. రంగం, టెక్నాలజీ, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్ రంగాలలో సంభవించిన భారీ విస్తరణ, రాష్ట్ర ప్రభుత్వ సరళీకరణ విధానాలే ఈ అత్యధిక వృద్ధి రేటుకు కారణాలు.

**విద్య (Education)**

భారతదేశ భవిష్యత్తు తరగతి గదిలో రూపుదిద్దుకుంటుంది అన్నారు ప్రముఖ విద్యావేత్త కొఠారి. అంటే మానవాభివృద్ధి విద్యాభివృద్ధి పై ఎంతగానో ఆధారపడి ఉంది. ఈ దిగువ పట్టిక ఆంధ్రప్రదేశ్ లో వివిధ జనగణన జరిగిన కాలాలలో అక్షరాస్యతా ధోరణులను వివరిస్తున్నది.

1. 1961 లో అక్షరాస్యతా రేటు కేవలం 21.19%.
2. 2001 లో 2/3 వంతుల రాష్ట్ర జనాభా అక్షరాస్యులు.
3. స్త్రీ, పురుష సంఖ్యలో పెరుగుదలను విశ్లేషిస్తే, స్త్రీలతో పోలిస్తే పురుషులలో వృద్ధి రేటు ఎక్కువ.
4. రాష్ట్రంలోని స్త్రీలలో సగం మంది మాత్రమే అక్షరాస్యులు.

**ఆరోగ్యం (Health)**

విద్య, రక్షిత మంచినీటి సప్లయ్, పరిశుభ్రమైన పరిసరాలు, కాలుష్య రహిత వాతావరణంల ద్వారా మంచి ఆరోగ్యం సాధ్యం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ దిశగా ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ, ఇంకా కొన్ని ఫ్లోరోసిస్ పీడిత గ్రామాలున్నాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ యొక్క 'అందరికీ ఆరోగ్యం' అన్న లక్ష్యాన్ని చేరుకునేందుకు ఆం.ప్ర ప్రభుత్వం ఈ దిగువ పథకాలను అమలు పరుస్తున్నది. అవి :

1) జాతీయ ప్రసూతి సహాయ పథకం (Natioanal maternity benefit Programme)
2) సమగ్ర బాలల అభివృద్ధి పథకం (I C D P)
3) మహిళల పౌష్టికాహార పథకం (Supplementary Nutrition Programme for women)
4) బాలికా సమృద్ధి ప్రణాళిక (Balika Samrudhi Yojana)
5) యుక్తవయస్సు బాలికల ప్రవర్తన అభివృద్ధి పథకం (Special development Programme for adolescent girls)
6) తల్లుల సంరక్షణ పథకం (Janani Surakhsha Yojana)

**జనాభా (Population)**

1961 – 2001 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ జనాభా రెట్టింపు అయినది. 2001 జనాభా లెక్కల ప్రకారం అది 7.62 కోట్లు, 2011 జనాభా లెక్కల ప్రకారం 8.46 కోట్లకు చేరింది. భారత దేశ జనాభాలో ఈ రాష్ట్రం వాటా 8%, మరియు ఆంధ్రప్రదేశ్ అధిక జనాభా గల రాష్ట్రాలలో ఐదవది.

# 35
# పర్యావరణం - ఆర్థికాభివృద్ధి
# (Environment and Economic Development)

## 35.1 పరిచయం

ఎన్విరాన్‌మెంట్ ( పర్యావరణం) అన్న ఆంగ్లపదాన్ని ఎన్విరాన్ అనే ఫ్రెంచి పదం నుంచి తీసుకున్నారు. “ఎన్విరాన్” అంటే ‘చుట్టూ ఉన్న’ అని అర్థం. మన చుట్టూ ఆవరించి ఉన్న ప్రతిదాన్ని సమిష్టిగా పర్యావరణం ( ఎన్విరాన్‌మెంట్) అని పిలవవచ్చు. మన చుట్టూ జీవులు, నిర్జీవులు ఆవరించి ఉంటాయి. జీవులన్నింటికి ప్రాణముంటే నిర్జీవులకు ప్రాణం ఉండదు కాబట్టి సజీవ భాగాన్ని (బయోలాజికల్) సజీవ పర్యావరణం అని, ప్రాణం లేకుండా మన చుట్టూ ఉండే భాగాన్ని పర్యావరణం అని పిలుస్తారు.

అలాగే ప్రాణమున్న అన్ని అంశాలను కలిపి జీవ సంబంధమైన అంశాలు లేదా జీవకారకాలు అంటారు. మొక్కలు, చెట్లు, జంతువులు, మానవులు అన్నింటిని కలిపి జీవసంబంధమైన అంశాలని పిలుస్తారు. మనిషి ఇలాంటి పరస్పరాధారితమైన, పరస్పరం ప్రభావితమవుతున్న సజీవ, నిర్జీవ అంశాల మధ్య, అవి ఆవరించి ఉన్న నిర్మాణాల మధ్య ఒక కేంద్రకంగా జీవిస్తూ ఉంటాడు. వాటిపై ఆధారపడుతూ, వాటి నుంచి ప్రభావితమవుతూ, వాటిని ప్రభావితం చేస్తూ తన జీవితాన్ని గడుపుతాడు.

## 35.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలోని ప్రశ్నలు, సమాధానాలు చదివిన తరువాత మీరు ఈ క్రింది వాటిని గురించి తెలుసుకోగలరు.

- పర్యావరణంలోని కారకాలు, మరియు విధులు
- పర్యావరణము మరియు ఆర్థిక వ్యవస్థ
- పర్యావరణం యొక్క భావనలు
- కాలుష్యం మరియు అడవుల నరికివేత
- కొనసాగించగల అభివృద్ధి

## 35.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. భౌతిక అనుఘటకాలు ఏవి?***

జ: భూమి, నీరు, వాయువు, పర్వతాలు, అడవులు, నదులు మొదలైనవి.

***2. జీవ అనుఘటకాలు ఏవి?***

జ: మొక్కలు, వృక్షాలు, జంతువులు.

ఒక నిర్ణీత ప్రదేశంలో, ఒక నిర్ణీత కాలంలో మానవుల చుట్టూ ఉన్న పరిస్థితుల మొత్తాన్ని పర్యావరణం అని చెప్పవచ్చు.

***3. సహజ ఆవరణ వ్యవస్థ అనగానేమి?***

జ: ప్రకృతి సిద్ధంగా ఆవిర్భవించి, తమకు తామే తమ విధులను నిర్వహించుకునే ఆవరణ వ్యవస్థలను సహజ ఆవరణ వ్యవస్థలు అంటారు.

**4. కృత్రిమ ఆవరణ వ్యవస్థ అనగానేమి?**

జ: మానవుని జోక్యంతో మార్పులు చేసి నిర్వహించబడే ఆవరణ వ్యవస్థలను కృత్రిమ ఆవరణ వ్యవస్థలు అంటారు.

**5. విచ్ఛిన్నకారులు అనగానేమి?**

జ: బాక్టీరియా, ఫంగి, ఈస్ట్, క్రిములు, కీటకాలు ఇతర సూక్ష్మ జీవుల సమూహాలను విచ్ఛినకారులు అందురు.

**6. నిర్జీవ అనుఘటకాలు అనగానేమి?**

జ: ఆవరణ వ్యవస్థలో ఉండేటవంటి ప్రాణంలేని పదార్థాలను నిర్జీవ అనుఘటకాలు అని అందురు.

**7. విచ్ఛిన్నమయ్యే కాలుష్యకాలు అనగానేమి?**

జ: సహజమైన పనుల, పద్ధతుల వల్ల పర్యావరణంలో సులభంగా కలిసిపోయే కాలుష్య కారకాలను విచ్ఛిన్నమయ్యే కాలుష్యకాలు అంటారు.

**8. నెమ్మదిగా విచ్ఛిన్నమైపోయే కాలుష్యకాలు అనగానేమి?**

జ: పర్యావరణంలో కొన్ని సంవత్సరాల పాటు తమ పరిస్థితుల్లో ఎలాంటి మార్పులు లేకుండా ఉండిపోయి తరువాత నెమ్మదిగా కరిగి, కలిసిపోయే కాలుష్యకాలను నెమ్మదిగా విచ్ఛిన్నమయ్యే కాలుష్యకాలు అంటారు.

**9. విచ్ఛిన్నం కానటువంటి కాలుష్యకాలు అనగానేమి?**

జ: సహజమైన పద్ధతుల ద్వారా విచ్ఛిన్నం కాలేనటువంటి, పర్యావరణంలో కలవలేకపోయినటువంటి కాలుష్యకాలను విచ్ఛిన్నం కానటువంటి కాలుష్యకాలు అంటారు.

## రెండు మార్కుల ప్రశ్నలు

***1. ఆవరణ వ్యవస్థను వివరింపుము.***

జ: ఈ ఆవరణ వ్యవస్థను గురించి బ్రిటన్ పర్యావరణ శాస్త్రవేత్త ఎ.జి.టిన్సిలో 1935లో మొదటగా ప్రతిపాదించాడు.

పర్యావరణ వ్యవస్థలో బాహ్య ఉపరితల వ్యవస్థ, అడవులు, భూములు, ఎడారులు మరియు తీర ప్రాంతాలు ఉండును. మానవ జీవనాన్ని ప్రభావితం చేసే విధంగా ఈ ఆవరణ వ్యవస్థలో అంతర్గత సంబంధాలు కలిగియుండును. జలనీటి పునరుత్పత్తి, కార్బన్ చక్రం, నైట్రోజన్ చక్రం మరియు శక్తి చక్రం ఉండును. ఈ పర్యావరణ వ్యవస్థ ఈ వ్యవస్థల ద్వారా పనిచేయును. ఉష్ణగతి శాస్త్రంలోని మొదటి, రెండవ సూత్రాలు ఈ పునరుత్పత్తి విధానాలకు ఆధారమైనవి. ప్రతి పర్యావరణ వ్యవస్థ ఒక దానికి మరొకటి పోలిక లేకుండా ఉండును. మానవుల జీవితాలను ప్రభావితం చేయును. వీటిలో ఎలాంటి మార్పులు సంభవించినా భూమిపై మానవ మనుగడ ఉండక పోవచ్చు.

***2. జీవ వైవిధ్యం అనగానేమి?***

జ: భూమి జీవరాశులకు నిలయం. మానవులు, జంతువులు, మొక్కలు, చెట్లు, చేపలు మొదలగునవి నివసిస్తూ ఉండును. అదే విధంగా పర్వతాలు, రాళ్ళు, గాలి, నేల, వాతావరణం లాంటివి కూడా భూమి మీద ఉండును. ఈ సజీవ, నిర్జీవ రాశులన్నింటిని కలిపి జీవ వైవిధ్యంగా పిలిచెదరు.

***3. వాయు కాలుష్యం వివరింపుము.***

జ: మన చుట్టూ ఉన్న వాతావరణంలో ఎన్నో రకాలైన వాయువులు – ఆక్సిజన్, హైడ్రోజన్, కార్బన్ డయాక్సైడ్, నైట్రోజన్ మొదలయినవి – ఆవరించి ఉంటాయి. భూమి చుట్టూ ఉన్న వాతావరణం ఇలాంటి వాయువుల కలయికతో ఏర్పడి, ఉమ్మడిగా వీటన్నింటిని కలిపి 'వాయువు' (గాలి) అని సామాన్య అర్థంగా పిలుస్తుంటాము. కాని ఒక్క వాయువునే 'గాలి' అని పిలువలేము. వాయువులన్నీ కలిసిన మిశ్రమాన్నే 'గాలి' అంటాము. గాలిలో మిళితమై ఉన్న వాయువులన్నింటికి వాటి వాటి స్వంత, సహజ లక్షణాలుంటాయి. విధులు ఉంటాయి. బరువు దృష్ట్యా చూస్తే మానవుడు రోజూ తీసుకొనే పదార్థాల్లో 80 శాతం వరకు 'గాలి' ఉంటుంది. మనుషులు సగటున ఒక్క గంటకు 2200 సార్లు శ్వాసిస్తారు. గాలి, వాయువుల రూపంలో భూమినంతటిని ఆవరించి ఉండి, వాతావరణంలో ఆకస్మాత్తుగా జరిగే మార్పుల నుంచి భూమిని కాపాడుతూ ఉంటుంది. గాలిలో ఇతర పదార్థాల గాఢత ఎక్కువైపోయి మానవుల ఆరోగ్యాన్ని ప్రతికూలంగా మార్చివేసినా లేదా ఆస్తులను పాడుచేసినా, గాలి కలుషితమైపోయిందని అంటాము. దీనినే వాయుకాలుష్యం అంటారు. ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని మానవుని, అతని ఆస్తులను ప్రభావితం చేసే వాయుకాలుష్యాన్ని ఇంటి వెలుపల జరిగే వాయు కాలుష్యం అంటారు.

***4. నేల కాలుష్యం అనగానేమి?***

జ: భూ పటలంలోని పై పొరలను 'నేల' లేదా 'మృత్తిక' అంటారు. రాళ్లు నిరంతరం భౌతిక, రసాయనిక,జీవశైథిల్యానికి గురవుతూ ఉండడం వల్ల నేల ఏర్పడింది. ప్రకృతి మానవునికిచ్చిన వరమే నేల. నేల ప్రాణంతో ఉన్న ( సజీవ) వనరు, సూర్యరశ్మి, గాలి, నీరులాగానే నేల కూడా వృక్ష సంపదను, పశు సంపదను, మానవ జీవితాలను పెంచి, పోషిస్తూ ఉంటుంది. ఒక గ్రాము నేలలో కీటకాలు, కొన్ని వైరస్‌లు, ప్రోటోజోవా, దానితోపాటు ఒక లక్ష బ్యాక్టీరియాలుంటాయి. నేల సారం, భూగర్భజలాల పరిమాణం, సాగుచేయబడిన పంటల ఉత్పాదకతలను మొక్కల నాణ్యతలను నిర్ధారిస్తాయి.

***5. శబ్ద కాలుష్యంను వివరింపుము.***

జ: సాధారణంగా మనం ఇంట, బయట రకరకాల శబ్దాలను వింటూ ఉంటాం. శబ్దమనేది శక్తికి ఒక రూపం. ఎలాంటి కంపనమైనా శబ్దాన్ని సృష్టిస్తుంది. గాలి, ఘన, ద్రవ మాధ్యమాల ద్వారా శబ్దం ప్రయాణించి విస్తరిస్తుంది.కొన్ని శబ్దాల స్థాయి తీవ్రంగా ఉంటుంది. కొన్నింటి స్థాయి తక్కువగా ఉంటుంది. కొన్ని వినసొంపుగా ఉంటాయి. మరికొన్ని కఠోరంగా ఉంటాయి. శబ్దానికి ఉండే స్థాయిని 'డెసిబెల్' లో కొలుస్తారు. ఒక్కొక్క డెసిబెల్ పెరుగుతూ ఉంటే శబ్ద తీవ్రత పెరుగుతూ ఉంటుంది.

***6. వన విచ్ఛేదనం అనగానేమి?***

జ: ప్రాముఖ్యత అడవులకు ఉన్నప్పటికీ, మానవుని ఆర్థిక కార్యకలాపాల వల్ల నానాటికీ తరిగిపోతున్నాయి. ఇలా అడవులు తరిగిపోవడాన్నే 'వన విచ్ఛేదనం' లేదా 'వన వినాశనం' అని అంటారు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. పర్యావరణానికి-అర్థికాభివృద్ధికి గల సంబంధాన్ని వివరించండి.***

జ: పర్యావరణం నిర్వహించే విధులను పరిశీలిస్తే పర్యావరణం ప్రాముఖ్యత మనకు అర్థమవుతోంది. పర్యావరణం ఆర్థిక వ్యవస్థకు అవసరమైన ముడి సరుకులను సరఫరా చేయడమే గాక ఆర్థిక వ్యవస్థ నుంచి ఉత్పన్నమయ్యే వ్యర్థ పదార్థాలను విలీనం చేసుకుంటుంది.

అర్థశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే పర్యావరణం సరఫరా చేసే వనరులన్నింటినీ 'పర్యావరణ వస్తువులుగా' చెప్పుకోవచ్చు. ఇవన్నీ కూడా సమిష్టి ప్రజా వస్తువులు (public goods) అందువల్ల ఇతరుల నుంచి ఎలాంటి పోటీ లేకుండా నష్టం కలగకుండా వ్యక్తులందరూ ఏకకాలంలో వినియోగించుకొనే వస్తువులను 'సమిష్టి ప్రజా వస్తువులు' అంటారు.

పర్యావరణ వస్తువులను వాడుకోవడంలో వినియోగదారుల మధ్య ఎలాంటి శత్రుత్వం ఉండదు. పైగా వనరులను సరఫరా చేసే సామర్థ్యానికి పరిమితులు విధిస్తున్నాయి. దీనితో పాటు వ్యర్థాలను విలీనం చేసుకొనే సామర్థ్యం కూడా పర్యావరణంలో తగ్గిపోతూ ఉంది.

***2. వాయు కాలుష్యంపై ఒక వ్యాసాన్ని వ్రాయండి.***

జ: మన చుట్టూ ఉన్న వాతావరణంలో ఎన్నో రకాలైన వాయువులు – ఆక్సిజన్, హైడ్రోజన్, కార్బన్ డయాక్సైడ్, నైట్రోజన్ మొదలయినవి – ఆవరించి ఉంటాయి. భూమి చుట్టూ ఉన్న వాతావరణం ఇలాంటి వాయువుల కలయికతో ఏర్పడి, ఉమ్మడిగా వీటన్నింటిని కలిపి 'వాయువు' ( గాలి) అని సామాన్య అర్థంగా పిలుస్తుంటాము. కాని ఒక్క వాయువునే 'గాలి' అని పిలువలేము. వాయువులన్నీ కలిసిన మిశ్రమాన్నే 'గాలి' అంటాము. గాలిలో మిళితమై ఉన్న వాయువులన్నింటికి వాటి వాటి స్వంత, సహజ లక్షణాలుంటాయి. విధులు ఉంటాయి. గాలిలో ఇతర పదార్థాల గాఢత ఎక్కువైపోయి

మానవుల ఆరోగ్యాన్ని ప్రతికూలంగా మార్చివేసినా లేదా ఆస్తులను పాడుచేసినా, గాలి కలుషితమైపోయిందని అంటాము. దీనినే వాయుకాలుష్యం అంటారు. ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా మానవుని, అతని ఆస్తులను ప్రభావితం చేసే వాయుకాలుష్యాన్ని ఇంటి వెలుపల జరిగే వాయు కాలుష్యం అంటారు.

వాయు కాలుష్యం ప్రజలను, మొక్కలను, జంతువులను, జలచరాలను, వస్తువులను ( ఆస్తులను) ప్రతికూలంగా ప్రభావితం చేస్తుంది. మానవుల ఆరోగ్యాన్ని తారుమారు చేస్తుంది. చెట్ల, మొక్కల ఆకులను పాడుచేస్తుంది. కిరణజన్య సంయోగ క్రియను సరిగ్గా జరుగనీయదు. మొక్కలవృద్ధిని అడ్డుకుంటుంది. చారిత్రాత్మక కట్టడాలను వర్ణవిహీనం చేస్తుంది. ఇండ్లు, కార్లు లాంటి వాటికుండే వెలుపలి రంగులను పేలవంగా తయారుచేస్తుంది. సహజమైన అందాలను కలిగిన ప్రదేశాలను స్వచ్ఛతను, నాణ్యతను క్షీణింపచేస్తుంది.

**వాయు కాలుష్యాన్ని రెండు విధాలుగా నియంత్రించవచ్చు**

1. నివారణా చర్యలు చేపట్టడం, 2. వ్యర్థ పదార్థాలను నియంత్రించడం.

వాయు కాలుష్యాన్ని కింది పద్ధతుల ద్వారా సాధ్యమైనంత తక్కువ స్థాయికి తీసుకురావచ్చు. అవి

1. వాయు కాలుష్యానికి దారితీసే మూలాధారాలను గుర్తించి, వాయు కాలుష్య హెచ్చరిక పద్ధతులను అనుసరించడం.
2. వాయు కాలుష్యానికి దారితీసే కారణాలను గుర్తించడం.
3. కార్బన్‌డయాక్సైడ్, సల్ఫర్ ఆక్సైడ్, నైట్రిక్ ఆక్సైడ్ మొదలయిన వాటి గాఢతను క్రమబద్ధంగా పరిశీలించడం
4. ఆధునికమైన వ్యర్థ పదార్థాలను అదుపు చేసే విధానాలను అవలంబించి కాలుష్యాన్ని తగ్గించడం.
5. ప్రయాణ వాహనాలకు వాడే ఇంజన్లలో తగు మార్పులు చేసి, వాటి పనిచేసే సామర్థ్యాన్ని పెంచితే అవి విసర్జించే వ్యర్థాలు తక్కువగా ఉంటాయి.
6. ప్రత్నామ్నాయ ఇంధనాలను కొత్తగా కనుగొనడం.
7. కాలుష్యాన్ని తగ్గించేందుకు వీలుగా అన్ని పరిశ్రమల్లో ఆధునికపరికరాలను అమర్చడం.
8. శిలాజ ఇంధనాల వాడకాన్ని వీలైనంతగా తగ్గించడం.
9. వాయు కాలుష్య చట్టాలను కచ్చితంగా అమలు పరచటం.
10. పునరావృతమయ్యే శక్తి వనరుల వినియోగాన్ని పెంచడం.

***3. నీటి కాలుష్యంపై ఒక వ్యాసాన్ని వ్రాయండి.***

జ: నీటిని 'నీలి బంగారం' అంటారు. జీవరాశులకు గాలి ఎంత అవసరమో నీరు కూడా అంతే అవసరం. మానవుని శరీర బరువులో 70 శాతం నీరు ఉంటుంది. భూమి ఉపరితలంలో 80 శాతం వరకు నీరు ఆక్రమించి ఉంది. భూమి మీద ఉండే నీటిలో 97 శాతం వరకు సముద్రాల్లో ఉంటుంది. మిగతా 3 శాతం మాత్రమే స్వచ్ఛమైన నీరు. అందులో 2,977 శాతం మంచుగడ్డల రూపంలో ఉంది. మిగతా 0.003 శాతం మాత్రమే మనకు అందుబాటులో ఉంది. ఇంతటి కొద్ది

పరిమాణంలో మాత్రమే లభిస్తోంది. కాబట్టి నీరు అత్యంత విలువైన వనరుగా పరిగణించబడుతోంది. నీరు లేకపోతే ఈ భూమి మీద అసలు జీవమే ఉండదు.

### నీటి కాలుష్యం - ఆధారాలు Sources of water Pollution

నీటిని కలుషితం చేసే కాలుష్యకాలు ప్రధానంగా కింది విధంగా ఉంటాయి.

1. గృహాల్లోని వ్యర్థాలు, మానవ వ్యర్థాలు.
2. ఉపరితల నీటి ప్రవాహం.
3. మేట వేయడం (Silt)
4. పారిశ్రామిక వ్యర్థాలు.
5. వేడిగా ఉండే వ్యర్థ పదార్థాలు
6. రసాయనిక ఎరువులు, క్రిమి సంహారకాలు.
7. ప్రమాదవశాత్తు చిందిపోయే నూనెలు.
8. విషపూరితమైన లోహాల మూలకాలు.
9. గనుల తవ్వకం వల్ల వచ్చే వ్యర్థాలు.
10. శుద్ధిచేయబడని పనికిరాని నీరు, చెత్తా చెదారం మొదలయినవి.

### నీటి కాలుష్యం వలన కలిగే ప్రభావాలు (Effects of Water Pollution)

నీటి కాలుష్యం - ప్రభావాలు

నీటి కాలుష్యం క్రింది దుష్ఫలితాలకు దారితీస్తుంది.

1. నీటి నుంచి పుట్టే వ్యాధులను వ్యాపింపచేస్తుంది.
2. తాగునీటి స్వచ్ఛతను క్షీణింపచేస్తుంది.
3. నీటి పారుదల కలిగిన వ్యవసాయ భూముల ఉత్పాదకత తగ్గిపోవడానికి కారణమవుతుంది.
4. చేపలను తినడానికి వీలులేని ప్రమాదకకరమైనవిగా మార్చేస్తుంది.
5. నీటిలో ఉన్న ప్రాణవాయువును క్షీణింపచేస్తుంది. నీటి ఉష్ణోగ్రతను తారుమారు చేసి పునరుత్పత్తిని తగ్గించేస్తుంది.
6. ఈదడానికి కూడా పనికిరాని విధంగా నీటిని మార్చివేస్తుంది.
7. నీటిని దుర్గంధపూరితం చేస్తుంది.
8. కలుషితమైన నీటిని తాగడం వల్ల వచ్చే వ్యాధులు ఆర్థికంగా భారాన్ని పెంచుతాయి. ముఖ్యంగా పేద ప్రజలు

ఆ భారాన్ని మోయలేరు.

9. అనారోగ్యం కారణంగా పనిచేసే రోజులు తగ్గిపోతాయి.
10. పేగులకు సంబంధించిన వ్యాధుల వల్ల పిల్లలు బాధపడవలసి వస్తుంది.

**నీటి కాలుష్యం – నియంత్రణ చర్యలు (Control measures)**

కింది పేర్కొన్న చర్యలు తీసుకుంటే నీటి కాలుష్యాన్ని నియంత్రించవచ్చు.

1. రసాయనిక ఎరువులను, క్రిమి సంహారక మందులను వీలైనంత తక్కువగా ఉపయోగించాలి.
2. సేంద్రీయ ఎరువులతో సాగుచేయడం పెరగాలి.
3. నీరు పొర్లిపోకుండా చెట్లను ఎక్కువగా పెంచాలి.
4. కలుషితమైన నీటిని శుద్ధిచేయడం చాలా అవసరం.
5. పరిశ్రమల్లో వాడుకున్న తరువాత మిగిలిపోయే కలుషితమైన నీటిని శుద్ధిచేసే యంత్రాలను ప్రతి పరిశ్రమ ఏర్పాటు చేసుకోవాలి.
6. పర్యావరణ చట్టాలను కఠినంగా అమలు పరచటంతో పాటు, 'కలుషితం చేసే వారే పరిహారం చెల్లించాలి' అనే సూత్రాన్ని అమలు పరచాలి. పరిశ్రమలన్నీ వ్యర్థజలాలను, వేడినీటిని విడుదల చేయడం తగ్గించుకోవాలి.
7. సురక్షితమైన తాగునీటిని అందించేందుకు వీలుగా ప్రభుత్వం పెట్టుబడులను పెంచాలి. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో పరిశుభ్రమైన తాగునీరు ఎంతో అవసరం.
8. ఆధునిక పద్ధతులను ఉపయోగించి కలుషితమైన నీటిని పున చక్రీకరణచేసి వాడుకోవడానికి వీలుగా శుద్ధి చేయాలి.
9. వర్షపు నీటిని సంగ్రహించి నిల్వచేయాలి. వర్షపు నీటిని సంగ్రహించే ప్రక్రియలో మహిళలు క్రీయాశీలకంగా పాల్గొనేలా చేయాలి.
10. పరిశుభ్రమైన నీటిని తాగడం హక్కు అని ప్రజలందరూ గుర్తించాలి.

***4. వనసంరక్షణా చర్యలను సూచింపుము.***

జ: అడవులను 'కర్బన శోషణాగారాలని ప్రకృతి సౌందర్యాల ఖజానాలని" అంటారు. వాటికున్న ప్రాధాన్యాన్ని గమనించి, సంరక్షించుకోవడం అత్యంత ఆవశ్యకం. అడవులను కింది చర్యల ద్వారా సంరక్షించుకోవచ్చు.

1. పేదలు ఇళ్ళు కట్టుకోవడానికి గాను అటవీ భూములను కేటాయించడం మానుకోవాలి.
2. ప్రభుత్వం తరుపున కట్టెల దొడ్లను, సామూహిక కట్టెల దొడ్లను ఏర్పాటు చేసి వంట చెరకు సరఫరా చేయాలి. ఇందుకు సామాజిక వనీకరణ బాగా తోడ్పడుతుంది.

3. వృధాగా ఉన్న భూముల్లో మొక్కలు నాటాలి.
4. అడవులు మంటల పాలు కాకుండా సంరక్షించుకోవాలి.
5. అడవులు తరిగిపోయిన ప్రదేశాలను గుర్తించి, ఆ ప్రాంతాల్లో చెట్లను నాటి తరగిపోయిన అడవిని భర్తీ చేయాలి.
6. అటవీ ఉత్పత్తులపై ఆధారపడిన పరిశ్రమలను, వ్యాపార సంస్థలను ప్రోత్సహించకూడదు.
7. సంయుక్త అటవీ యాజమాన్య సంఘాలను స్థాపించడం చాలా అవసరం.
8. పశువులను మేపడం, చట్ట విరుద్ధంగా చెట్లను నరికివేయడం మొదలయినవి అనుమతించకూడదు.
9. పరిశ్రమలను స్థాపించడానికి అటవీ భూములను కేటాయించడం మానుకోవాలి.
10. అటవీ సంరక్షణా చర్యల్లో స్థానిక ప్రజలను కలుపుకొని, వారిని భాగస్వాములను చేయాలి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. కొనసాగించగలిగే అభివృద్ధిని వివరించండి.***

జ: వనరులను వాడుకుంటూ ఉంటే వచ్చే ప్రయోజనాలు తగ్గకుండా ఉండే పరిస్థితినే 'సుస్థిరత్వం' లేదా కొనసాగించగల అభివృద్ధి అని నిర్వహించవచ్చు. కాల ప్రవాహంలో తలసరి మానవాళి సంక్షేమం తగ్గకుండా ఉండే పరిస్థితిని కూడా 'సుస్థిరత్వం' అని మరో అర్థంకూడా చెప్పుకోవచ్చు. అలాగే 'మూలధనాన్ని యధావిధిగా కొనసాగిస్తూ స్థిరమైన వాస్తవ వినియోగాన్ని సాధించడాన్నే 'సుస్థిరత్వం' గా అభివర్ణించవచ్చు. మూలధన స్థాయి ఏమాత్రం తగ్గకుండా వినియోగం ప్రవాహంలా కొనసాగుతూ ఉండే పరిస్థితిని కూడా 'సుస్థిరత్వం' అనే చెప్పవచ్చు.

బ్రాంట్ ల్యాండ్ సంఘం నివేదిక ప్రకారం 'అందరి మౌలిక అవసరాలను తీర్చుతూ, నాణ్యవంతమైన, మెరుగైన జీవితం కావాలనే వారి ఆపేక్షలన్నింటినీ సంతృప్తి కలిగించుకొనేందుకు అవసరమైన అవకాశాలను కల్పించడాన్నే 'సుస్థిరత్వం' కొనసాగించగల అభివృద్ధిగా నిర్వచించవచ్చు. 1992 లో నిర్వహించబడిన 'ధరిత్రీ సదస్సు' ననుసరించి భావితరాల వారి అవసరాలను తీర్చుకొనగలిగే శక్తితో ఏ మాత్రం రాజీపడకుండా, ప్రస్తుతమున్న తరంవారి అవసరాలను తీర్చుకోవడమే 'సుస్థిరత్వమైన అభివృద్ధి గా చెప్పవచ్చు.

ఈ నిర్వచనాలన్నింటినీ పరిశీలిస్తే మూలాధారమైన వనరులతోపాటు సమాజం, ఆవరణ వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థలను సంక్రమంగా తమ విధులను నిర్వహించే విధంగా అభివృద్ధి చెందాలనే విషయం బాగా అర్థమవుతుంది.

కొనసాగించల అభివృద్ధి' మనకు కింది విషయాలను గుర్తుచేస్తుంది.

1. మనం భూమికి సంబంధించిన భౌతిక, రసాయనిక, జీవపరమైన మూలధనాలను తరిగిపోయేటట్లు. విచ్ఛేదనమయ్యేటట్లు చేయకూడదు. అలాచేస్తే, మనం మన ప్రాణాధారాలైన మూలధనాలను కోల్పోతాం.

2. మనం పర్యావరణాన్ని బాగా అర్థం చేసుకోవాలి. మనం ఈ భూమికి సంబంధించిన వాళ్ళమని భావించాలి. అంతేగాని, భూమి మనకు మాత్రమే సంబంధించినది' అని మాత్రం భావించకూడదు.

3. మనం భూమిని గౌరవించాలి. అన్ని రకాల జీవ రూపాలను, నిర్జీవ పదార్థాలను గౌరవిస్తూ భూమితో సహకరించాలి. సహజీవనం చేయాలి.

4. భూమి మీదున్నటువంటి ఇతర జాతుల మీద, పదార్థాల మీద ఏలాంటి రుణాత్మక ప్రభావాలు పడని విధంగా మనం పర్యావరణాన్ని ఉపయోగించుకోవాలి.

5. మనకు జీవించే హక్కు ఎలా ఉందో అలాగే ప్రతి ఒక జీవ, నిర్జీవ జాతులకు కూడా అలాంటి హక్కు ఉంటుందని గుర్తించాలి.

6. మనం చేస్తున్న పనులవల్ల ఏ ఒక్క జాతి నశించిపోకూడదు.

7. విశ్వ స్థాయిలో ఆలోచించండి, స్థానికంగా పని చేయండి. (Think globally and act locally) నానుడిని మనసులో ఉంచుకొని చిన్న, చిన్న పనులు చేసినా చాలు.

8. సహాయం చేయడానికి, స్వాంతననివ్వడానికి, సుస్థిరంగా భూమి మనగలగడానికి ఇతరులతో కలిసి పని చేయాలి.

9. ప్రకృతిని ఆనందంగా ఆస్వాదించాలి. స్నేహం చేయాలి, ప్రేమించాలి, సంరక్షించాలి.

# 36

# వ్యవసాయం

# (Agriculture)

## 36.1 పరిచయం

'భూమి' ఒక కీలకమైన ఉత్పత్తి కారకం. పంటలను పండించడానికి అడవులను పెంచడానికి రహదార్ల నిర్మాణం కొరకు, కర్మాగారాలను నెలకొల్పటానికి గృహాలను నిర్మించడానికి మరియు వివిధ కార్యక్రమాల కొరకు 'భూమి' ని వినియోగిస్తున్నాం. సేద్యానికి అనుకూలమైన భూమి వల్లనే ప్రజలకు కావలసిన ఆహారం, పశువులకు దాణా లభ్యం అవుతున్నాయి. పరిశ్రమలకు కావలసిన ముడి పదార్థాలు వ్యవసాయం ద్వారా లభిస్తున్నాయి.

మనకు కావలసినంత భూమి లేకపోయినా లేదా వ్యవసాయం చేయడానికిఅనువైన భూమి లభ్యం కాకపోయినట్లయితే ఏమి జరుగుతుందో ఒకసారి ఊహించండి. మనం ఆహార అవసరాలు తీర్చుకోలేం. పశువులకు పశుగ్రాసం లభ్యం కాదు, పరిశ్రమలకు ముడిపదార్థాల కొరత ఏర్పడుతుంది. ఈ పాఠంలో వ్యవసాయ రంగం భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ఎంతటి ప్రాముఖ్యతను కల్గి ఉందో తెలుసుకొంటాం. అంతే కాకుండ, వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న అనేక సమస్యలు, వాటి పరిష్కార మార్గాలు మొదలగు పలు అంశాలను నేర్చుకొందాం.

## 36.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశంలో ప్రశ్నలు, సమాధానాలు అధ్యయనం చేసిన తర్వాత మీరు తెలుసుకునేవి.

- భారతదేశ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయ రంగ ప్రాముఖ్యత
- వ్యవసాయోత్పత్తులను పెంపొందించవలసిన ఆవశ్యకత
- భూ ఉత్పాదతను నిర్వచించటం
- భారతదేశం లోని భూమి ఉత్పదకత సామర్థ్యాన్ని ఇతర దేశాలలోని భూ ఉత్పాదకతలతో సరిపోల్చుట.
- మనదేశ వ్యవసాయ ఉత్పాదకత తక్కువగా ఉండటానికి గల అంశాలను పేర్కొనుట.
- మనదేశ వ్యవసాయ ఉత్పాదకత తక్కువ స్థాయిలో ఉండుటకు గల కారకాలను గుర్తించటం.
- వ్యవసాయ ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంపొందించుటకు తగిన కార్యాచరణ పథకాలను రూపొందించటం.

## 36.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. జాతీయాదాయంలో వ్యవసాయరంగం వాటా?***

**జ:** దేశ స్థూల జాతీయాదాయంలో వ్యవసాయ రంగం సుమారు మూడో వంతు ఆదాయాన్ని సమకూరుస్తుంది. 30 శాతం దాకా జాతీయాదాయం వ్యవసాయం, దాని సంబంధిత ఆర్థిక కార్యక్రమాల నుండి సమకూరుతుంది.

*2. విస్తృత సేద్యం?*

జ: ఈ విస్తృత సేద్యంలో నిరుపయోగంగా ఉన్న బంజరు భూములను సేద్యం క్రిందకు తీసుకువస్తారు. లేదా సేద్యం చేయకుండా ఉన్న భూములలో నూతనంగా పంటలు పండించటం జరుగుతుంది.

*3. సాంద్ర వ్యవసాయం అనగానేమి?*

జ: సాంద్ర వ్యవసాయం అనగా ఒక భూకమతంలో అనేక పంటలను పండించగలగటం.

*4. వ్యవసాయ ఉత్పాదకత అనగానేమి?*

జ: వ్యవసాయ ఉత్పాదకత అంటే, ఒక హెక్టారు భూమిలో మనం పండించగలిగిన ఉత్పత్తి సామర్థ్యం అని అర్థం.

*5. కమతాల విభజన ?*

జ: నిరంతరంగా పెరుగుతున్న జనాభా వల్ల, వారసత్వ చట్టాల వల్ల భూమి విభజనకు గురౌతుంది.

*6. కమతాల విఘటన అనగానేమి?*

జ: ఒక రైతుకు ఒకే ఊరిలో వేర్వేరు ప్రదేశాలలో భూములు ఉండడాన్ని కమతాల విఘటన అంటారు.

*7. మధ్యవర్తుల తొలగింపు అనగానేమి?*

జ: రైతుకు, ప్రభుత్వంకు మధ్య ఉన్న వ్యక్తులను మధ్యవర్తులంటారు. భూసంస్కరణలో భాగంగా ప్రభుత్వం వీరిని తొలగించింది.

*8. కౌలుదారులు అనగానేమి?*

జ: భూమి యజమానుల వద్ద నున్న భూమిని అద్దెకు తీసుకొని ప్రత్యక్షంగా వ్యవసాయ కార్యక్రమాలను నిర్వర్తించే వ్యక్తులను కౌలుదారులు అంటారు.

*9. గరిష్ట భూ పరిమితి అనగానేమి?*

జ: భూపరిమితి అనగా ఒక వ్యక్తి ఆధీనంలో ఉండదగిన భూకమతం పరిమితిని నిర్ణయించుట. పరిమితికి మించి ఎక్కువగా ఉన్న భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని భూమిలేని చిన్న రైతులకు పంపిణీ చేస్తుంది.

*10. కమతాల సమీకరణ అనగానేమి?*

జ: చిన్నచిన్న ముక్కలుగా ఉన్న చిన్న కమతాలను పరస్పర అంగీకారంతో పెద్ద క్షేత్రాలుగా ఏకం చేయడం.

*11. నాబార్డును వివరింపుము.*

జ: జాతీయ వ్యవసాయ గ్రామీణ అభివృద్ధి బ్యాంకు (నాబార్డు)ను 1982 జులైలో ఏర్పాటు చేశారు. గ్రామీణ పరపతిలో ఇది శిఖరాగ్ర సంస్థ. ఇది నేరుగా పరపతిని అందించదు. వివిధ పరపతి సంస్థలకు పునర్విత్తాన్ని (రీఫైనాన్స్) చేస్తుంది.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

*1. భారతదేశ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయరంగం ప్రాధాన్యతను వివరించండి?*

జ: వ్యవసాయం భారత ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నది. వ్యవసాయ ప్రాముఖ్యతను తెలియజేయు అంశాలు.

1. **ఆహారం, పశుగ్రాసం :** మానవుల కనీస జీవన అవసరాలు తిండి, బట్ట, నివాసం మొదలగునవి. వీటిలో ఆహారం అతి ముఖ్యమైంది. మనం ఆహారం తీసుకొనక పోయినట్లయితే, మనం జీవించటం అసాధ్యమౌతుంది. వ్యవసాయ రంగం మనకు కావలసిన ఆహారంను అందిస్తుంది. జంతువులకు కావలసిన పశుగ్రాసంను వ్యవసాయరంగం సమకూర్చుతుంది. అందువల్లనే వ్యవసాయరంగం జీవనాధార రంగం. ఇది మన ఆర్థికవ్యవస్థలో ఒక కీలకమైన పాత్రను నిర్వహిస్తుంది.

2. **పారిశ్రామిక ముడి పదార్థాలు :** వ్యవసాయం ద్వారా ఆహారం మాత్రమే కాక పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలు కూడా లభ్యమౌతున్నాయి. వస్త్రపరిశ్రమకు కావలసిన ముడి ప్రత్తి; జౌళి పరిశ్రమకు కావలసిన 'జౌళి'; పంచదార పరిశ్రమకు చెఱకు; నూనె పరిశ్రమకు కావలసిన నూనెగింజలు; టైర్లు, ట్యూబుల తయారీకి రబ్బరును రబ్బరు పరిశ్రమకు వ్యవసాయరంగం అందిస్తుంది.

3. **జీవనోపాధి కల్పన :** శ్రామిక శక్తిలో మూడింట రెండు వంతుల మందికి వ్యవసాయరంగం జీవనోపాధి కల్గిస్తుంది. భారత దేశంలో వ్యవసాయరంగం జీవనోపాధి కల్పనలో ప్రముఖ స్థానం కల్గివుంది. ప్రజలకు వ్యవసాయం ప్రధాన వృత్తి. భారతదేశంలో ఉపాధి కల్పనలో వ్యవసాయరంగం ఇప్పటికి తన ఆధిపత్యాన్ని కొనసాగిస్తూనే ఉంది.

4. **విదేశీ మారక ద్రవ్య ఆర్జన :** భారతదేశ విదేశీ వ్యాపారంలో వ్యవసాయం ఒక ప్రముఖ పాత్రను కల్గివుంది. అతి ప్రాచీనకాలం నుండి భారతదేశ వ్యవసాయ ఉత్పత్తులు ఎగుమతి చేయబడుతున్నాయి. తేయాకు, కాఫీ, పంచదార, కోక్, పొగాకు, ప్రత్తి వస్త్రాలు, జౌళి, ముడి ఉన్ని, ఖనిజ తైలాలు మొదలగునవి భారతదేశ వ్యవసాయ ఎగుమతులు. వ్యవసాయ ఎగుమతుల ద్వారా భారతదేశం అధిక మొత్తంలో విదేశీ మారకద్రవ్యాన్ని ఆర్జిస్తున్నది.

5. **పారిశ్రామిక వస్తువులకు మార్కెట్లు విస్తరణ :** ప్రజలు తమ ఆదాయంలో ఆహారం కొరకు వినియోగించగా మిగులుగా ఉన్న ఆదాయాన్ని వివిధ పారిశ్రామిక ఉత్పత్తులయిన దుస్తులు, ఫర్నిచర్, కుట్టుమిషన్లు, గ్యాస్ స్టవ్‌లు, రేడియోలు, టి.వీలు, ఫ్రిజ్‌లపై వినియోగిస్తూ వారి కోరికలను తీర్చుకుంటున్నారు. పై వస్తువులన్నీ పారిశ్రామిక ఉత్పత్తులే.

6. **జాతీయాదాయంలో వ్యవసాయరంగం వాటా :** దేశ స్థూల జాతీయాదాయంలో వ్యవసాయ రంగం సుమారు మూడవ వంతు ఆదాయాన్ని సమకూరుస్తుంది. 30% పైగా జాతీయాదాయం వ్యవసాయం, దాని సంబంధిత ఆర్థిక కార్యక్రమాల నుండి సమకూరుతుంది.

### *2. వ్యవసాయ ఉత్పాదకత*

**జ:** సాధారణ పరిభాషలో 'ఉత్పాదకత' అంటే ప్రతి యూనిట్ ఉత్పత్తి కారకానికి మనం పొందే మొత్తం ఉత్పత్తి. ఉదా॥ వ్యవసాయ ఉత్పాదకత అంటే ఒక హెక్టారు భూమిలో మనం పండించగల్గినంత ఉత్పత్తి సామర్థ్యం అని అర్థం. ఉత్పాదకతను తెలుసుకొనుటకు ఈ క్రింది సూత్రం ఉపయోగిస్తారు.

$$\text{భూమి ఉత్పాదకత} = \frac{\text{మొత్తం పంట ఉత్పత్తి}}{\text{మొత్తం పంట పండించిన భూ కమత విస్తీర్ణం}}$$

భూ ఉత్పాదకతను లెక్కించడానికి మొత్తం పంట ఉత్పత్తిని, ఆ పంట పండించడానికి వినియోగించిన మొత్తం భూ విస్తీర్ణం చే భాగించాలి.

మనం 2 హెక్టార్ల భూ కమతాన్ని కల్గి దానిలో మనం 50 క్వింటాళ్లు గోధుమ పండించినట్లయితే అప్పుడు ఆ భూమి ఉత్పాదకత హెక్టారుకు 25 క్వింటాల్లుగా పేర్కొనవచ్చు.

***3. భారతదేశంలో వ్యవసాయ ఉత్పాదకత తక్కువగా వుండటానికి గల కారణాలు ఏవి?***

జ: **1. భూసారమును మెరుగు పర్చుటకు తగిన ప్రోత్సాహం లేకపోవుట :** అనేక మంది వ్యవసాయ దారులకు / రైతులకు సొంత భూమి లేదు. వారు కౌలుదారులైతే (ఇతరుల భూమిని కౌలుకు తీసుకొని సేద్యం చేయువారు) కౌలుదారులు భూసారంను పెంచుటకు శాశ్వత ప్రాతిపదికన ఎలాంటి చర్యలు తీసుకొనరు. ప్రతి సంవత్సరం తమకే కౌలుకు ఆ భూములు ఇవ్వబడుతాయి అనే నమ్మకం లేకపోవుటం వల్ల వారు భూసారాభివృద్ధికి ఎలాంటి ఆసక్తి కనబర్చుటం లేదు. మరొక ప్రక్క, కౌలుదారులకు పండిన పంటలో కౌలు మొత్తం చెల్లింపగ లభించు ఆదాయం స్వల్పంగా వుండుట చేత వారు తాము సాగుచేస్తున్న భూమిని మెరుగు పర్చుటకు ఎలాంటి వనరులు కేటాయించుట సాధ్యం కాదు.

కౌలుకు ఇవ్వబడిన భూములను అభివృద్ధి పరచుటకు భూ యజమానులు ఎలాంటి శ్రద్ధ కనబర్చుట లేదు. ఫలితంగా, భూ ఉత్పాదకత చాలా తక్కువ స్థాయిలో వుంటుంది.

**2. కమతాల విభజన, విఘటన :** నిరంతరంగా జనాభా పెరుగుట వల్ల, వారసత్వ చట్టాల వలన భూమి విభజనకు మరియు విఘటనకు కారణమౌతుంది. ఈ ప్రక్రియ వలన భూ కమత పరిమాణ క్రమక్రమంగా తగ్గిపోవుటం జరుగును. ఆధునిక వ్యవసాయ పద్ధతులను పాటించి వ్యవసాయం చేయుట చిన్న చిన్న కమతాలతో సాధ్యం కాదు. అందువలన, భూమి ఉత్పాదకత తక్కువ స్థాయిలో వుండును.

**3. తగిన నీటిపారుదల సౌకర్యాలు లేకపోవుట:** నీరు వ్యవసాయంకు కావలసిన ముఖ్యమైన వనరు. ఇప్పటికి మనదేశంలో సరియైన నీటి పారుదల సౌకర్యాలు లేవు. 70% పైగా సాగుభూమి అనిశ్చియమైన ఋతుపవనాలపై ఆధారపడి వ్యవసాయ కార్యకలాపాలు కొనసాగుతున్నాయి. అందువల్లనే ఋతుపవనాల పై ఆధారపడి వ్యవసాయ ఉత్పత్తి నిర్ణయించబడుతుంది. సకాలంలో తగినంతగా వర్షం కురిసిన సంవత్సరంలో వ్యవసాయ ఉత్పత్తి గణనీయంగా వుంటుంది. నీటి పారుదలకు ఆధారమైన వర్షం అనిశ్చితంగా వుంటుంది.

**4. సాంప్రదాయక వ్యవసాయ పద్ధతులు :** అనేక మంది వ్యవసాయదారులు ఎక్కువగా సాంప్రదాయక వ్యవసాయ పద్ధతులపై ఆధారపడుట వల్ల వ్యవసాయ ఉత్పాదకత తక్కువ స్థాయిలోనే వుంటుంది. నిరక్ష్యరాస్యత, నమ్మకాలు, సనాతన వైఖరులు నూతన వ్యవసాయ ప్రక్రియలు చేపట్టుటకు అవరోధంగా నిలుస్తున్నాయి. నేటికి అనేకమంది వ్యవసాయదారులు భూమిని దున్నుటకు కొయ్య నాగళ్ళను ఉపయోగిస్తున్నారు. ఎద్దుల బండ్లు నేటికి వ్యవసాయ రవాణాకు ఉపకరిస్తూనే వున్నాయి. ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఉపయోగించి సేద్యం చేయుటలో అత్యధిక రైతులు సరియైన అవగాహన లేకుండా వున్నారు వారికి బహుళ పంటల విధానం ఇప్పటికి తెలియుట

లేదు. భూసారంను పెంపొందించి నాణ్యమైన ఎరువులను తగిన మోతాదులలో వాడకుండా సేద్యపు భూములను వదలివేయుటం వల్ల నేలలు నిస్సారంగా తయారు అవుతున్నాయి.

పై అంశాలన్ని సమిష్టిగా అల్ప వ్యవసాయ ఉత్పాదకతకు కారణమౌతున్నాయి.

**5. ఇతర వ్యవసాయ ఉత్పాదకాలు వాడ లేకపోవుట**

**ఎ. విత్తనాలు**

నాణ్యమైన మంచి విత్తనాలు వ్యవసాయంలో వినియోగించుట వ్యవసాయ ఉత్పాదకతను నిర్ణయించు అంశాలలో ప్రముఖమైనది. నాణ్యమైన అధిక దిగుబడి నిచ్చు విత్తనాలు వాడటం ద్వారా అధిక భూ ఉత్పాదకతను పొందగల్గుతాము. అయితే, వివిధ కారణాల వల్ల రైతులు సరియైన విత్తనాలు వినియోగించకపోవుట జరుగుతుంది.

i) రైతులకు తగిన ఆర్ధిక పరపతి లేకపోవుట

ii) రైతులు అధిక దిగుబడి విత్తనాలను వాడుటకు అంతగా ఆసక్తి చూపుట లేదు.

**6. గ్రామీణ పరపతి తగినంతగా లేకపోవడం :**

రైతులకు కావలసిన పరపతి సదుపాయాలు తగిన స్థాయిలో లేకపోవుట వల్ల కూడా అల్ప వ్యవసాయ ఉత్పాదకతకు కారణమవుతుంది. కౌలుదారులు ఋణం పొందుటకు వారి వద్ద తనఖా పెట్టుటకు ఎలాంటి భూములు వుండవు. కనుక కౌలుదారు పరపతిని పొందలేరు.

**7. గిడ్డంగి మరియు మార్కెటింగ్ సదుపాయాలు లేకపోవుట :**

రైతులకు గిట్టుబాటు ధరలు లభించినట్లయితే వారికి ఎక్కువ వ్యవసాయ ఉత్పత్తులు సాధించుటకు ప్రోత్సాహం కల్గును. దీనికి గిడ్డంగులు మరియు మార్కెటింగ్ సదుపాయాలు చాలా అవసరమవుతాయి.

***4. వ్యవసాయ ఉత్పాదకతను పెంపొందించుటకు ఎలాంటి చర్యలు తీసుకోవాలో తెల్పండి?***

**జ:** వ్యవసాయ ఉత్పాదకతను పెంపొందించుటకు అనేక మార్గాలు కలవు. అవి వ్యవస్థాగతమైన చర్యలు. మరియు సాంకేతిక పరమైనవిగా వర్గీకరించ వచ్చును. సేద్యపు భూములను ప్రత్యక్షంగా వ్యవసాయ పనులతో నేరుగా పాల్గొను రైతులకు పంపిణీ చేయుట, భూ కమతాల పరిమాణాన్ని పెంచుట, కౌలుదారులకు తగిన సంరక్షణ కల్పించుట మొదలగునవి వ్యవస్థాగతమైన చర్యలుగా పేర్కొనవచ్చు. సంస్థాగత మార్గాలనే 'భూసంస్కరణలు' గా వ్యవహరిస్తారు. సాంకేతిక పరమైన మార్గాలలో సేద్యపు పద్ధతులను మెరుగు పర్చుట, వ్యవసాయంకు ఉపకరించు వనరుల నాణ్యతను పెంచుట ముఖ్యమైనవి. వాటి గురించి విశ్లేషించుదాము.

**ఎ. వ్యవస్థాగతమైన మార్గాలు / భూ సంస్కరణలు**

1. **మధ్యవర్తుల తొలగింపు :** రైతులకు ప్రభుత్వంనకు మధ్య వున్న వ్యక్తులు మధ్యవర్తులుగా పేర్కొనబడుదురు. వారు ప్రభుత్వంనకు రైతుల నుండి పన్నులను వసూలు చేసి జమ చేయుటకు నియమితులైనవారు. ఈ పద్ధతిలో మధ్యవర్తులు రైతులను దోచుకోవటం జరుగుతుంది. భూ అభివృద్ధికి మధ్యవర్తులు ఎలాంటి చర్యలు తీసుకోరు లేదా రైతులకు ఎలాంటి ప్రోత్సాహం వుండదు. అందువలన, ప్రభుత్వం ప్రత్యేక చట్టం ద్వారా అన్ని రాష్ట్రాలలో వున్న మధ్యవర్తులను తొలగించినది.

**2. కౌలుదారులకు భద్రత కల్పించుట**

భూమి యజమానుల దగ్గర వున్న భూమిని కౌలుకు తీసుకొని ప్రత్యక్షంగా వ్యవసాయ కార్యక్రమాలను నిర్వర్తించు వ్యక్తులను కౌలుదారులు అంటారు. అధిక కౌలురేట్లు, భూ యజమాని తరచుగా కౌలు దారులను మార్చుట మొదలగునవి కౌలుదార్లు సాధారణంగా ఎదుర్కొను సమస్యలు. వీటిని పరిష్కరించుటకు ప్రభుత్వం కౌలురేట్లు నిర్ణయిస్తూ, కౌలు భద్రత కల్పించు చట్టాలను జారీ చేసింది. కౌలుదారులకు భూమి పై యజమాన్యపు హక్కుల కల్పనకు కావలసిన మార్గదర్శక సూత్రాలను ప్రభుత్వం జారీచేసింది.

**3. భూ పరిమితి చట్టాలు**

భూ పరిమితి అనగా ఒక వ్యక్తి అధీనంలో వుండదగిన భూ కమతం పరిమితిని నిర్ణయించుట. పరిమితికి మించి ఎక్కువగా వున్న భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని భూమిలేని చిన్న రైతులకు పంపిణీ జేస్తుంది. భూ పరిమితి నిర్ణయించుటకై ప్రభుత్వం వివిధ రాష్ట్రాలలో భూమికి గరిష్ఠ పరిమితులను నిర్దేశించుట జరిగింది.

**4. భూకమతాల సమీకరణ చేయుట**

వ్యవసాయ అల్ప ఉత్పాదకతకు భూకమతాల విభజన, విఘటన కారణం అగుటవల్ల దీనిని ఎదుర్కొనుటకు, ఒక వ్యక్తి అధీనంలో వున్న భూమిని సమీకరణ చేయుట ఒక చక్కని పరిష్కారం. చిన్నచిన్న ముక్కలుగా వున్న చిన్న కమతాలను పరస్పర అంగీకారంతో పెద్ద క్షేత్రాలుగా ఏకం చేయుటం. వివిధ ప్రాంతాలల్లో వున్న ఒక వ్యక్తి భూ కమతాలకు బదులుగా ఒకే ప్రాంతంలో ఆ వ్యక్తికి సరియైన ఏక కమతంగా భూములను కేటాయించుట వల్ల విఘటన వల్ల కలుగు నష్టాలను తగ్గించవచ్చును.

భూ కమతాల సమీకరణ ప్రక్రియ మనదేశంలో రైతుల మధ్య స్వచ్ఛంద అంగీకారంతో సహకార ప్రాతిపదికగా చేపట్టడం జరిగింది. పంజాబు, హర్యానా మరియు పశ్చిమ ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో సంతృప్తికరంగా భూ సమీకరణ జరిగింది. ఫలితంగా ఆయా రాష్ట్రాలలో వ్యవసాయ ఉత్పత్తులు గణనీయంగా పెరిగాయి. అయితే, దేశం మొత్తంగా పరిగణలోనికి తీసుకొంటే భూకమతాలు సమీకరణ చేసే కార్యక్రమం మందకొడిగానే సాగుతుంది.

**5. సాంకేతిక పరమైన మార్గాలు**

1. నీటిపారుదల సదుపాయాలు
2. నాణ్యమైన వ్యవసాయ ఉత్పత్తిని పెంపొందించు మూలకాలను అందించుట
3. గ్రామీణ పరపతి నందించుట

**6. ఇతర వసతుల కల్పన**

వ్యవసాయ ఉత్పత్తులను మార్కెటు చేసుకొనుటకు ప్రభుత్వం రెగ్యులేటెడ్ మార్కెట్లను నెలకొల్పింది. వీటిలో రైతులు పోటీ ధర వద్ద తమ సరుకులను అమ్ముకోగల్గుతారు. ఈ మార్కెట్లు రైతులు, వ్యాపారులు, స్థానిక సంస్థలు మరియు రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా నిర్వహిస్తాయి. ఈ మార్కెట్ల వల్ల రైతులకు అనేక ప్రయోజనాలు చేకూరుతాయి. మార్కెటుకు సంబంధించిన పూర్తి సహేతుబద్ధమైన సమాచారాన్ని పొందుట, తూనికలు కొలతలలో తగిన ప్రమాణీకరణ, హేతుబద్ధమైన గిట్టుబాటు ధరలు మొదలగు ప్రయోజనాలు నేరుగా రైతులకు కల్గుతాయి.

# 37

# పరిశ్రమలు (Industry)

## 37.1 పరిచయం

ఏ ఆర్థిక వ్యవస్థలోనైనా మూడు ప్రధాన రంగాలు వుంటాయి. అవి : ప్రాథమిక రంగం, ద్వితీయ రంగం, మరియు తృతీయ రంగం. మనం ప్రాథమిక రంగమైన వ్యవసాయ రంగంను గురించి నేర్చుకున్నాం. ప్రస్తుత పాఠంలో ద్వితీయ రంగమైన పరిశ్రమలను గురించి తెలుసుకుందాము. ఆహారం మన ప్రధాన జీవితావసరం. ఆహారంతో పాటు మనకు అనేక వస్తువులు అవసరముంటాయి. అవి దుస్తులు, చెప్పులు, సబ్బులు, రవాణా సాధనాలు అయిన సైకిలు, కార్లు, బస్సులు, ట్రక్కులు విమానాలు, విద్యుచ్ఛక్తి, పేపరు, స్టవ్‌లు, కుట్టుమిషన్లు, రేడియో, టి.వి.లు ఫ్రిజ్‌లు మొదలగునవి. పరిశ్రమలలో గుండుసూది మొదలు విమానం వరకు అన్నిరకాల వస్తు సముదాయాలు ఉత్పత్తి అవుతున్నాయి. ఈ పాఠంలో మనం భారతదేశ ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామిక రంగం యొక్క పాత్రను అధ్యయనం చేస్తాము. పరిశ్రమల వర్గీకరణ, పారిశ్రామిక పురోగతి, పారిశ్రామిక వృద్ధికి దోహదంచేయు కీలక పరిశ్రమలు మరియు ప్రభుత్వ పారిశ్రామిక విధానం మొ॥ అంశాల గురించి తెలుసుకుందాము.

## 37.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తర్వాత మీరు తెలుసుకొనేవి.

- భారతదేశ ఆర్థిక వ్యవస్థలో పరిశ్రమల పాత్రను వివరించుట.
- పరిశ్రమల వర్గీకరణ
- పారిశ్రామిక ప్రగతిని ప్రభావితం చేయు కారణాలను విశ్లేషించుట
- స్వాతంత్ర్యం సాధించిన కాలంనుండి నేటి వరకు ప్రభుత్వ పారిశ్రామిక విధానాలను తెల్పుట.

## 37.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. వినియోగ వస్తు పరిశ్రమలు?***

**జ:** వినియోగానికి నేరుగా ఉపయోగపడు వస్తువులను తయారుచేయు పరిశ్రమలు. ఉదా: దుస్తులు, చెప్పులు, సబ్బులు, టి.వి. మొ॥నవి.

***2. ఉత్పాదక వస్తు పరిశ్రమలు?***

**జ:** వస్తూత్పత్తి ప్రక్రియకు ఉపకరించు వస్తువులను తయారుచేయు పరిశ్రమలను ఉత్పాదక వస్తు పరిశ్రమలు అంటారు.

ఉదా: ఎరువులు, సిమెంటు, ఇనుము మరియు ఉక్కు, యంత్రాలు, పరికరాలు మొ॥నవి.

*3. పారిశ్రామిక విధానం?*

జ: పారిశ్రామిక విధానంలో ప్రభుత్వం కాలానుగుణంగా రూపొందించు అన్ని నిబంధనలు మరియు చట్టాలు కలసి ఉంటాయి. మన ప్రభుత్వం స్వాతంత్ర్యానంతరం మొదటి విధానాన్ని 1948లో ప్రకటించింది.

*4. చిన్నతరహా పరిశ్రమలు అనగానేమి?*

జ: మన దేశంలో యంత్ర పరికరాలపై పెట్టుబడి రూ.3 కోట్ల కన్నా తక్కువ ఉన్న పరిశ్రమలను చిన్నతరహా పరిశ్రమలంటారు.

*5. కుటీర పరిశ్రమలు అనగానేమి?*

జ: నామమాత్రపు పెట్టుబడితో కుటుంబసభ్యులు కలిసి శ్రమసాంద్రత పద్ధతుల ద్వారా వస్తు సేవలను తయారుచేసే పరిశ్రమలను కుటీర పరిశ్రమలంటారు.

*6. ప్రభుత్వరంగ సంస్థలు అనగానేమి?*

జ: ఆర్థికశక్తి కొద్దిమంది బడా పారిశ్రామికవేత్తల చేతులలో కేంద్రీకృతం కాకుండా ఉండుటకు, ప్రైవేటు వ్యక్తులు ఏర్పాటు చేయలేని పరిశ్రమను స్థాపించుటకు, సంతులిత ప్రాంతీయాభివృద్ధికి ఇవి ఎంతో అవసరం.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. పారిశ్రామిక వృద్ధిని ప్రభావితం చేయు వివిధ కారణాలను విపులీకరించుము.***

జ: పారిశ్రామిక వృద్ధి అనేక అంశాలపై ఆధారపడి నిర్ణయించబడును.

1. **ముడిపదార్థాల లభ్యత** : ఉత్పత్తి ప్రక్రియలో ముడిపదార్థాలు అత్యంత కీలకమైన కారకాలు. అవస్థాపనా సౌకర్యాలు, పరపతి సదుపాయం, యంత్రాలు మరియు కార్మికులు మొదలగునవి సంవృద్ధిగా లభ్యమైతేనే ఉత్పత్తి జరుగుతుంది. పరిశ్రమల సంఖ్య పెరిగే కొద్ది ఎక్కువ మొత్తంలో ముడిపదార్థాలు అవసరమౌతాయి. ఒకవేళ ముడిపదార్థాలు తగినంతగా లభ్యంకాకపోతే, పరిశ్రమల అభివృద్ధి లేదా విస్తరణ కుంటు పడుతుంది.
2. **సాంకేతిక పరిజ్ఞానం** : పరిశ్రమల వృద్ధిని నిర్ణయించు అంశాలలో ప్రముఖమైనది. సాంకేతిక పరిజ్ఞానం. అత్యున్నతమైన సాంకేతిక పరిజ్ఞానం అధిక స్థాయిలో లభ్యం అయితే అధికమొత్తంలో ఉత్పత్తి జరుగుతుంది. మానవశక్తి వనరులపై ఆధారపడు పరిశ్రమలలో ఉత్పత్తి కన్న యంత్రాల సహాయంతో నడుపబడుతున్నది పరిశ్రమలలో ఉత్పత్తి ఎక్కువగా జరుగుతుంది.
3. **అవస్థాపనా సౌకర్యాల లభ్యత** : రోడ్లు, రైల్వేలు, విమానాశ్రయాలు, వంతెనలు, డ్యామ్‌లు, టెలిఫోన్లు, నీటివసతి, విద్యుత్ మొ॥ అవస్థాపనా సౌకర్యాలు పరిశ్రమల నిర్వహణకు, అభివృద్ధికి చాలా అవసరం.
4. **మానవ వనరుల లభ్యత / కార్మికులు** : పారిశ్రామిక వృద్ధిని ప్రభావితం చేయు అంశాలలో కార్మికుల లభ్యత ముఖ్యమైనది. కార్మికులు రెండు రకాలు ఒకటి నైపుణ్యం గల వారు, రెండు నైపుణ్యం లేని కార్మికులు. సంస్థ నిర్వహణ జేయు యజమాన్య యంత్రాంగం మొదలుకొని, సంస్థను నడిపించు వ్యవస్థాపకుల వరకు మానవ

వనరులలో భాగంగానే పరిగణింపబడతాయి.

5. **ఉద్యోగి మరియు యజమాని సంబంధాలు** : పరిశ్రమల సక్రమ నిర్వహణకు ఉద్యోగులు యజమాన్యం మధ్య సంబంధాలు ధనాత్మకంగా ఉండాలి. మంచి కార్మిక సంబంధాలు వున్న పరిశ్రమలలో ఉత్పత్తి ప్రక్రియ ఎలాంటి ఇబ్బందులు లేకుండా కొనసాగుతుంది. ఒకవేళ కార్మిక సంబంధాలు సక్రమంగా లేకపోతే అది స్ట్రైక్స్ మరియు లాక్ అవుట్‌లకు దారితీసి అంతిమంగా ఉత్పత్తి దెబ్బతింటుంది. అందువల్ల శాంతియుతంగా మరియు హృదయ పూర్వకంగా / మర్యాద పూర్వకంగా ఉద్యోగి మరియు యాజమాన్య సంబంధాలు కొనసాగింపు అవసరం.

6. **వస్తువులకు తగిన 'గిరాకి' వుండాలి** : డిమాండ్ వున్న వస్తువులను ఉత్పత్తి చేయాలి. అప్పుడు మాత్రమే వస్తువులకు తగిన మార్కెట్ లభ్యమవుతుంది. పరిశ్రమ స్థాపనకు పూర్వపు పెట్టుబడులు పెట్టుటకు మార్కెట్‌లోకి రాబోవు ఉత్పత్తులకు / తయారు చేయబోవు వస్తువులను మార్కెట్ ఎలా ఉండాలనే అంశాన్ని సర్వేజరిపి డిమాండ్ తగినంతగా వున్న వస్తువుల ఉత్పత్తినే ప్రారంభించాలి.

***2. భారతదేశంలో చిన్నతరహా పరిశ్రమల పాత్రను వివరింపుము.***

**జ:** భారతదేశంలో చిన్నతరహా పరిశ్రమలు అంటే ఈ పరిశ్రమలలో యంత్ర పరికరాలపై పెట్టుబడి రూ. 3 కోట్లు కన్నా తక్కువ. చిన్నతరహా పరిశ్రమలను చిన్న తరహా కుటీర పరిశ్రమలుగా విభజించారు. నామమాత్రపు పెట్టుబడితో కుటుంబ సభ్యులు కలసి శ్రమ సాంద్రత పద్ధతుల ద్వారా, వస్తుసేవలను తయారు చేసే పరిశ్రమలను కుటీర పరిశ్రమలు అంటారు.

చిన్న తరహా పరిశ్రమలలో కుటుంబ సభ్యులతో పాటు ఇతర కార్మికులతో ఉత్పత్తి కొనసాగుతుంది మరియు ఆధునిక ఉత్పత్తి పద్ధతులను పాటిస్తారు.

**చిన్న తరహా పరిశ్రమ ప్రాముఖ్యత**

భారత ఆర్థిక వ్యవస్థలో చిన్న తరహా పరిశ్రమలకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడినది. దీనికి గల కారణాలు

1. **భారీ ఉద్యోగ అవకాశాలు**

   చిన్న తరహా పరిశ్రమలలో తక్కువ పెట్టుబడితో కూడినవి. మనదేశంలో అధికజన సంఖ్య తక్కువ మూలధనం వున్న పరిస్థితులలో పెరుగుతున్న ఉద్యోగాల కోసం ఎదురు చూస్తున్న ఆసక్తులకు చిన్నతరహా పరిశ్రమలలో తగినన్ని ఉద్యోగాలు లభ్యం అవుతాయి.

2. **మారుతున్న డిమాండ్‌కు తగిన ఉత్పత్తి నమూనాలను ఏర్పాటు చేసే వీలు**

   చిన్న తరహా పరిశ్రమలు తక్కువస్థాయి ఉత్పత్తి కార్యకలాపాల వలన వాటిలో మారుతున్న డిమాండ్ పోకడలకు అనుగుణంగా ఉత్పత్తి నమూనాలను మార్చుకోగలుగు వీలు కలదు.

3. **స్థానిక నిపుణులను ఉపయోగించుటకు అవకాశం**

   భారతదేశంలో అన్ని ప్రాంతాలలో వున్న ప్రజలలో నైపుణ్యం గల వారు వుంటారు. వారు సాంప్రదాయిక వస్తు

తయారీలో తగిన ప్రావీణ్యంను ప్రదర్శింపగలరు. చిన్న పరిశ్రమ నిర్వాహకులకు స్థానిక నిపుణులను ఉపయోగించుకోగలుగు అవకాశం ఎక్కువగా ఉంటుంది

**4. ఆర్థిక అసమానతలను తగ్గించుటకు సహకరిస్తున్నాయి**

భారీ పరిశ్రమలలో ఆదాయాలు మరియు సంపదలు కొద్దిమంది పారిశ్రామిక వేత్తల వద్ద కేంద్రీకృతం అవుతాయి. చిన్న తరహా పరిశ్రమల వల్ల ఆదాయం అనేకమందికి పంచబడుతుంది. తద్వారా ఆర్థిక అసమానతలను తగ్గించవచ్చును.

**5. ప్రాంతీయ సంతులితాభి వృద్ధి**

చిన్న తరహా పరిశ్రమలను దేశంలో వివిధ ప్రాంతాలలో నెలకొల్పుటకు అనువైనవి. దేశంలో ప్రతి మారుమూల ప్రాంతాలలో కూడా వీటిని నెలకొల్పగల్గుతాము. అందువల్ల వివిధ ప్రాంతాల మధ్య సమానమైన అభివృద్ధి సాధించుటకు చిన్న తరహా పరిశ్రమలు సహకరిస్తాయి.

పై విధంగా చిన్న తరహా పరిశ్రమలు భారత దేశ ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి. చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధి పర్చుటకు ప్రభుత్వం చేపట్టిన పలు చర్యలను తెలుసుకొందాము.

***3. కుటీర, చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వ చర్యలు ఏవి?***

జ: **1. కొన్ని వస్తువుల ఉత్పత్తిని చిన్నతరహా పరిశ్రమలకు కేటాయించుట**

చిన్న తరహా పరిశ్రమలను పెద్ద పరిశ్రమతో పోలిస్తే అవి ఆధునిక సాంకేతిక పరిజ్ఞాన వాడకం మార్కెటింగ్, పరపతి, ముడి పదార్థాల సేకరణ, మొదలగు అనేక వనరులను పొందుటలోను పోటీని ఎదుర్కొనవలసి వస్తుంది. అందువల్ల చిన్న పరిశ్రమలను అసమానమైన పోటీ పరిస్థితులనుండి రక్షించుటకు కొన్ని రకాల వస్తువుల ఉత్పత్తిని చిన్న తరహా పరిశ్రమలకు కేటాయించుట జరిగింది. ఈ రిజర్వు వస్తువులను కేవలం చిన్న తరహా పరిశ్రమలే ఉత్పత్తి చేయవలసి ఉంటుంది.

**2. ప్రభుత్వ కొనుగోళ్ళలో ప్రాధాన్యత ఇవ్వటం**

చిన్న తరహా పరిశ్రమలు తమ ఉత్పత్తులను మార్కెటింగ్ చేయుటలో అనేక సమస్యలను ఎదుర్కొంటు వున్నాయి. అయితే ప్రభుత్వం అనేక సహాయక చర్యల ద్వారా వాటి ఉత్పత్తులకు తగిన మార్కెట్లు కల్పిస్తున్నది. ప్రభుత్వ కొనుగోళ్ళలో చిన్నతరహా పరిశ్రమల ఉత్పత్తులకు తగిన ప్రాధాన్యతనిస్తున్నారు.

**3. పరపతిని సమకూర్చటంలో అవకాశం**

వాణిజ్య బ్యాంకులనుండి పరపతిని పొందుటలో చిన్న తరహా పరిశ్రమలకు తగిన ప్రాతినిధ్యం ఇవ్వబడుతుంది. 1990 సం॥లో చిన్న పరిశ్రమల అభివృద్ధి బ్యాంకును ఏర్పాటు చేసారు. ఇది చిన్న తరహా పరిశ్రమలకు కావలసిన పెట్టుబడులను సమకూరుస్తుంది.

**4. ఆధునీకరణ**

చిన్న తరహా పరిశ్రమలు పాత సాంకేతిక పరిజ్ఞానం, పాత యాంత్రాలతో కొనసాగుతూ వున్నాయి. అందువలన వీటి ఉత్పత్తి వ్యయం ఎక్కువగా వుంటుంది. అందుచేత వీటి ఉత్పత్తులు తీవ్రమైన పోటీని మార్కెట్లలో ఎదుర్కొనవలసి

వస్తుంది. అందువలన ప్రభుత్వం వివిధ పథకాల ద్వారా చిన్న తరహా పరిశ్రమలకు కావలసిన ఆధునిక యంత్రాలను కొనుగోలు చేయుటకు చేయూతనిస్తుంది.

*4. ప్రభుత్వరంగ సంస్థల పాత్రను పరిశీలింపుము.*

జ: భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ రంగ సంస్థలు ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి.

**1. శీఘ్రగతి పారిశ్రామికీకరణ**

పెట్టుబడులు పెట్టుటకు అనంతమైన అవకాశాలు వున్న రంగం ప్రభుత్వ రంగం. నష్టానికి సంసిద్ధత కల్గి ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా వ్యవహరించగల్గు సమర్థత ప్రభుత్వ రంగ సంస్థలకు కలదు. అందువల్ల ఇవి శీఘ్రగతిన పారిశ్రామికీకరణ సాధించుటలో ఎంతో దోహదపడుతున్నాయి.

**2. సంపద / ఆర్థిక శక్తి కేంద్రీకృతం కాకుండా నిరోధించుట**

ప్రభుత్వ రంగ సంస్థలు సమాజం చేత నిర్వహించబడేది. ఏకొద్దిమంది వ్యక్తుల చేతులలో వుండదు. అందువల్లనే, ప్రభుత్వ రంగంలో పరిశ్రమల స్థాపన వల్ల సమాజానికి ప్రయోజనం చేకూరుతుంది. దీని ఫలితంగా ఆర్థిక శక్తి సక్రమంగా సమాన ప్రాతిపదికపై సమాజంలోని అన్ని వర్గాలకు పంచబడుతుంది.

**3. ప్రైవేటు రంగం చేపట్టలేని పరిశ్రమల స్థాపన మరియు వృద్ధి**

స్టీల్‌ప్లాంట్లు, డ్యామ్‌లు, రైల్వేలు, నీటిపారుదల ప్రాజెక్టులు మొ॥ భారీ పరిశ్రమలకు అధికమొత్తంలో పెట్టుబడులు అవసరమతుంది మరియు వాటినుండి ప్రతిఫలాలు కోసం దీర్ఘకాలం వేచివుండవలసి వస్తుంది. అలాంటి పరిశ్రమల స్థాపనకు ప్రవేటు వ్యక్తుల ఇష్టత కనిపించదు. కాని పై పరిశ్రమలు దేశ ఆర్థికాభివృద్ధికి కీలకమైనవి. అందువల్ల ఈ రకం పరిశ్రమలను నెలకొల్పుట, వృద్ధిపర్చుట ప్రభుత్వ రంగ బాధ్యత.

**4. సంతులిత ప్రాంతీయాభివృద్ధి**

రోడ్లు, విద్యుచ్ఛక్తి, నీటివసతి, రవాణా సదుపాయాలు, విద్యాసౌకర్యాలు మొదలగు ప్రాథమిక సౌకర్యాలు అందుబాటులో వున్నపుడు మాత్రమే ప్రవేటు పెట్టుబడి దారులు పరిశ్రమలను నెలకొల్పుతారు. వెనుకబాటు గల ప్రాంతాలలో పైన పేర్కొన్న సౌకర్యాలు వుండవు. అందువల్ల ప్రభుత్వమే తక్కువ అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో ప్రభుత్వరంగ సంస్థలను ఏర్పాటుచేయుట. ద్వారా సంతులిత ప్రాంతీయాభివృద్ధిని సాధించగల్గుతుంది.

**5. లాభాలు పునఃపెట్టుబడిగా ఉపయోగిస్తారు**

ప్రవేటు రంగంలో చాలావరకు సంస్థలు ఆర్జించిన లాభాలు యాజమాన్యంలో పాల్గొన్న సభ్యులు పంచుకొంటారు. ప్రభుత్వరంగంలో ఎలాంటి లాభాల పంపకం వుండదు. అందువలన ప్రభుత్వరంగ సంస్థలు ఆర్జించే లాభాలు తిరిగి పెట్టుబడిగా మారుతుంది. ఫలితంగా పారిశ్రామికీకరణ వేగంగా పుంజుకుంటుంది.

*5. ప్రభుత్వరంగ సంస్థల సమస్యల నివారణకు తగు సూచనలిమ్ము.*

జ: భారతదేశ ఆర్థికాభివృద్ధిలో ఎంతో కీలకమైన పాత్రను ప్రభుత్వరంగ సంస్థలు నిర్వహిస్తూ ఉన్నాయి. అయినప్పటికి అవి అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాయి.

**1. వ్యాపార దృష్టిలో సంస్థల స్థాపన జరుగకపోవటం**

ప్రభుత్వ రంగ సంస్థలన్నీ వెనుకబడిన ప్రాంతాలలో సంతులిత ప్రాంతీయాభివృద్ధి సాధన లక్ష్యంతో ఏర్పాటు చేయబడినవి. అవి వ్యాపార దృక్పథంలో నెలకొల్ప బడేవికావు.

**2. ప్రభుత్వ జోక్యం**

ప్రభుత్వ రంగ సంస్థల నిర్వహణలో మితిమీరిన ప్రభుత్వ జోక్యం వల్ల నిర్ణయాలు రూపొందించుటలో, అమలులో తీవ్రమైన జాప్యం జరుగుతుంది.

3. **బాధ్యత రాహిత్యం, తగిన ప్రోత్సాహకాలు లేకపోవుట**

సమర్ధవంతంగా పనిచేసిన ఉద్యోగులకు ఎలాంటి ప్రోత్సాహకాలు లేకపోవటం. ఎవరినీ బాధ్యులుగా నిర్ధేశించకపోవటం వల్ల వైఫల్యంనకు ఎవరు కారణమో నిర్ణయించలేకపోవటం.

4. **ప్రాజెక్టుల వ్యయం చాల ఎక్కువ**

సక్రమ ప్రణాళికా లోపం, జాప్యం వల్ల ప్రాజెక్టులు అమలులోపు వాటి వ్యయంతీవ్రంగా పెరిగిపోతున్నాయి.

5. **'పోటీ' లేకపోవడం**

ప్రభుత్వ రంగ సంస్థలు చాలాకాలంగా ఏకస్వామ్యంగా కొనసాగుతూ ఉండటం, ప్రవేటు వ్యక్తులకు ప్రవేశించుటకు అనుమతించక పోవటం వల్లను వాటికి తగిన పోటీ లేక ఉత్పత్తి వ్యయాలను తగ్గించుకొనుటకు కానీ, నాణ్యతను పెంచుకొనుటకు అవి ఎలాంటి ప్రయత్నం చేయలేదు.

6. **అధిక సంఖ్యలో ఉద్యోగులు**

ప్రభుత్వ రంగ సంస్థలలో అధిక సంఖ్యలో ఉద్యోగులు ఉన్నారు. వీరు అవసరం మించి వుండుటవల్ల ఉత్పత్తి వ్యయాలు పెరిగి, రావలసిన లాభాలు తగ్గి పోయినాయి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

*1. భారత ఆర్థిక వ్యవస్థలో పరిశ్రమల ప్రాముఖ్యతను వివరింపుము.*

**జ:** పరిశ్రమలు మనదేశ ఆర్థికవ్యవస్థలో ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి.

1. **పరిశ్రమలు పలు వినియోగవస్తువులను ఉత్పత్తి చేస్తున్నాయి** : పరిశ్రమలలో వినియోగదారుల వివిధ అవసరాలను తీర్చుటకు కావలసిన పలురకాల వినియోగవస్తువుల ఉత్పత్తి జరుగుతుంది. పెన్నులు, కాగితాలు, పెన్సిళ్ళు, దుస్తులు, చెప్పులు, సబ్బులు, సైకిళ్ళు, కుట్టుయంత్రములు, రేడియోలు, టి.వి.లు, ఫ్రిజ్‌లు మొదలగునవి పరిశ్రమలలో తయారుచేయుట ద్వారా ప్రజల కోరికలు తీరుచున్నవి.

2. **పరిశ్రమలు ఉత్పత్తి యూనిట్లకు కావలసిన పారిశ్రామిక వస్తువులను ఉత్పత్తి చేస్తున్నాయి :** ఉత్పత్తి యూనిట్లు అయిన కర్మాగారాలు, షాపులు, ఆఫీసులు, ఫరమ్స్ మొదలగు వాటికి కావలసిన పారిశ్రామిక వస్తువులను ఉత్పత్తి చేస్తున్నాయి. వీటిని మరికొన్ని వస్తువులను ఉత్పత్తి చేయుటకు వినియోగిస్తారు.

3. **సేవలు అందించటంలో పరిశ్రమలు ఉపకరిస్తున్నాయి** : రవాణా సాధనాలు అయిన బస్సులు, ట్రక్కులు, రైళ్ళు, మొదలగు వాహనాలను పరిశ్రమలు ఉత్పత్తి చేయకపోతే మనం త్వరిత గతిన ఒక ప్రాంతంనుండి కావలసిన ప్రాంతానికి చేరుటకు రవాణా సౌకర్యములను పొందలేము.

   పరిశ్రమలలో పేపరు, ముద్రణ యంత్రాలు, ఇంకు. వైద్యులు ఆరోగ్య పరీక్షలు నిర్వహించుటకు, వైద్య సేవల కొరకు పరికరాలు మరియు ఔషధాలు అన్నియు పరిశ్రమలు సమకూరుస్తున్నాయి. సమాచారం పంచుకొనుటకు పోస్టల్ సేవలు (కార్డులు, కవర్లు, స్టాంపులు, మొ॥) సంభాషించుటకు కావలసిన టెలిఫోన్లు (టెలిఫోన్లు, కేబుల్స్ ఇతర సామాగ్రిని) మొ॥ అన్నియు పరిశ్రమలు ఉత్పత్తి చేస్తున్నాయి.

4. **పరిశ్రమలు మనకు స్వయం సంమృద్ధిని కల్గిస్తున్నాయి** : ఒకవేళ దేశంలో ఎలాంటి పరిశ్రమలు లేకపోయినా లేదా వస్తువుల తయారీ జరుగకపోయినా మనం, ఇతర దేశాలనుండి కావలసిన వస్తువులను దిగుమతి చేసుకోవలసి వచ్చేది. దీనివల్ల మనకు పూర్తిగా వస్తువుల కొరత ఏర్పడి ఇతర దేశాలపై ఆధారపడవలసి వచ్చేది. ఇలా ఇతర దేశాలపై ఆధారపడుట అంత శ్రేయస్కరం కాదు. ఒకవేళ యుద్ధం సంభవించి మనకు వస్తువులను సరఫరా చేయు దేశాలు దెబ్బతింటే దిగుమతులు ఘోరంగా పడిపోయి ఆర్థిక అనిశ్చితి ఏర్పడును. మనదేశం ఎక్కువగా తన పెట్రోలియం అవసరాల కోసం అరబ్ దేశాలపై ఆధారపడి వున్నది. గల్ఫ్ యుద్ధ కాలంలో కువైట్ పెట్రోలియం ఉత్పత్తి మరియు ఎగుమతి చేయు దేశాలు దెబ్బతినుటవల్ల మనదేశంలో తీవ్రమైన పెట్రోలియం కొరత ఏర్పడింది.

5. **పరిశ్రమలు ఎగుమతులను పెంపొందిస్తాయి** : ఏదేశం కూడా నూరు శాతం స్వయం సంమృద్ధిని సాధించలేదు. అనేక వస్తువులను తయారు చేయుటకు కావలసిన ముడి పదార్థాల లభ్యత కొరత వల్ల ఆయా వస్తువులను దిగుమతి చేసుకోనవలసి వస్తుంది. అయితే, మనం వస్తువులను దిగుమతి చేసుకోవాలంటే వాటికి చెల్లించే ధరను విదేశీమారక ద్రవ్యరూపంలో చెల్లించవలసి వస్తుంది. ఈ విదేశీ మారక ద్రవ్య ఆర్జనకు మనం వస్తువులను తప్పనిసరిగా ఎగుమతి చేయవలెను. మన అవసరాల మేరకు వినియోగించు కొనగా మిగులుగా వున్న ఉత్పత్తులను ఇతర దేశాలకు ఎగుమతి చేసి తగిన విదేశీ మారక ద్రవ్యాన్ని పొందగల్గుతాము.

6. **జీవనోపాధికల్పన / ఉద్యోగావకాశాలు** : పరిశ్రమలు ఉద్యోగావకాశాలు కల్పిస్తున్నాయి. 1990-91 సం॥లో భారతదేశ పారిశ్రామిక రంగంలో 5 కోట్లకుపైగా కార్మికులు పని చేస్తున్నారు. దేశం మొత్తం శ్రామిక శక్తిలో 1/6 వంతు మందికి పరిశ్రమలు ఉపాధిని కల్పిస్తున్నాయి.

వ్యవసాయ రంగంతో పోల్చితే పరిశ్రమలలో ఉద్యోగావకాశాలు చాలా ఎక్కువగా లభిస్తున్నాయి. ఆహార పదార్థాల డిమాండ్ పరిమితంగా ఉండి ప్రజల ఆదాయస్థాయిలు పెరిగేకొలది ఆహారేతర పదార్థాలు/ ఉత్పత్తులపై ఎక్కువ ఖర్చు చేయుటం వల్ల వాటికి డిమాండ్ పెరుగుతుంది. దుస్తులు, చెప్పులు, గృహాలు, రేడియో, టి.వి., కుట్టుమిషన్, వాషింగ్ మిషన్, గ్యాస్‌పొయ్యి మొ॥ వస్తువులకు డిమాండ్ అధికంగా కలదు.

***2. 1956 పారిశ్రామిక విధానం ముఖ్యాంశాలు ఏవి?***

జ: 1956 పారిశ్రామిక విధాన తీర్మానంలోని ముఖ్యాంశాలు కింది విధంగా ఉన్నాయి.

**(i)** 1956 తీర్మానం పరిశ్రమలను మూడు జాబితాల కింద వర్గీకరించింది.

**జాబితా ఎ లో**

జాబితా ఎ లో 17 పరిశ్రమలున్నాయి. వీటికి ప్రభుత్వం లేదా ప్రభుత్వరంగం బాధ్యత వహిస్తుంది. అవి ప్రభుత్వ పరిశ్రమలు, ఆయుధాలు, అణుశక్తి, ఇనుము, ఉక్కు, భారీ విద్యుత్ పరికరాలు, రైల్వేలు, విమాన, నౌకా నిర్మాణం, టెలిఫోన్లు, విద్యుత్ ఉత్పత్తి మరియు పంపిణీ మొదలైనవి.

**జాబితా బి లో**

జాబితా బిలో 12 పరిశ్రమలు కలవు. కొత్త సంస్థలను ప్రభుత్వమే స్థాపిస్తుంది. ప్రభుత్వ భాగస్వామ్యాన్ని పెంచుకుంటుంది.

అయితే ప్రైయివేటు రంగం కొత్త సంస్థలను ఏర్పాటు చేయటానికి గాను, పాత సంస్థలను విస్తరించడానికి అవకాశాలు నిరాకరించదు. యంత్ర పరికరాలు, రసాయనిక పదార్థాలు, ఎరువులు, రోడ్లు మరియు సముద్ర రవాణా మొదలగునవి.

**జాబితా సి లో**

జాబితా ఎ మరియు బి లో చేర్చని పరిశ్రమలు సి లోనికి వస్తాయి. ఈ పరిశ్రమల అభివృద్ధి ప్రవేటు రంగానికి ఇవ్వబడెను. పై విధంగా ప్రభుత్వ మరియు ప్రవేటురంగాల మధ్య బాధ్యతలను విభజించటం వల్ల భారత ఆర్థిక వ్యవస్థ ఒక మిశ్రమ ఆర్థిక వ్యవస్థగా ప్రకటితమైనది. మిశ్రమ విధానంలో ప్రైవేటు, ప్రభుత్వ రంగాలు ఒక దానితో ఒకటి పరస్పర సహకారంతో పురోగతిని సాధిస్తాయి.

దేశంలో పారిశ్రామిక సుస్థిరత స్థాపించి, జాతీయ, అంతర్జాతీయ మార్కెట్ స్థాయిలో పోటీని ఎదుర్కొనే స్థాయికి భారత ఆర్థిక వ్యవస్థను సన్నిద్ధంచేసే ఉద్దేశ్యంతో "నూతన పారిశ్రామిక విధాన తీర్మానం" 1991 లో ప్రకటించారు. ఈ విధానంలో ప్రైవేటు రంగానికి అధిక ప్రాముఖ్యతను ఇచ్చారు. పూర్వం ప్రభుత్వరంగానికే కేటాయించబడిన పరిశ్రమలలో ప్రవేటు రంగానికి ప్రవేశం అనుమతించారు. 1956 పారిశ్రామిక విధానంలో రిజర్వు చేయబడిన 17 ప్రభుత్వ రంగ సంస్థలలో 9 పరిశ్రమలను ప్రవేటు రంగం ప్రవేశించుటకు అవకాశం కల్పించారు. అవి ఇనుము, ఉక్కు పరిశ్రమ, విద్యుచ్ఛక్తి, విమానయానం, నౌకానిర్మాణం మరియు భారీ యంత్రాలు.

**(ii) పారిశ్రామిక లైసెన్సింగ్ విధానం**

పారిశ్రామిక లైసెన్సింగ్ అనగా పరిశ్రమల స్థాపనకు కావలసిన అనుమతులను ప్రభుత్వం నుండి పొందుట. పారిశ్రామిక విధానం అమలు పర్చుతూ పరిశ్రమలను నియంత్రించుట ఇందలి ప్రధాన లక్ష్యం. పారిశ్రామిక లైసెన్సింగ్ విధానం లోని ముఖ్య లక్ష్యాలు.

1. ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా పరిశ్రమలను అభివృద్ధి పరచుట
2. పెద్ద తరహా పరిశ్రమల విస్తరణను నియంత్రించుతూ ఆర్థిక శక్తి కేంద్రీకృతం కాకుండా పరిరక్షించుట
3. చిన్న తరహా పరిశ్రమలకు తగిన రక్షణను కల్పిస్తూ, పెద్ద పరిశ్రమలనుండి ఎదురగు పోటీని ప్రోత్సాహించుట
4. సమతుల్య ప్రాంతీయాభివృద్ధిని ప్రోత్సాహించుట
5. వనరులను సమర్థవంతంగా సక్రమంగా వినియోగించుట
6. ఉపాధి అవకాశాలను సృష్టించుట.

ఏమైనప్పటికీ లైసెన్సింగ్ విధానం పెద్ద పరిశ్రమలకు తగిన పోటీ నుండి దూరంగా వుంచుతుంది. 1991 పారిశ్రామిక విధానం క్రమక్రమంగా లైసెన్సులు పొందుటకు కావలసిన నిబంధనలను సరళీకృతం చేసింది. ప్రస్తుతం కేవలం 15 పరిశ్రమలు మాత్రమే లైసెన్సింగ్ విధానం క్రిందకు తీసుకొని రాబడెను.

# 38

# వ్యవసాయము మరియు పారిశ్రామిక రంగముల పరస్పర ఆధారము

## (Interdependence of Agriculture and Industry)

## 38.1 పరిచయం

వ్యవసాయ–పారిశ్రామిక రంగాలు ఆర్థిక వ్యవస్థకు జీవం (lifeline) వంటివి. వ్యవసాయం ప్రజలకు అవసరమైన ఆహార పదార్థములను అందిస్తుంది. పారిశ్రామిక రంగం ప్రజలుకోరే ఇతర వస్తువులైన వస్త్రం, గృహము, విద్యుత్, బూట్లు, పుస్తకాలు, రవాణాసాధనాలు మొదలైన వాటిని అందిస్తుంది. ఆహార, ఆహారేతర వస్తువులు రెండును మానవులు జీవనాన్ని కొనసాగించడానికి అత్యవసరమైనవి. కాబట్టి వ్యవసాయ–పారిశ్రామిక రంగములు రెండు ఒక సంఘంలో ఉండి తీరవలసిందే. ప్రజల కోర్కెలను సంతృప్తి పరిచే విషయంలో ఈ రెండూ పరస్పర పూరకాలు. రెండూ సమక్రమంగా వృద్ధి చెందాలి. వ్యవసాయరంగవృద్ధి సాధించకుండా పారిశ్రామికాభివృద్ధిని సాధించలేము. అదే విధంగా పారిశ్రామికాభివృద్ధి లేకుండా వ్యవసాయ రంగవృద్ధిని సాధించలేము. డిమాండ్ సప్లయ్‌లకు సంబంధించి ఈ రెండూ ఒకదానికొకటి ఆధారాలు. వ్యవసాయరంగంపై పనిచేసేవారు పారిశ్రామిక వస్తువులను కూడా డిమాండ్ చేస్తారు. పారిశ్రామిక రంగంలో పనిచేసేవారు వ్యవసాయిక వస్తువులనూ డిమాండ్ చేస్తారు. వ్యవసాయరంగానికి పారిశ్రామిక ఉత్పాదితములు అవసరము. పారిశ్రామిక రంగానికి వ్యవసాయికరంగము ముడిపదార్థములను అందిస్తుంది. కాబట్టి ఈ రెండూ రంగాల మధ్య పరస్పర సంబంధముందనేది స్పష్టం. ఈ పాఠ్యాంశ లక్ష్యం ఈ పరస్పర ఆధార సంబంధాన్ని విపులీకరించడం.

## 38.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశము అధ్యయనం చేసిన తర్వాత మీరు తెలుసుకొనేవి.

- వ్యవసాయ రంగంపై పారిశ్రామిక రంగ ఆధారాన్ని వివరించుట.
- పారిశ్రామిక రంగంపై వ్యవసాయరంగ ఆధారాన్ని వివరించుట.

## 38.3 ప్రశ్నలు – సమాధానాలు

### ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. వ్యవసాయరంగంపై పారిశ్రామిక రంగం ఏవిధంగా ఆధారపడుతుంది? విపులీకరించుము.***

జ: వ్యవసాయరంగము పారిశ్రామిక రంగానికి ఈ క్రింది విధంగా సహాయపడుతుంది.

**1. పారిశ్రామిక రంగము వ్యవసాయరంగము నుండి ముడిపదార్థాలను పొందుతుంది.**

వివిధ పరిశ్రమలకు అవసరమైన ముడిపదార్థములను వ్యవసాయరంగం అందిస్తుంది.

కొత్త సంస్థలను (enterprise) స్థాపించేకొలది, ఉన్న సంస్థలు విస్తరింపబడి, ముడి పదార్థములో డిమాండ్ పెరుగుతుంది. ఈ పెరిగిన డిమాండ్‌ను కేవలం వ్యవసాయ ఉత్పత్తులు మాత్రమే భర్తీ చేయగలుగుతాయి.

**2. వ్యవసాయ రంగంలో ఆధారపడిన జనాభా పారిశ్రామిక వస్తు డిమాండ్ చేస్తారు.**

మానవాళి మొత్తానికి ఆహారం ప్రాథమిక అవసరం. ఈ అవసరం తీరిన తరువాత మనం ఇతర వస్తువులైన వస్త్రాలు, బూట్లు, ఇళ్లు, సైకిళ్ళు, బోరింగుపంపులు, ట్రాక్టర్లు, కుట్టుమిషన్లు, గ్యాస్‌స్టవ్, రేడియో, ఫ్రిజ్, టి.వి. వాషింగ్ మిషన్ మొదలగు వాటిని మన కోర్కెలు తీర్చుకోవడానికి ఆశిస్తాము. వీటిన్నింటినీ పారిశ్రామిక రంగం అందిస్తుంది.

**3. పారిశ్రామిక రంగానికి అవసరమైన శ్రామికులను వ్యవసాయ రంగం అందిస్తుంది.**

ఒక అల్పాభివృద్ధి చెందిన దేశం ప్రాథమికంగా వ్యవసాయిక దేశం. ఆర్థికాభివృద్ధి జరిగే కొలది వ్యవసాయ రంగంలో శ్రామికుల తులనాత్మక అవసరం తగ్గుతుంది. దీనికి ముఖ్యంగా రెండు కారణాలు. మొదటగా ఆదాయం పెరిగినకొలది ఆహారపదార్థముల డిమాండ్ పెరుగుతుంది. కాని మందగమన రేటులో పెరుగుతుంది. మానవుడు ఆహారాన్ని తక్కువ పరిమాణంలో వినియోగిస్తాడు. ఇతడు ముఖ్యంగా నాణ్యమైన ఆహారాన్ని కోరుకుంటాడు. కాబట్టి ఆహార పదార్థముల డిమాండ్, మందగమన రేటులో పెరుగుతుంది.

రెండవ కారణం, మెరుగైన పరిజ్ఞానం, నాణ్యమైన విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు, తాగునీటి పారుదల వసతులు మొదలగు సౌకర్యాలవలన వ్యవసాయరంగంలో హెక్టారు సగటు ఉత్పాదకత పెరుగుతుంది. కాబట్టి, నియమిత భూ పరిమాణంలో, అదే మొత్తంలో ఉత్పత్తి చేయడానికి, గతంలో కన్నా ఎక్కువ శ్రామికులు అవసరం అవుతారు.

**4. పారిశ్రామిక రంగంలో నిమగ్నమైన వారికి వ్యవసాయరంగం ఆహారపదార్థాలను అందిస్తుంది.**

వ్యవసాయ రంగం మానవునికి ప్రాథమిక అవసరమైన ఆహారాన్ని అందిస్తుంది. ఇది కాయధాన్యాలు, పప్పు ధాన్యాలు, కూరగాయలు, పండ్లు, సుగంధ దినుసులు మరియు పానీయాలను అందిస్తుంది. ప్రజలందరి అంటే, పారిశ్రామిక రంగంలో, సేవారంగంలో, వ్యవసాయరంగంలో పనిచేస్తున్న వారందరి, ఆహార డిమాండ్‌ను వ్యవసాయ రంగం తీరుస్తుంది.

పారిశ్రామిక రంగంలో నిమగ్నమైన వారు ప్రత్యక్షంగా వ్యవసాయ రంగంపై ఆధారపడిఉంటారు. ఆహార పదార్థాల లభ్యత లోని ఇబ్బందులు కొత్త పారిశ్రామిక యూనిట్ల స్థాపనపై ప్రభావం చూపుతాయి. ఆహార లభ్యతలోని లోటును శ్రామికుడు గమనించినట్లయితే అతడు పారిశ్రామికరంగానికి బదిలీ కావడానికి శ్రద్ధచూపడు. పారిశ్రామిక ప్రాంతాలలో సక్రమమైన ఆహారపదార్థాల లభ్యత, పారిశ్రామికాభివృద్ధికి ప్రాథమిక నిబంధన.

**5. పారిశ్రామిక రంగానికి వ్యవసాయరంగం నిధులమార్గం.**

గ్రామీణ ప్రాంతాలలోని ప్రజలు వారి పొదుపులను బ్యాంకులలోనూ, పోస్టాఫీసులలోనూ, ఇతర ద్రవ్యసంస్థల లోనూ జమచేస్తారు. కొన్ని పరిమితుల వలన వీరు వారి పొదుపులను వ్యవసాయరంగంలో పెట్టుబడులు చేయడానికి శ్రద్ధచూపరు. దీనివల్ల ఈ గ్రామీణ పొదుపులు బ్యాంకుల ద్వారా పట్టణ ప్రాంతాలలోని పరిశ్రమలకు పెట్టుబడులుగా మరలుతాయి. వ్యవసాయరంగంలోని అధిక ఆదాయము అధిక పొదుపులకు,

పారిశ్రామిక రంగంలో అధిక పెట్టుబడులకు దారితీస్తాయి. ఈ కారణంగా పారిశ్రామిక రంగానికి వనరుల లభ్యత పెరుగుతుంది. దీనిని బట్టి కూడా పారిశ్రామికాభివృద్ధి వ్యవసాయిక వృద్ధితో ప్రత్యక్ష సంబంధం ఉన్నదని చెప్పవచ్చు.

మనం పైన పేర్కొన్న అంశాలలో పారిశ్రామిక రంగ అభివృద్ధి వ్యవసాయ రంగ అభివృద్ధిపై ఆధారపడి ఉన్నదని చర్చించాము. అయితే ఇది పరస్పర ఆధారానికి ఒకవైపు మాత్రమే. ఇది రెండువైపులా పరస్పర ఆధారం. వ్యవసాయ రంగ అభివృద్ధి కూడా ఇదే మొత్తంలో పారిశ్రామిక రంగ అభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది.

***2. పారిశ్రామిక రంగంపై వ్యవసాయరంగం ఏ విధంగా ఆధారపడి ఉంటుంది? చర్చింపుము.***

జ: వ్యవసాయ రంగం పారిశ్రామిక రంగంపై ఈ క్రింది విధంగా ఆధారపడివుంటుంది:

**1. పారిశ్రామిక రంగం వ్యవసాయరంగానికి విత్తనాలు అందిస్తుంది.**

మంచి నాణ్యత కలిగిన విత్తనాలు వ్యవసాయరంగానికి అత్యవసరమైన ఉత్పాదితాలు. అధిక దిగుబడిని ఇచ్చే, చీడపీడలను తట్టుకొనగలిగే, స్థానిక పరిస్థితులకు అనువైన (అంటే భూమి, వాతావరణ పరిస్థితులు ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి మారుతుంటాయి) మేలురకమైన విత్తనాలను రూపొందించడానికి పరిశోధనలు ఎల్లప్పుడూ జరుగు తుంటాయి. ఈ పరిశోధనలకు అత్యాధునిక పరికరాలు, శీతలీకరణ ఇంకా ఎన్నో నవీన సదుపాయాలు కలిగిన ప్రయోగశాలలు కావాలి. దీనిని బట్టి వ్యవసాయరంగం పారిశ్రామిక రంగంపై ఆధారపడి ఉన్నదని తెలుసుకోవచ్చు.

**2. రసాయనిక ఎరువులను అందించడం.**

భారతదేశంలో రైతులు సాంప్రదాయకంగా మొక్కలు మరియు పశువుల నుండి వచ్చిన వ్యర్థాలను భూసారాన్ని పెంచడానికి ఎరువులుగా వాడుతున్నారు. దీనిలో కలిపే పదార్థాలు అవీ వ్యవసాయిక కార్యకలాపాల నుండి లభించేవే. దీనికి ప్రత్యామ్నాయంగా వ్యవసాయరంగంలో అధిక ఉత్పాదికతను ఇచ్చే ఎరువుల ఆవశ్యకత క్రమంగా పెరుగుచున్నది. దీనికి ప్రత్యామ్నాయంగా రసాయనిక ఎరువులు కనుగొనబడ్డాయి. ఈ రసాయనిక ఎరువులు మొక్కల పెరుగుదలకు అవసరమైన పోషకాలను అందిస్తాయి. ఈ రసాయనిక ఎరువుల వినియోగం వ్యవసాయరంగంలో గణనీయంగా పెరగడం వలన వ్యవసాయ ఉత్పాదకత పెరిగింది. ఈ ఎరువుల ఉత్పత్తి చేసే బాధ్యత కెమికల్ పరిశ్రమలు తీసుకున్నాయి. పై విధంగా వ్యవసాయ రంగంలో ఉత్పాదకత పెరగడానికి పారిశ్రామిక రంగం దోహదపడుతుంది.

**3. నీటిపారుదల సౌకర్యాలకు అవసరమైన పరికరాలను పారిశ్రామిక రంగం అందిస్తుంది.**

తాగునీరు అందకపోతే మొక్కలు పెరగవు. మనదేశంలో ప్రధానమైన నీటివనరు వర్షపాతం. సుమారు 70 శాతం సాగుబడిలో ఉన్నభూమి రుతుపవనాల వలన కలిగే వర్షాధారమైన భూమి. అయితే వర్షాధారం రెండు కారణాల వలన నమ్మదగినదికాదు. మొదటి కారణం, వర్షపాత పరిమాణం.వానలు ప్రకృతిచే నిర్ధారింపబడతాయే తప్ప మానవుని కృషివలన కాదు. కొన్ని సందర్భాలలో వర్షపాతం ఉండదు. మరికొన్ని సందర్భాలలో చాలా తక్కువగా ఉంటుంది. దీని వలన వ్యవసాయ ఉత్పాదకతలలో గణనీయమైన తగ్గుదల కన్పిస్తుంది. మరొకవైపు అధిక వర్షపాతం పంటలపై దుష్ప్రభావాన్ని కల్గిస్తాయి. రెండవకారణం వర్షపాతం నమోదయ్యే కాలం. ఒక్కొక్కసారి పంటలకు అవసరమైనకాలంలో వర్షాలు కురవవు. సరియైన కాలంలో

వర్షాలు లేకపోతే పంటలు నాశనం అవుతాయి.కాబట్టి మనదేశంలో నీటిపారుదల సౌకర్యాలను గణనీయంగా విస్తరించవలసిన అవసరం ఉంది.

4. **పురుగుమందులను పారిశ్రామిక రంగం తయారుచేస్తుంది.**

క్రిమికీటకాలవలన మరియు ఇతర చీడలవలన వ్యవసాయ ఉత్పత్తిలో 5-10 శాతం నాశనం అవుతున్నది. మొక్కలను ఈ క్రిమికీటకాల నుండి, చీడలనుండి రక్షించడానికి పురుగుమందులు ఎంతో అవసరం. మానవునికి, మొక్కలకు హాని కల్పించని పురుగుమందుల అవశ్యకత మనదేశంలో ఎంతో ఉన్నది.

5. **పారిశ్రామికరంగం అధునిక పరికరాలను తయారుచేస్తుంది.**

భారతదేశంలో రైతులు సాంప్రదాయక పనిముట్లయిన, నాగళ్ళు, చేతిపనిముట్లు, ఎద్దులు, ఎద్దులబళ్ళు వంటి వాటిని వ్యవసాయరంగంలో ఉపయోగించి ఉత్పత్తులు చేస్తున్నారు. వీటి వల్ల వ్యవసాయరంగంలో ఉత్పాదకతలు చాలా తక్కువగా ఉన్నాయి. ప్రస్తుతం పారిశ్రామికరంగం వీటికి ప్రత్యామ్నాయములైన అధునిక పనిముట్లను తయారుచేస్తున్నది. ట్రాక్టర్ల వంటి అధునిక యంత్రాలు వ్యవసాయరంగంలో మానవశక్తి వినియోగాన్ని గణనీయంగా తగ్గించాయి. మరొక వైపు వ్యవసాయ ఉత్పాదకతలు కూడా వృద్ధి చెందాయి.

6. **వ్యవసాయమార్కెటింగ్‌కు, గిడ్డంగులకు అవసరమైన వనరులను ఏర్పాటు చేస్తాయి.**

పక్కా రోడ్లనిర్మాణానికి అవసరమైన పరిజ్ఞానాన్ని, యంత్రాలను, మెటీరియల్‌ను అందించేది పారిశ్రామికరంగం. మన్నికగల రోడ్డు రైతులు తమ ఉత్పత్తులను సులభంగా మార్కెట్ ప్రాంతానికి సకాలంలో రవాణా చేయడానికి అవసరం. రైతులు తమ వస్తువులకు తగు మార్కెట్ ధర లభించేవరకు దాచుకోవడానికి కావలసిన గిడ్డంగుల నిర్మాణానికి అవసరమైన వస్తువులన్నింటినీ పారిశ్రామికరంగం ఉత్పత్తి చేస్తుంది. తగు గిడ్డంగి సదుపాయాలు లేనట్లయితే తమ సరుకు పాడైపోతుందనే భయంతో రైతులు మార్కెట్‌లో అమలులో ఉన్న ధరవద్దనే అమ్ముకోవలసిన అవసరం ఉంది. అయితే తగు గిడ్డంగి సదుపాయాలు ఉన్నప్పుడు ఈ అవసరం ఉండదు. కాబట్టి గిడ్డంగులు రైతులకు మంచిధర వచ్చేందుకు దోహద పడతాయి.

7. **వ్యవసాయ రంగంలో నిమగ్నమయినవారికి ఉత్పాదక వస్తువులు పారిశ్రామిక రంగం ఉత్పత్తి చేస్తుంది.**

ప్రజలకు ఆహారపదార్థాలేకాక, ఇతర వస్తువులైన వస్త్రాలు, ఇళ్ళు, రవాణాసాధనాలు, విద్యుచ్ఛక్తి, టి.వి.ఫ్రిజ్, వాషింగ్‌మెషిన్ మొదలగు పారిశ్రామిక వస్తువులు కూడా అవసరం. వీటినన్నింటినీ పారిశ్రామిక రంగమే ఉత్పత్తి చేస్తుంది. వ్యవసాయరంగంలో పనిచేసేవారికి కూడా ఇవి అవసరమే. వీరికి ఈ వస్తువులను పారిశ్రామిక రంగం అందించి వారి అవసరాలను తీరుస్తుంది.

8. **వ్యవసాయరంగానికి నిధులను కల్పిస్తుంది.**

వ్యవసాయరంగంలో పనిచేసే వారితో పోలిస్తే పారిశ్రామికరంగంలో పనిచేసేవారి పొదుపురేటు ఎక్కువగా ఉంటుంది. ఈ పారిశ్రామికరంగంలో పనిచేసే వారుకూడా వారి పొదుపులను బ్యాంకులు ఇతర ద్రవ్యసంస్థలలో దాచుకుంటారు. ప్రస్తుతం భారతదేశంలో అత్యధికశాతం బ్యాంకులు గ్రామీణ ప్రాంతాలలో తమ శాఖలను కలిగిఉన్నాయి. ఇవి ప్రాధాన్యత రంగంగా వ్యవసాయానికి అధికరుణాలను మంజూరు చేస్తాయి. సాధారణంగా వ్యవసాయరంగం తక్కువ పొదుపురేటును కలిగివుంటుంది కాబట్టి నిధుల అవసరం ఎక్కువగా ఉంటుంది. పారిశ్రామిక రంగం నుంచి సమీకరించిన పొదుపులను వ్యవసాయరుణాలుగా గ్రామీణ ప్రాంతాలలో బ్యాంకులు ఇస్తున్నాయి. ఈ విధంగా వ్యవసాయరంగానికి అవసరమైన నిధులను పారిశ్రామిక రంగం అందిస్తుంది.

# 38

# జనాభా - ఆర్థికాభివృద్ధి

# (Population and Economic Development)

## 38.1 పరిచయం

శ్రామిక శక్తికి జనాభా ఆధారం. జనాభా ఎక్కువగా వుంటే, అధికసంఖ్యలో శ్రామికులు లభ్యం అవుతారు. అధిక జనాభా వృద్ధిరేటు ఉంటేనే అధిక శ్రామిక శక్తి సామర్థ్యం వుంటుంది. కేవలం శ్రామికులతోనే ఉత్పత్తి సాధ్యంకాదు. ఉత్పత్తి చేయటానికి కావలసిన అన్ని వనరులు సంమృద్ధిగా దొరికినపుడు మాత్రమే శ్రామికులు ఉపయోగిత కల్గి శ్రమ ఒక ఉత్పాదక 'ఆస్థి'గా మారుతుంది. ఉత్పత్తికి దోహదం చేయు కారణాల - లభ్యత తక్కువగా వుండి కేవలం అధిక జనాభా వల్ల శ్రామికుల సంఖ్య అపరిమితంగా వున్న దేశాలతో, జనాభా ఒక ఆర్థికాభివృద్ధికి నిరోధకంగా మారుతుంది. ఎందుకని ఆర్థికాభివృద్ధి చెందుతున్న కొన్ని దేశాలలో జనాభా వేగంగా వృద్ధి చెందుతూవుంది? ఏవిధంగా వేగంగా వృద్ధి చెందుతున్న జనాభా ఆయా దేశాల ఆర్థికాభివృద్ధిని ప్రభావితం చేస్తుంది? ఇలాంటి ప్రశ్నలకు సంబంధించిన విషయాలను ఈ పాఠంతో చర్చించుకుందాం.

## 38.2 లక్ష్యాలు

ఈ ప్రశ్నలు, సమాధానాలు చదివిన తర్వాత మీరు ఈ క్రింది అంశాలు తెలుసుకుంటారు.

- జనాభావృద్ధిరేటు భావనను వివరించుట.
- ఆర్థికవృద్ధిని అధిక జనాభా వృద్ధిరేటు ఎలా ప్రభావితంచేస్తుందో వివరించుట.
- అభివృద్ధి చెందుతున్న దేశాలలో అధికజనాభా వృద్ధిరేటు ప్రభావం మానవ వనరులు, సహజ వనరులు మరియు మూలధన సంచయనంపై ఎలా వుంటుందో వివరించుట.

## 38.3 ప్రశ్నలు - సమాధానాలు

### ఒక్క మార్కు ప్రశ్నలు

***1. జనాభా వృద్ధి రేటు అనగానేమి?***

**జ:** ఒక నిర్ణీత కాలంలో దేశంలో ఉన్న మొత్తం జనాభాకు, పెరిగిన జనాభాకు మధ్య గల నిష్పత్తిని జనాభా వృద్ధిరేటు అంటారు.

$$\text{జనాభా వృద్ధి రేటు} = \frac{\text{జనాభా}}{\text{మొత్తం జనాభా}} \times 1000$$

*2. జనసంఖ్య అనగానేమి?*

**జ:** ఒక నిర్ణీత కాలంలో దేశంలో నివసించే జనాభాను ఆదేశ జనసంఖ్యగా పేర్కొనవచ్చు.

## రెండు మార్కుల ప్రశ్నలు

*1. జనాభా వృద్ధిరేటు అనగానేమి?*

జ: ఏ దేశమైనా ఏ కాలంలోనైనా కొంత జన సంఖ్యను కల్గి వుంటుంది. ఆ జనాభాను ఆదేశ జన సంఖ్యగా పరిగణిస్తాం. అయితే, ఈ సంఖ్య నిరంతరం మార్పు చెందుతూ వుంటుంది. జననాలు, మరణాలు, వలసలు జనాభాలో మార్పులకు కారణాలు. ఒక నిర్ణీత కాలంలో దేశంలో నివసిస్తున్న జనాభా పెరగడాన్ని జనాభా వృద్ధిగా వ్యవహరిస్తారు. ఈ పెరుగుదల మరణాలకన్నా జననాలు ఎక్కువగా ఉండటం వల్ల సంభవిస్తాయి. వలసల వల్ల దేశ జనాభా పెరుగుదల ఎక్కువగా వుండదు. ఒక నిర్ణీత కాలంలో దేశంలో వున్న మొత్తం జనాభాకు పెరిగిన జనాభాకు మధ్యగల నిష్పత్తిని జనాభా వృద్ధి రేటుగా లెక్కించవచ్చును.

జనాభా వృద్ధిరేటు ప్రాథమికంగా జననాల రేటుపైన ఆధారపడి వుంటుంది.

$$\frac{\text{జనాభా}}{\text{మొత్తం జనాభా}} \times 1000$$

జననాల రేటుకు, మరణాల రేటుకు మధ్యగల తేడాను జనాభావృద్ధి రేటుగా తెలుపుతారు. ఇది ప్రతి 1000కి లెక్కిస్తారు.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

*1. మూలధన సంచయనం పై అధిక జనాభా వృద్ధిరేటు ప్రభావం*

జ: ఆర్థిక వృద్ధి సాధనలో పెట్టుబడి/మూలధనం ఒక ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నది. ఒక దేశంలో వున్న మూలధన నిల్వలు ఆదేశ ఆర్థిక వృద్ధిస్థాయిని నిర్ణయిస్తాయి. ఆర్థికంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో శీఘ్రంగా పెరుగుతున్న జనాభావల్ల వినియోగవ్యయం పెరుగుతూ వుంటుంది. ఆహారం, నీరు, దుస్తులు, గృహాలు, రవాణా, విద్య, విద్యుచ్ఛక్తి, వైద్యసదుపాయాలు మొ॥ అవసరాలు వేగంగా పెరగటం వల్ల వినియోగం పెరుగుతుంది. ఫలితంగా, పెట్టుబడికి కావలసిన వనరులు, పెరుగుతూ వున్న జనాభా అవసరాలకు కేటాయించటం వల్ల పెట్టుబడుల కొరత ఏర్పడుతుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రజల తలసరి ఆదాయం మరియు వారి జీవన ప్రమాణాలను పెంపొందించటానికి అవసరమయ్యే మూలధన సంచయనం, పెరుగుతున్న అధిక జనాభా వల్ల తగ్గిపోతుంది. పైవిధంగా అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలను అధిక జనాభావృద్ధిరేటు తీవ్రంగా దెబ్బతీస్తుంది. పై విధంగా అధిక జనాభావృద్ధి రేటు మూలధన సంచయనం పై ప్రతికూల ప్రభావాన్ని కల్గిస్తుంది. పెరుగుతున్న వినియోగ అవసరాలను తీర్చుటకై అధిక మొత్తంలో వనరులను ఉపయోగించటం వలన ఆర్థిక వ్యవస్థలో ఉత్పాదకతను, దాని సామర్థ్యాలను పెంచుటకు కావలసినంతగా వనరులు లభ్యం కావటంలేదు. భవిష్యత్ ఆర్థిక వృద్ధి రేటును ఈ పరిస్థితులు దెబ్బతీస్తాయి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. దేశ ఆర్థికవృద్ధి జనాభా వృద్ధి రేటును ఎలా ప్రభావితం చేస్తుందో వివరింపుము.***

జ: అనేక దేశాలలో జరిపిన అధ్యయనాలను బట్టి పరిశీలిస్తే, వెనుక బడిన ఆర్థిక వ్యవస్థలు గల దేశాలలో జననాలరేటు మరియు మరణాల రేటు రెండూ ఎక్కువగా వుండి జననాలు, మరణాలు రేట్లు మధ్యతేడా చాల తక్కువగా వుంటుంది. అందువల్ల ఆయా దేశాలలో జనాభావృద్ధి రేటు స్వల్పంగా ఉంటుంది. ఇలాంటి ఆర్థిక వ్యవస్థలో ప్రజల ఆదాయస్థాయి తక్కువగా ఉండటం వలన పౌష్టికాహార లోపం మరియు సరియైన ఆహారం తీసుకొనకపోవటం జరుగుతుంది. వైద్య మరియు పారిశుద్ధ్యం సౌకర్యాలు పూర్తిస్థాయిలో లోపించి కనిపిస్తాయి. జనాభాలో అధిక సంఖ్యాకులకు ఎలాంటి రక్షిత త్రాగునీటి వసతి లభ్యత వుండదు. అందువలన మరణాలరేటు చాలా ఎక్కువగా వుంటుంది. సనాతన వైఖరుల వల్ల జననాలరేట్లు కూడా ఎక్కువగా వుంటాయి. అక్షరాస్యత లేకపోవడం మరియు అధికస్థాయిలో శిశు మరణాల రేటు వుంటుంది. అందువలన, వెనుకబడి ఆర్థిక వ్యవస్థలు గల దేశంలో అధిక జననాలరేటు మరియు మరణాలరేటు వుండి, జనాభా వృద్ధి రేటు స్వల్పంగా వుంటుంది. జనాభా నెమ్మదిగా పెరుగుట గమనించవచ్చును.

దేశ ఆర్థికాభివృద్ధి ప్రారంభం కావటంచేత, ప్రజల ఆదాయ స్థాయిలు పెరిగి వారి జీవన ప్రమాణస్థాయిలు పెరుగుతాయి. వైద్య సదుపాయాలు మరియు పారిశుద్ధ్యం పెంపొందుతాయి. కొన్ని రకాల వ్యాధులు అరికట్టబడతాయి. వీటి ఫలితంగా జననాలరేటు కూడా తగ్గుతూనే వుంటుంది. కానీ, చాల నెమ్మదిగా తగ్గుతుంది. జననాలరేటులో తగ్గుదల మరణాలరేటులో తగ్గుదల కన్నా తక్కువగా సంభవిస్తుంది. జననాలలో తగ్గుదల స్వల్పంగా ఉండటానికి ప్రజల వైఖరులలో తగిన మార్పు లేకపోవడం, మత పరమైన నమ్మకాలు కొంతవరకు కారణం.

ఎప్పుడైతే దేశం ఆర్థికంగా వృద్ధి చెందుతుందో దేశ జనాభా పెరుగుదల క్రమక్రమంగా పెరుగుతూ వేగవంతమౌతుంది. ఉదా॥ భారతదేశ జనాభా వృద్ధి 1921 సం॥ నుండి పెరుగుతూ 1951 నుండి వేగవంతంగా పెరిగింది.

ఒక్కసారి ఆర్థిక వృద్ధి సాధన పురోగతి అందుకున్న తరుణంలో గమనించ దగిన స్థాయిలో మార్పులు చోటుచేసుకుంటాయి. ఆదాయ స్థాయిలలో పురోగతి గమనించవచ్చు. పౌష్టికాహారం పొందుస్థాయి పెరుగుతుంది. ప్రజాఆరోగ్యం, పారిశుద్ధ్యం మొ॥ సౌకర్యాలు త్వరితగతిన ఏర్పాటు చేయబడుతాయి. ప్రజల జీవన ప్రమాణ స్థాయిలు పెంపొందుతాయి. సనాతన ప్రాచీన వైఖరుల స్థానంలో శాస్త్రీయ దృక్పథాలు చోటుచేసుకుంటాయి. చిన్న కుటుంబ భావనను ప్రజలు అలవర్చుకుంటారు. ఈ మార్పుల ప్రభావం జనన, మరణాల రేట్లపై వుంటుంది. మరణాలరేటు సాధారణ స్థితి నుంచి మరింతగా తగ్గకపోయినా, జననాలరేటు గణనీయంగా తగ్గుతుంది. మరణాల రేటు స్థిరంగా కనీసస్థాయిలో నిలిచిపోగా, జనన, మరణాల రేట్ల మధ్య వ్యత్యాసం చాలా స్వల్పంగా వుండి, జనాభావృద్ధి రేటు స్వల్ప స్థాయిలో వుంటుంది. అన్ని అభివృద్ధి చెందిన దేశాలలో మనం స్వల్ప స్థాయి జనాభా వృద్ధిరేట్లను గమనించ వచ్చును.

భారతదేశం రెండవ దశలోవుంది. జననాలరేట్లు ఎక్కువగా వుండి క్రమంగా తగ్గుముఖం పట్టాయి. మరణాలరేట్లు వేగంగా తగ్గాయి. ఫలితంగా 'అధిక జనాభా వృద్ధి' నమోదు అవుతున్నాయి.

***2. అభివృద్ధి చెందుతున్న దేశాలలో శీఘ్రంగా పెరుగుతున్న అధిక జనాభా వృద్ధి రేటు మానవ మరియు సహజ వనరులపై ఎలాంటి ప్రభావాన్ని కల్గిస్తుందో వివరణాత్మకంగా తెల్పుము.***

జ: ఇంతకు మునుపు తెల్పినట్లు, అభివృద్ధి చెందుతూవున్న దేశాలలో అధిక జనాభా వృద్ధి రేటు ఉంటుంది. ఈ

విభాగంలో అధిక వృద్ధి రేటు దేశ ఆర్థిక వృద్ధిపై ఎలాంటి ప్రభావం చూపుతుందో అధ్యయనం చేద్దాం. ఇది విశ్లేషించటానికి వివిధ వనరుల పై జనాభా వృద్ధి రేటు ప్రభావాన్ని అధ్యయనం చేద్దాం. అవి 1) మానవ వనరులు, 2) సహజ వనరులు మరియు 3) మూలధన సంచయనం ఎ) మానవ-యత్నంతో సమకూరు వనరులు.

**1. మానవ వనరులు - అధిక జనాభా వృద్ధిరేటు**

దేశ జనాభాలోనే మానవ వనరులు అంతర్భాగంగా వుంటాయి. జనసంఖ్య వేగంగా పెరుగుతున్న భారతదేశంలో అధిక సంఖ్యలో శ్రామికులు లభ్యం అవుతారు. అధిక సంఖ్యలో మానవ వనరుల సృష్టి, ఒక ప్రక్క ఆర్థిక బలాన్ని మరోప్రక్క బలహీనతను కల్గిస్తాయి.

మానవ వనరులను పూర్తిస్థాయిలో వినియోగించుకోగల్గితే ఆర్థిక వృద్ధికి దారితీస్తుంది. వినియోగించుకోలేకపోతే దేశ పురోగతి దెబ్బతింటుంది. కేవలం శ్రామికుల సంఖ్య పెరుగుదల వస్తూత్పత్తిని కల్గించదు. సహజవనరులు మరియు మూలధనంతో కూడిన మానవ వనరుల ద్వారానే ఉత్పత్తి కొనసాగుతుంది. అందువల్ల పెరుగుతున్న శ్రామిక సంఖ్యను తగిన ఉపాధిని అందించుటకు అదేస్థాయిలో సహజ వనరులు, మూలధన సేకరణ జరగాల్సివుంది.

భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశంలో పెట్టుబడుల కొరత వుంటుంది. పెరుగుతున్న జనాభావల్ల సహజ వనరుల కొరత కల్గుతుంది. ఈ దేశాలలో వున్న శ్రామికులను వినియోగించుకోగల సామర్థ్యం వుండదు. ఫలితంగా నిరుద్యోగం అధికస్థాయిలో వుంటుంది.అంతేకాక, అధిక జనాభా వృద్ధిరేటు వలన శ్రామికులకు అదనంగా చేరువారి సంఖ్య పెరుగుతూనే వుంటుంది. అందువల్ల నిరుద్యోగం మరింతగా పెరుగుంది. ఒక ప్రక్క శ్రామిక శక్తి పూర్తిగా ఉపయుక్తం కాకపోవుట వల్ల అది పెనుభూతంగా తయారవుతుంది. ఉత్పత్తి ప్రక్రియలో వారి పాత్ర ఏమీవుండదు.

ఆర్థికంగా వృద్ధిని సాధించని అభివృద్ధి చెందుతున్న దేశాలలో అధిక జనాభా వృద్ధిరేటు అనేక సమస్యలను ఉత్పత్తి ప్రక్రియలో సృష్టిస్తుంది. మానవ శక్తి వనరుల నాణ్యతను తగ్గిస్తుంది. ఆధునిక ఆర్థిక వ్యవస్థలు విజ్ఞాన, పెట్టుబడి సాంద్రత గలవిగా మారుతున్న తరుణంలో ఆధునిక ఉత్పత్తి నైపుణ్యాలు గల నిపుణులు అయిన శ్రామికులు అవసరమౌతారు. అభివృద్ధి చెందుతున్న అక్షరాస్యత స్థాయి చాలా తక్కువ. నిరక్షరాస్యత సర్వత్ర వుంటుంది. నిరక్షరాస్యత నిర్మూలనకు వారిలో నైపుణ్యమును పెంపొందించుటకు అధిక ఆర్థిక వనరులు అవసరమౌతాయి. పై సమస్యలు జనాభా పెరిగేకొద్దీ తీవ్ర మవుతాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో పెట్టుబడులకొరత, ఇతర వనరులు పూర్తిస్థాయిలో ఉపయుక్తం కాకపోవుట వలన మానవ వనరుల నాణ్యత అల్పస్థాయిలో వుంటుంది. దీనికి తోడు జనాభా వృద్ధి రేటు వేగంగా పెరుగుట వల్ల సమస్య మరింత క్లిష్టమౌతుంది. అధిక సంఖ్యలో వేగంగా పెరుగుతున్న శ్రామిక శక్తి వృద్ధిని, మానవ శక్తి వనరులను నైపుణ్యాలును పెంపొందించవలసిన అనేక సమస్యలను సృష్టిస్తుంది. ఆర్థికాభివృద్ధి సాధనలో పెరుగుతున్న జనాభా ఫలితంగా విస్తృత మవుతున్న శ్రామికుల సంఖ్య అనేక సమస్యలను కల్పిస్తుంది.

**2. సహజ వనరులుపై అధిక జనాభా వృద్ధిరేటు ప్రభావం**

భూమి ఉపరితలం ఖనిజాలు, అడవులు మరియు నీరు మొదలగునవి అన్నింటిని కలిపి 'సహజవనరులు'గా వ్యవహరిస్తాము. అధిక జనాభా వృద్ధిరేటు వల్ల ఈ సహజ వనరులపై కల్గు ప్రభావాన్ని మనం పరిశీలిద్దాం.

### a) వ్యవసాయ భూమిపై ప్రభావం

ఏదేశంలోనైనా భూమి విస్తీర్ణం స్థిరంగానే ఉంటుంది. దానిలో అధిక భాగం వ్యవసాయ కార్యక్రమాల కొరకు వినియోగించటం జరుగుతుంది. అయితే, అధికంగా జనాభా పెరుగుదల వల్ల ఇతర అవసరాలైన రోడ్లు, ఫ్యాక్టరీలు, గృహాల కొరకు భూములను కేటాయించవలసి వస్తుంది. ఫలితంగా వ్యవసాయ కార్యకలాపాల విస్తరణ జరగదు. కొద్ది మేరకు మాత్రమే మనం వ్యవసాయం కొరకు భూములను విస్తరించగల్గుతాం. బంజరు భూములను సేద్యంలోనికి తీసుకొని రాగల్గుతాం. జనాభా పెరుగుదల వలన తలసరి భూమి వినియోగ పరిమాణం తప్పని సరిగా తగ్గుతుంది.

భూమిపై ఎక్కువ మంది ఆధారపడి జీవించవలసి రావడం వల్ల, ఇది ప్రచ్ఛన్న నిరుద్యోగితకు దారి తీస్తుంది. అధిక జనాభా ఒకవైపు, వ్యవసాయేతర రంగాలలో ఉపాధి అవకాశాలు లేకపోవటం మరొక వైపు ఉండటం వల్ల గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువ మంది అవసరాలకు మించి వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు. అదనంగావున్న శ్రామికులను వ్యవసాయ రంగం నుండి పట్టణ ప్రాంతాలకు పంపగల్గినా పట్టణాల సంఖ్య పెరిగి, వ్యవసాయ భూములు పట్టణీకరణ వల్ల తగ్గిపోతాయి. పట్టణ ప్రాంతాలలో పెరుగుతున్న జనాభా కోసం కావలసిన వసతులకొరకు భూములు అవసరమవుతాయి. గృహనిర్మాణాలు, రోడ్లు ఏర్పాట్లు కోసం భూమి వినియోగించవలసి వస్తుంది. వేగంగా జరుగుతున్న పట్టణీకరణ వల్ల పారిశ్రామిక కాలుష్యం, మురికివాడలు వలస సమస్యలు ఉత్పన్న మవుతాయి. ఈ సమస్యలవల్ల దేశ ఆర్థిక వృద్ధి దెబ్బతింటుంది.

### b) అడవులపై అధికజనాభా వృద్ధిరేటు ప్రభావం

దేశ ఆర్థిక వృద్ధికి అడవులు పెద్ద స్థాయిలో దోహద పడుతున్నాయి. పర్యావరణ సంతులితం చేయడంలో అడవులు సహకరిస్తున్నాయి. భూసార సంరక్షణకు అడవులు తోడ్పడుతున్నాయి. పరిశ్రమలకు కావలసిన అనేక ముడి పదార్థాలు అడవులలో లభ్యమవుతున్నాయి. అధిక జనాభా వృద్ధి వలన అడవులు నరికివేతకు గురి అవుతున్నాయి. వ్యవసాయం కొరకు, వంట చెఱకు అవసరాలకు అడవులను నరికి వేస్తున్నారు. ఫలితంగా భూసారం శిథిలం అవుతుంది. ఆర్థిక వ్యవస్థకు కావలసిన ముడి పదార్థాల లభ్యత దుర్లభం అవుతుంది.

అధిక జనాభా వృద్ధిరేటు వల్ల అడవులు హరించివేయబడుతూ ఆర్థికాభివృద్ధికి విఘాతం కల్గుతుంది.

### c) ఖనిజాల పై ప్రభావం

దేశ ఆర్థిక వృద్ధిలో ఖనిజాలు ఒక ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. ఏదేశంలోనైన ఉందు ఖనిజాలు పరిమితం గానే వుంటాయి. అవి పారిశ్రామిక ముడి పదార్థాలుగా ఉపయోగపడుతున్నాయి. బొగ్గు, సహజ నూనెలు ఖనిజాలు మొదలైన ముఖ్యమైన శక్తి వనరులను పునరుత్పత్తి చేయలేము. వేగంగా పెరుగుతున్న జనాభా వల్ల, అధిక జనసంఖ్య వల్ల ఖనిజాలు అధిక మొత్తంలో వెలికితీసి వినియోగిస్తున్నారు.

అందువల్ల ఖనిజనిక్షేపాలు హరించి వేయబడుతున్నాయి. భవిష్యత్‌లో దేశాల ఆర్థికాభివృద్ధిని ఇది తీవ్రంగా ప్రభావితం చేస్తుంది.

# 40

# భారతదేశ జనాభా

# (Population of India)

## 40.1 పరిచయం

ఒక దేశంలోని మానవ వనరుల లక్షణాలను తెలుసుకొనటం అత్యవసరం. జనసంఖ్య, జనాభా వృద్ధిరేటు, దాని లింగనిష్పత్తి, వయోపంపిణీ, అక్షరాస్యత స్థాయి మొ॥ అనేక మానవ వనరుల అంశాలు అధ్యయనం చేయవలసి వుంది. ఈ పాఠంలో మనం భారతదేశ జనాభా మరియు వివిధ జనాభా సమస్యలు, వాటి పరిష్కార మార్గాల గురించి నేర్చుకుంటాం.

## 40.2 లక్ష్యాలు

ఈ పాఠంలోని ప్రశ్నలు, సమాధానాలు చదివిన తర్వాత మీరు ఈ క్రింది అంశాలు తెలుసుకుంటారు.

- భారతదేశ జనాభా పరిమాణం మరియు గత దశాబ్దాల కాలంగా దాని వృద్ధి
- 1921 సం॥ నుండి భారతదేశ జనాభా వృద్ధి రేటును వివరించుట.
- భారతదేశ జనాభా నిర్మాణంను వివరించుట
- అధిక జనాభా వల్ల భారతదేశంకు కలుగు పలు సమస్యలు వివరించుట
- జనాభా సమస్యల పరిష్కారానికి తగు పరిష్కార మార్గాలను సూచించుట

## 40.3 ప్రశ్నలు – సమాధానాలు

### రెండు మార్కుల ప్రశ్నలు

***1. జనాభా పరిమాణం వివరింపుము.***

జ: ఒక నిర్ణీత కాలంలో దేశంలో నివసించే జనాభాను ఆదేశ జనసంఖ్యగా పేర్కొనవచ్చును. ప్రతి పదిసంవత్సరాల కాలానికి ఒకసారి దేశంలోని జనాభాను లెక్కించటం జరుగుతుంది. ఈ ప్రక్రియను 'జనాభా లెక్కింపు' (census) అందురు. భారతదేశంలో 1991లో ఒకసారి మరియు చివరిగా 2001లో జనాభాలెక్కల సేకరణ నిర్వహించారు. మార్చినెల ఒకటి నాటికి దేశంలో వున్న జనసంఖ్యను 'జనాభా లెక్కలు' తెలియజేస్తాయి. ఉదాహరణకు 1991

సంవత్సరపు జనాభాలెక్కల ప్రకారం భారతదేశపు జనాభా 84.63 కోట్లు. దీని అర్థం భారతదేశం జనసంఖ్య మార్చినెల ఒకటో తారీఖు నాటికి 84.63 కోట్లమంది. జనాభా లెక్కలు కేవలం జనసంఖ్యనే కాక, జనాభా అంశాలైన లింగనిష్పత్తి, వయో నిష్పత్తి, జనాభా వృద్ధిరేటు, అక్షరాస్యతరేటు, జనసాంద్రత మొదలగు అంశాలను తెలియచేస్తాయి.

***2. జనాభా వృద్ధి వివరింపుము.***

జ: భారతదేశంలో జనసంఖ్య అధికంగానే కాకుండా జనాభావృద్ధి రేటు వేగంగా పెరుగుతుంది. పట్టిక 39.1 ని గమనించినట్లయితే, ప్రతి దశాబ్దం కాలంలోను జనాభాలో పెరుగుదల వృద్ధి ఎక్కువ గానేవుంది. 1951-61 దశాబ్దం కాలంలో జనాభా వృద్ధి 7.8 కోట్లు. ఇది బ్రిటన్‌లో దేశం జనాభాకు ఒకటిన్నర రెట్లు. 1971-81 దశాబ్దకాలం జనాభా వృద్ధి 13.5 కోట్లు. ఇది బ్రిటన్ (UK) దేశ జనాభాకు రెండున్నర రెట్లు అధికం. 1961-71 దశాబ్దకాలంలో జనాభావృద్ధి 10.8 కోట్లు. ఇది జపాన్‌దేశం లోని జనాభాలో 3/4 వంతు. మరియు 1981-91 లోని జనాభా వృద్ధి 16.3 కోట్లు ఇది జపాన్ దేశ జనాభా కన్న అధికం.

***3. లింగనిష్పత్తి తెలుపుము.***

జ: లింగనిష్పత్తి అనగా జనాభాలో స్త్రీ పురుషుల నిష్పత్తిని లెక్కించటం. ఇది నిష్పత్తిలో ఉంటుంది. లింగనిష్పత్తి ప్రతి వేయి మంది పురుషులకు గల స్త్రీల సంఖ్య తెల్పుతుంది. దీనిని లెక్కించడానికి కింది ఫార్ములా / సూత్రం ఉపకరిస్తుంది.

$$\text{లింగనిష్పత్తి} = \frac{\text{మొత్తం స్త్రీ జన సంఖ్య}}{\text{మొత్తం పురుష జన సంఖ్య}} \times 1000$$

***4. జనసాంద్రత అనగానేమి?***

జ: జనసాంద్రత అనగా ఒక చదరపు కిలోమీటరు విస్తీర్ణంలో నివసించుచున్న ప్రజల సంఖ్య. జనసాంద్రతను లెక్కించుటకు మొత్తం దేశ జనాభాను దేశంలోని భూవిస్తీర్ణంతో భాగించాలి.

జనసాంద్రత = మొత్తం జనసంఖ్య / మొత్తం దేశ భూ విస్తీర్ణం

ఏదేశంలోనైనా భూ విస్తీర్ణ మార్పు లేకుండా స్థిరంగా వుంటుంది. పెరుగుతున్న జనాభా వల్ల జనసాంద్రత పెరుగుతుంది.

***5. అక్షరాస్యతా రేటు తెలుపుము.***

జ: వ్యక్తికి చదువుట, వ్రాయుట మరియు ఏదైన ఒక భాషలో అవగాహన చేసుకోగల్గు పరిజ్ఞానం కల్గివుంటే 'అక్షరాస్యుడు' గా పరిగణిస్తారు. 1991 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యతారేటు లెక్కింపు జనాభాలో 7 సం౹౹ అంతకన్నా ఎక్కువ వున్న వారిని ఆధారంగా లెక్కించడం జరిగింది. 1951 సం౹౹లో అక్షరాస్యతారేటు కేవలం 16.7 శాతం. అందులో పురుషులు 25శాతం మరియు మహిళలు 8 శాతంగా ఉన్నారు. 1991 లో మొత్తం మీద అక్షరాస్యతారేటు 52.2 శాతం అందులో 64.17 శాతం పురుషులు మరియు 39.5 శాతం స్త్రీలు. అక్షరాస్యులుగా ఉన్నారు.

అక్షరాస్యతారేటు పట్టణ ప్రాంతాలలో గ్రామీణ ప్రాంతాల కన్నా ఎక్కువగా ఉంది. 1981 లో అక్షరాస్యతారేటు 36.2 శాతం, పురుషులలో ఇది 46.9 శాతం కాగా స్త్రీలు 28.8 శాతంగా ఉన్నారు. 1981 సం॥ మొత్తం నిరక్షరాస్యులు 30.19 కోట్లు మంది మరియు 1991లో ఈ సంఖ్య 32.4 కోట్లుగా ఉంది. అక్షరాస్యతలోని పెరుగుదల జనాభాలోని వృద్ధి వలన కల్గింది.

***6. ఆయుఃప్రమాణం తెలుపుము.***

జ: పుట్టిన శిశువు జీవన కాలంను ఆయుఃప్రమాణంగా వ్యవహరిస్తారు. స్వాతంత్ర్యం వచ్చే నాటికి మనదేశంలో ఆయుఃప్రమాణం కేవలం 32 సం॥ మాత్రమే. ఇది 1991 సం॥నాటికి 58 సం॥లకు పెరిగింది. 1991-96 సం॥ మధ్యకాలంలో మనదేశంలోని ప్రజల ఆయుఃప్రమాణం 61.2 సం॥గా ఉంది. పురుషులకన్నా స్త్రీల ఆయుః ప్రమాణం ఎక్కువగా ఉంది. 1991-96-04 మధ్యకాలంలో ఇది పురుషులలో 60.6 సం॥ కాగా, స్త్రీలలో 61.7 సం॥లుగా ఉంది. ఏమైనప్పటికి, గ్రామీణ ప్రాంతాలతో పోలిస్తే పట్టణ ప్రాంత వాసుల ఆయుఃప్రమాణం చాలా ఎక్కువగా ఉంది. 1990 సం॥ ఆయుఃప్రమాణం గ్రామీణ భారతంలో 57.4 సం॥కాగా అది పట్టణ ప్రాంతాలలో 64.12 సం॥గా ఉంది.

## నాలుగు మార్కుల ప్రశ్నలు

***1. అధిక జనాభా వల్ల కలుగు సమస్యలు తెలుపుము.***

జ: భారతదేశం అధిక జనసంఖ్యను కల్గి ఉండటమేకాక అది నిరంతరంగా పెరుగుతూనే వుంది. జనాభా వృద్ధిరేటు ఎక్కువగా ఉంది. అందువలన ప్రతి సంవత్సరం మొత్తం జనసంఖ్యకు కలసే అదనపు జనాభా ఎక్కువగానే ఉంటుంది. ఇలాంటి వృద్ధి అవాంఛనీయమైంది. ఆర్థికవృద్ధి సాధనకు అధిక జనాభా ఒక ప్రతిబంధకం. అంతేకాక, ప్రజల ఆదాయ స్థితి గతులలో పెరుగుదలను నిరోధిస్తుంది. అధిక జనాభా ఫలితంగా, ప్రజల తలసరి ఆదాయాలలో, దేశ జాతీయాదాయంలో పెరుగుదల చాలా స్వల్పంగా ఉంది.

వేగంగా వృద్ధి చెందుతున్న జనాభా 'పొదుపురేటు'ను ప్రతికూలంగా ప్రభావితం చేస్తుంది. పెరుగుతున్న జనాభా అవసరాలకు దేశ ఆర్థిక వనరులను వినియోగించవలసి వస్తుంది. పెరుగుతున్న జనాభా అవసరాలు అయిన ఆహారం, దుస్తులు, గృహాలు, విద్యావసతి, ఆరోగ్య సదుపాయాల కల్పనకు అధిక సంఖ్యలో వనరులను కేటాయించవలసి వస్తుంది. దీనివల్ల దేశంలో పేదరికం, నిరుద్యోగం సమస్యలు మరింత తీవ్రంగా మారి, అనేక సామాజిక, రాజకీయ ఉద్రిక్తలకు దారితీస్తుంది. అవస్థాపన సౌకర్యాలు అయిన విద్యుచ్ఛక్తి, రవాణా మొ॥గు వాటి కొరత తీవ్రరూపం దాలుస్తుంది. పై పరిస్థితులవల్ల, మానవ జీవన నాణ్యతలు దిగజారిపోతాయి. ఫలితంగా అల్పస్థాయి అక్షరాస్యతరేటు మరియు ఆయుః ప్రమాణాలు ఏర్పడతాయి. అధిక జనాభా అవసరాలు తీర్చుటకు కావలసిన త్రాగునీరు కొరత, పౌష్టికాహారము, తగిన గృహాలు లేకపోవడం మరియు శిశుమరణాల రేటు ఎక్కువగా ఉండటం జరుగుతుంది.

భారతదేశ జనాభా యొక్క ఒక మంచి లక్షణం దేశంలో మరణాలరేటు వేగంగా తగ్గటం. జనాభాకు వున్న మరోచెడు లక్షణం జననాలరేటు చాలా నిదానంగా తగ్గటం. దేశంలో జనాభా తీవ్రంగా పెరగడానికి గల ప్రబలకారణం అధికంగావున్న జననాల రేటు మరియు నిదానంగా అది తగ్గటం. కనుక, జనాభా సమస్యలను పరిష్కరించవలెనంటే దానికి వున్న ఒకమార్గం జననాల రేటును తగ్గించటమే.

జననాలరేటు ప్రభావితం చేయు అనేక అంశాలు సంక్లిష్టమైనవి. అంతతేలికగా జననరేటును మనం తగ్గించటం సాధ్యంకాదు. దీర్ఘకాలంలో జననాల రేటును తగ్గించగల్గుతాము. అందువల్ల, జననాలరేటును తగ్గించటానికి తీవ్రస్థాయిలో కృషి చేయాలి.

## ఎనిమిది మార్కుల ప్రశ్నలు

***1. అధిక జనాభా సమస్య పరిష్కార మార్గాలు సూచింపుము.***

జ: మనదేశంలోని అధికజనసంఖ్య మరియు దాని అధిక వృద్ధిరేటు వల్ల అనేక తీవ్రమైన సమస్యలు కల్గుతున్నాయి. అధిక వృద్ధిరేటును తగ్గించాలంటే జననాలరేటును తగ్గించాలి. ఇది ఒక్కటే మార్గం.

భారతదేశం వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశం. భారత ప్రభుత్వ జనాభా విధానంను 1951-52 సం॥లో అధిక జనాభా విస్తరణను రేటును అరికట్టుటకు ప్రవేశపెట్టింది. అప్పటి నుండి ప్రభుత్వం వివిధ చర్యలను జనాభావృద్ధి రేటును తగ్గించుటకు చేపట్టింది. భారత ప్రభుత్వం తీసుకొన్న కొన్ని చర్యలు.

i) ప్రజలను ఉత్తేజపరుస్తూ వివిధ రకాలైన ప్రోత్సాహకాలను కల్పిస్తూ 'చిన్న కుటుంబ భావన'ను ఒప్పించే ప్రయత్నంను ప్రభుత్వం కొనసాగిస్తుంది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అమలుచేయడం ద్వారా మరియు పాఠ్యాంశంలో 'జనాభా విద్య'ను చేర్చటం ద్వారా ప్రజలలో జనాభా సమస్య పట్ల అవగాహనను కల్గిస్తుంది.

ii) పట్టణ, మండల స్థాయి, గ్రామీణ ప్రాంతాలలో కుటుంబ నియంత్రణ మరియు ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటం. దీనివల్ల అవి ప్రజలలో కుటుంబ నియంత్రణ ఆవశ్యకతను ప్రచారం చేయ వీలగుతుంది. అవి ఆరోగ్య సేవలను అందిస్తూ ఆరోగ్య పరిరక్షణ చేస్తాయి. ఇవి ప్రజలకు కావలసిన గర్భనిరోధక సాధనములను పంపిణీచేస్తాయి.

iii) పురుషులకు కనీస వివాహ వయస్సు 21 సం॥లుగా, స్త్రీలకు 18 సం॥గా నిర్ణయించారు.

iv) జననాలరేట్ల తగ్గింపుకు వివిధ గర్భ నిరోధకాలు, పద్ధతులను ఆచరింపచేయటం, తొడుగులు, లూపులు, గర్భనిరోధక మందులు మొ॥నవి సప్లయ్ చేయటం

v) ప్రజలకు కుటుంబనియంత్రణ పాటించేందుకుగా వారికి అనేక రకాలైన పథకాల ద్వారా వివిధ రకాలైన ప్రోత్సాహకాలను కల్పించుట.

vi) వివిధ శిక్షణా సంస్థలను నెలకొల్పి కుటుంబ నియంత్రణ సిబ్బందికి తగిన శిక్షణ ఇవ్వటం. వివిధ పరిశోధనా కేంద్రాలను ఏర్పాటుచేయుటం

vii) స్త్రీ విద్యావకాశాలను పెంపొందించడం వారికి తగిన ఉపాధికల్పన కల్గించడం, దీనివల్ల జననాలరేటుపై ప్రత్యక్ష ప్రభావం ఉంటుంది.

viii) కుటుంబ సంక్షేమ కార్యక్రమాలలో భాగస్వాములుగా ప్రజలు, ప్రైవేటు ఏజెన్సీలను మరియు ఇతర సంస్థలైన పంచాయితీలను చేర్చటం. కుటుంబ ప్రణాళికా కార్యక్రమంలో ఒక నూతన వ్యూహం.

వివిధ కార్యక్రమాలను రాష్ట్ర ప్రభుత్వం నేరుగా లేదా కేంద్ర ప్రభుత్వ గ్రాంటులలో నిర్వహించబడుతున్నాయి. రాష్ట్రాల మధ్య జనాభా విస్తరణలో అనేక వ్యత్యాసాలు వున్నందువల్ల ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క ప్రత్యేకమైన పద్ధతి అమలు అవసరం వుంది.

## ఆంధ్రప్రదేశ్ ఓపన్ స్కూలు సొసైటి (సీనియర్ సెకండరీ లెవల్ కోర్స్) అర్థశాస్త్రం (318)

## మాదిరి ప్రశ్నా పత్రం – I

సమయం : 3 గం॥ గరిష్ట మార్కులు : 100

**సూచనలు :**

1. ఈ ప్రశ్నాపత్రం రెండు విభాగాలుగా ఉన్నది. – Part - A కోర్ మాడ్యూల్ మరియు Part - B ఆప్షనల్ మాడ్యూల్ నుండి ఇవ్వబడింది.

2. Part - A లో అన్ని ప్రశ్నలకు సమాధానాలు వ్రాయుము. మరియు Part - B లో ఏదైనా ఒక విభాగం పూర్తిగా వ్రాయుము.

3. 1 మార్కు ప్రశ్నలకు **ఒకటి లేదా రెండు పంక్తులలో**

   2 మార్కుల ప్రశ్నలకు **ఐదు పంక్తులలోపు**

   4 మార్కుల ప్రశ్నలకు **పది పంక్తులలోపు**

   8 మార్కుల ప్రశ్నలకు **పదిహేను పంక్తులలోపు** సమాధానాలు వ్రాయుము.

4. సంఖ్యాత్మక ప్రశ్నలకు పంక్తుల నిబంధన వర్తించదు.

### విభాగం - A

మొత్తం మార్కులు : 80

### సెక్షన్ – I

క్రింది ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము. 6×1=6

1. ఆర్థిక వ్యవస్థ అనగా నేమి ?
2. ఆర్థికాభివృద్ధి గురించి నీకేమి తెలియును ?
3. గణాంక దత్తాంశం అనగా నేమి ?
4. 'రేటు' మరియు 'శాతం' ల మధ్య తేడా ఏమిటి ?
5. "సూక్ష్మ అర్థశాస్త్రం" అనగా నేమి ?
6. "గిఫెన్ వస్తువులకు" ఉదాహరణలు నిమ్ము ?

## సెక్షన్ - II

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము. 5×2=6

7. ప్రాథమిక దత్తాంశానికి గౌణ దత్తాంశానికి మధ్య గల తేడాలేమిటి ?
8. పౌనఃపున్య భుజి, పౌనఃపున్య విభజన కంటే ఎలా భిన్నమైనది ?
9. నియమిత ఆర్థిక వ్యవస్థ అనగా నేమి ?
10. జాతీయ ఆదాయ మదింపులో వ్యయ పద్ధతి అనగా నేమి ?
11. ద్రవ్య చెల్లించబడ్డ వ్యయం అనగా నేమి ?

## సెక్షన్ - III

క్రింది ప్రశ్నలలో ఏవైనా 8 ప్రశ్నలకు జవాబులిమ్ము 8×4=32

12. గణాంక శాస్త్రం యొక్క పరిధిని గురించి వ్రాయండి ?
13. ఆదాయ మదింపు పద్ధతి ద్వారా జాతీయాదాయాన్ని అంచనా వేసేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలేవి ?
14. మనదేశ ఆర్థిక ప్రణాళికల ముఖ్య లక్ష్యాలేవి ?
15. ఉత్పత్తి అవకాశాల వక్రరేఖపై ఆర్థిక వ్యవస్థ ప్రధాన సమస్యల ప్రభావం ఎట్లుండునో వివరించుము?
16. పౌనఃపున్య విభజనా పద్ధతుల్లో గల సమ్మిళిత, అసమ్మిళిత పద్ధతుల మధ్యగల తేడాలను తెల్పండి?
17. వాణిజ్య బ్యాంకుల ఋణాలపై చట్టబద్ధమైన రిజర్వు నిష్పత్తి ఎలా ఆంక్ష విధించగలదు ?
18. ప్రభుత్వ బడ్జెట్ అనగా నేమి ?
19. దేశ విభజన భారత ఆర్థిక వ్యవస్థపై ఎలాంటి ప్రభావాన్ని కల్గించినదో వ్రాయండి?
20. స్వాతంత్ర్యం సిద్ధించే నాటికి భారత ఆర్థిక వ్యవస్థ లో గల వివిధ ఆర్థిక సమస్యలను వివరించుము?
21. దిగువ ఇవ్వబడిన దత్తాంశం ఆధారంగా గరిష్ట లాభ స్థితిని కనుగొని గరిష్ట లాభాన్ని అంచనా వేయుము?

| ఉత్పత్తి (యూనిట్లు) | ఉపాంత రాబడి (MR) (రూ॥లలో) | ఉపాంత వ్యయం (MC) (రూ॥లలో) |
|---|---|---|
| 1 | 10 | 4 |
| 2 | 9 | 5 |
| 3 | 8 | 6 |
| 4 | 7 | 7 |
| 5 | 6 | 8 |

## సెక్షన్ - IV

క్రింది ప్రశ్నలలో ఏ నాలుగింటికైనా జవాబులిమ్ము 4×8=32

22. వనరుల కొరత అనగా నేమి? వనరులకు గల ప్రత్యామ్నాయ ఉపయోగాలను గురించి వ్రాయండి?
23. బడ్జెట్‌లో విత్తలోటును భర్తీ చేయుటకు గల ఆధారాలేవి ?

24. నియంత్రిత మరియు స్వేచ్ఛాయుత ఆర్థిక వ్యవస్థల మధ్యగల వ్యత్యాసాలు ఏవి ?

25. ఆదాయ మదింపు పద్ధతి ద్వారా సేకరించిన దత్తాంశము ఒక ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ఉపయోగకరమైన వ్యాఖ్యలు చేయుటలో ఎలా తోడ్పడును.

26. ద్రవ్య సప్లయ్‌ని 'బహిరంగ మార్కెట్ కార్యకలాపాల' ద్వారా ఎలా నియంత్రిస్తారు ?

27. క్రింది కుటుంబ పట్టిక (వ్యయం)ను ఉపయోగించి రేఖా చిత్రం నిర్మించుము.

| క్రమ సంఖ్య | అంశం | వ్యయం (రూ) |
|---|---|---|
| 1 | ఆహారం | 480 |
| 2 | దుస్తులు | 300 |
| 3 | విద్యా & వినోదం | 330 |
| 4 | అద్దె | 450 |
| 5 | ఇతరములు | 240 |
| | మొత్తం | 1800 |

28 మామిడి పండ్ల డిమాండ్ మరియు సప్లయ్‌ల ఆధారంగా సంతులిత ధరను చూపు పటం నిర్మించుము.

| ధర (రూ) | డిమాండ్ | సప్లయ్ |
|---|---|---|
| 9 | 4 | 14 |
| 7 | 6 | 11 |
| 5 | 8 | 8 |
| 3 | 10 | 5 |
| 1 | 12 | 3 |

## విభాగం - B

క్రింది గ్రూపు - A, గ్రూపు - B లలో ఏదైన ఒక గ్రూపును ఎంపిక చేసుకొని ఆ గ్రూపులోని అన్ని ప్రశ్నలకు జవాబులునిమ్ము.

### గ్రూపు – A

20 మార్కులు

29. 'శాంతాకజ్ అంతర్జాతీయ విమానాశ్రయం' ఎక్కడ ఉంది ?

30. భారతదేశంలోని ప్రజల 'ఆయఃప్రమాణం' ఎంత ?

31. 'నాబార్డ్'

32. 'విస్తృత వ్యవసాయం' అనగా నేమి ?

33. 'సామాజిక అవస్థాపక సౌకర్యాల' ప్రయోజనం ఏమి ?

34. 'విద్య' అవశ్యకత, దాని ప్రాధాన్యతలను తెల్పుము.

35. "వాయురవాణా భారత ఆర్థిక వ్యవస్థకు కీలకమైనది" – వివరింపుము.

## గ్రూపు - B

36. 'లింగ నిష్పత్తి' అనగా నేమి ?
37. ప్రపంచ జనాభాలో భారత జనాభా వాటా ఎంత ?
38. కరెంటు ఖాతా, మూలధన ఖాతాల మధ్య తేడా ఏమి ?
39. 'విదేశీ వ్యాపారం' అనగానేమి ?
40. 'ఆధారిత వర్గ నిష్పత్తి' అనగా నేమి
41. 'జనాభా వృద్ధి రేటు' గురించి తెల్పుము.
42. "భారతదేశంలో సరళీకృత ఆర్థిక విధానం విదేశీ వ్యాపార విస్తరణకు తోడ్పడుతూ, విదేశీ వ్యాపార చెల్లింపు శేషం పై తక్కువ ప్రాధాన్యత ను చూపుతూ ఆర్థిక వృద్ధికి దోహదం చేస్తుంది" - వ్యాఖ్యానించుము.

* * *